[illegible]

# గోలకొండ కవుల సంచిక

సంపాదకుడు

సురవరము ప్రతాపరెడ్డి. బి. ఏ., బి. ఎల్.

ప్రకాశకులు:

గోలకొండపత్రికా కార్యాలయము

హైదరాబాదు - దక్కను

శా. శ. ౧౮౫౬

# మూల్యము

గోలకొండపత్రిక చందాదారులకు ... రూ ౧ — ౦ —

ఇతరులకు ... ... ... ,, ౨ — ౦ —



గోలకొండ ముద్రణాలయము

హైదరాబాదు, దక్కన్

1934

అంకితము

అమరచింత - ఆత్మకూరు సంస్థాన ప్రభ్వీణి

శ్రీ శ్రీ శ్రీ

# సవై రాణీ భాగ్యలక్ష్మమ్మ

## బహదరువారికి

శ్రీవారి నిర్మల యశః సౌరభము
నిఖిలాంధ్ర ప్రపంచము నందు
చిరస్థాయిగా ప్రసరించు నట్లు

గోలకొండ

ఆంధ్రకవివరేణ్యా కవితావిలాసపుష్పము

కృతజ్ఞతాబద్ధముగ - అనుజ్ఞాపూర్వకముగ

సమర్పితము

# ఆశీస్సు



౧

శ్లో. శ్రీమద్దివ్యరథాంగ శంఖసుమహా పద్మాదిసర్వాయుధైః
శ్రీమత్కౌస్తుభ దివ్యహారమణిభి శ్శ్రీవత్సచిహ్నాదిభిః
యుక్త శ్శ్రీపతి శేషనిత్యమవతు శ్రీభూమినీళాదిభిః
శ్రీరామా వనిపాల మౌళిమహిషీం శ్రీభాగ్యలక్ష్మ్యంబికాం.

— తి. బు. వేంకటాచార్యులు

౨

మ. స్థిరసామ్రాజ్యమనామయంబు జయలక్ష్మీవ్యాప్తి శశ్వద్యశ
స్స్ఫురణంబంచిత పోషణాభిరతి సంపూర్ణానుకంపాప్తియుక్
బరమౌదార్యము నైజపాదభజన వ్యాసంగముం గూర్చి శ్రీ
కర కుమార్తి గిరీశుఁడోము నిను దీర్ఘ భాగ్యలక్ష్మ్యంబికా.

— దీక్షితుల నరసింహశాస్త్రి

౩

జయతుజయతు నైజాం చక్రవర్తి చ రాజ్యం
జయతుజయతు రాజత్పుత్రజా తత్కుటుంబం
జయతుజయతు తస్యా న్వగ్రహాల్లబ్ధరాజ్యా
జయతుజయతు రాజ్ఞీ భాగ్యలక్ష్మ్యంబికాఖ్యా.

— జోశ్యం వేంకటాచార్యులు



కీ. శే. శ్రీమంతు

సవై రాజా శ్రీరామ భూపాలరావు బహద్దరుగారు

ఆత్మకూరు సంస్థానాధిపతులు.

# గోలకొండ కవుల సంచిక



సంపాదకుఁడు

శ్రీ సురవరము ప్రతాపరెడ్డి గారు

బి. ఏ. బి. ఎల్.

# ఆత్మకూరు సంస్థాన చరిత్ర 7/5-

ఇది మహిబూబునగరము జిల్లాలో చేరినది. ఇది పూర్వము అజరు చింత (అమరచింత) వర్ధమాను అను రెండు పరగణాలదిగానుండెను. ఈ సంస్థానములో ౨౮ గ్రామములున్నవి. ఈ సంస్థాన మూలపురుషుడు గోపాలరెడ్డి. వీరి తర్వాతివారి వంశవృక్షమిది.

—♦ వంశావళి ♦—




రంగారెడ్డి
గోపిరెడ్డి
రెండవసాహెబురెడ్డి
బుక్కారెడ్డి
లక్ష్మారెడ్డి
శేషాద్రిరెడ్డి
తాతారెడ్డి
రెండవతిమ్మారెడ్డి
సోమిరెడ్డి
పెద్దవెంకటరెడ్డి
చిన్నవెంకటరెడ్డి
బాలకృష్ణారెడ్డి
రాజా సోమభూపాలరావుగారు
రాజా సీతారామభూపాలరావుగారు
రాజా శ్రీరామభూపాలరావుగారు

# ఆత్మకూరు సంస్థాన చరిత్ర.

ఈ కడపటి రాజులుంగారు చనిపోయి ౪౧ సంవత్సరములయ్యెను వీరి ధర్మపత్ని శ్రీమంతు సవై రాణీ భాగ్యలక్ష్మమ్మ బహద్దరుగారు యిప్పుడు రాజ్యము చేయుచున్నారు.

ఈ సంస్థాన మూలపురుషులగు గోపాలరెడ్డిది మొదట తిరుపతి ప్రాంతపు చంద్రగిరి యనునగరము. రుద్రమదేవి సామంతుండగు గోనబుద్ధారెడ్డి తిరుపతియాత్రచేసినపు డీగోపాలురెడ్డి వారికి సపర్యలుచేసెను. వీరిని బుద్ధారెడ్డి తన రాజధానికి శా. శ. ౧౨౧౪ లో పిలిపించి మఖ్తల నాడ గౌడరికమిచ్చెను. ఇతని యనంతరము చిన్నగోపిరెడ్డి శా. శ. ౧౨౫౫ లో ౫౫ పరగణాలు పంచమహల్ తాలూకా, సర్నాడగౌడివతన్ కాట భూపతిసనదుమూలమునపొందెను. క్రీ.శ. ౧౩౦౪లో ప్రతాపరుద్రుని తోగ్లాకు కొడుకు జయించెను. తదనంతరము బహమనీరాజ్య స్థాపనమయ్యెను. అప్పుడు అల్లావుద్దీన్ హసన్‌గంగూ బహమనీపై రాజారాం అనువాడు తిరుగుబాటు చేయ గోపిరెడ్డికి వానిని బట్టుటకై తాకీదయ్యెను. ఆప్రకార మొనర్పుటచే ఫిరోజు గడునకు సంబంధించిన సర్కారు ముజఫర్నగర్ పరగణాలో కడేమూరులో నాడగౌడు సర్నాడగౌడు, దేశముఖ్ దేశపాండ్యాగిరి, దేశాయిగిరి మున్నగు రుసుములు వీరికిసనదుద్వారా యియ్యబడెను. వీరియనంతరము చంద్రారెడ్డి ౩౫ ఏండ్లు రాజ్యముచేసెను. వీరే కురుమూర్తి దేవాలయము కట్టించిరి.

రెండవ గోపిరెడ్డికాలములో గోలకొండరాజ్యము అభివృద్ధికివచ్చెను. అప్పుడు అబ్దుల్లాకుతుబుషా రాజ్యము చేయుచుండెను. ఆకాలములో గుత్తిముగడ్డ దుర్గమును గోపాలరావు అనునతడు స్వాధీనపరచుకొని తిరుగుబాటు చేసినందున సుల్తానుయాజ్ఞపై గోపిరెడ్డి యతనిఁబట్టుకొనెను. ఈపనికై వీరికి ముచ్చింతల అల్లిపురము అను జాగీర్లనిచ్చి పాన్సద్ (౫౦౦) మన్సబ్‌దారీ ౨౦౦ సవార్లు ఉంచుకొనుటకు సెలవయ్యెను. ఇతని కిద్దరు కొడుకులు వారు తమ జాగీరు భాగించుకొనిరి. గోపిరెడ్డి భాగమునకు అమరచింత వడ్డెమానులు వచ్చెను. సాహెబురెడ్డికి కడేచూరు, మఖ్తలవచ్చెను.

గోపిరెడ్డి యనంతరము శర్వారెడ్డి హి. ౧౦౬౪ లో రాజ్యముచేసెను. తర్వాత రెండవ సర్వారెడ్డి ఔరంగజేబు కాలములో రాజ్యమునకు వచ్చెను. ఆకాలములో అలంగీరు సేనాని రాయచూరుమీదుగా సైన్యముతో పోవుచుండ నతనికి సర్వారెడ్డి సాయపడెను. తత్ఫలితముగా వీరికి

మొత్తము తాలూకాను ౫ం వేలకు గుత్తకిచ్చి దుప్పల్లిగ్రామము జాగీరుగానిచ్చి జండా, నగార, ౫౦౦ సవార్లు మున్నగు రాజచిహ్నములుంచుకొన సనదియ్యబడెను.

తిమ్మారెడ్డి కాలమువరకు పేష్వాల అధికారము ప్రారంభమయ్యెను. రాజా చంద్రసేన జిలేదారు పేష్వాల యాజ్ఞచే నీదేశమువచ్చి తిమ్మారెడ్డికి హి. ౧౧౨౧ లో అమరచింత, వర్ధమాను పరగణాల రూ. ౫ం వేలకు గుత్తకిచ్చి తనపేర చంద్రగడము, తన భార్యపేర ధర్మపురము అను గ్రామములఁ గట్టించి వాని దేశముఖి మున్నగురుసుములు వీరికేయిచ్చిపోయెను.

రెండవ సాహేబురెడ్డి కాలమువరకు ఆసఫ్జాహీ ప్రభుత్వము స్థాపింపబడెను. హి. ౧౧౩౬ లో ఆసఫ్జాహీ కర్ణాటకముపై దండెత్తి పోవుచుండ సాహెబురెడ్డి వారికి సాయపడినందున వారికి సర్వై రాజా బిరుదమును నిచ్చి పూర్వ సనదులు ఖాయపరచిరి.

తర్వాత వెంకటరెడ్డికి హి. ౧౨౩౫ లో సికిందర్జా దర్శనమబ్బెను. వారికి అమరచింత, వర్ధమాను పట్టేల సనదులను రాజా చందూలాలుగారిప్పించిరి. ఇతని కాలమందే తిప్పడంపల్లెనుండి ప్రకృతపు ఆత్మకూరునకు రాజధాని మార్చబడెను.

రాజా సోమభూపాలరావుగారికి హి. ౧౨౨౬ లో సిరాజుద్దౌలా మంత్రికాలములో రూ ౫౨౨౦౧ ల మాషుకు వర్ధమాను అమరచింత పట్టేలను శాశ్వతముగా బిక్ మఖ్తాగా సనదులియ్యబడెను. సర్ సాలార్జంగు కాలములో నీ మొత్తము ౭౦ వేలు చేయబడెను.

వీరి కుమారులు శ్రీమంతు సర్వై రాజా సీతారామ భూపాలరావు బల్వంతె బహదరు విరోధికృతు సంవత్సర ఆశ్వయుజ బహుళ పంచమినాడు జన్మించిరి. ఆజానుబాహువు. గంభీరాకారము. వీరాగ్రేసరులు. రాజ్యమును మిక్కిలి బాగుగ పరిపాలించుచుండినవారు. అనేక విద్వత్కుటుంబములను తమ సంస్థానమునందు నివసింపఁజేసినవారు. వీరు గుఱ్ఱపుస్వారియం దద్భుత శక్తిగలవారుగానుండిరి. గురికాల్చుటయందు నిరుపమానులు. పెద్దపులులను వేటాడుటయందు అత్యుత్సాహ సాహసములు గలవారుగానుండిరి. వీరుతమ కాలమున ఉకుశలవాగునుండి అనేక కాలువలను తీయించినవారు లక్షరూపాయలను వ్యయముచేసి మహాసత్తాహమును తమ తల్లిగారి యాజ్ఞచే తమకు ౧౯ వ వయస్సున శుక్ల సంవత్సరమునచేసి తమ వంశమును తమసంస్థానమును దిగంతములకు ప్రసిద్ధి జెందునట్లు చేసినారు. వీరు తమ జీవితకాల

మున విశ్వావసు సంవత్సర కార్తిక బహుళ సప్తమినాడు తమ కుమారులగు రాజా శ్రీరామభూపాలు గారికి పట్టాభిషేక మొనరించి అదే కార్తిక బహుళ నవమినాడు పరలోకగతులైరి.

వీరి కుమారులు కీర్తిశేషులయిన శ్రీమంతు స్వైరాజా శ్రీరామ భూపాలు బల్వంత బహదరుగారు అమరచింతాత్మకూరు సంస్థానము ౧౮౫౦ శా.శకమున సర్వధారి సంవత్సర అధిక చైత్ర శుక్ల పంచమినాడు వృశ్చికలగ్న మందు రాజా సీతారామభూపాల బల్వంత బహదరుగారివలన రామలక్ష్మ మ్మగారి గర్భాబ్ధియందు నావిర్భవించిరి. ఈరాజా శ్రీరామభూపాల్ బహ దరుగారు ఆంధ్రాంగ్లపార్సీ భాషలను అభ్యసించి యుండిరి. మరియు శాంతి, శమ, దమ, వివేకాది గుణములచే కూడుకొని యుండెడివారు. ఈ రాజా శ్రీరామభూపాలు బహదరుగారు విశ్వావసు సంవత్సర కార్తిక బహుళ సప్త మినాడు తమ తండ్రిగారగు శ్రీమంతు స్వైరాజా సీతారామభూపాలు బల్వంత బహదరు అమరచింతాత్మకూరు సంస్థానాధీశుల యాజ్ఞచే సింహాస నమున మూర్థాభిషిక్తులై ప్రసిద్ధిబొంది ప్రమోదూత సంవత్సర వైశాఖ బహుళ అమావాస్యనాడు పరలోకమును జెందిరి.

శ్రీమంతు స్వైరాజా శ్రీరామభూపాలరావు బల్వంత బహదరుగారి పట్టపురాణి శ్రీమంతు స్వైరాణీ భాగ్యలక్ష్మమ్మగారు పతివ్రతా శిరోమణులు, దేవబ్రాహ్మణ భక్తియుక్తలు, ప్రజాపాలనా పారీణురాలు, న్యాయైకవిచక్షణలు, ధైర్య స్థైర్య సౌశీల్య చాతుర్యవినయాది సుగుణో పేతలు, విద్యావివేకయుతలు, రాజనీతినిపుణురాలు. ఈ రాణీబహదరు గారిట్టి వారైనందుననే హెచ్. ఇ. హెచ్. నిజాం ఉస్మానియా పాదుషా గారి ప్రేమధారాప్రవాహ పాత్రులై ఫసలి ౧౩౪౩ లో భావసంవత్సర జ్యేష్ఠ శుక్ల పూర్ణిమనాడు అమరచింతాత్మకూరు సంస్థాన సింహాసనమునందు పట్టా భిషిక్తులయిరి. ఈ రాణీ బహదరుగారు ఖరసంవత్సర ఆశ్వయుజ శుక్ల షష్ఠి నాడు వృషభలగ్నమందు దోమకొండ సంస్థానాధీశులగు జస్వంత్ గారివలన రంగమాంబయొక్క గర్భశుక్తిముక్తాఫలమై జన్మించిరి. వీరు చిన్నతనము ననే యనేక సత్కార్యములను, అనంతశయనము సేతు మొదలగు దక్షిణ యాత్రలను తమ పెనిమిటియగు రాజా శ్రీరామభూపాలు ప్రభువరేణ్యుల తోపాటు చేసిన మహాపుణ్యమూర్తులు. శ్రీవారి రాజ్యపరిపాలనములో రాజ్యాభివృద్ధి సర్వతోముఖముగా నుండుగాత మని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

---

# ప్ర స్తా వ న

వాగ్రచన వర్తమానమున కుపకరించునది. గద్యప్రబంధము కతిపయకాలజీవితముకలది. పద్యప్రబంధము బహుకాలము వర్తించునది. ఏతద్రహస్యమును గ్రహించియే ప్రాజ్ఞులు తమ యమూల్యాభిప్రాయములను విశ్వశ్రేయమభిలషించి ఛందోబద్ధమగు వాక్యములలో లిఖించియున్నారు. ప్రపంచవాఙ్మయమును బరిశీలించినయెడల ఆదికావ్యములన్నియు ఛందోబద్ధములే. అవియే మన పూర్వులగు ప్రాజ్ఞులు మనకిచ్చినయమూల్యసంపత్తు. కవిత్వమే ప్రపంచాభివృద్ధికి ముఖ్యకారణము. వాల్మీకి, వ్యాస, కాళిదాసాదులను దీసివేసిన నింక సంస్కృతమున మిగులునది తక్కువే. నన్నయ, తిక్కన, పోతనాదులను విస్మరించినచో నాంధ్రమున కస్థిభారము లేనట్లే. ఇట్టి కవుల గ్రంథపఠనమువలననే నేఁటికిని హైందవనాగరికత నిలచి యున్నది.

"సుకవితా యద్యస్తి రాజ్యేనకిం' (మంచికవితయున్నచో రాజ్యమెందులకు) అని భర్తృహరి తనయభిప్రాయమును వెల్లడించినాఁడు.

కావ్యం యశసేర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే.

(కావ్యమువలన యశస్సు, ధనము, వ్యవహారజ్ఞత, అమంగళపరిహారము, ఉత్తమానందము కలుగును. మరియునది కాంతవలె సరసముగా నుపదేశ మొనరించును.) అని కావ్యప్రకాశిక నిర్వచించి యున్నది. కవిత్వమసామాన్యమైనశిల్పము. కావుననే తిక్కన "అమలోదాత్త మనీషనేనుభయ కావ్యప్రౌఢిఁబాటించు శిల్పమునం బారగుఁడన్" అని చెప్పికొనెను- కవిత్వమునకుఁదోడు పాండిత్యముండినా యట్టి ధనసంపన్నులు వీరులేకాని యన్యులుగారు అనిఉద్భటసాగరుఁడిట్లు వాక్రుచ్చెను:

అవయః కేవలకవయః కీరాస్యుః కేవలంధీరాః
వీరాః పండితకవయః తానవమంతాతు కేవలంగవయః.

# ప్రస్తావన.

మఱియు "నాఽనృషిః కురుతే కావ్యం". అని పెద్దలువచించిన వాక్యము సత్యేతరముకాదు. ఆనంద తన్మయులును, ప్రతిభావంతులునగువారి యుత్తమానంద సమయములందుఁ బ్రకటీకృతమైనదే కవిత ( Poetry is the record of the best and happiest moments of the happiest and best minds ) అని షెల్లీకవియును, ప్రేమమయులును, సత్యద్రష్టలై వానినిఁ బ్రవచనము చేయువారును కవులు ( Poets are all who love, who feel great truths and tell them ) అని బెయిలీ మహాశయుఁడును జాటియున్నారు.

కవిత్వమహిమ యిట్టిది గనుకనే దానిని లలితకళలయందొకటిగనేకాక ప్రాముఖ్యమయినదిగా మనవారు పరిగణించియున్నారు. భూతభవిష్యద్వర్తమానములను దన దివ్యనేత్రములతో వీక్షించి యుత్తమసందేశమొసంగువాఁడు కవి. రవిగాననిచో కవిగాంచునే కదా యను నుడి సుప్రసిద్ధము. "హిందూదేశమునైననువదలుకొందుముగాని మా షేక్స్పియరునువదలము" అని యొకానొకపండితుఁడు చెప్పినమాటలవలన నింగ్లీషువారికిఁ గవులయెడగలభక్తి స్పష్టమగుచున్నది. కవిలేనిదేశమరణ్యము. కవిలేనిజాతి యనాగరక సంఘము.

ఇట్టి భావపరంపరలలోఁ దన్మయులైయున్నవారికి "నిజాం రాష్ట్రములో ఆంధ్రకవులు పూజ్యము." అని గోలకొండపత్రిక తొమ్మిదవ సంవత్సరాదిసంచికలో ఆధునిక భావకవిత్వతత్త్వము అను శీర్షికగల వ్యాసమునందు శ్రీముడుంబ వేంకట రాఘవాచార్యులు, బి. ఏ. బి. ఇ. డి. గారు నుడువుటఅసామాన్యముగాఁ గనఁబడెను. ఇట్టి సిద్ధాంతపు అభిప్రాయములు నిజాంరాష్ట్రములోని యాంధ్రులనుగూర్చి పలుమారువినుట తటస్థించినది. అయిననీయభిప్రాయములు ఇచ్చటిపరిస్థితులు దెలియకను, తెలిసికొనుట కవకాశములేమియు వెల్లడింపఁబడిన వేగాని ద్వేషబుద్ధిచేఁ గాదనుట నిశ్చయము:

నిజాంరాష్ట్రాంధ్రభూభాగము "అచ్చతెనుంగుగబ్బమునకాదిపదంబయి పొల్పుభాగ్యముఁ బెంపుఁగన్నదేశ"మనియు నిచ్చట కవులునుపండితులును తండోపతండములుగా నుండుటయు నట్టివారి పాండిత్యము మిడిమిడి పాండిత్యముగాక దిట్టమై సాహిత్యయుక్తమై భావప్రపూర్ణమైపూర్వపు శ్రీనాథపోతనాదులను దలపించునదైయుం

ఢుటయు స్థానికులకుఁ దెలిసినవిషయమే. కావున నట్టికవులకవితా సామర్థ్యప్రాగల్భ్య ప్రావీణ్యతలను జగమునకెఱిఁగించుటఅవసరముగాఁ గనఁబడెను. అంత గోలకొండపత్రికవారి కార్యభారము వహింపనిశ్చయించుకొని భావ సం॥ జ్యే॥ బ॥ ౧ నాఁడు ౯ సంపుటము ౧౫ సంచికయందు ఈక్రిందివిన్నపమును బ్రకటించిరి.

"మ. ఘ. వ. నిజాం ప్రభువరేణ్యుల పాలనలోని ఆంధ్రప్రాంతము పూర్వకాలమునుండియు ఆంధ్రభాషామతల్లికి విహారరంగస్థలమై యొప్పారుచున్నది. బమ్మెరపోతన, విద్యానాథుఁడు, పాల్కురికి సోమనాథుఁడు, మల్లికార్జున పండితారాధ్యులు, రుద్రదేవచక్రవర్తి, మారన, గోనబుద్ధారెడ్డి, వేములవాడ భీమకవి, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు, మల్లినాథసూరి మొదలగు పండితప్రకాండులు కవిసింహులు, ఈప్రాంతమునందు వాఙ్మయక్షేత్రమునందు కృషిసల్పి అజరామరకీర్తిఫలమును గడించినమహనీయులు. ఇప్పటికిని సంస్కృతాంధ్రములందు విశేష పాండితీప్రభావ సంపన్నులై దివ్యప్రబంధ రచనా ధురంధరులై వెలసినమహనీయులు ఈప్రాంతమునందుతండోపతండములుగఁ గలరు. ఆధునికభావపరిణామముననుసరించి నూతనముగ వెలువడిన "భావకవిత్వ" సాంప్రదాయము గ్రహించిఆంధ్రభారతి నుపాసించుచున్న నవయువకకవులును అనేకులు గలరు. కాని, వీరందరును పల్లెటూళ్ల నివాసులు. పత్రికా ప్రచారమేలేని మారుమూలల నున్న వీరు తమతమ యభిరుచుల ననుసరించియు, తమ కానందము నభిలషించియు, వాఙ్మయకృషి సల్పుచుండుటయే కాని, ఆధునిక పద్ధతులననుసరించి ప్రచారము చేసికొనుటయు, చేయించుకొనుటయు, నెఱుఁగరు. అందుచేత "నిజాంరాష్ట్రమునందు ఆంధ్రకవులుపూజ్యము" పండితులులేరు, అని పలువురు భ్రమ ప్రమాదములకు లోనగుటలో నాశ్చర్యమేమి కలదు?

గోలకొండపత్రిక ఆంధ్రులవిజ్ఞానమునకై కృషిసల్పుచుండుట మాపత్రికాపాఠకులకు విదితమైన విషయము. మాయోపినకొలఁది వివిధోద్యమములకు దోహదము నర్పుటయే మాయాశయము. కావున నివురుగప్పిననిప్పువలెనున్న ఇచ్చటి యాంధ్రకవుల ప్రజ్ఞాపాండితీ విభవములను ప్రచారముచేయుటయు, బయటివారికీవిషయ

మునుగల భ్రమను నివారించుటయు, పరమకర్తవ్యముగా భావించి "గోలకొండ కవులసంచిక" యను నామకరణముతో పుస్తకరూపమున ప్రత్యేకసంపుటము వెలువరచుటకు నిశ్చయించుకొన్నారము. ఇది గోలకొండ కవులసంచికా "దీపావళి పుష్పము" గా బ్రకటితము గాగలదు. నిజామురాష్ట్రములోని ఆంధ్రులగు సంస్కృతాంధ్రపండితుల కవితా విలాసములిందు బ్రకటింపబడును.

ఈవిషయమునందీ క్రిందినియమములను గమనించవలెను:—

౧. కవి నిస్సంశయముగా నిజాంరాష్ట్రవాసియై యుండవలయును.
౨. కవి తన జన్మస్థానము గ్రామము తాలూకా, జిల్లా, టప్పాఖాన మొదలగువానినిఁ దెలుపవలయును.
౩. సంచికలో పద్యములుమాత్రమే ప్రకటింపఁబడును.
౪. ప్రతికవియు సంస్కృతమునందైనను, ఆంధ్రమునందైనను లేక రెంటియందైనను రచనగావింపవచ్చును.
౫. విషయము వర్ణనాంశమైనచో ౫ పద్యములలోను, కథాంశమైనచో ౧౦౦ చరణములలో నుండవలయును.
౬. కవి తన వంశవృత్తాంతము, వయస్సు, ఉద్యోగాదికములు, ఉన్నచో బిరుదులు తెలుపవలయును.
౭. కవి తానురచించిన గ్రంథములపట్టికనిచ్చుచు, వానికథాంశములను సంగ్రహముగా వివరించవలయును. ముద్రితాముద్రిత గ్రంథములును వేర్వేరు చూపవలయును. ముద్రిత గ్రంథముల మాకార్యాలయమునకుఁ బంపిన స్వీకృతిప్రకటింపబడును.
౮. పద్యముల నిప్పటినుండియే పంపుచుండవలయును. శ్రావణమాసానంతరము వచ్చినపద్యములను ప్రకటింపఁజాలము.
౯. భావకవితఁగూడ ప్రకటింపఁబడును.
౧౦. ఉన్నచో తమఫోటోగ్రాఫులను (తస్వీరులను) పంపవలయును.
౧౧. ౧౩౦౦ ఫసలీనుండి యుండుకవులనుఆధునికులనుగా నిర్ణయించినాము కావున నెవ్వరేని ౧౩౦౦ ఫసలీతర్వాత గతించినయెడల నాకవి బంధుమిత్రులు లతఁడురచించియుండిన పద్యములను బంపఁగలరు.

ఈవిషయమునుగూర్చి కవులందఱకును ప్రత్యేకాహ్వానములు పంపుటకు మాఅపరిచితి కొంతయాటంకముగా నుండఁగలదు. కావున పత్రికాపాఠ

కులు మాయీప్రయత్నమును తమమిత్రులగు కవులకుఁ దెలిపి వారిని బ్రోత్సహింపవలయునని వారిని గోరుచున్నాము. నిజాంరాష్ట్రాంధ్రకవులీ తరుణమునుఁ గైకొని, ఉత్సాహముతో తోడ్పడి మాప్రయత్నమును ఫలప్రదము గావింపవలయునని ప్రార్థించుచున్నాము."

ఈసమయమును బురస్కరించుకొని సంస్కృతాంధ్రములకు సమాన గౌరవములనియ్య నుద్దేశించితిమి. మా యీ యుద్యమమును బ్రశంసించుచు స్థానికులును బరస్థానికులును మా కాశీర్వాదపూర్వకముగా లేఖలు వ్రాసి మమ్ము బ్రోత్సాహపరచిరి. కవులు ప్రోత్సాహముతో దమతమ కవితల నంపియున్నారు. మరియు మాసదుద్యమమునువిని శ్రీమంతు స్వైరాణీ భాగ్యలక్ష్మమ్మ బహద్దరువారు అత్యంతానుగ్రహపూర్వకముగా నేతత్కవితావిలాస పుష్పప్రచురణ భారమును వహింప సమ్మతించి శ్రీవారి ఆంధ్రభాషాభిమానమును బ్రకటించియున్నారు. అట్టి సంతోషపరిస్థితులచే ద్విగుణీకృతోత్సాహులమై మూడుమాసముల పరిశ్రమమూలకముగ నిప్పుడే కవితాపుష్పమును సరస్వతీ పాదపీఠమున సమర్పింపఁగలిగిన భాగ్యమబ్బినందులకు మేము కడుంగడు ధన్యులమని భావించుకొనుచున్నాము.

ప్రకృతము మేము నివేదించుకొను నీసంచికయందు ౩౫౪ గురి కవితలను బ్రకటించియున్నాము. ఇందలివిషయములనుబట్టి దీనిని ౧౧ శాఖలుగా పాఠకులసౌకర్యార్థము విభజించియున్నాము. మొత్తము పద్యములసంఖ్య ౧౪౧౮. ఆయా శాఖలపేర్లను వానినివ్రాసినకవులసంఖ్యను అందలి సంస్కృతాంధ్ర పద్యములసంఖ్యను గ్రిందనిచ్చుచున్నాము.

| విషయము | కవులసంఖ్య | పద్యసంఖ్య. |
|---|---|---|
| ౧ స్తోత్రములు | ౯౪ | ౩౫౮ |
| ౨ మహాపురుష ప్రశంస | ౨౩ | ౮౨ |
| ౩ శృంగారము | ౧౯ | ౭౬ |
| ౪ హితోపదేశము | ౨౬ | ౯౯ |
| ౫ సంచికా ప్రశంస | ౧౫ | ౫౭ |
| ౬ వివిధవర్ణనలు | ౭౬ | ౨౬౫ |
| ౭ కథాలహరి | ౧౩ | ౨౫౦ |
| ౮ ప్రబోధము | ౨౨ | ౫౨ |
| ౯ నిజాంరాష్ట్ర ప్రశంస | ౧౨ | ౬౦ |

| విషయము | కవులసంఖ్య | పద్యసంఖ్య |
|---|---|---|
| ౧౦ కవిత్వతత్త్వము | ౯ | ౩౯ |
| ౧౧ సంకీర్ణము | ౪౫ | ౧౧౦ |

ఈ ౩౫౪ కవులలో సంస్కృతమునందుఁ గవితనల్లినవారు ౭౨ మంది ఆంధ్రమునందుఁ గవితనల్లినవారు ౨౮౨ మంది. సంస్కృతశ్లోకముల సంఖ్య ౨౩౭. ఆంధ్రపద్యములసంఖ్య ౧౧౮౧. పురుషులసంఖ్య ౩౪౭ స్త్రీల సంఖ్య ౭. మరియు కులమునుబట్టి చూచినచో ఈ క్రిందివిధముగాఁ గవులసంఖ్య తేలుచున్నది.

| | |
|---|---|
| శ్రీవైష్ణవులు | ౧౦౮ |
| నియోగులు గోలకొండ వ్యాపారులు | ౭౪ |
| వైదికులు | ౬౬ |
| రెడ్లు | ౧౭ |
| చాత్తాద వైష్ణవులు | ౧౬ |
| కోమట్లు | ౧౧ |
| భట్రాజులు | ౧౧ |
| వీరశైవులు | ౬ |
| పద్మశాలీలు | ౫ |
| తెలగలు | ౪ |
| రాజపుత్రులు | ౪ |
| వెలమలు | ౩ |
| విశ్వబ్రాహ్మణులు | ౩ |
| క్రైస్తవులు | ౩ |
| ముసల్మానులు | ౩ |
| ఈడిగవారు | ౨ |
| కుమ్మరివారు | ౧ |
| యాదవులు | ౧ |
| ఆదిమాంధ్రులు | ౧ |
| అజ్ఞాతకులజులు | ౧౫ |

# ప్రస్తావన

జిల్లాలవారిగాఁజూచిన నీ క్రిందివిధముగానున్నది.

| | | |
|---|---|---|
| ౧ | మహబూబునగరు జిల్లా | ౮౭ |
| ౨ | వరంగల్లు జిల్లా | ౮౫ |
| ౩ | నల్లగొండ జిల్లా | ౫౭ |
| ౪ | కరీంనగరము జిల్లా | ౩౭ |
| ౫ | అత్రాపుబల్దా జిల్లా | ౩౩ |
| ౬ | రాయచూరు జిల్లా | ౨౩ |
| ౭ | మెదకు జిల్లా | ౨౧ |
| ౮ | గుల్బర్గా జిల్లా | ౫ |
| ౯ | నిజామాబాదు జిల్లా | ౩ |
| ౧౦ | ఆదిలాబాదు జిల్లా | ౩ |

ఇఁక నీసంచికలో మేమువలంబించినపద్ధతి నించుక వివరించుట యవసరమనిపించెడి-

కవులసంఖ్యను నిర్ణయించుటలో హెచ్చుతగ్గు లొనర్చినామని యపోహపడఁగూడదు. మేము నిర్ణయించుకొనిన భాగములోనికి వచ్చినకవులను ఏవిచక్షణయులేక ముద్రించినామే కాని మొదటిసంఖ్యవారు హెచ్చుతర్వాతి సంఖ్యవారు తచ్చు అని నిర్ణయించినామని యెవరేని తలంపఁగూడదని మనవి. అదేవిధముగాఁ బటములముద్రణముగూడ జరిగినది. మఱియు మా నిర్ణీతభాగములు ముద్రితమైనతర్వాత వచ్చినవారి కవితలను సంకీర్ణము శీర్షికతో ముద్రించితిమే కాని పనికిరానివారినందఱని నీభాగములోఁ బడవేసినామని యపోహపడఁగూడదని మనవిచేయుచున్నాము.

మేముచేసిన నిర్ణయమునకు విరుద్ధముగాఁ గొందఱు హెచ్చుగను,కొందఱనేకవిషయములను గూర్చియు పద్యావళిని రచించిరి.అవిచారముగా నట్టే ముద్రించినయెడల గ్రంథముయొక్క రమ్యత చెడిపోఁగలదు. కావున మా యుద్దేశము పరిపూర్తియగునట్లును, కవులందఱకు స్థానముదొఱకునట్లును మావిచక్షణ నుపయోగించి కొన్నిపద్యములుతగ్గించి కొన్నివదలి ప్రకటించియున్నాము. కవులెల్లరు మాసద్భావమునుగ్రహించి మన్నింతురుగాక.

మేముపెట్టిన గడువుప్రకారము కవితలురానందున మేమనుకొనినంత శీఘ్రముగా నీసంచికను బ్రకటింపలేక పోయినాము. ఇంకను కవితలను

బంపుచునేయున్నారు. అందుచే వానిని విచారముతో విడువవలసివచ్చినది. ఈ సంచికా ప్రకటనమువలన మాయుద్యమమును విరమించితిమని కవులు భావింపఁగూడదు. ఇప్పుడు విడిచినవానిని ఇకముందు వచ్చువానినిఁగలిపి మఱియొకసంపుటమును బ్రకటింపనుద్దేశించియున్నాము. కావున నిరుత్సాహపడవలదని సూచించుచున్నాము.

ఈసంచికా ప్రకటనానుభవమునుబట్టి యీరాష్ట్రములో నింతకు రెండింతల సంఖ్యగల కవులున్నారని చెప్పఁగలము. మఱియు పండితులసంఖ్యయు నపారముగా నున్నది. మాకుఁదెలిసినవారే యెందఱోయున్నారు. ఇంకఁదెలియనివారెందఱున్నారో చెప్పలేము. అట్టివారినందఱను బ్రోత్సహించుట మాయుద్దేశ్యము. కవులనేకులు తమకుఁబత్రికలు ప్రోత్సాహమొసంగుట లేనందున కవిత్రవ్రాయుటలేదని వ్రాసియున్నారు. అవియన్నియు వెనుకటి మాటలుగా భావింపవలయును. ఈరాష్ట్రమునందలి కవులలో చెక్కంద్రకు తమను దమకవితను బ్రకటించుకొను నుత్సాహముగాని యిూప్సితముగాని లేనివారుగాఁ గనఁబడుచున్నారు. అట్లు మూలలందొదిగి యున్నవారిలోఁ జాలమఁదిని నీసంచికామూలమున ముంగటికిఁ దేఁగలిగితిమి. బంధకవిత్వము బంధముల చిత్రములతోఁ గొందఱుకవులుబంపిరి. ఆబంధములను బ్లాకులు చేసిముద్రింపయత్నించితిమి కాని కాలవ్యవధి లేనందునఁ దుదిలోఁ గవివ్రాసిన పెక్కింటి బంధములలో నొక్కటొక్కటి మాత్రమే ప్రకటించినాము.

కొందఱు విపరీతవాదులు "అందఱు కవులగుట కర్హులా" యని ప్రశ్నింతురు.

> "పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా
> అద్యాపితత్తుల్య కవేరభావా దనామికా సార్థవతీ బభూవ.

అనియొక సంస్కృతనానుడికలదు. "పెద్దనవలెఁ గృతిఁజెప్పిన పెద్ద" అనవలె అని కవిచౌడప్ప పలికియున్నాఁడు. ఈనిర్వచనముక్రిందికి నీ 354 మంది కవులువత్తురా! "వీరందరు "కవి"యను నామమునకు నర్హులా?" అని వారు శంకింప వచ్చును. ఈ నిర్వచనమునే ప్రమాణికముగాఁ గైకొన్నచో స్వదేశ విదేశ కవులపేళ్లన్నియూ తుడిచివేయవలసివచ్చును. దానిభావ మది యెన్నటికినిగాదు. అదియొక విశేషవాక్యము. కావున కవియనుపదమును సర్వసాధారణముగా నన్వయించు నర్థమునందే మాయీకవులయెడల నన్వయించుచున్నాము. ఇందలి కవులయందుఁ బ్రస్ఫుటముగు

నుపజ్ఞ, చక్కని కవితాధార, మనోహరభావనాపటిమ, ధారాళమగు శైలి, ఛందో వ్యాకరణాలంకార శాస్త్రపరిజ్ఞానము, సంస్కృతాంధ్ర భాషా వైదుష్యము గనఁబడుచున్నది. అల్పారంభములే మహద్దశ ననుభవించుట కలదు. భోజరాజువంటి కవిజనమందారముల యౌదార్యము, కృష్ణరాయ సార్వభౌములఁబోలుకవిజనకల్పతరువుల ప్రోత్సాహము, నాలుగువేలు కాదుకదా యెనిమిదివేలిచ్చు అననేమునిబోలురసికాగ్రగణ్యుల పరామర్శయున్నచో వీరిలోనుండి యెంతమంది కాళిదాసులు, ఎంతమంది పెద్దనలుమఱియెంతమంది శ్రీనాథులు బయలు దేరుదురో! కాలగర్భమున నేమున్నదో యెవరికెఱుక?

మాయీసంచిక రెండుమూఁడు కారణములచే సంపూజ్యమైయున్నది. శ్రీ శ్రీ శ్రీ పరమహంస పరివ్రాజక పూజ్యపాదులైన శ్రీ పరకాలస్వాములు మగ్గురును అందు ప్రకృతము విజయముచేసియున్న శ్రీ శ్రీ శ్రీ అభినవ రంగనాథ మహాదేశికులవారును శ్రీ కృష్ణభారతీతీర్థ యతీంద్రులును మా సంచికకు నుత్కృష్టకవిత నంపి మమ్ము కృతకృత్యులను జేసినారు. మఱియు సకలసంస్థానాస్థాన కవులును కవిసార్వభౌములును శతవృద్ధులైన కవిపండితులును ననేకులు మమ్మాశీర్వదించి తమయుత్సాహయుక్త కవిత్వము నంపి తోడ్పడినారు. ఇంతియ కాదు. హిందువులేకాక మహమ్మదీయులును క్రైస్తవులును ఆంధ్రభాషాభిమానమును ప్రకటించుట గమనింపఁదగిన యంశము.

మేముచేసిన సేవ యల్పము. శక్త్యతీతమైనపనియిది. ప్రతిసంవత్సర మిట్టి సంచికను ప్రకటించుబాధ్యత ఆంధ్ర సంస్థానాధిపతులపైఁగలదు. కానివారు ప్రతిసంవత్సరము వేనవేలు కవిపండితులకై వ్యయముచేయుచుండియు నిట్టి పనినిఁ జేయఁబూనకపోవుట యీరాష్ట్రకవుల దుర్భాగ్య మనవలసినదే. ఈసంచిక కేవలము తాత్కాలిక కాలహరణమునకో వినోదమునకో పనికివచ్చునదిగానుండక శాశ్వతమగు చారిత్రకప్రఁగవిలెగాఁగూడనుండునట్లొనర్చినాము. ప్రతికవియుఁ దనఫోటో పంపిన బాగుండెడిది. ప్రాచీనకవులెట్లుండిరో గుర్తెఱుఁగఁగోరనివారుండరు. తిక్కన చిత్రలేఖనమీనాఁడెవరికేవ్రాలకిన, పోతనపటమిదియే యని యెవరేని నిరూపించిన వానికి లక్షలిచ్చువారున్నారు. కావున భావికాలములో కవుల ఛాయాప్రకృతులెంతవిలువ కలవిగానుండునో చెప్పనవసరములేదు. మరియు కవికాలము స్థలమునిర్ణయించుటలో విమర్శకులు పడిన శ్రమ పాండవులయజ్ఞాతవాసశ్రమకన్న మించినదేయైనది. ఒక్కొక్క కవిని ౧౦-౧౫ శతాబ్దములమధ్య వెనుకకు ముందునకులాగి బీభత్సముచేసినారు.

వాఁడు మాప్రాంతమువాఁడేయనియు, మావాఁడేయనియు ముప్పతిప్పలువడి గోవలుగోవలువడ వ్రాసి అచ్చుకొట్టి పెట్టినారు. పాపము ఓరుగల్లుపోతన్నను లాగుకొనిపోయి కడపమండలములో స్థాపించినారు. మహబూబునగరు అప్పకవిని గోదావరిలో వేయుదమా, కృష్ణలో నంచుదమా, లేక గుంటూరులో నిశ్చయముచేయుదమా, అని తగవు లాడినారు. బిక్కనవోలు (దోమకొండ) సంస్థానము కవియగు మల్లారెడ్డిని లాగుకొనిపోయి గోదావరిలో పడవేసినారు. కావున కవిపరిచయమను భాగములో కవికాలము, స్థలము, వయస్సు, రచనలు నిర్ణయముగా వ్రాసినాము. మఱియు నింతటితోఁ దృప్తినొందక ప్రాచీనకవులపట్టికనుగూడ నిచ్చినారము. కొన్నిసంవత్సరములకు పూర్వము శ్రీ శేషాద్రిరమణకవులు ౧౧౪ పూర్వకవులపట్టికను ప్రకటించియుండిరి. ఇప్పుడు మాకు హెచ్చుగా ప్రకటితాప్రకటిత కవులవిషయము తెలిసినది. మొత్తము ౧౫౩ ప్రాచీనకవులవివరములను సంక్షేపముగాఁ బ్రకటించియున్నాము. మాయనుభవమునుబట్టి యీ రాష్ట్రములో నింకనుసుమారు ౨౦౦ మంది ప్రాచీనకవులు గలరని చెప్పఁగలము. మాకు (మా ముద్దేశాం కురరీత్యా) సంచికానుబంధ ప్రకటనానుకూల్యమబ్బెనేని యీకవులజాడల గుర్తెఱిఁగి ప్రకటింతుమని మనవి చేయుచున్నాము.

పూర్వకవులలోఁ గొందఱిచరిత్రలుమాకు సమగ్రముగా దొఱకినవి. అవి గోలకొండపత్రికలోఁ బ్రకటించితిమి. అట్టివారిచరిత్రలీసంచికలోఁ బ్రకటించిన బాగుండెడిది. కాని కాలము లేమి, స్థలము లేమి, ప్రకృతము విరమించినను ముందుప్రకటింపనుద్దేశించిన యనుబంధము స్వరూపముఁదాల్చెనేని అందు తప్పక ప్రకటింతుము. పూర్వకవులపట్టికతో ముగ్గురు ప్రాచీనకవులచిత్రలేఖన ప్రతిబింబములు ప్రకటించినాము. శ్రీ కిరీటి వేంకటాచార్యులు, శ్రీనివాస నిగమాంతదేశికులు, శ్రీ అణ్ణయాచార్యులు అను వీరు సుమారు ౨౦౦ వందల సంవత్సరముల నాఁటివారు. వీరిపటములు చిత్రించిన చిత్రకారులు గుల్బర్గా జిల్లాలోచేరిన షోలాపురసంస్థానమువారు. ఈపటములు ప్రాచీనకవులవగుటచేతను ప్రాచీనచిత్రలేఖన ప్రతిబింబములగుటచేతను వీనివిలువ చాలకలదని పాఠకులు గమనింపఁగలరు. శ్రీ కిరీటి వేంకటాచార్యులే అచలాత్మజాపరిణయమను ద్వ్యర్థిప్రబంధకర్త. అదియసమగ్రముగా లభించినదని ఏలూరు ముద్రాపకులు వ్రాసిరి. కాని కిరీటివారివంశీయులవద్ద నాగ్రంథపు సమగ్ర ప్రతికలదు.

# ప్రస్తావన

పూర్వకవుల పట్టికను సిద్ధముచేయుపనిని తదనుభవము విజ్ఞానమును బట్టి సమర్థులగు మామిత్రులు శ్రీమాన్ దూపాటి వేంకటరమణాచార్యులు శతావధానులుగారిని ప్రార్థింపగా వారుసంతోషముతో శ్రమయనక వానిని సమకూర్చి సకాలమునకిచ్చి మాకు సాయపడినందులకు వారికనేక కృతజ్ఞతావందనములర్పించుచున్నాము. మాకు సంచిక ప్రకాశనుండు సర్వవిధములతోడ్పడి యడిగినయంతనే తమకవితలనంపిన కవులకు ముఖ్యముగా కృతజ్ఞులము. అనుదినము ప్రూఫులనుదిద్ది సలహాయిచ్చుచుండిన శ్రీమాన్ కిడాంబి వాదికేసరి శృంగారం కృష్ణాచార్యులు గారును, తమయథకానుభవముచే ప్రూఫులు సవరించుటయందును గ్రంథస్వరూపమును సుందరముగా చేయుటయందును మరియు నితరవిధములను శ్రమయనక ప్రతిదినము కార్యాలయమునకువచ్చి ప్రోత్సాహపరచి సాయపడిన పండిత శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారును మాకృతజ్ఞతకు పాత్రులు. మరియు శ్రీ బెల్లముకొండ నరసింహాచార్యులు గారు ముద్రితపత్రములఁజదివి తప్పొప్పులపట్టికను సిద్ధము చేసియిచ్చి సాయపడినందులకు వారియెడ కృతజ్ఞులము. తదితర మిత్రులు చాలకలరు. వారందరికిని నమస్కృతులు. ఈకవులసంచికకు అలంకారముగా భారతీచిత్రమును చిత్రించియిచ్చిన శ్రీమాన్ వనార్చాల రామాచార్యులు గారికిని మావందనములు సమర్పించుకొనుచున్నాము. వీరియందు చిత్రకళానైపుణ్యము కవితానైపుణ్యము జోడుగానుండుట ముదావహమగుచున్నది. ముఖ్యముగా శ్రీమంతు సర్వై రాణీ భాగ్యలక్ష్మమ్మ బహద్దరు ఆత్మకూరు పరిపాలకులు చేసిన సహాయమునకై మేమునిరంతరము కృతజ్ఞులము. వారిదే యీసంచిక. ఈసంచికయే వారి విద్వదాస్థానము. శ్రీవారి యీయాస్థానమునకు అష్టదిగ్గజములు కాదుకదా నవరత్నములు కాదుకదా 354 కవి కుంజరములను కవిసార్వభౌములను తీసికొనివచ్చి ఏతదాస్థానము నలంకరించినారము.

ఆత్మకూరు రాజబంధువులును సహృదయులును నగు కోటకొండ అనంతరెడ్డి బి. ఏ. ఎల్. ఎల్. బి. గారు మా యుద్యమమును గూర్చి శ్రీ సర్వై రాణీ భాగ్యలక్ష్మమ్మ బహద్దరు ఆత్మకూరు రాణిగారితో మనవి చేసి మాకు సాయముచేయించి పలుమారు ప్రోత్సహించినవారు. వీరియెడ మే మత్యంత కృతజ్ఞులమై యున్నారము.

## గోలకొండ కవుల సంచిక

హైదరాబాదు శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయమువారొక బ్లాకును, రాజమండ్రి కాకతీయ సంచికవారొక బ్లాకును, శ్రీలాల్జీమేఘ్జీగారొక బ్లాకును కవులవి మాకు ముద్రించుట కిచ్చినందులకు పైవారికి మాకృతజ్ఞత నర్పించు చున్నారము.

గోలకొండపత్రికాధిపతులీ సంచికాసంపాదకీయ కార్యభారమునునాపైఁ బడవేసిరి. భారతీసేవాసక్తుఁడ నగు నాకిట్టి సదవకాశము లభింపఁజేసినందున గోలకొండ పత్రికాధిపతులకు నామనఃపూర్వకమగు వందనము లాచరించుచున్నాఁడను. మహోన్నతమగు నీకార్యనిర్వహణము నెడ నెంత భక్తిశ్రద్ధలతోఁ బనిచేసినను గొన్నిలోపము లుండకపోవు అట్టిదానికి నన్ను మన్నింపవలసినదిగాఁ బండితవర్యులను, కవిశ్రేష్ఠులను ప్రార్థించుచున్నాఁడను.

సీ. భగవంతు సంపూర్ణభక్తితో నతియించి యాదర్శపురుష గీతాళిఁదనిసి
రసరాజ శృంగార రసవాహినింగ్రుంకి సదుపదేశము నాత్మఁ బదిలపరచి
సంచికోద్యమమూఁ ప్రాశస్త్యమున్ గ్రహియించి వర్ణనావీచికావళులఁదేలి
మహనీయ తరకథా మాధుర్యముంగ్రోలి దివ్యప్రబోధ నందీప్తమించి

గీ. శ్రీ నిజాంరాష్ట్ర ఘనతా విశేషమెఱిఁగి
పటుకవిత్వంపుఁ దత్వమ్ము పాఠ్ఠి నరసి
యితర రసముల చవిఁజూచి యీ ప్రబంధ
పాఠకు ల్పుణ్య పురుషార్థ భవ్యు లగుత.

గీ. ఇది యపర పారిజాతంబు, సదయహృదయ
సంతతానంద సంధాన సాధనంబు
ప్రకటితోన్మేష సౌరభ్య భాసురంబు
రాష్ట్రియసుకవిపోషణ భ్రాజితంబు
నిత్య నూత్నగుణంబుచే నెగడు గాత.

హైదరాబాదు
౧౨-౧౨-౧౯౩౪

సంపాదకుఁడు
సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ. బి. ఎల్.

# విషయసూచిక

# పటముల సూచిక

# కవినామసూచిక

# కవి నామ సూచిక

# గోలకొండ కవుల సంచిక







౧

# శ్రీనారాయణాష్టకమ్

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీకృష్ణపరబ్రహ్మతంత్ర.
పరకాల యతీంద్రులు



ధారాధరప్రవర నీరాజనీయరుచి పూరాయలోకగురవే
ఘోరాహతక్షుభిత సారామరాధిపతిసారాజ్యకల్పతరవే
నారాయణాయ ఘనసారావభాసిరుచి ధారాళభవ్యయశసే
పారాశరీస్ధ్రకలి తారాధనాయనతి రారాదుదాత్తమహసే. ౧

స్మేరాసితాభ్రరుచి దోరాహవాకలన ధీరాత్మదిత్యసుమమం
తారాధిపానిశ సమారాధనీయముఖ వారాశిజాత్తవిభవమ్
స్వారాజముఖ్యసుర వారాగ్ర్యమౌళిమణి నీరాజితాఙ్ఘ్రియుగళం
మారాదపీహ సుకుమారాకృతిం నమత నారాయణం ననుజనాః. ౨

వేలాతిశాయిశుభ లీలామృతాబ్ధిభవ బాలావిహారసుమహా
డోలాయమానవన మాలామనోహర మరాలాలకం సుతిలకమ్
నీలామ్బరాజ్ఞ శిశు పాలాన్తకాది యదుమాళావుదఙ్చితపదమ్
శ్రీలాల్యమఙ్గ్యయదుశైలావతంస మవహేలామపాస్యహృదయ. ౩

బాలాతపచ్ఛురిత నీలాభ్రవత్కనక చేలాదృతే ద్విలసితం
కైలాసశైలపతి శూలాయుధాదినుతి కోలాహలప్రముదితం
ఏలాలవఙ్గముఖ సాలాభిరామయదు శైలాగ్రశృఙ్గవసతిం
నీలాదిదివ్యమహిషీలాలితాఙ్ఘ్రి మను వేలాఙ్చితం రచయతమ్. ౪

పాయాత్సదాశ్రిత మపాయాదిమంజన మపాయాస్త్రశేషవిముఖం
శ్రీయాదవాద్రిరమణీయామహస్తతిర మేయాత్మదివ్యమహిమా
దేయాచ్చతాదృగనపాయాంశ్రియంవిధుతకాయాస్త్రరా
న్వయకథాం
ధ్యేయాత్మభవ్యతమ కాయాఽభివిశ్లథిత కాయాధవార్తివితతిః ౫

శ్రేయాంసి దాతుమిహ భూయాంసి మే జగతి భూయాత్స
ఏవహిపటుః
శ్రేయాన్స్వమానధిభయో యాదవాచలము పేయాయ-
వైష్ణవపరాత్
ఆయాస్యకాయమపి ధేయాన్ సుగాఢమపి నేయాన్ జనానతితరాం
హేయాన్నితాన్తమను పేయాన్ విపద్యపిచ నేయాంకదాఽపి
శరణమ్. ౬

శ్రీరామ్యోనిధిభాగధేయ విభవాన్దారానుదారాకృతి
స్మేరాన్ స్మేరసిలాలయస్మణిమహో హారాంసుధారాశ్చతే
పారావారగభీరిమాఽబ్జజ శునాసీరాదిమారాధితః
సారాంసమ్పదమాతనోతు నమతాం వారాయనారాయణః ౭

శ్రీరామానుజసంయమీన్ద్రవిభవాధారాయితస్తత్త్వప
స్సారాగస్య మహత్ఫలం జగదలంకారాయమాణస్థితిః
ఐరావత్యనఘశ్రియాఽనవరతం రారాజ్యమానశ్శ్రియా
పారార్థ్యాచ్ఛరణాగతాన్ వితనుయాన్నారాయణోఽస్మాన్
ప్రియాన్. ౮

శ్రీబగ్గ్యాన్వితంత్రపరకాలపదావతంస
శ్రీకృష్ణసంయమికృతం సతతం పఠన్తః
నారాయణాష్టకమిదం తద పాఙ్గధారా
సారాభిషేకశిశిరాస్సుఖినో భవన్తు.

---

శ్రీ

# శ్రీకృష్ణబ్రహ్మతన్త్రార్యవేదపాదస్తవము

శ్రీ హానసముద్రం వేదాంతాచార్యులు గారు



విశిష్టాద్వైతసిద్ధాన్తశుద్ధాన్తస్థితమానసమ్
శ్రీకృష్ణబ్రహ్మతన్త్రార్యం పశ్యేమ శరదశ్శతమ్. ౧

శ్రీకృష్ణబ్రహ్మతన్త్రాఖ్యాన్నమస్కృత్య గురూత్తమాన్
ప్రాప్య తత్కరుణాదృష్టిం జీవేమ శరదశ్శతమ్. ౨

పరకాలయతిశ్రేష్ఠం జ్ఞానప్రదమహర్నిశమ్
సంసేవ్య ప్రకృతిం జిత్వా నందామ శరదశ్శతమ్. ౩

శ్రీకృష్ణబ్రహ్మతన్త్రార్యాత్సద్వదాన్యశిరోమణేః
పర్యాయలక్ష్మణాచార్యాత్ మోదామ శరదశ్శతమ్. ౪

విద్యాచార్యాయ సద్విద్యా నిష్ణాతాయ నమో నమః
ఇతి సన్మన్త్రముఖరా భవామ శరదశ్శతమ్. ౫

ప్రణమామః పరమాచార్యం గణయామో న విపత్తతిమ్
జనవర్యైద్యగురోః కీర్తిం శృణవామ శరదశ్శతమ్. ౬

బ్రహ్మతన్త్రగురుసన్నుతఖ్యాతిమేవహి శుభప్రదామ్
మోదమేదురముఖా వయం ప్రబ్రవామ శరదశ్శతమ్. ౭

గృహ్ణన్తో నామ శుభదం సదాచార్యస్య మధురం సతామ్
రమాకాన్తస్యదయయాఽహితైః అజీతాస్యామ శరదశ్శతమ్. ౮

---

౩

# ప్రార్థనాంజలి.

శ్రీ సుదర్శనం తిరుమలాచార్యులు గారు.

ఉ. శ్రీపతి సన్మనోవసతి
జీవనదద్యుతి ధూత చంచలా
రూప విభూతి మధ్యమ ని
రుద్ధ మహాంబర భాతి సద్విజే
లాపతి రాజమాన గతి
లక్షిత చక్రధర స్థితి స్తనో
ద్దీపిత హార గోప యువ
తీపతిమాకు శుభంబుఁ జేయుతన్. ౧

చ. స్ఫురదరహాస వక్త్రమతి
సుందర కంజ సమీక్షణంబులున్
అరుణ సుధా సమాధరము
హస్తికరోపమ దీర్ఘబాహువుల్
సిరినిరవొందు వక్షమును
సింహకిశోర సమాన మధ్యమున్
హరిహయనీల సద్రుచిని
భాంగము గల్గిన రామమూర్తి సు
స్థిరముగ నాకుఁ దోఁచుఁ గనుఁ
జేర్చిన యప్పుడు విచ్చినప్పుడున్. ౨

చ. నగుమొగమున్ సుమధ్యమును
నల్లనిదేహము లచ్చికౌట ప
ట్టగు నురమున్ మహాభుజము
లంచిత కుండల కర్ణముల్ మదే
భగతియు నీలవేణియుఁ గృ
పామృత దృష్టియుఁ గల్గి వెన్నుఁడి
మ్ముగఁ బొడసూపుగాతఁ గను
మూసిన యప్పుడు విచ్చినప్పుడున్. ౩

౪

# శ్రీ హయగ్రీవప్రబోధస్తుతి

కవికులతిలక

శ్రీ హాంసదుర్గం కృష్ణమాచార్యులు గారు

సరససరసస్మేరాంభోజోదరోద్గళితామితా
తి మధురమధుక్షోదక్షేపాత్యుదంచితసౌరభః
మృదులమృదులంవాతప్రాతోనవాతిదయానిధే
భవతుభవతస్సుప్రాతంశ్రీహయానన! వాసరమ్ ౧

త్వన్మూర్తేః ద్యుతి సామ్యసంపదమసౌ సంప్రాప్తుకామస్తప
స్తప్త్వాధః కృతమస్తకోపి సయథాపూర్వత్వమేవాశ్నువన్
అప్రాప్త్యాస్వమనోరథస్య మలినశ్శుభ్రాంశురభ్రాంతరాత్
పాశ్చాత్యే జలధౌ తథైవ పతతి స్యాత్సుప్రభాతం తవ. ౨

అసావహ్నాంనేతా హ్యవిదితకలంకోహమనిశం
కలంకాక్రాన్తోస్మీత్యధికతరచిన్తాఘనమనాః
కలంకం సంమార్ష్టుం కిలజలనిధౌ హన్త చరమే
నిశాంనేతామగ్నో భవతిభగవన్! జాగృహి హరే! . ౩

అసావిందుశ్శౌరే మమ కిల గతోస్తంకుముదినీ
లతేయం సంప్రాప్తా పతివిరహతో గ్లానిమధునా
వదన్త్యేవం మాద్యన్మధుకర విరావైః కమలినీ
పరీహాసం నూనం రచయతితరాం జాగృహి హరే! . ౪

సరిత్పతిసముచ్ఛలన్మకరపుచ్ఛవిచ్ఛోటనా
ద్విధూతమరుణం మహత్తరమనర్ఘరత్నంకిము
విరాజతి సరిత్పతేరుపరి భాస్వతో మండలం
హయానన! దయానిధే భవతు తే విభాతం విభో! . ౫

౫

# శ్రీమచ్ఛేషాచల వేంకటేశ స్తుతి

ఆంధ్రగీర్వాణవాణీప్రవీణ

శ్రీ ఆచి. రాఘవాచార్యశాస్త్రులు గారు



శ్రీశేషాచల శృంగదేశ విలసద్గాంగేయ హర్మ్యాంగణో
దివ్యోద్యాన విరాజమాన సరసీమాలాభి రాశోభిత
శృంగారాంచిత వీధికాయుత మహాశృంగాటకై ర్భాసిత
శ్రీశ్రీవాస నివాస పత్తనవరో జేజీయతే సర్వదా. ౧

అస్మిన్నారుత్మతమణిమయో మంటపో దివ్యరత్న
స్తంభై ర్యుక్తో మరకతశిలా గోపురద్వార హృద్యః
ఐంద్రై ర్నీలై ర్మణిభి రమలైః కుట్టిమోద్భాసితోంచ
న్ముక్తాజాలై రుపరితల సంప్రోత దివ్యద్వితానః. ౨

మాణిక్య వజ్రమణి గుంభిత మౌళిదేశః
కస్తూరికోర్ధ్వరచితాలికపుండ్రకాంతః
రత్నోష్టకుండలవికాసితగండభాగ
శ్రీశంఖచక్ర పరిమండితదివ్యహస్తః ౩

శ్రీమత్కాంచన చేల యుక్తకటిభాగానంజితాంచత్కన
త్కాంచీఖడ్గవిరాజితఃకువలయశ్యామాకృతిశ్శ్రీధరః
బ్రహ్మేశాదిసురార్పితాబ్జతులసీమందారమాలావృతా
నందావాప్తికరాంఘ్రిపద్మయుగళో వందారుమందారకః ౪

ఏకోవ్యసావహిశిలోచ్చయరాట్స్వయంస్యా
త్సప్తత్వమేత్య భువిసప్తగిరీంద్రసంజ్ఞః
తత్సప్తశైలశిఖరేఖిలరక్షణార్థ
మావిర్బభూవ భగవాన్పురుషోత్తమోఽసౌ ౫

---

# ౬
# దత్తాత్రేయ స్తవము

శ్రీ వారణాసి రామయ్యగారు హరిదాసు

శా. శ్రీకైవల్య రమాకటాక్షవిలసచ్ఛృంగార భావప్రపూ
నాకీర్ణాంఘ్రిసరోజుఁడై తదనుభూత్యానంద సంధాన స
త్యైకానంద లసచ్చిదాన్వయవధూ సేవారతిన్ జొక్కు వి
ద్యాకల్పోన్నతుఁడైన మద్గురుని దత్తాత్రేయునిం గొల్చెదన్ ౧

శా. ఏనః పుంజముఁ బాసి శుద్ధమతులై యిష్టార్థముల్ గాంచి నా
నా నిశ్శ్రేయస సౌఖ్యముల్ జనులు గన్నారంచు విన్నాఁడనే
నీ నామోఘ మహత్త్వ నల్లుగుటచే నీదివ్య పాదాబ్జముల్
ధ్యానంబందున నిల్పి ప్రోవుమని దత్తాత్రేయునిన్ గొల్చెదన్ ౨

మ. అనసూయాత్రుల పుణ్యసంపదఁ ద్రిమూర్త్యంశమ్ములన్ బుట్టి తా
జననంబాదిగ బ్రహ్మచర్య ఘనదీక్షన్ బూని యాకల్ప జీ
వనసిద్ధిన్ గని జ్ఞానమార్గమును సర్వస్తుత్యమై యొప్పు ని
త్య నిధానంబుగ భక్తకోటికిడు దత్తాత్రేయునిన్ గొల్చెదన్ ౩

మ. సదయుండై పరులన్ భయంకర మహాసంసార ఘోరాంబురా
శిఁ దరింపన్ బొనరింపఁ బుట్టెనగుటన్ జిత్తంబునన్ దాను తు
చ్ఛమరంతై హికసౌఖ్య వేశముల పజ్జన్ జేర కెవ్వాఁడు స
త్యదశా రూఢత మించె నట్టిగురు దత్తాత్రేయునిన్ గొల్చెదన్ ౪

మ. నయధుర్యుల్ రఘురామ కృష్ణ ముఖులౌ నారాయణాంశుల్ జగ
న్మయధర్మంబులరక్షఁ జేయుచును గొన్నాళ్లుండి చన్నారు; నీ
వు యుగాంత ప్రళయాంతముందువు సదాపూర్ణానసూయాత్ర్య ప
త్య! యథార్థాచలతత్త్వబోధ, నిను దత్తాత్రేయునిన్ గొల్చెదన్ ౫

౬

# ఆర్యాపంచకము

శ్రీ వెల్లాల శివరామశర్మగారు



కుందేందుధవళహాసా
మిందీవర లోచనామంబాం
మందరసమానజఘనా
మార్యాంప్రణతోస్మి సంతతంభక్త్యా. ౧
ఇందిందిరాభవేణీ
మిందునిభాస్యాం సరోజమృదుపాణీం
మత్తేభమందగమనా
మార్యాంప్రణతోస్మి సంతతంభక్త్యా ౨
అంచితరూపామంబా
మంగదహారాది భూషణైర్యుక్తాం
అరుణారుణవస్త్రయుతా
మార్యాం ప్రణతోస్మిసంతతంభక్త్యా. ౩
కుండలి ధరార్ధదేహా
మండజయానాదిభిస్తుత్యాం
ఖండితరిపు దోర్దండా
మార్యాంప్రణతోస్మి సంతతంభక్త్యా. ౪
కేయూరమండితభుజా
మజవందితాంఘ్రిమార్యామనంగ
రిపుణాసహసంచరంతీం
కొల్లాపురీతి నగరే కుతుకేననిత్యం
సంవాసినీ మభయదాం
ప్రణతోస్మిభక్త్యా. ౫



శ్రీ శ్రీ శ్రీ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర యతీంద్రులవారు





శ్రీ శ్రీ శ్రీ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీవాగీశ బ్రహ్మతంత్ర పరకాలస్వాములవారు



[౨౯౧] వేదకావ్య స్మృతితీర్థ
శ్రీ చిదిరేమఠ వీరభద్రశర్మగారు





[౨౯౮] శ్రీ యామవరము
రామశాస్త్రిగారు

౮

# శంకరస్తవము

శ్రీపత్రి సత్యనారాయణ శాస్త్రిగారు.



ఉ. కట్టఁగ బట్టలేక కడు గారియఁ జెందుచుఁ గుందు వారికిన్
బొట్టకుఁ బట్టెడోగిరము పుట్టక కష్టము లొందు వారికిన్
బట్టకుఁ బొట్టకిచ్చి పెనుబాము లడంచి దగంబరుండవై
పొట్టకు బిచ్చమెత్తుకొనఁ బోవుట చిత్రముగాదె శంకరా! ౧

ఉ. పాలసముద్రమున్ జిలుకుపట్ల సురాసుర సంఘ మందులో
హాలహలంబు పుట్టె నది యంతటినిన్ దిగ మ్రింగఁ బోవ నా
వేలుపుఁ బెద్దలెల్ల తమ పీటి మొగంబయి పార దాని, లో
గ్రోలి జగత్త్రయంబుఁ గనుఁ బ్రోచిన దిట్టవు గాదె శంకరా! ౨

చ. పతియెడ భక్తిలేక యుపవాసములున్ సురపూజలున్ గృహా
గతుల సపర్యలున్ యతుల గౌరవముల్ ధన ధాన్య ధర్మముల్
సతతము తీర్థయాత్రలును సల్పుట కాంతకు బూదిలోన గో
ఘృతమును బోయుమాడ్కి యగుఁ గీర్తియు స్వర్గము గల్గదీశ్వరా ౩

చ. నరులిల గౌరవంబును ధనంబును జెందఁగఁ గారణంబుగా
దరయఁగ విద్య పూర్వజన నార్జిత పుణ్య విశేష మొండె సు
స్థిరముగఁ గారణంబగుసు దేవతలంచు బుధుల్ భజింతు రీ
పరుసపు రాళ్లులేమి చదువన్ గలిగెన్ వచియింపు మీశ్వరా! ౪

శా. పారావారములో మునింగి యసువుల్ వర్జింపఁ గావచ్చు దు
ర్వారాభీల దవాగ్నిలోఁ బడి శరీరత్యాగమున్ జేయ నౌఁ
గ్రూరాహీంద్రు విషంబు మ్రింగి ధరపైఁ గూలంగవచ్చున్ దుర్
దారిద్ర్యంబు భరింపరా దెవరికిన్ దథ్యంబుగా శంకరా! ౫

౯

# మారుతి

శ్రీ సిరివెల్లి విశ్వనాథ శాస్త్రిగారు.



మ. దిననాథాన్వయులైన రాకొమరులే తేరంగ వీక్షించి సూ
ర్యుని పుత్రుం డతివేగ నిన్ బనుపఁ బుణ్యోపేతులౌ వారితో
డను సుగ్రీవుని చెంతకుం జని నిరాటంకంబుగా మైత్రిఁ గూ
ర్చిన నీలీలలు గోరి వ్రాసెదను తండ్రీ! ప్రోవవే మారుతీ! ౧

చ. తన కులకాంతనున్ గుటిలదానవుఁ డొక్కఁడు దొంగిలించి వేఁ
జనటయు నాదిగాఁ గలుగు సంగతులన్ వినిపింప సూర్యసం
దనుఁడు మనంబులోపలను దద్దయుఁ జింతిలి నిన్ను జానకీ
వనితనుగాంచి రమ్మనుచుఁ బంపిన నేగితి వీవు మారుతీ! ౨

మ. లవణాంభోనిధి దాఁటి రావణుపురీ లావణ్యమున్ జూచి దా
నవ రాజేంద్రుని రమ్య సౌధములలోనన్ గాంచఁగాలే కశో
కవనంబందునఁ గ్రూర దైత్యవనితాక్రాంతన్ ధరాజాత రా
ఘువునాతిం గనినట్టి నీకిదె నమస్కారంబులో మారుతీ! ౩

ఉ. జానకితోడ ముచ్చటలు సల్పి వనంబును భంగపెట్టఁగాఁ
బూని కుతూహలుండవయి భూరిగ నాదముఁ జేసి శాఖలున్
మ్రానుగముల్ బడంగలఁచి రాకుసులెల్లను భీతినొందవే
భానుజుఁ జేరగాఁ జని సువార్తను దెల్పితివీవు మారుతీ. ౪

ఉ. అంగదుఁడాదిగాఁగల వనాటులతోడను రాము దేవిఁ గా
నంగను దక్షిణాబ్ధికి ఘనంబుగ నేగి ముదంబుతోడ ను
ప్పొంగుచు దాఁటి లంకకును బోయి నిశాచరనాథు శౌర్యమున్
భంగమునొందు వాక్యములు పల్కితి వచ్చుట నీవు మారుతీ! ౫



౧౦

# ప్రార్థన

శ్రీ వలిపె వేంకటరావుగారు వకీలు



మ. జననంబాదిగఁ జేయు పాపములకై జాలిం గడుఁ గాంతునా?
ముసు జన్మంబుల కర్మ సంచితము నాత్మన్ గాంచి దుఃఖింతునా?
ఘన సంసార దవానలంబునకునై గాసిల్లి ఘోషింతునా?
వనజాతేక్షణ! యేదిదారి యిఁక నీవ్యామోహముఁ మాన్పుమా. ౧

చ. సరసిజనాథ! నీదు పదసారసముల్ శిరమందుఁ దాల్చి నే
నిరతము సంస్మరించెదను నీ శుభనామ మనేకభంగులన్
బిరబిర నన్నుఁ బ్రోవఁగను భీమపరాక్రమ వేగ రాఁగదే
బిరుసు వహించి నన్నుఁ గడు భీతునిఁ జేసెదవేల మాధవా! ౨

ఉ. సారవిహీనమై తుదకు సంకటమౌ నరకంబుఁ జేర్చు సం
సారములో మునింగి కడు జాలిని నొందుటకంటె వేగ నా
సారసనాభునిన్ సుగుణసాగరు సూరిజనాభివంద్యు వే
సారక నాత్మనుంచి మనసార భజింపఁగ సౌఖ్యమబ్బదే? 3

ఉ. కోరినవారి కీవు పలు కోర్కెల నీయఁగలేదె? వారలే
తీరునఁ గాన్కలిచ్చిరొకో? తీరని భక్తియ కాక నే నిరా
ధారుఁడ నీదు నామము నెదన్ స్థిర భక్తి జపించువాఁడ నో
నీరజనేత్ర! నా పయిని నీదగు ప్రేమను జూపి ప్రోవవే. ౪

ఉ. తల్లివి దండ్రి వీవనుచుఁ దమ్ములు నన్నలు నీవ యంచు నే
నెల్ల విధమ్ములన్ మదిని నెన్నికతోఁ దుత నున్నవాఁడ నో
పల్లవ కోమలాంఘ్రియుగ! పన్నగశాయి! పతంగ వాహనా!
యుల్లమునందుఁ దా వొసఁగిఁ యుత్తమ మార్గము వేగఁ జూపుమా! ౫

## ౧౧

# శ్రీనివాస ధ్యానసోపానము

శ్రీమద్బాల సరస్వతీ, తర్కతీర్థ
శ్రీ బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులు



సంస్కృతభాష

ఏకీభూతంకిలతనుజుషాం మన్మథానాం సహస్రం
రాశీభూతం కలజనదృశాం ప్రాక్తనంభాగధేయం
కారుణ్యానామివసముదయం కాంక్షితానామివౌఘం
కల్యాణానామివచ నివహం కామయే శ్రీనివాసం. ౧

ప్రాకృతి

మాణిక్కమంజుణి ఉరజ్జుఇ సంఝురాఅ
సంపక్కసంగహి అసోణిను సందభావో
దవ్వీరఇందసిహరిందు సుహంఘిసోహా
బాలాఅతో మహహి అంబుఅముజ్జలేఉ. ౨

ఛాయా॥

మాణిక్య మంజునూపురద్యుతిసాంధ్యరాగ
సంపర్కసంగ్రథిత శోణిమసాంద్రభావః
దర్వీకరేంద్ర శిఖరీందు శుభాంఘ్రిశోభా
బాలాతపోమమహృదయాంబుజ ముజ్వలయతు. ౩

శౌరసేని

జవహాపుంజప్పసరే
తాసవ్వవిలో అణా ఇమఉలీభోంతి
తారిసకొత్థుహవక్ఖో
కహాణుసి ఆలమ్మణేత్తసుహానంసెవో ౪

ఛాయా॥

యత్ప్రీభాపుంజప్రసరే
తస్యైవవిలోచనేముకుళీభవతః
తాదృశకౌస్తుభవక్షాః
కథంనుస్యాదస్మన్నేత్ర సుఖసంసేవ్యః. ౫

మాగధి

మిదహశిదమిశాఏ చందిమాశంపఆఏ
శిలిణయణ చఓలాణంద మాకందళెంతే
మహులిఉ ముహచందే అమ్హాణెత్తేసులమ్మం
ముఅదివి అతుశాలం భూపేయూశధాలం. ౬

ఛాయా॥

మితహసిత మిషయా చంద్రికాసంపదా
శ్రీనయన చకోరానంద మాకందళయా
మధురిపు ముఖచంద్రోస్మన్నేత్రయోరమ్యాం
ముంచతీవతుషారాం భూరిపీయూషధారాం. ౭

పైశాచి

ణిపిడేక్కేక్కవ్వవహింత
మకుటప్పచ్చుత్త వజిరరతనరుచీ
సోభతిస మొప్పితాహారి
సిరమ్మిసితసోణ పొమ్మమాలవ్వ. ౮

ఛాయా॥

నిబిడైకైకవ్యవహిత
మకుటప్రత్యుప్త వజ్రరత్నరుచిః
శోభతేసమర్పితాహారి
రసిసిత శోణపద్మమాలేవ. ౯

## ౧౨

# రామలింగస్తుతి

కంబము వీర రామయ్యగారు



సీ. కైలాస గిరిఖేల కల్యాణ గుణశీల
సురచక్ర పాల యశోవిశాల
భంజితాంహోజాల పాలిత మునిబాల
భావజేభమృగేంద్ర భక్తపాల
కరుణాలవాల శంకర పురహర బాల
నక్షత్ర రాడ్ధర నమిత లోల
సవనాంతకా భవ సంభృత కరశూల
దిగ్జాల చేలార్క రుగ్విశాల
గీ. దీన సురపాల గళరుగ్జి తేంద్రనీల
నిలచి ప్రణుతించితిని గదే నీమ్రోల
యేలఁ జాలవిదేల నే నగడఁజాల
రాజమిహిరరథాంగ శ్రీ రామలింగ. ౧

సీ. రవిశశి శిఖినేత్ర భవలతోగ్రలవిత్ర
కవిజన స్తుతి పాత్ర ధవళ గాత్ర
దివిజోపవనచైత్ర భువన రక్షణ సూత్ర
నివసిత సితగోత్ర శివపవిత్ర
కుజనద్రు కరపత్ర విజిత శాత్రవ గోత్ర
వృజినౌఘ కానన వీతిహోత్ర
రక్షిత మునిపుత్ర దక్షప్ర ధనజైత్ర
పంకజాయత నేత్ర కంకపత్ర
గీ. ధవళ వృషపత్ర సుచరిత ధనద మిత్ర
నిభృతదృక్కోత్రి శ్రీభవానీకళత్ర
మిత్రజామిత్ర మానిసం స్తోత్రపాత్ర
రాజ మిహిరరథాంగ శ్రీరామలింగ ౨

(ముక్తపదగ్రస్త)

సీ. శ్రీసర్వమంగళా చేతోబ్జ సారంగ
సారంగ నిర్జర వైరిభంగ
భంగీకృతత్రిపుర భవనాశ ధవళాంగ
యంగసంభవ భంజి తార్క్ష్యసంగ
సంగమేశ్వర సమస్తక భవ్యపురగంగ
గాంగేయ నగచాప కరకురంగ
రంగద్భుజంగేంద్ర రవణ కృపాపాంగ
యంగద జనక ద్విడఘువిభంగ

గీ. భంగరహిత ఫలప్రద భద్రసంగ
సంగ తామ్రస్వరూప వాసగిరి శృంగ
శృంగ మునినుత శుభ్ర వృషేత్తురంగ
రాజ మిహిరరథాంగ శ్రీరామలింగ ౩

(సర్వలఘు)

సీ. తరుణహిమ కిరణధర ధరణిరథ హరిణకర
మరణ జని రహిత హృత దురిత విసర
కమలభవ దమనసుర వినుతకుల శమనసర
నమితపద జలజయుగ యభయదకర
కదనతల విజయమద మదనహర కుధరవర
సదన జగదవన మృదువచనసుకర
విహగహయ వినుతపుర గహనదవ దహనచిర
బహుళతర విభవ నిరుపమ శుభకర

గీ. కమలనిధి శరధి గరళ గళ గగన చికుర
వరగమనసఖ సుఖఫలద మురహర శర
నిజగుణ కథన చణకమలజ మధుకర
రాజమిహిర రథాంగ శ్రీరామలింగ ౪

# ౧౩
# భక్తిభిక్ష

శ్రీబద్దిరాజు లక్ష్మీనరసింహారావుగారు.



ఉ. భావముపల్లవింప నిజభక్తహృదంబుజ లోకమిత్ర ! ల
క్ష్మీవిభవాభిరామ ! నినుఁగీర్తనసేయుదు; సర్వలోకసం
సేవితమైన నీపదచింతనమాననిబుద్ధినిచ్చి నన్
గావుము దీనపోష ! సనకప్రముఖాఖిలమౌనిసన్నుతా. ౧

చ. అనయమునీదుచెంగటఁ బ్రియంబుననిల్వఁగఁ గోటిసూర్యకాం
తినిభ మహావిలాస రమణీయభవత్తనుభూరిదీప్తి నా
త్మను పదిలంబుగానిలుప, మంజురుచీ రమణీయు దవ్యగా
ధనవిన తావకీన సునితాంతదయన్ మతినిచ్చి ప్రోవుమా. ౨

శా. నీరూపంబులు, నీదువేషములు, నీ నేర్పుల్, విలాసంబులున్
నేరంజాలరు తెల్యయోగులనఁగా, నేనెంతవాఁడన్ బృహ
ద్ధీరా ! భక్తినొసంగిప్రోచుటకు నీదే భారము ద్వేల దు
ష్టారిధ్వంసక ! పాలముంచినను నీటన్ముంచినన్ శ్రీహరీ ! ౩

మ. పరమార్థప్రతిపాదకుండవు, సురారాతివ్రజాహార్య భం
జనదంభోళివి, యోగిమానసపయోజద్వాదశాత్ముండ వెం
దునదిక్కెద్దియులేని నాకలుషముం దూలించిరక్షించి నా
మనమందున్ భవదీయ నామమును సంస్థాపించి రక్షింపుమా. ౪

క. అనిశము చేతస్సౌధాం
గనమునఁ గ్రీడించుపరమ కారుణ్య చిరం
తనమూర్తి భక్తిభిక్షా
ర్థిని దానిన యొసఁగు మైత్రేయమునొల్లన్. ౫

౧౪

# శ్రీరామ పంచాక్షరీ స్తవము

శ్రీ పుల్లగుమ్మి శ్రీనివాసాచార్యులు గారు



ఓంకారప్రతిపాద్యం శ్రీభూదేవ్యంచితం నిగమవేద్యం
శ్రీకేశవపరదేవం వన్దేహం సర్వసంపదాం ప్రాప్త్యై ౧

రాంకవభూషితవపుషం దయానిధిం మాత్స్యరూపమబ్జాక్షం
వేదోద్ధరణధురీణం శరణాగతరక్షిణం ప్రణౌమి హరిం. ౨

రాజన్మన్దరశైలం పృష్ఠే ధృతవాన్ దివాకసాం నేతుం
జీవాతుమమృతమబ్ధేః కూర్మాకారో హరిస్సదావ్యాన్నః. ౩

మానాతీతవిభూతిర్దంష్ట్రోద్ధృతధరణిమండలశ్శ్రీశః
సదయో మమ నగాన్తరంగే మహావరాహశ్చిరం సరీవర్తు. ౪

యస్తంభభవో వ్యదృణాద్ధిరణ్యకశిపోరురః ఖరైర్నఖరైః
స నృసింహవపుర్లక్ష్మీజానిః పాయాద్విపత్తేరస్మాన్ ౫

నమతామాశ్యంకరణో బలిమస్తన్యస్తశోభిశుభచరణః
మాతాద్యావాభూమ్యోః పదద్వయేనైవ వామనోఽవతు నః ౬

మర్త్యానిద్యోతితే క్షితిమత్క్షత్రాం మహారుషాకృతవాన్
త్రిస్సప్తకృత్వ ఏతజ్జమదగ్నిసుతస్సుఖాకరోత్వస్మాన్ ౭



# ౧౫
# దశావతార స్తుతి

శ్రీ నంబాకం రాఘవాచార్యులుగారు.



మానాతిగ మీనాకృతి మేనా మాసాద్యహరసికిముజలధౌ
సోమక మాగమచోరం మామకముతచిత్త మకుశలైర్ఘోరం. ౧

కూర్మతనునూర్మిమాలినిమగ్నం నిర్మంథశైలముద్ధరసి
అపినామకిల్బిషార్ణవమగ్నం మామకుశలోర్మిషూద్విగ్నం. ౨

వారాహంవపురేత్య ఉపారాహంకారమథహిరణ్యాక్షం
శిక్షయసిపక్షివాహనదృప్తం మచ్చిత్తముతసదోత్రిక్తం. ౩

జిహ్మమథ దైత్య సింహం సంహర్తుం నారసింహతనుమతనోః
ఉతవాబంహిష్ఠాంహస్సంహాతి పరిబృంహితంమదీయమనః ౪

అదితిమతిముదితసుతగతివిమతిం బలివంచనాదుపంచయితుం
వామన దధా వపురథవామనసీషాంమమాతిధృష్టశంకుం. ౫

కృతవీర్యతనయ మవినయకృతవీర్యం పితరివీక్ష్యహాకుమనాః
జన్యే బలరాజన్యాన్ భార్గవరామాఽశు పరశునాదకరోః. ౬

ఉగ్రదశగ్రీవ భయగ్రస్తదిశాధీశ పోషణవ్యగ్రః
దాశరథీ రామో ధియమాశరకులధూమకేతురేతుమమ. ౭

రామఃప్రలంబడింభక దంభీయస్తంభనోగ్రసంరభః
కలయతుశంహాలముసలస్ఖలనత్రాసార్త దృప్తకురుధూర్తః. ౮
యదురాజకులవతంసస్సుదురాసదకంస దుర్మదధ్వంసః
గోపీమానసహంసః కోఽపి ధియాంమమమధినోత్వఘధ్వంసః. ౯

గీతాతరణి వితరణఖ్యాతాఖిలపాపజలధినిస్తరణః
సకలకలికలుషవిశరణ నిపుణధరాభరణ రేణుకణచరణః. ౧౦

---

౧౬

# వేంకటేశ్వరస్తవము

శ్రీ చక్రహరి నరసరాజుగారు



చ. వరము లొసంగి భక్త జనవాంఛలఁ దీర్చెడి భారమెల్ల బల్
మురిపెముతోడఁ దాల్చిన విభుండవుగా, మదభీప్సితార్థసి
ద్ధి రయమునన్ బొనర్పఁ దగదే పెరవాఁడనె నీ పదాంబుజ
స్మరణ పరాయణుండఁ బలుమాట లికేటికి వేంకటేశ్వరా! ౧

చ. కరివరుఁ బ్రోచినప్డు మునికాంతకు శాపము దీర్చినప్డు భూ
సురవరుఁ గాచినప్డు సురసూనుని రక్షణ సేసినప్డు నీ
యరమర లేక యుండిన మహా కరుణారస మెందుడాఁగె నా
కరుణ యొకింత జిక్కి నను గావగ రావటె వేంకటేశ్వరా! ౨

ఉ. మానవుఁ డెప్పుడైన రిపుమందిర సీమను ద్రొక్కరాదు క
న్గానక నేగెఁబో యచటఁ గాంతుఁ దలిర్పఁగ నిల్వరాదు పెన్
బూనిక నిల్చెఁబో యచట భోజనమున్ బొనరింపరా దిటుల్
గాని నరుండు మోసమును గాంచు గదా యిల వేంకటేశ్వరా!

ఉ. పోకలు లేని తమ్మలము పోటున కోర్వని మల్లయోధు పే
రాకలిలేని భోజనము నక్కరమాలిన బంధుజాలమున్
మేకల పాడియున్ సమత మీరి యొనర్చు వివాహ కార్యముల్
పాకర గల్గు బండఁ గన వ్యర్థము తథ్యము వేంకటేశ్వరా!

ఉ. కాసులె దోలు దోషములఁ గాసులె యిచ్చు సుఖంబు లెన్నియేన్
గాసులె బాపు కర్మములఁ గాసులచేతనె గల్గు గౌరవాల్
కాసులచేతఁ దాఁ దలఁచు కార్య విశేషములున్ ఫలించెడిన్
కాసులు లేని మానవుఁడె కష్టము జెందును వేంకటేశ్వరా!



# ౧౭

# మాధవనుతి

శ్రీ ఆవుల పురుషోత్తముదాసుగారు



ఉ. ఆయువు చూడ స్వల్ప మడియాసలు మెండు మనోవికారముల్
పాయకయుండు, నంతతము బాధలఁగూర్చుచునుండు రుగ్మతల్
ప్రాయము సర్వముల్ గలుష భాజనమై గనుపట్టుచుండు నా
కేయది రక్షణంబు పరమేశ్వర! దెల్పఁగదేర మాధవా! ౧

ఉ. బాలుఁడ దీనమానసుఁడ పాపవశుండను గోపచిత్తుఁడన్
గాలముచేతఁ గట్టువడి కామము లోభము మోహ మన్మహా
భీల దవాగ్ని బ్రుంగి భవ భీతినిఁ బొంది తపించుచుంటి నన్
బాలను ముంచెదో? జలము పాలొనరించెదొ తెల్పు మాధవా! ౨

శా. సంసారంబను ఘోర సాగరమునన్ సంతాప చిత్తుండనై
హింసల్ చేయుచు మాయచేత నమతా హీనుండనై యుంటినో
కంసారీ! గజరాజ రక్ష వరదా! కారుణ్యసంధాయకా!
సంసారాంబుధి తారకాఖ్య పరమేశా ప్రోవవే మాధవా! ౩

ఉ. పంకజనాభ! నీదు పద పంకజయుగ్మము నమ్మి మన్మనః
పంకజమందు నారతము పావన నామము సంస్మరించుచున్
శంకలు మాని శాంతమతి సజ్జన సంగతి గోరుచుంటి నా
వంక కృపారసంబుఁ బరు పంగను రాఁగదవయ్య మాధవా! ౪

ఉ. సూదిని నీడ్చు జాతి విధి సొంపగు స్త్రీల ముఖప్రదేశముల్
మోదము గూర్చు కెంజిగురు మోవియుఁ గాంచిన యంతనే మహా
వేదనచేత నెమ్మనము వేగమె లాగుచునుండుఁ బాపవృ
క్ష్వ ధరవజ్ర! ప్రోవఁగదవే కలుషంబు లడంచి మాధవా ౫



౧౭

# గోపాల చూడామణీ!

శ్రీ మాటేటి వరవరరావు గారు

---

జీవుల్ జీవియె పొట్టకూటికయి భక్షింపంగ సృష్టించి యా
జీవుల్ బ్రహ్మనిజాంశ మంటకుఁ దగన్ జిత్రించి కర్మంబునన్
జీవుల్ జీవినిఁ జిక్కఁజేసి తుది రక్షింపంగ నీవంచహో
గోవిందా! వినఁజెప్పరావు భళిరా! గోపాల చూడామణీ. ౧

"ఆవైకుంఠ పురంబులో నగరిలో నామూల సౌధంబులో"
నావిశ్వస్తుత దివ్యమందిరములో నా లక్ష్మితోఁగూడి క్రీ
డా విన్యాసములందు నిన్నుఁగను వేడ్కన్ బాహిమాం శ్రీహరీ
గోవిందా యని మ్రొక్కఁగల్గు దేవుఁడో గోపాల చూడామణీ. ౨

తలపంజాలక మానినాఁడ మిము మీ దాసాది వర్గంబుతో
నిలువంజాలక మానినాఁడఁ దుదకున్ నీ నామముల్ తల్పులో
నిలుపంజాలక మానినాఁడ తమరెన్నోరీతులం బ్రోచినన్
గొలువంజాలక మానినాఁడ శుభదా! గోపాల చూడామణీ. ౩

హాల వజ్రాంకుశ చక్ర శార్ఙ్గ వితతుల్ అబ్జాతకల్ప ధ్వజో
జ్జ్వల చిహ్నంబులఁబోలు మీపదము లీశా దేవ మన్మూర్థ మం
దిల త్రైవిక్రమ కాంచనాభరణమై దీపించుచున్నండో మ
త్కుల కల్లోజ్జ్వల వాసుదేవ! వరదా! గోపాలచూడామణీ! ౪

౧౯

# వేంకటేశ్వరా!

శ్రీ ధర్మవరము మణిమణిహారి గోపాలసూరిగారు.



అచ్చఁదెనుఁగు

ఉ. తియ్యనిపువ్వుదేనియలు తేటలునీటుగఁ గ్రోలుమేటి తేం
ట్లెయ్యెడనైననుమ్మెతల కేగనిలాగున లాతివేల్పులం
జయ్యనడాయఁబోకెపుడు చక్కఁగ డెందపుఁ దమ్మినిల్పిని
న్నెయ్యనఁ గొల్తునక్కటిక మూనఁగరాదొకొ వేంకటేశ్వరా. ౧

చ. అడుగునఁజాలుమబ్బుగమి నగ్గవఁబుచ్చెడు మేనిడాలుకై
నడరెడుచుట్టువాలు, మెయి నందము గొల్పెడుపట్టుసేలు, లే
బిడినడఁగించునాలు, కడిమిం దగ గల్గియు మేలుగాజగ
లెడపనివేలు, నిన్ను నెద నెంతయుఁ గొల్చెద వేంకటేశ్వరా. ౨

చ బెడదఁ దీర్పుమయ్య నినుఁ బేర్మినివారక వేఁడుపల్కులన్
బెడచెవిఁ బెట్టకయ్య, కడుపేదటికంబున నుంచినిచ్చలన్
సుడివడఁ జేయకయ్య, గడుసుందనమున్ విడుమయ్య, కల్మలన్
వడిగనొసంగుమయ్య, నిను వావిరిఁ గొల్చెద వేంకటేశ్వరా. ౩

చ. జిలిబిలిముద్దుపల్కొకటి చెన్నగ తేనియలొల్క, నాదునుం
గలకరుదెంచియొక్కపరి గాటపుమక్కువమీఱఁబల్క, నా
కలవరపాటులన్నిఁటిని గ్రన్ననఁ దీర్పుమ వేనవేలుజో
తలిడుదునీకు నెల్లపుడు తాల్మిదలిర్పఁగ వేంకటేశ్వరా. ౪

చ. చెలువగుకైత నీనెనరుచే దగనబ్బుటచేత రిత్తవెం
గలులనుగల్మికిఁ బొగడగా మది గోరక నెమ్మి నిన్నని
చ్చలుగొనియాడువాఁడబలు సంతసమందుచుఁ బ్రోవుమయ్య నే
సలిపిన యెల్లదోసములు చయ్యన బాపవె వేంకటేశ్వరా. ౫



## ౨౦

# దశరథ రామా

శ్రీ కొండా యల్లయ్యగారు

---

క. శ్రీరవికులసుత్రామా, సూరిజన స్తోమవినుత సుచిరనామా
చారులసద్గుణధామా, దారుణసంగ్రామభీమ దశరథరామా.

క. బహుభంగులనిను వేడిన, గుహునకునిడినావుగా పెక్కోర్కులనెల్లన్
సహజుని కిదిరిపువన,దహనా సీతాభిరామ దశరథరామా.

క. జానకిచెంగటలేదా, పూనిక భక్తులనుబ్రోవ బోధింపద యో
మానితగుణగణ వినరా,దా నామొఱవినులార దశరథరామా.

## ౨౧

# కాళీ!

శ్రీ జొన్న ఎల్లారెడ్డి గారు

క. శ్రీవిశ్వేశార్ధాంగివి, నీవై జగములసృజింప నేలగ లయమున్
గావింప నజహరాచ్యుతి, భావంబున వెలయునీకు భద్రము కాళీ.

క. వాణివినీ వేకదశ,ర్వాణివి సర్వార్థభోగవర్తివి గద పూ
బోణి వినుతగీర్వాణి, వీణాకర కమలనిన్ను వేడితిఁగాళీ.

క. పట్టితినీపాదంబులు, గట్టిగనాహృదయమనెడి కమలమునందున్
బెట్టితి దూరము వెడలన్, గొట్టకుధూర్తుండననుచుగోమలి కాళీ.

## ౨౨

# పరమాత్మ

శ్రీ అర్వకం పెరుమాళ్ళాచార్యులు గారు



చ. అనుపమ సృష్టిసుస్థితిలయాదులె కేవల లీలగాఁగ నా
యను గాని దానికంగముగ హర్షముతో సకలంబు నిండి నా
తనము విచిత్రమా ప్రకృతిధర్మమునన్ దలయూపి యూపునా
ఘనతరమైన బ్రహ్మమెరుఁగన్ సులభంబొకొ! జీవకోటికిన్. ౧

ఉ. జీవులు బద్ధకర్మమునఁ జిక్కి చరాచర జంతువాసియా
దేవునిఁ గానలేక తమతీరునెఱుంగక రాగ తృష్ణలోఁ
జావఁగ వహ్నిలోఁబడెడి జంతువులట్టుల దూయుచుఁద్రు సం
భావిత ధర్మవర్తులయి భక్తిఁదలంపక నాపరాత్పరున్. ౨

ఉ. భూరిగుణోజ్జ్వలంబమిత పుణ్యతమం బకళంకమైన నా
కారమటంచు కొందఱు వికారవిహీనము దివ్యమా నిరా
కారము నిర్గుణంబు పలుకందగు నట్టిదటంచుఁ గొందఱున్
బోరున బల్కుచుండ్రు తమ బుద్ధికిఁదోఁచినరీతి బ్రహ్మమున్. ౩

చ. ప్రకృతి వికాసభాసిత చరాచర జంతు మయ ప్రపంచ రూ
పకమయి కానివానివలె భాసిలుపుణ్యుని సత్యరూప మిం
చుక గనలేక కర్మమున స్రుక్కినజీవుల నుద్ధరింప నా
సకలనియంత గన్పడగ జాలినవాఁడయి యుండు చేరువన్. ౪

చ. సురుచిరమా శ్రుతిస్మృతుల శోధనసేసి యఖండమైన యా
పురుషవిభూతి భక్తిగను పుణ్యులఁగాచు పరాత్పరుండు సా
దరమున రక్షసేయుత ముదంబలరార నిజాము రాజ్య మం
దరుదుగ నిండియుండు విభుధావళి సత్కవితా విలాసమున్. ౫



౨౩

## శంకరస్తవము.

శ్రీ కొండపర్తి వీరమల్లుగారు.



ఉ. భూధరకార్ముకుండఖిల భూసురసంతతి రక్షకుండు వా
ణీధవమాధవాబ్జముఖ నిత్యసమర్చితపత్కజుఁడునన్
శ్రీధవభానుఁడున్ సకల సిద్ధమనస్స్థితి భాసియైన యా
భూధరజామనోహరుఁడు ప్రోచును గాకననుం గృపాళుఁడై. ౨

ఉ. ఆర్తిహరుం ద్రినేత్రు తుహినాంశుధరున్ హరు శాంకరీప్రియున్
నర్తనలోలు నాశ్రితజనావళికల్పకుజంబు శారదా
మూర్తినగేంద్రచాపు వటమూలనివాసు గిరీశు దక్షిణా
మూర్తినిఁ గొల్తునిచ్చలు నమోఘకవిత్వపటుత్వమీయఁగన్. ౩

౨౪

## విఘ్నేశ్వరా!

శ్రీ చాగంటి భాస్కరలింగముగారు



మ. సరసీజాసన వాసవాదిసుమన స్సంఘంబు లెవ్వానిపత్
సరసీజంబుల భక్తియుక్తులగుచున్ ధ్యానించి విఘ్నావళిన్
జెరుపన్ జాలియు కీర్తిన్ గనియు వాసిన్ గాంచినారయ్యనీ
చరణాంభోజములన్ స్మరించియొకదా చర్చింపవిఘ్నేశ్వరా.



౨౫

# శ్రీహరీ!

శ్రీ ముదల్ఘుర నరహరిరావుగారు



ఉ. శ్రీవనిత ప్రకోష్ఠయుగ శింజిత కంకణ ఘృష్ట తాంఘ్రి రా
జీవ విరాజితార్క భవ సీమ, పయోనిధి భోగ, భోగిభో
గా విరతస్ఫురన్మణి సహస్ర వికస్వర దేహ, దేవసం
భావిత సచ్చరిత్ర, నత భక్త హృదబ్జ పవిత్ర శ్రీహరీ ౧

చ. సరస గుణాభిరామ నయ జాల, యశోజితసోమ, సోమశే
ఖరనుత భవ్యనామ, రిపు గర్వ విరామ, భవౌఘభీమ, భా
స్కర శతకోటిధామ, నత సత్సుర వ్రజసార్వభౌమ, దృ
గ్వర కృత సూర్యసోమ, త్రిజగన్నుత దైవలలామ, శ్రీహరీ ౨

చ. అచల దృగోత్పలమ్ముల ధరారుణ బింబము లాస్య పద్మముల్
కుచ లికుచమ్ములున్ రదన కుట్మలముల్ కచపాశ బర్హముల్
రుచిరవచో వచస్సుల నిరూఢిగ గోపిక లర్పణంబొన
ర్చుచు భవదీయ గాన గతిఁ జొక్కి నటింతురు గాదె శ్రీహరీ 3

మ. అరయన్ గోసలదేశమౌక్తికము సీతామోదమాణిక్యమున్
సురసంసేవిత కల్పకంబు హనుమత్సుగ్రీవ భాస్వద్గళా
భరణంబున్ దశకంఠవంశ మహీభృద్వజ్రంబయైయొప్పు దా
శరథిన్ సత్కరుణాతరంగశరధిన్ జర్చించెదన్ శ్రీహరీ. ౪



## ౨౬
# పార్వతీస్తవము

శ్రీ అత్తలూరు విశ్వనాథ శాస్త్రిగారు

శ్లో. దుర్గేత్వదీయ మహిమానర్గలతాం సంతతం నివేదయతి
స్వర్గే వసదమరస్త్రీవర్గకృతానంత పుష్పతతిపూజా. ౧

శ్లో. చింతాకులితం స్వాంతం, సంతత సంసార సాగరే మగ్నం
భ్రాంతిం హర మే పార్వతి, చింతిత చింతామణి! ప్రపంచేఽస్మిన్. ౨

శ్లో. కచబంధిత సుమవారే, కుచకలశోల్లాసి తారసంతానే
నిచయాం తేపతి పార్వతి, వచకరుణాపూరితోక్తిమాధుర్యం. ౩

---

## ౨౭
# వేల్పు

శ్రీ వట్టెము పాపకవి గారు

సీ. కొమరుపీనులకంటె గమికాడు మొత్తగా
సత్త మిల్లిన మేటి సత్తివేల్పు
నెట్టనపొలిదిండ్ల పొట్టక్రొవ్వడగింప
జుట్టుకైదువు బట్టు దిట్టవేల్పు
పుట్టుగట్టునఁగను పట్టు వెట్టవెలుంగు
బోనిమానికె మెద బూనువేల్పు
మబ్బుబాబాబువ్వ గొబ్బునఁ గొనినిక్కు
పక్కివెన్నెక్కి పెం పెక్కువేల్పు

గీ. పొన్నజిగిదువ్వలుఁవదాల్చి యున్న వేల్పు
పెంచెరువునందు నెపుడు పెంపొందువేల్పు
బత్తులకు బుత్తి ముత్తు లేర్పఱచువేల్పు
పెల్లిదపుపొగడిత నివ్వటిల్లువేల్పు



౨౮

## వేణుగోపాల ధ్యానము

శ్రీ మరతాటి వేణుగోపాలచార్యులు గారు

---

మధురిపువదనసరోజం దరహాసమరాళరాజరమణీయం
మురళీరవమధుధారాం విసృజద్విలసతుమదీయహృత్సరసి ౧
పదయుగగతకింకిణీనినాదానుకరణపేశలబాలహస్తతాళః
అపనుదతుమమాంతరంమురారిస్తిమిరముదారవిలాసలోలశీలః ౨
మంజులగుంజాహారీ మౌళిచలాచలశిఖండమాలీమాం
కులసుందరీ విహారీకువలయకర్ణావతంసితాపాతు ౩
ఉరగాలంకృతికలితం సుమశరసుందరమహీశగిరివాసం
కలయేవిశాలవక్షస్థ్సలలసదరవిందనిలయమురుశరణం ౪

---

౨౯

## కురుమతిగిరీంద్ర నిలయోవిలసతు

శ్రీ కవితార్కిక సింహాచార్యులు గారు

---

నవకువలయదలనీలఃకమలాస్తనకమలముకులలోలాళిః
కురుమతిగిరీంద్రనిలయోవిలసతుమమమానసేరమావాసః ౧
శ్రీవత్సవైజయంతీకౌస్తుభలక్ష్మీపరిష్కృతోరస్కః
విలసతుహృదివిధిశతమఖహరిశరముఖవందితాంఘ్రిరాజీవః ౨
విద్యుద్రుచిరుచిరాంశుకసంవీతఃకిసలయాధరశ్శుభదః
విలసతుమమహృదికలశాంబుధికన్యాస్వాంతకమలకలహంసః ౩
షట్పదనివహమదాపహమంజులకుటిలాలకస్ఫురత్ఫాలః
కమలాకటాక్షదాసోవిలసత్వనఘఃకృతాసురత్రాసః ౪
పద్మాలయాపదాంబుజలాక్షాంకితవక్షసంసరోజాక్షం
కలయామికలుషజాలకతూలంకషమంశుమాలినిభభాసం ౫

---

# ౩౦

# నీరజాక్ష!

శ్రీ శిలింగం జగన్నాథం గారు



గీ. పుండరీకంబు నా కిప్డు పుండరీక
మయ్యె, శరము శరంబయ్యె, నా శుగంబు
నాశుగంబయ్యె, బర్హియు నయ్యె బర్హి,
నీ వియోగంబుచేత నో నీరజాక్ష! ౧

గీ. నీ వియోగంబు భరియింప నేర కేను
మదన తాపంబు తోడను మ్రగ్గు చుంటిఁ
జంద్రికల వెదఁ జల్లెడు చంద్రుఁ బోలు
నీదు వదనంబుఁ జూపు మో నీరజాక్ష! ౨

గీ. అంచితంబగు నీ యధరామృతంబు
తవిలి పానము సేయంగఁ దలఁపు గలదు
ఆశ్రితాభీష్ట సంధాత! యమృత మొలుకు
నీ యధర మానఁగా నిమ్ము నీరజాక్ష! ౩

గీ. విశ్వ మోహనమైన నీ వేణుగాన
మాధురిం గ్రోలి తడవాయె, మరల నొక్క
సారి నీ మోవిఁ గ్రోవిని సరగఁ జేర్చి
నీవు గానము సేయు మో నీరజాక్ష! ౪

గీ. ఘోర నారాచమున మారుఁ డీరసమునఁ
గ్రుమ్మఁ గాఁ జొచ్చె నిప్డు నా గుండెలవియ
దర్పకుని దర్ప మణఁగింపఁ దరలి రమ్ము
నీల నీరద నిభ గాత్ర! నీరజాక్ష! ౫



# ౩౧

# స్తోత్ర పంచకము

శ్రీ మేల్నాటి లక్ష్మయ్య గారు



### ఇష్టదేవతాస్తుతి

శా. శ్రీ వైదర్భి సరోజ సక్తభసలశ్రేణిం దొలంగించి న
త్తావుంబాసి ముఖాంబుజంబునఁ బడం దన్వాఁగి భీతిల్లి రా
భావం బాత్మ నెఱింగి గంధఫలులం బైఁజల్లి యత్తేటులం
బోవంజేసిన కృష్ణుఁ డెప్పుడు మముం బొల్పారఁగాఁ బ్రోవుతన్ ౧

### లక్ష్మీస్తుతి

సీ. మెఱుఁగారు వదనంబు సరసిజంబులఁ గేరి
విధుమాడ్కిఁ దద్దయు వెలయుచుండఁ
జెలువొందు రోమాళి యాళులను నిరసించి
హరిభంగి సంతతం బలరుచుండ
ఒరికింపవేసలి వారిదంబుల దూఱి
యేడ్తెఱం గృష్ణత్వ మెసఁగుచుండ
భావింప లేఁగాను, పంచాస్యమును నవ్వి
రహి ననంత విధంబుఁ గ్రాలుచుండఁ
గీ. దనరువాతెఱ బంధూకమును హసించి
మాధవస్ఫూర్తి విలసిల్ల మహి సదవయ
వంబులంతట శౌరి భావంబుఁ జెంది
పొసఁగు సిరిమాకు సంపద లొసఁగుగాత. ౨

### బ్రహ్మస్తుతి

మ. పరఁగ న్భారతి కొప్పు వారిదముగా భావించి తా నెక్కు హం
సరహిస్స్ఫీతి వహించి యేగునని బల్చర్చించి సందేహతం
ద్వరగా వాణిని నైజ వక్త్రమున నిత్యం బొప్పగాఁ దాల్చుచున్
సరసత్వంబునఁ బొల్చుధాత ననుఁ దా జైవాతృకుం జేయుతన్. ౩

### సరస్వతిస్తుతి

సీ. ప్రోల్ల సద్వల్లకీ పుస్తకాంచిత పాణి
రాజతాసిత ఫణి రాజవేణి
వినయ నిరంతర వినుత మునిశ్రేణి
మకరంద సుధా మధురవాణి
చాంచల్య లోచన, చకిత సంజ్వలదేణి
దక్షిణభుజకనద్వర కృపాణి
కైవల్య హర్మ్యాగ్ర కాంచన నిశ్రేణి
యంచ తేజీ నెక్కు మించుబోణి
గీ. యాచితేంద్రాణి సర్వ విద్యాధికాళి
సన్నుతాఖిల గీర్వాణి స్మరపధూని
పులినజిచ్ఛ్రోణి జాణయౌ నలువరాణి
కలితకల్యాణి ధీ నిచ్చుఁ గాత వాణి. ౧

### కవిస్తుతి

సీ. పరమ సత్యావాస పరుఁడగు వాగను
శాసను చతురాస్య సరణిఁ బొగడి
బహుముఖవక్తయౌ రహిఁ గుండలీంద్రుని
పదగూఢభావంబుఁ బ్రస్తుతించి
లలితవైదర్భిచేఁ జెలఁగు శ్రీనాథుని
పురుష సింహత్వంబు సరగఁ దలఁచి
విబుధ వత్సలుఁడన విలసిల్లు సోముని
సన్మార్గ గతులను సంస్మరించి
గీ. కవి వితానంబునకు మేలుఁ గలుగఁ జేయు
భాస్కరుని వృత్తి నియమప్రభావసమితి
నభినుతించియు నిరతపూర్వాంధ్రకావ్య
సృజన కౌశల కోవిద వ్రజముఁ గొలుతు ౨



## ౩౨
# శరణాగత రక్షణ
### శ్రీ రజాల్లి లక్ష్మణరాయడు గారు

క. శరణాగత రక్షణ తత్పరతం బోషించుమయ్య దామోదర శ్రీ
ధర భూధర ధరధరధర, నరసింహా పురీ నివాస నరహరిరూపా. ౧

గీ. మూడు మూర్తుల మీదటి మూల మెవడు
ఉండి లేనట్టి పురుషుని యునికి యెచట
నామ రూపంబు లేనట్టి నాథుడెవడు
అట్టి యీశునిఁ గొల్చెద నధిక భక్తి ౨

మాలిని. సరసిజనిభనేత్రా సాధుసంస్తుత్యపాత్రా
నిరుపమశుభనామా సిద్ధరారాతిభీమా
సురుచిరమణిభూషా సూరిసంఘాతితోషా
సురమునిగణపాలా క్షోణిజాప్రాణలోలా ౩

## ౩౩
# రంగశతకము
### శ్రీ రంగానందస్వామి గారు

గీ. సకలజీవకోటి సాఁకెడిపరమాత్మ, నెపుడు వీడకుండ నెదభజించు
వాఁడెభక్తవరుఁడు వసుధలోఁజూడంగ, విమలసుగుణలింగ వినుతరంగ.

గీ. భక్తి లేనిపూజ పత్రిచేటందురు, ఫలము లేదుదాన పరగఁజూడ
భక్తి చేతనిడిన పండొక్కటేఁజాలు విమలసుగుణలింగ వినుతరంగ.

గీ. అణువు మొదలుకొని యజాండంబువఱకును
నిండియుండు చిన్మయుండు నెపుడు
అతనిఁగన్నవాఁడె యానందయోగిరా
విమలసుగుణలింగ వినుతరంగ. ౩

౩౪

# సాంబమూర్తి స్తవము

శ్రీ గుండ్లా రాజమౌళిగారు



గీ. ఉన్నదనరాదు లేదనుకొన్న బోదు,
పట్టుకొనరాద దెప్పుడెడఁబాసిపోదు
ఇట్టిదౌమాయలేని నీగట్టిపాదు
సచ్చిదానంద గురుమూర్తి సాంబమూర్తి. ౧

గీ. ఎవ్వరేరూపునన్నుతియింపుచున్న
నేనదేరూపు గైకొని నిలిచికోర్కె-
లిడుదునసవింటి నీకీర్తి కడు ముదమున
సచ్చిదానంద గురుమూర్తి సాంబమూర్తి. ౨

గీ. బ్రహ్మ విష్ణు మహేశ్వర బలమనంగ
త్రిగుణమాయావిశిష్టమై తేజరిల్లు
దానిపైనుండు చోటునీ స్థానమయ్యా
సచ్చిదానంద గురుమూర్తి సాంబమూర్తి. ౩

గీ. ఈశ్వరానిన్ను నెడబాసి యెంతకాల
మేగెనో దేవ యికముందు నెంతకాల
మునకునిను జేరుదునో తెల్పు ముదముతోడ
సచ్చిదానంద గురుమూర్తి సాంబమూర్తి. ౪



## ౩౫

# జీడికంటిరామ

శ్రీ కేశవపట్నం నరసయ్యగారు



సీ. నాకలోకమునీకు శీకుదివాన్ఖాన
నిగమపదార్థంబు నీఖజాన
యెన్నశక్యముగాదు రన్ననీశాన్ఖాన
నిత్యంబుహెచ్చురా నీఘరాన
సనకాదిమునులకోసంగితౌ రోజీన
యెఱుఁగలేఁడింత నిన్నిదివాన
యిచ్ఛతోనన్ను నీకిచ్చితి నజరాన
పడఁద్రోయకయ్య నన్బందిఖాన
గీ నైజవిభవంపుఁ బుట్టిల్లు నీజనాన
ప్రస్తుతమకిచ్చుఁ దగుహిసా పాదియాన
సిరులకిరవైనజుంటి శ్రీజీడికంటి
ధామ సుగుణాభిరామ శ్రీరామ రామ. ౧

సీ. దేవనినుమఱచి తెచ్చుకొంటినిజేటు
పడఁగదాభవముల బందిపోటు
గదిసె నింకెటుజొత్తు మదికితొందరపాటు
లేశమైనను దాగలేదుచోటు
ఏలికవైచేయు మినుమంత తోడ్పాటు
మనుపు నీపాద పద్మములచాటు
చేరఁగోరితినయ్య సేయకు టాటోటు
దైవమాలేదు నీదయకుదీటు
గీ. సక్కృతము దక్కఁగలదె వేరొక్కబాటు
గద్దరించకు చేయుమా దిద్దుపాటు
సిరులకిరవైనజుంటి శ్రీ జీడికంటి
ధామసుగుణాభిరామ శ్రీరామరామ. ౨

# ౩౬

## తారకనామా!

శ్రీ యస్. బి రాములు గారు

క. నారాయణనీనామము, పారాయణ జేయుచుండు భక్తులకెపుడున్
వారక బ్రోచెడిసర్వా,ధారుండవు గావె నీవు దాక్షిణ్యనిధీ.

క. దయగలవాఁడవు నీవని
భయమును విడనాడి ప్రేమభావముతోడన్
నయమొప్పఁ గొలుచు మమ్ములఁ
బ్రియముగ రక్షించి యాదరించవె కరుణన్

క. శ్రీరామా నిను గొలుతును, గారుణ్యముతోడ వచ్చి కనుపించఁగదే
తారకనామ భవాంబుధి, పారము మట్టింపుమయ్య భద్రముతోడన్

# ౩౭

## కృష్ణా

భట్టరాజు రామకృష్ణయ్య గారు

క. శ్రీమానితకురుమతిగిరిధామ పరంధామ సుగుణధామ జలధర
శ్యామ రిపుభీమ విక్రమ సోమార్యమనయన రామసోదరకృష్ణా ౧

క. మూర్తిత్రయమునకవ్వలిమూర్తివసంగుఁడవు సర్వమునకును నీవే
కర్తవు భర్తవటంచని కీర్తింతురుబుధులు దేవకీసుత కృష్ణా ౨

క. సాక్షాత్పరుఁడవు త్రిభువనరక్షణదక్షుఁడవు భక్తరక్షణకార్యా
పేక్షను పేక్షింతువెకరు ణాక్షమగుణలక్షణా జనార్దన కృష్ణా ౩

క. నావిధముగాంచి దేశికుఁ డేవిధముననైన నీని నెలమిఁ గృతార్థున్
గావింపవలయునని తను సేవకునన్నంపెఁ బ్రణుతి జేకొను కృష్ణా ౪

క. దోషంబులెన్నియున్న నిమేషంబున మాన్చి పుచ్చియుక్కలిప్రియసం
భాషణముల నీదాసుల బోషింతువనంగ శరణుబొందితి కృష్ణా ౫

క. కొండంత దేవుఁడవు నీవుండి నిరాధార మానవుని గాఁ జేయన్
దండిదొరతనము సంపద లుండినఫలమేమి ధర్మముడిగతె కృష్ణా ౬

౩౭

# భద్రసంధాయకా!

శ్రీ ధప్వూరి సత్యనారాయణాచార్యులు గారు



సీ. శ్రీనాయకాయ భాసితశుభాకారాయ
పద్మనాభాయ తుభ్యంనమోఽస్తు
జగదీశ్వరాయ సజ్జనపాలకాయ శో
భనచరితాయ తుభ్యంనమోఽస్తు
విశ్వరూపాయ సర్వేశ్వరాయ ధీరాయ
భవవిదూరాయ తుభ్యంనమోఽస్తు
కాంచనవసనాయ కమనీయదేహాయ
భక్తవంద్యాయ తుభ్యంనమోఽస్తు

గీ. అబ్జనిభలోచనాయ తుభ్యంనమోఽస్తు
పరమకరుణాకరాయ తుభ్యంనమోఽస్తు
భద్రసంధాయకాయ తుభ్యంనమోఽస్తు
భావరామభద్రాయ తుభ్యంనమోఽస్తు. ౧

మ. సకలాధారుఁడు వేదవంద్యుఁడుమహాశాంతుండుమౌనీంద్రర
క్షకుఁడజ్ఞానమహాంధకారపటలీసప్తాశ్వుఁ డబ్జాక్షుఁడ
త్యకలంకస్తవనీయనామకుఁడు నిత్యానందకైవల్యదా
యకుఁడాశ్రీరమణీమనోహరు మహత్త్వంబెన్నఁగన్ సాధ్యమే ౨



## ౩౮

# ప్రార్థనము

శ్రీ మార్చాల రామాచార్యులు గారు



శా. శ్రీమంతంబునఁ జెన్నుమీఱుధరణీ సీమంతినీభూషణ
గ్రామంబౌ మధురాపురంబున దివౌకవ్యూహ సంప్రార్థనన్
భూమేల్ జూప జనించినట్టికరుణాభూష్ణుండు కృష్ణుఁడొగిన్
ధామైశ్వర్య సుఖాదికంబొసఁగి ప్రోచున్ గాత నెల్లప్పుడున్. ౧

మ. కడుమాగ్ధ్యంబున నివ్వటిల్లుపడతుల్ గాసిల్లి నిద్రించగా
నడురేయొయ్యన వారిఁ జేరికినుకన్ దద్వేణిబంధంబులన్
వడి లే దూడల దోకలన్ బిగిచి యాహ్లాదించి మోదించు నా
తఁడుకృష్ణుండుకృపామతిన్ గనుటకై ధ్యానింతునశ్రాంతమున్. ౨

గీ. భవ్యబృందావనారణ్య భూరుహాళి
సాంద్రతరునీడలందు సుశ్రావ్యమహిత
నవసుధారస కలిత మాధుర్యవేణు
గానమొనరించ గోవులు గ్రాసముడిగి
యేమహాదివ్యమూర్తిని నెలమిగాంచు
నట్టికృష్ణుని సేవింతు ననుదినంబు. ౩

౪౦

# శ్రీ మల్లికార్జున స్తవము

శ్రీ అక్షింతల సింగరశాస్త్రి గారు

దేవదానవయక్షకిన్నర సిద్ధచారణసేవితం
శ్రీగిరౌ భ్రమరాంబయానిఖిలార్థదం శరణార్థినాం
హేమమందిర మధ్యమే నివసన్తమద్భుతవిగ్రహం
మల్లికార్జున మీప్సితార్థ విధాయకంహృదిభావయే ౧

బ్రహ్మవిష్ణుమహేశ్వరాదిభి రర్చ్యమానపదాంబుజం
దివ్యచందన దీప్యమాన విశాలపీవరవక్షసం
మందహాసవిరాజమాన ముఖారవిందమనోహరం
మల్లికార్జున మీప్సితార్థవిధాయకం హృది భావయే. ౨

రత్నకుండలమండితామల కర్ణయుగ్మవిరాజితం
చంద్రఖండవిరాజమాన కిరీటశోభితమస్తకం
భోగిభూషణ భూషితం గిరిజాసహాయమగోచరం
మల్లికార్జునమీప్సితార్థ విధాయకంహృదిభావయే. ౩

పద్మపత్రవిశాలలోచన మాదదేవమయంవిభుం
పాపతూల హుతాశనం పరమేశ్వరంప్రణతార్తిహం
జన్మమృత్యుజరాతిగం జగదాదికారణమన్వహం
మల్లికార్జునమీప్సితార్థ విధాయకంహృదిభావయే. ౪

బిల్వపత్రవిభూషితం మునిపూజితం వరదాయకం
భస్మకాసురసూదనం నిజభక్తిముక్తివిధాయకం
భూతిభూషితవిగ్రహం శరణాగతోద్ధరణోద్యతం
మల్లికార్జునమీప్సితార్థవిధాయకం హృది భావయే. ౫



౭౧

# భావసీమ

శ్రీ కే. యామునాచార్యులు గారు

సీ. దలితేంద్రనీలమంగలకోమలానీల
ప్రావృషేణ్యపయోద పటలములను
జనవిలోచనమోదసంజననసటత్క
లార్హ ఫుల్లకలార్హ బర్హిణముల
మందమారుతహతి మంద్రమధ్యమతార
మధురస్వనద్వేణు మండలముల
తరుణార్క కల్యాణ కిరణకిమ్మీరిత
దూర్వాప్రతాన సమోర్వీతటుల
గీ. తరళతర తార కానిరంతరమనోజ్ఞ
గగనతలములఁ గనుగొన్న కాలములను
నీ త్రిలోకమోహనోన్నిద్రమైన
బాలకృష్ణాకృతియ తోఁచు భావసీమ. ౧

సీ. కాంతనింతలుసేయు కాకాసురుని బ్రోచి
అమలుసౌమిత్రిఁబో నడచితీవు
అపరాధిసహజు మూర్ధాభిషిక్తుని జేసి
యనపరాధిని వాలిఁ దునిమితీవు
విదురులోఁగిటఁ బ్రీతి విందారగించియుఁ
గురురాజునామెతఁ గొనవునీవు
గుహునాదృతిఁ బ్రియోపగూహనంబునఁ దన్పి
ఋషిపుంగవుల స్పృశియింపవీవు
గీ. శత్రుమిత్రులు నుచ్చనీచములు నిద్ది
కార్య మిదియకార్యమనియుఁ గానవీవు
గుణివో? యగుణివో? యేది వాకొనఁగరాదు
దేవ! నీపూన్కి యెటులని తెలియవలయు. ౨

౪౨

# అపంచవర్గీయ చిత్రస్తుతి

శ్రీమాన్ మార్చాల రంగాచార్యులు గారు

క. శ్రీసరసీరుహయోషా
సారోరోరుహవిహార సరసవరశయా
సూరివ్యూహాసరోరుహ
సూరాసౌశీల్యహారి సురహరిశౌరి! ౧

క శేషాహీశ్వరశైలవి
శేషాలయ వాసలోల సేవావిరళా
శేషవరాశయవివశా
రోషాసుర శౌర్యశోష రురుహరశౌరి! ౨

క. సరవాళి వలయ సల్లల
సరవక్షోవీక్ష్యరాస సరసీరుహాక్షీ
సరసాత్మయలీలా వా
సర వేలాలవవిహార శాలీశౌరి! ౩

క. అశరీరశ్రీహాసిశి
వశరీరసహస్రవీక్షు వసుహారిసువై
రశరారుశరాశరసా
హససర్వస్వహరవీర హరిహయశౌరి! ౪

క. సర్వంసహాస్వరీశ్వర
సర్వాశావాసహార సలిలరుహశ్రీ
శర్వాహార్యశిశిరసా
రార్వశశియశోవిశాల హారిశౌరి ౫

## ౪౩
# శ్రీవేంకటేశ్వర స్తవము.

శ్రీ కాళ్ళూరి రాజేశ్వరరావుగారు



సన్నిధినున్న మానినుల సంగతిమాని సమస్తకార్యభా
స్వన్నిజభారముఁ మరచి భక్తజనాళిఁ గృపాకటాక్షసం
పన్నతఁ బ్రోవవేల? నిజభావదయాస్థితిఁ జూపవేల యో
యన్నపురెడ్డిపల్లినగరాభ్యుదయేశ్వర ? వెంకటేశ్వరా ? ౧

ఎంతో కాలమునుండియాశ్రితుఁడనై యేనిట్లు ప్రార్థించుచో
సంతోషించివరంబునీయవు పయిఁ సంధించుకష్టంబులఁ
బొంతఁ జేరిన మోసగింపఁదగునే పుణ్యాత్మ? చంచత్కృపా
నంతా ? అన్నపురెడ్డిపల్లి నగరేశా ? వేంకటేశప్రభూ. ౨

ఒక్కఁడు నవ్వుచుండు మరియొక్కఁడు దుఃఖమునొందుచుండు వే
రొక్కఁడు రూపయౌవనమహోత్సవమందు చరించుచుండు వే
రొక్కఁడు చాలహీనతను నొంది సుఖంబు త్యజించుచుండు నీ
చక్కికర్తృకత్వమిది శక్తియె నానిదా? వెంకటేశ్వరా ౩

జలసంచారముచేయుకాలమున నాజాతిస్వభావమ్మునీ
కలవాటైనకతంబుచే నలతులందన్యాయముఁ బూని కే
వలహింసాపరబుద్ధి పూనికొనినావా? యిట్టిధర్మాఘముల్
గలవా? అన్నపురెడ్డిపల్లి పుంపాలా వేంకటేశప్రభూ ? ౪

ఒకనాడామరిరెండునాళులకో యేనోర్పుఁ వహింపంగ నె
ట్లకటా? యేండ్లనుబూండ్లుగాఁ దొడఁగె విద్యాసక్తమై వ్యావహా
రికసంబంధములందు మున్గితినయారే! యంతముఁ లేదె యిం
తకు నోయన్నపురెడ్డిపల్లిపురనాథా? వేంకటేశప్రభూ. ౫



౪౪

# వేంకటేశ్వరస్తవము

శ్రీ వేంకటగిరి రామాచార్యులుగారు.



సీ. ముగ్ధాంగనాజన మోహితతారుణ్య
మహనీయవిభవ రమావరేణ్య
దుగ్ధపానస్నిగ్ధ ముగ్ధాంగలావణ్య
కల్యాణభాస్వ దగణ్యగుణ్య
దగ్ధసంసరణదుస్తరఘోరారణ్య
శరణాగతాసుర వరశరణ్య
నిరవధికానందకరపూర్ణకారుణ్య
నిరుపమానానంత నిరతపుణ్య
గీ. వినతసనకాదినారద మునివరేణ్య
సకలలోకాధిదేవతా నికరగణ్య
సరసగుణజాలవేంకట శైలఖేల
భక్తజనపాలగోపాల భర్మచేల. ౧

సీ. జితయాతుధాన సంవృతహేమపరిధాన
నతిజనాధీన కంపితనదీన
కృతసర్వదాన నందితముక్తసంతాన
తతవేణుగాన సన్నుతనిధాన
సతతాభిమాన రక్షితపాదగతదీన
ఖగరాజయాన సాగరశయాన
పరమాభిదాన భాసురముక్తిదస్థాన
రుచిరకీర్తినవీన ఖచరయాన
గీ. అధిగతజ్ఞాన మునిజనావనవిధాన
ప్రబలతరదివ్యతేజో విరాజమాన

సరసగుణజాల వేంకట శైలఖేల
భక్తజనపాలగోపాల భర్మచేల ౨

సీ. నిరవధికానంద నిలయంబునీప్రాపు
నిగమాంతముల కేపు నీదుచూపు
జగములన్నియునిండు సొగసైననీరూపు
సాటిలేదెందు నీమాటతీపు
నీపదస్మరణంబు నిరయంబునెడబాపు
దయతోడనాకునీ దాపుజూపు
కడలికవ్వపుఁగొండఁ గడతేర్చెనీవీఁపు
ఛేదించుదనుజుల నీదుతూపు

గీ. పాపరాయఁడు నీకు రేబవలుకాఁపు
పరమునీకీర్తనము మోక్షపదముజేఁపుఁ
సరసగుణజాలవేంకట శైలఖేల
భక్తజనపాలగోపాల భర్మచేల. ౩

సీ. శ్రీమానినీమణి చిత్తాబ్జమత్తాళి
పదపంకరుహనమ్ర భక్తపాళి
శైశవవిధ్వస్త శకటాదిదనుజాళి
వరమానిహృత్సరోభవసుహేళి
ధారుణీసురగోత్ర దారుణదంభోళి
నందితద్రుహిణ బాలేందుమౌళి
మురళీనినాదసమ్మోహితగోపాళి
పరమకీర్తిత పయచ్చరమరాళి

గీ. కుటిలఫణివరపటుఫణా నటనకేళి
రాధికానవ్యకుచపటీ రాద్ధ్రిపాళి
సరసగుణజాలవేంకట శైలఖేల
భక్తజనపాలగోపాల భర్మచేల. ౪

## ౪౫
# వేంకటేశ్వరస్తుతి

శ్రీ ముడుంబ రామానుజాచార్యులు గారు

---

శా. శ్రీమదుగ్ధాంబుధికన్యకాహృదయ నీరేజాబ్జమిత్రా ముకుం
దా దేవాహితవారకాననకుఠారా భీష్మభీభత్స ప్ర
హ్లాదవ్యాసపరాశరాదిసుజనాహ్లాదప్రదా పూజితో
మాదామోదర దేవదేవ యలవేల్మంగామనోనాయకా. ౧

మ. వరదా సర్వజగన్నియామక సదావాత్సల్యసింధూ పరా
త్పర దీనావన మోవిపన్నజనసద్బంధూ ముకుందా చరా
చరలోకప్రతిపాలనైకచతురా సర్వజ్ఞ లోకైకసు
స్మరణీయానుగుణప్రభావ యలవేల్మంగామనోయకా. ౨

మ. చతురత్వంబు పదప్రయోగరచనా సామర్థ్యముల్ లేమిచే
యతికిన్ బ్రాసకు నెన్నిపాట్లువడి మాయయ్యా నినున్ గూర్చినే
నతుకుల్ పెట్టితి మూఢపద్యముల నందందున్న లోపమ్ములన్
మతిలో నెంచక నన్నుగ్రహింపు మలవేల్మంగామనోనాయకా. ౩

---

## ౪౬
# దేవదేవ

శ్రీ తిరువాయిపేట రంగయ్యసూరి గారు

గీ. వేదవేదాంతముల నెల్ల వెదకిచూడ, నీవె దిక్కని బోధించు నీరజాక్ష
యితరదైవతములమాట లేల నాకు తెరువుచూపవే యించుక దేవదేవ

గీ. సూర్యుఁడున్మేఘములు వహ్ని సోముఁడావి
గాఁగలుగు నదులు వృక్షముల్ గలతలేక
యెట్లు సృజియించినాఁడవో యేమొ యేను
తెలియఁగాఁజాలరే గతి దేవదేవ.

---

## ౪౭

# భక్తవిజ్ఞప్తి

శ్రీ విఠాల చంద్రమౌళిశాస్త్రి శతావధానిగారు



మ. ఒకఁడై యుండమె నీవు నేను దొలి మాయోద్యోగముం బూని న
న్నకటా! యన్యునిఁ జేసి త్రోసితివి కర్మాంశాభోగిగా నేన నీ
ప్రకటైశ్వర్యము సత్యదృష్టిఁ గమనింపం బూనుచో మిథ్యయై
సకలమ్మొక్కముగాక మానదుగ కృష్ణా! దేవకీనందనా. ౧

మ. అవివేకమ్మునఁ దావకావయవచౌర్యమ్మొనగావింప నీ
భవకారాగృహవాసమబ్బె నిపుడవ్వానిన్ ద్వదీయ్యేశసూ
త్రవిరాజ్ఞాత్ములకిచ్చి నేఁజనెద నాత్మస్థానముం జేర నా
జ్ఞ విధింపన్ వలెనీవు నాకుఁ గృపఁ గృష్ణా! దేవకీనందనా! ౨

శా. నాయత్నమ్మను మాటలేదు కలనైనం జుమ్ము విశ్వమ్మొక
ర్మాయత్తమ్మన నేను కాననుట యెట్లాఁగాని నేనీశ "మూ
ఢా యొక్కింత యొసంగితిన్ బురుషకారమ్మందువా! యప్డిదో
నాయత్నమ్ము త్వదంఘ్రియుంబనె కృష్ణా! దేవకీనందనా! ౩

శా. త్వత్పాదాంబురుహమ్ములం బడెదు స్వాతంత్ర్యమ్ము నాకుండినన్
మత్ప్రాగర్జిత కర్మరాశి దహియింపం జాలనా? నా ప్రమా
దోత్పన్నంబు క్షమించి పాదపతితోద్యోగమ్మునన్ నీకృపా
సత్పాత్రమ్ముగ నీవె చేకొనుము కృష్ణా! దేవకీనందనా! ౪

మ. ఇదె యాధ్యాత్మిక ముఖ్యతాపములు మద్గాత్రాత్మముఖ్యాల్ సదో
పదశోగ్రగ్రహముల్ వలెన్ దవిలినన్ బాధించునా నీవదీ
నదయాళూ! తదనుగ్రహాత్మకుఁడవై నా తండ్రి! నాడెందమున్
బదనొక్కండవ యింటనుండినను? కృష్ణా! దేవకీనందనా! ౫

## ౪౫

# సూర్యనారాయణ స్తోత్రము

శ్రీ జ్ఞానమాంబ గారు



శా. స్వామీ! నీపదపంకజద్వయమె సంభావించి సేవింతునీ
నామంబొక్కఁడు దక్కనేయితరమౌ నామంబు నాబుద్ధిలోఁ
బ్రేమింపన్ విననొల్లఁబల్కఁదలఁపన్ వీక్షింప నీరూపము
ద్దామావ్యాజకృపన్ ననున్ దనుపు నాథా! సూర్యనారాయణా! ౧

మ. నినుబద్యంబులఁ బాటలన్ గృతులతో నిక్కంపుసద్భక్తిమై
వినుతిన్ జేసెద నీకరంబులను హృద్వీథిన్ దగన్ జేర్చి మా
నినినౌ నన్ను ననూనమౌకరుణ నెంతేఁ జూచి పోషింపు నా
తనువున్ బ్రాణము నీకె యర్పితము నాథా! సూర్యనారాయణా! ౨

మ. హృదయేశుండవు పాశ్యదేవతవు నీవే కాని వేరేమిలే
దిదినిక్కంబు మదీయమానసము నీకేయర్పణంబయ్యె నా
యెదలోఁ దప్ప మఱేడ దాఁచెదను నేనే యర్థమున్ గాని త్వ
త్పదపంకేజములే శరణ్యమగు నాథా! సూర్యనారాయణా! ౩

శా. నిన్నున్ జూచినతోడనే తిమిరము నా నేత్రద్వయిం బాయు శు
భ్రోన్నత్యంబగు దారిద్రోఁచు మఱి స్నేహత క్షీయమానంబుగా
దెన్నండున్ విను నాకు నీయెడల నిన్నే నేత్రమూర్త్యాత్మకుం
డన్నం జిత్తము సంతసించెడిని నాథా! సూర్యనారాయణా! ౪

శా. నాకుం డావక దర్శనంబె సుదినానందంబుఁ జేకూర్చునీ
వేకన్పట్టక యున్న దుర్దినము గున్ వేసంబులున్ శాస్త్రముల్
నీకున్ మ్రొక్కుటయే విశేషమని యోన్ నిన్నెంతు నిన్గొల్తుమ
ల్లోకాప్తుండవు నీవ నీకొలువె చాలున్ సూర్యనారాయణా! ౫



## ౪౯

# జీవమా

శ్రీ ఉత్పల వేంకటరావు గారు



ఉ. శ్రీమదనంతశక్తిగణ సేవితుభక్తహృదంతరాళస
త్ప్రేమసుధాకరుఁ బరులు దీనజనావను లోకపావనుఁ
బామరమెల్లమానిదృఢభక్తిభజించి తరించుమయ్యనీ
కామితసచ్చిదాత్ముఁడు సుఖప్రదుఁడాతఁడె సుమ్మి జీవమా. ౧

ఉ. ఆశ్రితలోకబంధుఁడు సుఖాలయుఁడార్త జనావనుండు వృ
ద్ధశ్రవపూజితుండు జితతామరసాక్షుఁడు వానిఁజూచి మో
దాశ్రువులొల్కమైమఱచి ధ్యానసుమంబులఁ బూజసేయు వా
రాశ్రయలంచుఁజేరును బ్రియంబున మోక్షవధూటి జీవమా! ౨

ఉ. ఆర్తశరణ్యుఁడైన పరమాత్మునినామము నంతతంబు సం
కీర్తనఁజేయుచుండుము సుఖంబు నిహంబు పరంబునందు స
త్కీర్తియుఁ గల్గుజన్మముల కీడుదొలంగును సుమ్మి యాజగ
త్కర్తకృపాకటాక్షమునఁ గాంతువనంత పదంబు జీవమా! ౩

ఉ. ద్రవ్యమదాంధుఁడేల పరతత్త్వవిచారము గోరఁడు స
ప్తవ్యసనాళిచేతఁ బరితప్తుఁడునై చెడి చచ్చుగాని క
ర్తవ్యమెఱుంగలేఁడు తెనరక్షకు నేనిఁగనంగఁజాలఁ డా
యవ్యయశాంతినేనియు ధనాదులనేఁగొననెంచు జీవమా! ౪

ఉ. ఇంద్రియభోగముల్ సతములే క్షణికంబులు ఛీ! దివౌకసా
పేంద్రపదంబదేని స్థిరమే హృదయంబున యోజసల్పి ని
స్తంద్రపయోధిభాతి పరతత్త్వమునందు విలీనమానచి
త్తేంద్రియుఁడై గతవ్యథ నిరీహతురీయమునందు జీవమా! ౫



# ౫౦

# సోమశేఖరా

శ్రీ ముదిగొండ విశ్వనాథకవి గారు



చ. పలుమరు వాక్యజాలములఁ బ్రార్థన చేసితిఁగాని నింతయుం
దలఁపునఁ బెట్టుకుంట మదిఁ దల్లడమందెడు నా మనంబికం
గలుగదు గా మహాత్మ! నను గావఁగ కోరిక నీ మనంబయో
శిలయొ సువజ్రమో మఱియు చింతిలలోహమొ సోమశేఖరా! ౧

ఉ. అక్కయు బావ నీవనుచు, నాత్మ గృహంబునఁ బిల్వ రాఁగ బె
న్మక్కున మీర నేగి యల, మైథునరామునిఁ బ్రోచినట్టి యా
నిక్కపుఁ బ్రేమనా పయి నొకించుక చూపుము సంతతంబునం
దిక్కని నమ్మినట్టి కడుదీనుఁడ సూనుఁడ సోమశేఖరా! ౨

చ. శివశివయంచు నోటస్థిర చిత్తముతో ననలేద యీశ్వరా
భవ! యనిచేతులార కడుభక్తిని సేవలొనర్పలేద యో
భవదురితాపహార! యని ప్రార్థనసేసి యెఱుంగనయ్య యీ
శ! వదాన్య యెట్లు మనసార క్షమించెదొ సోమశేఖరా. ౩

ఉ. సంగరమే ఘటిల్లెనొ పిశాచరమూకగుఱించి, యార్యయుం
గంగయుఁ బోరుసల్ప నది గన్గొని తీర్పువచించుచుంటివో
సంగడికాఁడె వండుమన చయ్యన విందుకుఁబిల్వఁబోయితో
జంగమదేవ యేల నను సమ్మతి నేలవు సోమశేఖరా! ౪

చ. పలుకక రోశలందుకొని బాదగలేనని యేమొ పుక్కిటం
గలుషితమైన తోయమును గ్రక్కునఁ బైనమియంగలేకనో
తలఁపఁగరాని శాపములఁ దద్దయుఁ బూజలసల్పలేదనో
పిలచిన పల్కవేమి హర! బింకమ! కోపమ! సోమశేఖరా! ౫





శ్రీ శ్రీ శ్రీ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
[౯౩] శ్రీమదభినవరంగనాథ
బ్రహ్మతంత్రపరకాలస్వాములవారు



## ౧౧
# హరిహరస్తుతి

శ్రీ శ్రీధర కృష్ణశాస్త్రి గారు

సీ. విసము మెక్కినవాని మిసిమి మెక్కినవాని
భజియింపఁగల మహాభాగ్యమబ్బె
కరిఁగూల్చువాని మకరినిఁ గూల్చినవాని
సేవింపఁగల మహాశ్రీ లభించె
చర్మ చేలమువాని భర్మచేలమువాని
వినుతింపఁగల మహావిభవమొదవె
తెల్లమేన్గలవాని నల్లమేన్గలవానిఁ
బూజింపఁగల గొప్ప పుణ్యమబ్బె
ఆ. వె. ఎద్దునెక్కువాని గ్రద్ద నెక్కెడువాని
మహికుమారజనకు మారజనకుఁ
గన్నులారఁ జూచు కలిమి మా కొనఁగూడె
నొక్క నెలవునందు నొక్కమాత్ర.

---

## ౧౨
# స్తోత్రములు

శ్రీ కోట్రిక పుల్లయ్య గారు

---

క. శ్రీ రుక్మిణీ మనోహర
సారస దళనేత్ర విబుధ సన్నుత చరణా
నారద మునిగణ వందిత
నారాయణ నతులొనర్తు నగధర కృష్ణా. ౧
కం. వాణీ నినుఁ దలఁచితి నలి
వేణీ కృపఁజూడు నన్ను వేవేగమునన్
ఏణీ నయనీ పుస్తక
పాణీ నిను సన్నుతింతుఁ బద్మజు రాణీ. ౨

---

## ౫౩
# కేశవ స్తవము

శ్రీ లక్ష్మణసింగ్ గారు

---

మ. ఖలునిన్ ద్యక్తవివేకు హీనకులజున్ గామాంధుఁ బాపాత్ము దు
ర్మలినున్ మాంద్యునసత్యు ద్వేషుజడునిన్ మాత్సర్యుఁ గ్రూరాత్ము దు
ష్కలహాక్రీతుని నెట్టివానినయినన్ గాపాడఁగా నీదు ని
ర్మలనామంబు మహౌషధంబుగ ధరన్ రాజిల్లెనో కేశవా. ౧

మ. పవనవ్యాప్తతృణప్రగాఢశకల స్ఫారాంధకారంబు మా
నవసంభూతమనోవికారకృత నానాభోగసంబంధముల్
పవనోద్ధూత తదభ్రశూన్యగగనోద్భాస్వరస్ఫుటజ్యోత్స్నమై మా
నవసంభూతమనోవికాసకృత నానాయోగముల్ కేశవా. ౨

మ. తనద్రవ్యంబును యాచకోత్తములకున్ ధర్మంబుగా నిచ్చినా
తనప్రాయంబును ధర్మపత్నిరతికై దత్తంబుగాఁ జేసియున్
తనకాయంబిల స్వామికార్యమున కేతధ్యంబుగా నిచ్చునా
తని జన్మంబతిపావనంబు నతఁడే ధన్యుండు శ్రీకేశవా. ౩

---

## ౫౪
# మనసా!

శ్రీ అయిత్నేని గోపాల్‌రావు గారు

---

మ. దురితౌఘుల్ దెసిదూరు గొండల విపత్తుల్ దూరముల్ బారు దు
ర్భరసంసారదవాగ్నులారు విషయ వ్యాపారముల్ మీరు నీ
స్మరణన్ సంపదలెల్ల మీరు మదినీ సాన్నిధ్యమున్ గోరు ని
ర్జరసంస్తుత్యపదారవిందయుగళా రామా! కృపన్ బ్రోవరా. ౧

చ. కలశపయోధిఁ బుట్టి హరిగాత్రమునన్ బసగట్టి లోకమిం
పలరఁగఁ బ్రోచినట్టి సిరియంఘ్రుల నెన్నదురంటఁబెట్టి స
త్ఫలములొసంగుమంటి ననుఁ బాయకయుండఁగ మ్రొక్కుచుంటినో
జలజదళాక్షయంచు మనసా రఘువీరుమఱుంగు జేరుమా. ౨

---

౫౫

# భక్తవత్సలా

శ్రీమతి బి. లక్ష్మీనరసమ్మ గారు



ఉ. శ్రీకర దీనబంధు సరసీరుహలోచన భక్తలోకప్రే
మాకర నీపదాబ్జములధ్యానము నామదికిమ్ము సర్వలో
కైకగురూ! కృపాకర సిరీశ నిరామయ నిష్ప్రపంచ మో
క్షాకర సర్వదుఃఖహరణా కరుణామయ భక్తవత్సలా.

ఉ. పూర్ణకృపాంబురాశి భవమోచన స్వాశ్రితభక్తపాల సం
పూర్ణసుధాంశుఁబోలు నగుమోమిటుచూపవదేల తండ్రి! శ్రీ
మార్గవపూర్ణభక్తిని హృదంతరమందుననిన్నుఁగొల్వ నీ
శీర్ణమనంబుచాలదెటుసేయుదుఁగావవె భక్తవత్సలా.

చ. వృజినవినాశ దేవనుత ప్రేమపయోనిధి భక్తజీవనా
సుజనమనోబ్జవాస పరిశోషిత దైత్యకులాబ్ధి శ్రీశ యో
త్రిజగదభీష్టదాయి మును దీనులనెందఱఁగావలేదొ య
క్కజమయితోఁచె నన్నిపుడు గావఁగలేవొకొ భక్తవత్సలా.

ఉ. రామ భవాబ్ధిశోష మునిరాజనుతాంఘ్రిసరోజ మోక్షదా
స్వామి! జగత్పతే హృదయశాంతి నొసంగి త్వదీయమౌ పరం
ధామము జేర్చుకొమ్ము భవతారకనామ యనంతమూర్తి స
త్ప్రేమసుధానిధీ పతితదీనజనావన భక్తవత్సలా.

ఉ. ఎమ్మెలవేల రామ! భవదీయపదాంబుజ సేవగోరు న
న్నిమ్మెయి చిక్కులంగలఁచ నెవ్వరివేడుదు నెందుఁ బోదు నో
యమ్మకచెల్ల! యిట్లుతనయాత్మజనేనియుఁ గావలేని వా
రిమ్మహినుందురే కృపవహింపవదేటికి భక్తవత్సలా.



## ౫౬
## శ్రీ హనుమత్స్తవము

శ్రీ బచ్చు రామన్నగుప్త గారు

---

క. హరివై పుట్టినతోడనె హరిపదమున కెగసిబాల హరినిఫలముగా
హరియింపఁదలఁచినాఁడవుహరిహరులాశ్చర్య మొందహరివరతనయా

క. హరితనయునిగూల్చియు మురహరియౌ దాశరథి సీతనన్వేషింపన్
హరినిన్నంపినశరధిన్ హరివిధిలంఘించిదాటి తౌనన నమరుల్

క. హరివిధిరుద్రాత్మకుఁడవు హరిముఖసుర గేయమానయద్భుతచరితా
హరివుత్రునిప్రియసఖుఁడవుహరికార్య మునర్పనీవె యర్హుఁడవయ్యా

---

## ౫౭
## రాజరాజేశ్వరీ!

శ్రీ భాగవతము సీతారామశర్మ గారు

---

మ. జననీ! త్రాహి యటంచుఁ దావకపదాబ్జాతంబులన్ భక్తియున్
వినయంబుట్టిపడంగ మ్రొక్కనెడ సప్రేమంబుగాఁ గ్రుచ్చియె
త్తినయంబొప్పఁగ వీఁపుదట్టి ఘనకీర్తింగాంచుమీ యన్న నీ
ఘనరూపంబును నెప్డుచూపెదవొ దుర్గా! రాజరాజేశ్వరీ. ౧

మ. పరిహాసంబు లొనర్చు నీసభల విద్వద్వర్యులీతండు దు
శ్చరితుండంచువచించనీ కవులుభాషాజ్ఞానహీనుండఁటం
చు రహింబల్కనఁ జంక నిన్ బొగడ సంస్తుత్యంబుగా వాక్కునన్
గరమింపారగ నిల్చిబ్రోవగదె దుర్గా రాజరాజేశ్వరీ. ౨

మ. పతిభావంబు నెఱింగిసంతతము లోపంబింత లేకుండ స
న్మతిచేసేవనమాచరించుసతికిన్ మాన్యంబుచేకూరు సం
తతియుంగీర్తియు శోభనంబుగలుగున్ ధర్మంబువర్ధిల్లు నీ
గతివర్తించెడుకాంత ధన్య యగు దుర్గా రాజరాజేశ్వరీ. ౩

౯౭

# స్తుతి

శ్రీ ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారు



శా. ఆపద్బాంధవ! యాదిదేవ ద్రుహిణాహంకారవిధ్వంసకా
యీపాపాత్ముని మూఢునిజ్ఞుని నీవేరీతి రక్షించెదో ?
నీపాదాంబుజపూజ నొక్కదినమే నింజేయలేదయ్యా నా
కేపాపంబుగళానఁగట్టకుము తండ్రీ! రాజరాజేశ్వరా ! ౧

మ. నరుపై శైలజపై రమాసఖునిపై నాగేంద్రుపైఁ జండిపై
సురమందాకినిపై మృకండుసుతుపై శుభ్రాంశుపై భృంగిపైఁ
బగగంజూపిన నీకృపారసము నాపైఁ గొంతరానిమ్ము నీ
చరణాబ్జంబులు నమ్మినాఁడ జగదీశా! శ్రీయగస్త్యేశ్వరా. ౨

శ్లో. చేటీకృతఖేటీవన
వాటీకృత నీప పాదప కదంబా
ఘోటీకృత మృగరాజా
ధాటిం కవనే దదాతు జగదంబా. 3

శ్లో. అంబేఽఖిలజగదంబే
సాంబాంతఃకరణపద్మరోలంబే
మాం బాలమవతు నిత్యా
లంబిత రాజత్కదంబ నికురంబే. ౪



౫౬

# శ్రీకృష్ణసంస్తుతి

శ్రీ సముద్రాల రామానుజాచార్యులు గారు



కృతిశిరసివిహారం సూతవేషైకధీరం
భవదురితవిదూరం భక్తశత్రోర్విదారం
కరికమలముదారం కామినీవస్త్రచోరం
నరనుతభుజవీరం నౌమికృష్ణావతారం. ౧

నతజనపరిరక్షం నక్రగర్వప్రశిక్షం
నవనళిననిభేక్షం నర్మవాక్యైకదక్షం
భవభయహరణేక్షం భక్తపాత్రైకదీక్షం
నతజనభవమోక్షం నౌమిగోపాలరక్షం. ౨

పురిజనపరితోషం పూతనాయావినాశం
ప్రముదజనవిలాసం భాషితంమందహాసం
నరవరకృతవేషం నాశితానార్యకంసం
నతసురవరజోషం నౌమిగోపాలవేషం 3

సముచితగుణజాలం సర్వలోకైకపాలం
రుచిరకనకచేలం రుక్మిణీకాంతలోలం
దళితదనుజజాలం ధర్మరక్షైకశీలం
నతమునిహృదిలోలం నౌమిగోపాలబాలం ౪

శ్లో. వాధూలాన్వయజాతేన శ్రీరామానుజ ధీమతా
కృతైషాస్తుతిరార్యాస్తాం సంస్కృత్యక్షుంతుమర్హథ.

# ౬౦

# కృష్ణ వినతి

శ్రీ ఘంటంబట్ల వేంకటభుజంగకవి గారు



సీ. ఘనవినీలచ్ఛాయ నెనయునీనెమ్మేని
కాంతిచూపఱులకు వింతగొలుపఁ
గ్రేఁగంటిచూడ్కుల లాఁగునీసద్భక్త
జనమనస్తాపంబు సక్కఁజేయు
భవదుజ్వలత్ప్ర తాపస్ఫూర్తి శాత్రవ
నికరమ్మునకుభీతి నివ్వటిల్లఁ
దావకోన్నతదయా దాక్షిణ్యసంపద
లీరేడుజగముల కిమ్మొదనర
గీ. వెలయు నీదివ్యతేజంబు వినుతిసేయఁ
పరమెనాబోటిజడునకుఁ దలఁచిచూడ
సరసగుణధామ యదుకుల సార్వభౌమ
నన్నుఁగాపాడ రావెయో చిన్నికృష్ణ. ౧

సీ. చనుబాలొసంగ వచ్చినపూతననుగాంచి
దుష్టురాలిదియని త్రుంచినావు
గార్ధభాసురముఖ్య కఠినరక్షోరాజిఁ
దెంపుమైజముప్రోలి కంపినావు
కార్చిచ్చుదిక్కులఁ గ్రమ్మగోపగణంబు
మేలుకై దావాగ్ని మ్రింగినావు
సంతసంబునగోప కాంతామణుల వల
పించిపల్మారు భోగించినావు
గీ. నిఖిలలోకైకవిభుఁడన నెగడినావు
సంశ్రితావళిగరమర్థి సాఁకినావు
సరసగుణధామ యదుకుల సార్వభౌమ
నన్నుఁగాపాడ రావెయో చిన్నికృష్ణ. ౨

౬౧

## రాఘవస్తుతి

శ్రీ రంగనాథాచార్యులు గారు

శ్రీమ జ్జనక తనూజా కుచయుగ సన్మార్దవజ్ఞ మృదుహస్తః
అళినీల కేశహస్తో జయతుతరాం రఘువేశ్య రక్ష్యస్తః ౧
కల్యదళత్సరసిజ సాకల్యవినోద ప్రతీతతరనేత్రః
కల్యఘ వనాగ్నిహోత్రః కల్యాణంసంతనోతు రఘుపుత్రః ౨
అవనావమోఘచర్యః పవనాశిం ద్రాత్మజాత్తకైంకర్యః
భవనాశనప్రధుర్యః కవనస్ఫూర్తింకరోతురఘువర్యః ౩
అకలంకదివ్యకీర్తిః సకలాభిష్టూయమాన శుభమూర్తిః
శకలీకృతశ్రితార్తిః సుకలం విదధాతు మాం దయాపూర్తిః ౪
భాషాధిపాదివంద్యో యోషా భాషావిలాసనిష్పంద్యః
దోషాచరేంద్రనంద్యో తోషాయైవాత్మనోభవేద్దేవః ౫

౬౨

## అపంచవర్గీయ హయగ్రీవ స్తుతి

శ్రీ విగ్రాల వేంకటాచార్యులు గారు

స్వర్వాహివారాంలహరీవిహారి వ్యాహారసారైశ్శిశిరాంశువాణీ
హేషాగవాహక్షి సురక్షి సేవ్యే శేషేశయేసంవిహరై హయాస్యే ౧
ఆశంసుసూరియశః సారసవాసంశ్రయీయాయవాహాస్యం
సంసేవ్యయంసురేశా ఆశీరాశీరయాసిషుస్సహసా, ౨
శుశ్రూషాయాయీశ్వరహే శంయాయాసంహివాసవాసేవ్య
విశ్వస్యవేలాలస విశ్వస్యావేహిళారసాలోల. ౩
వాయుర్వారిరసావిహాయ సహావిర్వాహవశేయస్స్వయం
శ్రేయాంస్యావః వారి షంసశిశిరాంశ్వావాసహేలాశ్రయః. ౪
ఆశంసావహసార సేశయహరే వాహాస్యహేషారవ
శ్రీలీలారసలోలవాసవసురా శాస్యారహేవాశ్రవః. ౫

౬౩

# శ్రీ రామ స్తవము

శ్రీ పలివెల వేంకట అప్పారావు గారు



శా. శ్రీ నారాయణ ఘోరపాపహరణా; సీతామనోనాయకా
జ్ఞానానందమయా? రమారమణ! సచ్చారిత్రలోకేశ యే
మైనన్ నీవెయదియు పాపచయసంహారంబుఁ గావించి స
న్మానింపన్ గలవాఁడవంటి నికరమ్మా రామచంద్రప్రభో. ౧

మ. సరసీజాక్ష, రమామనోహరకృపాసాంద్రా హృషీకేశ శ్రీ
కర గోవింద ముకుందసచ్చరిత లోకస్తుత్యనారాయణా
మురసంహార సురాళిసేవితహరీ మోక్షైకసంధాన నీ
వరకారుణ్యమె ముక్తిదాయకము దేవా రామచంద్రప్రభో. ౨

మ. బలిమిన్ దైత్యుఁడు కన్నపుత్రుఁడని సంభావింప కే నిర్దయన్
పలుమార్గంబుల స్వీయకింకరులచే బాధింప నబ్బాలుఁడో
జలజాక్షా! మధుసూదనా యన సభాస్తంభంబునన్ బుట్టి యా
ఖలునిన్ దానవుఁ ద్రుంపవే భువనరక్షా రామచంద్రప్రభో ౩

శా. ఘోరారణ్యమునన్ గజంబు జలమున్ గ్రోలంగఁ బోనత్తఱిన్
నీరాటంబు పదంబుఁ బట్టి బలిమిన్ నిర్జింప మత్తేభమున్
ధీరత్వంబెడ దక్కి నిన్ దలఁప నో దేవా వెసన్ బ్రోవవే
మారాకార త్రివిక్రమా హరి మహాత్మా రామచంద్రప్రభో. ౪

మ. కరుణాసాగర భక్తవత్సల జగత్కల్యాణ సంధాయకా
వరముల్ భాగ్యము లిమ్మటంచు మదినిన్ వాంఛింపగాలేదు సు
స్థిరతన్ నీపద పద్మముల్ గొలువఁగాఁ జిత్తంబునం దెంచితిన్
వరగన్ శ్రీధర కోర్కెదీర్పు పరమేశా రామచంద్రప్రభో. ౫



౬౪

# భక్తవినతి

శ్రీ వరకవి గడ్డం రామదాసకవి గారు



సీ. చలినట్టుదిండి సెజ్జనుపరుండిన దిట్ట
పొత్తి పొత్తియల కాపొయి నావ
కడలి కరళ్ళతూకమునఁ దూఁగు నొయారి
తొట్ల తూఁగాకులఁ దొలఁకి నావ
డొసఁగలో బమ్మగ్రుడ్డుల నాపికొను తొంద
యగ్గుబాలకుఁ జాలనుబికి నావ
యడుగున మిన్నేటి యలఁతిఁ గాంచిన తండ్రి
తల్లిపుడికెడు నీటఁదనిసి నావ
గీ. అవునవు నొకా నొకప్పుడు దవ్వులదొడ్డు
సన్నముసఁ దార్చిమైకొని యున్నవేమొ
మేలు రతనాలపెట్టె నెమ్మేటి జెట్టి
బంతి తేద్దొరపట్టి పూంబట్టుదట్టి. ౧
సీ. అనువంది పెనుపొంది నినుఁ జూలుగాఁ జెంద
తొలినెల ననకారు కలిమియయ్యొ
తులకించి తిలకించి వెలయఁగా నిను గాంచి
తెలితెక్క చందిరికలకు మించె
కమనెమ్మి నుమవొమ్మి యెదునిన్నుఁ గని తొమ్మి
దవప్రొద్దు పూజలఁ దనరుచుండె
కసుగామి యసులొమి నిసువుగా వినఁనోము
పొదరిండ్ల రిక్కమెప్పులకు నొప్పె
గీ. సొగస నినుఁగూర్చి నాలవఁగన మల్లి
తొగల చెలికాని మనికిమై నెగడుఁ జూవె

మేలు రతనాలపెట్టె నెమ్మేటిజెట్టి
బంతి తేద్దొరపట్టి హూంబట్టుదట్టి. ౨

సీ. మొలక నవ్వుల తేటలొలుకు నీదు మొగంబు
చెంజాయ లెనఁగు నీ చిగురు మోవి
మెలపు చూపులకల్మిఁ దెలుపు నీ కందోయి
గోటారు నీచిప్ప కూకటంబు
నునువన్నె చిన్నియల్ పొనుపు నీ చెక్కులు
మచ్చు గుత్తొలయు నీ మంపు ఱొమ్ము
నెరు బుజంబులుఁ జాఁపులగు నీదు కేల్జోడు
నెరపు రేకలఁ గ్రాలు నీ యడుగులు

గీ కాంచి వేడుకలందు నీఁ గన్నవారు
నోము లెన్నెన్ని మునుపడ నోచిరొక్కొ
మేలు రతనాలపెట్టె నెమ్మేటిజెట్టి
బంతి తేద్దొరపట్టి హూంబట్టుదట్టి. ౩

సీ. కట్టాణి చౌకట్టుఁ గామిడీరారేక
పులుగోళ్ల పతకంబు కలికిపచ్చ
మూల జాకెంపులు మచ్చు టుంగరములు
హూరుముంజి పేరులు సరులుఁ జల్గు
జాళువా మొలత్రాడు సందిలి దండలు
మురువు లందెలు ఘువ్వలరుసుటీవి
జోప్పిల్లు జలతారు చొక్కాయి వలవాటు
జెగజింక పొక్కిళి సొగసుబొట్టు

గీ. మొల్లమియ్యఁ దెల్లముగ సంపతిల్ల తల్లి
ప్రొద్దు ప్రొద్దులు నైసేయు ముద్దుఁడాయు
మేలు రతనాలపెట్టె నెమ్మేటిజెట్టి
బంతి తేద్దొరపట్టి హూంబట్టుదట్టి. ౪



## ౬౮

# భక్తిప్రభావము

శ్రీ నెమిలికొండ శ్రీరంగాచార్య శాస్త్రిగారు
అష్టావధాని

శ్లో. శ్రీమద్గోపవధూకిశోరమమలం కారుణ్యమూర్తిం జగ
న్నాథం స్వీకృతవ్యాజమానుషతనుం ధ్యానైకగమ్యం రమా
కాంతం కంసనిబర్హణం యదుపతిం పాండోస్సుతాభీష్టదం
పాంచాలీశరణం మునీంద్రహృదయాబ్జాదిత్యమార్యం భజే.
శ్లో. శారదాబ్జసదృశాననశోభం శారదాబ్జదళలోచనదీప్తిం
ప్రావృడబ్జసమదివ్యశరీరం వాసుదేవమనఘం హరిమీడే.
శా. సీతారామపదారవింద ధృతసచ్చిత్తుండు సౌమిత్రి సం
జాతానందముతోఁ జనెన్ విపినసంచారంబుకై ప్రేమతోఁ
బ్రాతః కాలమునందు యోగ్యఫలసంపాద్యంబు గావించి సా
కేతేశున్ ముదమొందఁజేసె గురుభక్తిన్ దాసుఁడై నిత్యమున్.
చ. భరతుఁడు రాజ్యభారము నుపాయముగాఁ బదునాలుగేండ్లు శ్రీ
కరమగు రామపాదుకలకై నెఱేఁగించి మనంబునందుఁ దా
శరథి పదారవిందయుగ సన్నుతిఁ జేసి తదాగమంబుకై
మురిసెనుగాన లోకమునఁ బూజ్యము భక్తియె సౌఖ్యదంబగున్.

---

## ౬౬

# శంకరా

శ్రీ మఠం రామయ్య గారు

శా. కైలాసాచలమందు స్వర్ణమణియుక్తంబైన సౌధంబులో
లీలన్ మోదితగౌరి గూర్చి ప్రమథుల్ సేయున్ బవల్ గొల్వఁగా
ఫాలాక్షు శివ బ్రోవుమంచు నెమలిన్ ఫాలస్థలిన్ హస్తములే
వాలాయంబుగ జేర్చి సెక్కుయుగముల్ వర్తింతు నిష్టంబుగాన్. ౧
చ. నరసురపర్వతత్వము వనత్వమృగత్వము మక్షికత్వభా
సురపశుకీటకత్వములు సూకృతి దుష్కృతి దిష్టమైతనుల్
నిరతము గల్గుచుండినను నీపదయుగ్మ నిమగ్నమానసాం
తరమగునేని జాలు తను తత్వమదేమగు నేని శంకరా. ౨

---

# ౬౭
# వేంకటేశ్వర స్తుతి

శ్రీ జములాపురము వేంకట రామారావు గారు

---

సీ. శరము తో శిత ధరాధరము తో శ్వేతకం
ధరముతో రాజ కంధరముతోడ
హిమముతో శారదా గమముతోఁ దృణశూన్య
సుమముతో సంతాన ద్రుమ ముతోడ
కంబుతో వరమల్లికంబుతో వాక్పార
దంబుతో పూష్యామృతంబుతోడ
భాళితో నవమౌక్తిక కాళితో శిశిర రు
గ్జాళితో ద్రుహిణ భూభాళితోడ
గీ. మించి లసదమరులు సన్నుతించ జగతి
ప్రౌఢిరాణించె రమ్య భవత్సమాఖ్య
జములపురవాస మృదుహాస చారుభాస
వినుతవాగీశ యోగీశ వేంకటేశ. ౧

సీ. అంభోజశరదభ్ర శుంభదాద్రిక్రోడ
దంభోళిదీప్తుల జృంభ మడఁచి
యభ్రకుంభేంద్ర శీతాభ్రభాండజకులేంద్ర
శుభ్రోత్పలవ్రజ శుభముదరిచి
ధనదసుహృద్గిరి ధరవైరిగంధర్వ
హాలధరదరకాంతి నవఘళించి
వాశ్యరాట్కృతస? మాతులామరధునీ
నాగదస్యుశ్రీల నవఘళించి
గీ. యమలమలయజధవళిమ రమ నదల్చి
దిశల వెలయించెఘనయుష్మ దీయకీర్తి
జములపురవాస మృదుహాస చారుభాస
వితతవాగీశ యోగీశ వేంకటేశ. ౨

---

౬౫

# రామచంద్ర

శ్రీ పదిర లక్ష్మణశాస్త్రిగారు



సీ. శేషునిశిరముల భూషించు నీపంట
పంటవెలంది నీ పాన్పుదంట
దంటగాతమునాలు తరియించె కాలంట
కాలంటబోరు నీ కరుణవెంట
వెంటరాదిహాభోగ వేషమెన్నగ పెంట
నగపెంటిరా చూలిను గనిదంట
దంటారు మేనుల దయ్యమావలకంట
వలకంటమీనైతి వార్ధిగుంట.

తే. గీ. గుంటచిక్కులఁబెట్టకు కుజనుఁడంట
నంటనానోట నీపేరు హరివికుంఠ
పదిరెపురసద్మ పావన పాదపద్మ
పద్మజాధిప రామ సద్భావసీమ.

సీ. బ్రహ్మహత్యాది పాపము బాపుపదధూళి
దూలించు చక్రంబు దుర్జనాళి
నళిపంక్తినదరించు నసితకుంతలపాళి
పాలించు రదము మొల్లలనువ్రాలి
వాలికచూపులు వాలుగలనుబోలి
బోలుశంఖము మెడఁబొందఁజాలి
జాలిచప్పనిదొండ చవురుపెదవులఁగూలి
కూలిముక్కుకు నువ్వు గుదిరెగోలి

తే. గీ. గోలిభవరోగ వనికి గోపాలకేలి
కీలెరిగి నిన్నుగను శౌరి కీర్తిశాలి

పదిరె పురసద్మ పావన పాదపద్మ
పద్మజాధిప రామ సద్భావసీమ.

సీ. మఖదానసుఖధామ ముఖవినిర్జితసోమ
సోమపూజితభక్త సులభకామ
కామపాలసునామ కంసగర్వవిరామ
రామ భార్గవరూప రాజభామ
భామగర్వస్తోమ భస్మితానలభీమ
భీమాదిరసశిష్ట భీతసామ
సామాదికామ్నాయ సన్నుతసుత్రామ
తామసగుణ వర్గదళితనేమ

తే. గీ. యేమహాత్మునిపాద పద్మేశమహిమ
హిమసుధాకర సీతమై యెసఁగుసీమ
పదిరెపురసద్మ పావన పాదపద్మ
పద్మజాధిపరామ సద్భావసీమ.

సీ. బ్రహ్మేంద్రవందిత పాదపంకజరాగ
పంకజరాగ దుష్ప్రవివిభాగ
భాగవతవ్రత భద్రలాంఛనభోగ
భోగీశఫణతల భోగ్యయోగ
యోగమానస సుమార్గోచితగుణపూగ
పూగవీటీ జపముఖవిరాగ
రాగాది సంగీత రసమగ్నబుధనాగ
నాగరత ప్రసన్న నామసుభగ

తే. గీ. భగశశాంకులు గన్నతై భ్రమసిమరుగ
మరుఁగనిన చక్కనయ్య నా మదినిఁదిరుగఁ
బదిరె పురసద్మ పావన పాదపద్మ
పద్మజాధిపరామ సద్భావసీమ



౬౯

# చంద్రశేఖర నమస్కృతి

శ్రీ శాస్త్రులవారి అనంతరామ శర్మగారు



శ్లో. కేశవాదిభిరశేషసురేంద్రైః
పాపదాహకమితిస్మరణీయం
శర్వపాదయుగళంమునిగేయం
సర్వదామమశ్రియంవితనోతు ౧

శ్లో. యస్మైత్రివిక్రమఇషుస్తురగాశ్చవేదాః
మేరుశ్శరాసనమభూచ్చహిరణ్యగర్భః
సూతో భవత్త్రిపురదాహకృతే భవాయ
తస్మైనమోభగవతేభవతారకాయ ౨

శ్లో. శృత్వామఖేఖలు పరాభవతప్తగాత్రీ
దాక్షాయణీతిపురతః ప్రమథానవేక్ష్య
యోవీరభద్రమజశక్రనుతప్రతాపం
దక్షక్రతోర్వికృతయే సుషువేజటాయాః ౩

శ్లో. యస్తారకాదివివిధాసురమారణాయ
బ్రహ్మాదిదేవనుతపాదసహస్రపత్రైః
కాత్యాయనీకరపరిగ్రహణంచకృత్వా
సూతాత్మజంనిఖిలదైత్యహరంకుమారం. ౪

శ్లో. కోటిసూర్య సమదివ్యశరీరం
భాసురాగ్నికృతలోచనదీప్తిం
అబ్జరేఖధరమబ్జగళాభం
సామితంస్మరహరంగిరిజాపం. ౫



## ౬౦

# వీరరాఘవా!

శ్రీ ఏ. నరసింహారావు గారు



ఉ. శ్రీరఘువంశచంద్ర! బుధ సేవితపాద! నవీనమేఘశ్యాం
గారశరీర! దైత్యకుల గర్వవిభంజన! లోకమోహనా!
వారిజనాభ! సత్యజన బాంధవ! రక్తసరోరుహాక్ష! సం
సారవిదూర! భవ్యగుణ సాంద్ర! నృపోత్తమ! వీరరాఘవా! ౧

చ. సనకసనందనాద్యఖిల సన్మునివందిత! సర్వలోకసం
జననవినాశకారణ! నిశాచరజైత్ర! మహాప్రభావ! యో
జనకతనూజనాథ! ఘన సత్యపరాక్రమ! పాపనాశ! స
జ్జనహృదయాంతరాత్మ! వర సాధుజనావన! వీరరాఘవా! ౨

చ. సురుచిరహేమరత్నమయశోభితపీఠము నందుసీతతోఁ
జిరునగ వంకురింపగ, వసిష్ఠమునీంద్రుఁడు స్వస్తిఁజెప్పఁగా
భరతుఁడు, లక్ష్మణుండెపుడు ప్రక్కవినమ్రత భక్తిఁగొల్వ, సుం
దరతరనీదురూపము ముదంబునఁగొల్తును వీరరాఘవా! ౩

చ. శివునకు ముఖ్యమంత్రమయి శ్రీకరమై, నిజదాసరక్షయై
పవనతనూజుఁ ప్రాణమయి పావనమై, భువనప్రసిద్ధమై
భవభయభేషజంబగుచు భద్రమునిచ్చెడు నీదునామముం
బవలును రేలుమైమఱచి ప్రార్థనసేయుదు వీరరాఘవా! ౪

చ. అగణితభోగభాగ్యముల కాసవహింపఁగ లేదుగాని, నేఁ
బగలును రాత్రియందునిను బ్రార్థనఁజేయఁగ సుస్థిరంబుగా
జగమునను న్నాళ్లయినఁ జక్కనిభక్తి నొసంగుమయ్య నీ
నగవులమోముఁజూడఁగ మనంబుననెంచితి వీరరాఘవా! ౫



## ౭౧
# యాదవా!
శ్రీ టి. పాండురంగయ్య కవిగారు

మ. సతతంబేను కుచేలునట్లు సకలైశ్వర్యంబు లిమ్మంచు వే
డితినే యెప్పుడు వెంటనుండుమని తండ్రీకోరితే బొందు సం
తతివోలెన్ గన నొక్కసారియె భవత్సందర్శనంబీగదే
గతిలేనమ్మకు గంజియే సుధగదా? కంజాక్ష యో యాదవా. ౧

ఉ. అందములేని జవ్వనము నాదరణంబునులేని విందుఁ గో
విందుడులేని కోవెలయు వెన్నెలగాయనిరేయి భక్తి సం
బంధముగానివిద్య మతిమంతులులేని పురంబు తృప్తినిం
జెందనిజీవి వ్యర్థమని జెప్పరెపెద్దలుమున్న యాదవా. ౨

## ౭౨
# కృష్ణస్తవము
శ్రీ చెన్నమాధవుని పెరుమాళ్లరాజు గారు

క. శ్రీకౌస్తుభధరవక్షా రాకేందునిభాస్యవిమల రాజీవాక్షా
నాకాధ్యవినుతపదయుగ నాకోరికదీర్చి కావు నయముగఁగృష్ణా. ౧

క. ఒప్పుగసత్కృతులెఱుఁగను దప్పులుగామాటలన్ని దలఁచెడివాఁడన్
ఒప్పులకుప్పవు తెప్పవు గొప్పగమిముఁజాలవేడు కుందునుగృష్ణా ౨

క. అనుభవహీనుఁడదీనుఁడ వినయంబుగఁదలఁచిమిమ్ము వేడతరంబే
తనయుఁడుపల్కినమాటలు వినినంతనెతండ్రికెగ్గ వినరా కృష్ణా. ౩

క. క్రూరుఁడనై చరియించితి జారుఁడనై స్త్రీలపొందు సల్పితినిఁక నా
నేరములెన్నఁబనేమిఁకిఁగారుణ్యముతోడనన్ను గావుము కృష్ణా. ౪

# ౭౩

# హనుమంతా!

శ్రీ గంగు కృష్ణదాసు గారు

---

సీ. తీరైన గౌతమీ తీరమా యిది నీకు
నీరులూరెడి సుబేదారు బావి
ఠీవైన పంచవటీ స్థలమా నీకు
బాలతాళ రసాల కేళివనము
మేలైన యా పర్ణశాలా విలాసమా
మెచ్చులు గుల్కు బల్గచ్చు మిద్దె
బాల కృష్ణారాయ భక్తవర్య ప్రతి
ష్ఠాపనా యిది నీకుఁ బ్రాపకంబు
గీ. నింతటికి నీదు చారిత్ర మింత చిత్ర
మంత యింతనఁ దోఁచదు నలవిగాదు
భూరి బలవంత తెరగూరి పురనిశాంత
వీర హనుమంత శాంత వివేకవంత. ౧
సీ. భాను ఫలాసక్తిలో నూని మిన్నంటఁ
బ్రాఁకి నప్పుడు పసిబాలకుఁడవు
రామ సుగ్రీవుల కామోదమున సఖ్య
పఱచునప్పుడు మహా పండితుఁడవు
ద్రోణాద్రి లక్ష్మణ ప్రాణరక్షణ కని
జరుగు నప్పుడు వీర సాహసుఁడవు
నమ్మించి యా జానకమ్మ నెమ్మది చింత
మాయించు నప్పుడు మాయికుఁడవు
గీ. యెక్కువకు నెక్కువాడవు తక్కువాడు
గాన నిను తెక్కఁగొన బ్రహ్మకైనఁ గాదు
భూరి బలవంత తెరగూరి పురనిశాంత
వీర హనుమంత శాంత వివేకవంత. ౨

---

౭౪

# చవితి గణపతి

శ్రీ కొండవల్లి రామచంద్రరావు గారు



మ. తనపైఁబడ్డ వృథాపవాదమున కాత్మం గుందుచున్ తన్నివా
రణకై కష్టము లోర్చియుం బిదప సత్రాజిత్తునుండి సన్మణిం
గొని కీర్త్యుజ్జ్వలుఁడౌచుఁ దన్గొలుచు నా గోపాలు భవ్యాత్ముగా
నొనరం జేసిన విఘ్నరాజు కృతిఁ బ్రత్యూహంబు పోకార్పుతన్.

మ. నిను విఘ్నాధిపు మున్ను గొల్చి పిదపన్ దేవావళిం బూజ సే
యును లోకావళి సర్వకార్యముల విధ్యుక్తంబుగా, "మొట్టు దే
వుని గా కెవ్వఁడు పెట్టు దేవరను దాఁ బూజించు" నన్మాట యిం
దు నిజంబై చెలువారెగా, సుజనబంధూ! దేవ! విఘ్నేశ్వరా!.

ఉ. ము జ్జగముల్ రచించు ఫలముల్ పలుబప్పులు మోదకంబులున్
బొజ్జను నింపుకొన్న నిను మూషక మొక్కఁడు మోయుటెట్లొ వి
ద్వజ్జనవంద్య? యాఁగద! భవత్కృపఁ గల్గినఁ జాలుగాని పెన్
రజ్జువుచేత నిడ్వఁబడు రమ్యకులావని భృచ్చయంబులున్.

మ. జిలుగుం బచ్చని యాకుపూల గమితో సింగార మేపార పూ
జలు గావించెను మా త్రిలింగ ధరణీశ వ్రాతమేనాఁడొ త
త్ఫలమున్ నేటికి నేము పొందెదము; త్వద్దాక్షిణ్యముంజేసి మా
తెలుఁగుం దేశము సంపదాకరముగా దే! పార్వతీనందనా!.

మ. ఇవె తోయంబుల నాంధ్రవాహినులు నా కిచ్చెన్ భవత్పూజన
వ్యవసాయంబున కొంటిపంటిదొర! మీరా కర్పింతు, శ్రీ కాకతీ
య వరానీకము వోలె, తత్కలిత విద్యాశూరతా దేశభ
క్తి విశేషంబులనైన నా కొసఁగి దాతృత్వంబు పాటింపవే!





## ౨౫

# ఉమామహేశ్వర స్తుతి

శ్రీ ఉమాపతి నాగయ్యశాస్త్రి గారు



చ. గిరిచరులన్ గిరీశ్వరుల గీష్పతి వాక్యవిశేష వాక్యులన్
బరమదయాసముద్రులను బాపవిమోచన శీలవంతులన్
ధరఁగలవస్తురూపులను ధర్మచయప్రభులన్ ధనాఢ్యులన్
కరములు మోడ్చి మ్రొక్కెదను గన్నులఁ గాంచఁగ వత్తురంచునన్ ౧

చ. శివులను శంకరాకృతుల సేవక సేవిత పాదపద్ములన్
భవులను భాగ్యవంతులను భానుకరాంతర దీప్తిదాతలన్
బవిసమగాత్రులన్ భువన పాలనదీక్ష సుబద్ధసూత్రులన్
జనగల వారినిందరినిఁ జాలఁగ మ్రొక్కుచు వేడుచుండెదన్ ౨

చ. ఈశ్వరులన్ దయామయుల నీప్సిత కార్య ధురంధరాత్ములన్
శాశ్వత సౌఖ్యదాయకుల సర్వశరణ్యుల సాధు వేషలో
కేశ్వరవంద్యపాదుల నిరీశ్వరులన్ భవబంధదూరులన్
సేశ్వరలోకపాలకుల నెంచుచునుండెద నామనంబునన్ ౩

చ. ప్రణవరథాధిరూఢులను బ్రహ్మజసారథులన్ హరీషులన్
గుణసముదాయవంతులను గూఢవిచార వివేకవంతులన్
గణనయ భాగ్యవంతులను గానవినోదుల నాట్యశీలురన్
మణిగణ సర్వభూషణుల మానక యెప్పుడు వేడుచుండెదన్ ౪





## ౭౬
# వేంకటేశ్వరా

శ్రీ చక్రహరి అచ్యుత రాజ గారు



ఉ. శ్రీపతి వాసుదేవ సరసీరుహలోచన చక్రపాణి స
ద్రూప విరించి శంకర శిరోమణి మండిత పాదపద్మ తా
రాపతి భానునేత్రయుగ రాజిత చెన్నమనేని వేంకట
క్ష్మాపతి నేలునట్టి శిరిశాల పురీశ్వర వేంకటేశ్వరా. ౧

చ. లలియతి కర్త్రుకర్మక్రియలన్ భువినీకృతి సంస్కృతాంధ్రసం
ధులఁగల తప్పులన్ని విడఁద్రోచి సలక్షణ మయ్యె గాదె భూ
జలమది గంగలోఁ గలసి సన్నుత మాక్రియ నీసమాఖ్యచే
జలధర నీలదేహ శిరిశాల పురీశ్వర వేంకటేశ్వరా. ౨

ఉ. కొంకక యుష్మదంకితము గూర్చి రచించితిఁ జక్కఁజేయు నా
వంకలు భట్టు చక్రహరి వంశ్యుఁడ నచ్యుత రాట్కవీంద్రుఁడన్
వేంకటరామ పౌత్రుఁడ వివేకసులక్షణ మూర్తిపుత్రుఁడన్
సంకటదైత్యనాశ శిరిశాల పురీశ్వర వేంకటేశ్వరా. ౩



# ౭౭
# రాజరాజేశ్వరీ స్తవము

శ్రీ శివదేవుని వీరభద్రశాస్త్రి గారు

శ్లో. కమలాసన లలనామణి కమలాది నతాంఘ్రి ఫుల్లకమలే మే
విమలం కురుష్వ మానస కమలం సంసారకాననోద్విగ్నం. ౧

శ్లో. ఓంకారజాలలగ్నాం హ్రీంకారీం సర్వలోకజనయిత్రీం
శంకాకలంకహృదయో౽హం కుర్యాం వందనాన్యవేహి. ౨

---

# ౭౮
# చూడికుడుత్త దేవి

శ్రీ ఖండేరావు రామారావు గారు

మ. దనుజారిప్రియ దివ్యపుష్పతులసీ దామార్పణైకాంత దా
స్యనిరూఢాశయభట్టనాయక సుధీ సంవర్ధితాత్యంత పా
వనభాస్వత్తులసీ వనాంతరమునన్ వైదేహిరీతిన్ జనిం
చినమాతల్లిని విష్ణుచిత్తతనయన్ సేవింతు నశ్రాంతమున్. ౧

మ. కలితాత్మీయ వచస్సుధారసఝురీ కల్లోలమగ్నాత్ములై
ఫలమందన్ హరిమోద మొందగ తిరుప్పావై ప్రబంధంబు భూ
స్థలిలో నానతి యిచ్చి దాసజనతా దార్గత్యముం బాపి భా
సిలుమాతల్లిని విష్ణుచిత్తతనయన్ సేవింతు నశ్రాంతమున్. ౨

మ. ఘననీలాశ్మ సమాత్మ కమ్రకబరీ గంధాంకితోత్కృష్టమా
ల్యనవీనోజ్వల సౌరభానుభవ లౌల్యంబొప్ప ధన్యోత్సహామం
చును దన్మాలికఁ గృష్ణుఁడందుకొనుటన్ చూడికుడుత్తాఖ్య గాం
చినమాతల్లిని విష్ణుచిత్తతనయన్ సేవింతునశ్రాంతమున్. ౩

మ. తనయందే దురితక్రియాచరణుఁడై దార్గత్యమున్ బొందివ
చ్చినకాకాసురు నాత్మనాథుపద రాజీవంబులన్ జేర్చి ప్రో
చినకారుణ్యసతీమతల్లిని జగత్త్రేమావహాపాంగ రా
శిని మాతల్లిని విష్ణుచిత్తతనయన్ సేవింతు నశ్రాంతమున్. ౪

---

౭౯

# దేవీ స్తోత్రము

శ్రీ బండి వేంకటరామారెడ్డి గారు

అష్టావధాని



శా. నీహారాద్రిసుతా పితామహముఖానేకామరప్రార్థితా;
బాహానిర్జిత భీకరా సురవరవ్రాతా త్రయీసంస్తుతా
మోహాంధద్యుమణిప్రభాపటలితా మూర్ధేందుభారాజితా;
దేహార్ధాయితశంకరా సురనుతా దివ్యత్పుధీవందితా. ౧

మ. అవతంసాయిత బాలచంద్రకళతో నాకాశకేశాళితో
నవకుందాంకురతారకాపటలితో నవ్యప్రభాస్ఫూర్తితో
నవనీకల్పకటిస్థలీభరముతో నభ్రోత్తరీయంబుతో
భవదీయాకృతి విశ్వరూపమటు సంభావింతునే నంబికా ౨

శా. ఓకల్యాణనిరీక్షణీ సకలినీ యో పాపసంహారిణీ
యో కాదంబ విహారిణీ గుణఖనీ యోంకారిణీ తారిణీ
యో కామప్రతిపంథిమూర్తి గృహిణీ యో చంద్రచూడామణీ
మా కాలంబన మీఁగదే త్రిజగతీ మాతా జగన్మోహినీ. ౩

మ. రతనాల్ గూరిచినట్టి హారములు లీలన్ తుంగ రంగత్కుచో
న్నతభాగంబున నాట్యమాడఁగ గళ న్యాసాభిరమ్యక్రియన్
స్మితభావోజ్జ్వల వక్త్రచంద్రుఁడు బ్రకాశింపన్ నవద్రూప్యలతాం
చితవీణావినిబద్ధుఁజేసితి భవున్ శీతాంశుచూడామణీ. ౪



## ౨౦
# సదాగతి

శ్రీ గజవల్లి హనుమత్కవి గారు



క. కొందఱు హరిహరవిధులను
గొందఱుశక్తులను నింకఁ గొందఱు యోగీ
ద్బృందముల సదాగతియని
యందురునిను వీడియొక సదాగతి కలఁడే. ౧

సీ. నిక్కాక రుజనెప్డుఁ బొక్కెడు ప్రజకీవ
యర్థవ్యయములేని యౌషధంబు
వేసవి సంజల వేళ తోటలఁ గ్రుమ్మ
రెడు దంపతులకీవ లేడికూన
చింతాటవీభ్రాంతి చేతస్కులకునీవ
శాంతిసద్మముఁజూప సరణిమాత
తెఱపు మేడలను సుందరగవాక్షపుటిండ్ల
మెలఁగు లోకముకీవ మేటిబువ్వ
గీ. అతిశిరోబాధలకు నీవ యమృతధార
వీటికిని వాటి కననేల విబుధులెల్ల
వాడిరి సదాగతిని జగత్ప్రాణుఁడనుచుఁ
దగును భళి నీకయాపేర్లు తగు సమీర. ౨

ఉ. ఈకలి నెవ్వరైనసుఖమిత్తురు సన్ముఖులైన నిత్తురా
వ్యాకులతన్న దావిముఖులైన భవత్క్రియ రూపమేలకో
లోకమునం గనంబడు విరుద్ధముగా నెటు లన్నఁ జూడుమా
సైకిలు నెక్కు నాగరిక సంఘముసౌఖ్యముగా ప్రభంజనా. ౩



౨౧



# మాధవా

శ్రీ నేతి రామకృష్ణశాస్త్రి గారు



ఉ. శ్రీధరయాదవాంబునిధి శీతకరా కమలా మనోహరా
సాధుహృదబ్జ సూర్యవర చందనలిప్తశరీర గోపికా
గోధన గోప దుఃఖహర గోత్రధరా బలభద్రసోదరా
భూధవపూజ్య రారవడి పోషణసేయర నన్ను మాధవా. ౧

ఉ. నారదగానలోల కరుణారసపూర్ణ కటాక్షజాల స
త్కీర్తి విశాల ధామవర కేసరిరూప జితారి భీమదే
వారిసమూహ వైరి శరణాగతరక్షణశాలి గోపికా
వారిజనేత్రకామ ముని వందితమంగళధామ ప్రోవరా. ౨

చ. శతధృతివై సృజింపుచును సర్వ చరాచర విశ్వమున్ రమా
పతివయి ప్రీతితో భువన పాలనమున్గరుణించియీశ్వరీ
పతివయి యుగ్రరూపమున పంతమునన్విలయంబొనర్చియున్
శ్రుతులకగోచరుండవయి శుద్ధచిదాకృతి నందియుందువే. ౩



## ౮౨
# హరిస్తవము

శ్రీ పుల్లగుమ్మి అహోబలాచార్యులు గారు

సూక్ష్మచిదచిద్విశిష్టందహారేధ్యాయామికారణంబ్రహ్మ
స్థూలచిదచిద్విశిష్టంవిశ్వాకారంప్రణౌమితదభిన్నం ౧
భవదీయభాషణరసజ్ఞాత్వాయావదతిసారసజ్ఞేతి
అన్యాతుశకంధ్వాదౌపాశేతివినిశ్చినోమినుమహృదయే ౨
యంసంశ్రిత్యవిరాజతిపశ్చాత్త్రేణైవహన్యతేలోకే
అధరోద్విజాశ్రితస్సకారుణ్యేతేనహన్యతేశ్రుణుత ౩



## ౮౩
# రామవరా

శ్రీ వేంకటేశ్వరరావు దేశముఖు గారు

ఉ. నిక్కము దాఁపనేల మది నీపదపద్మము నమ్మినాఁడ నే
నెక్కడికేఁగువాఁడ మదినెవ్వరివేఁడుదు సార్వభౌమ యో
రక్కసిగండ భీమనుత రంగదరాతివిభంగ దీనునిన్
జిక్కులఁబెట్టవద్దనుచుఁ జెప్పెదజానకిరామ ప్రోవరా. ౧
ఉ. కొందఱు యోగ మార్గమునఁ గొందఱు వేద విచారదృష్టిచేఁ
గొందఱు సాధు భావమునఁ గోరిభజింతురు నాదుభావముల్
కొందలమందు చుండ ముచుకుందన తేందునిభాస్య దేవకీ
నందన నన్నుఁ గావుమని నమ్మితివేగమె నన్నుఁ బ్రోవరా. ౨



౮౪

# శ్రీ వేంకటేశ్వరా

శ్రీ భట్టు అచ్యుతరాజు గారు

చ. అటమదియేను భిక్షుకునకై చరియించుటకుఁ బ్రయాణ మె
చ్చటికిఁ దలంచుకొన్నఁ గొనసాగఁగ నీయవు నిన్నుఁగూర్చి యే
మిట నపరాధినైతి నో క్షమించఁగఁబూని ఫణీశ్వరాద్రి వేం
కటరమణ ప్రభో యిఁకను గావుము లింగపురాచ్యుతాఖ్యునిన్. ౧

చ. తటుకున సత్కృపారసము దాలిచి నీ హృదయంబునందు నే
కుటిలము లేక యెప్పుడును గోరికలన్ ఘనభోగ భాగ్యముల్
ఘటనముఁగాఁగఁ జేసి కలకాలము నూనక గారుడాద్రి వేం
కటరమణ ప్రభో యిఁకను గావుము లింగపురాచ్యుతాఖ్యునిన్. ౨

---

౮౫

# శ్రీ వేంకటేశ్వర చంపకమాలిక

శ్రీ రాజా వేంకట శ్రీనివాసరావు గారు

వరగుణరత్నహార నవవారిద నీలశరీర దివ్యసుం
దర జితమారమాముఖ సుధాకరబింబచకోరభక్తహృ
త్సరసిజసూర కాంచన నిశారసకిల్బిషదుష్టదూర శ్రీ
కరకరసంభృతారి దర ఖడ్గగదాధర శార్ఙ్గశౌరభీ
కరపలలప్రసాద చపకాండవిదార భవాబ్ధిదార సం
గరనతధీర యోగి హృదగార విహారదురంత విస్ఫుర
చ్ఛరధిగభీర దీనజన సంఘ ఘనార్తినివార దుర్మదాం
కురపరిహార చారుతర గోపకిశోర భవాంబుజాత రు
ద్రసురవరుత్తైన యీ పరమశోభనచర్య గణింపజాలరో
హారనుత శేషశైల సువిహార రమేశ్వర వేంకటేశ్వరా.

## ౮౬
# జ్యేష్ఠాదేవీ స్తవము
శ్రీ కందాళ శరగోపాచార్యులు గారు



చ. తలఁచితిఁ గొంతకాలము నుదారతకీర్తి గడింతునంచు హృ
ద్బలము నశించె మీఁద ముని భావముచే తప మాచరించగా
మెలఁగఁగ రక్తపాటవము మీఱెవిరక్తి! స్వధర్మ వృత్తియే
సులభమటంచు జెప్పఁ విని స్తోత్రము జేసితిఁ బెద్దతల్లినిన్ ౧

ఉ. భావమునందు దేహమును భాగ్యము బందుగు లన్నదమ్ములున్
గావగలా రటంచు బహు కాంక్ష మెలంగక నిశ్చలంబుగా
దేవునినమ్మ మన్ననుడి దీరిచె సంశయ మాత్మకిప్పుడే
చావుదరిద్ర మెప్పటికి శాశ్వతమంచుఁ దలంచితక్కరో, ౨

ఉ. అంగనలెల్ల హేయముగ నారసి నవ్విరి గుడ్డపేలికల్
దొంగలు గూడ ముట్టుకొన దోసమటంచుఁ బరిత్యజించి రీ
సంగతిఁజూచి చుట్టములు చల్ది నొసంగిరి తొల్తనే కృపన్
మంగలితోడఁగూడఁ బని మాలి కృతార్థుఁడనైతి సోదరా. ౩

## ౮౭
# నా ఆశ
శ్రీ ఆకుల లక్ష్మినారాయణ గారు

ఉ. శ్రీరమణీ మనోధవుని చిత్రవినిర్మల పాదపద్మముల్
కూరిమిభక్తి మీర మదిఁగొల్చి తరించుట లోకమందునన్
ధీరతయంద్రు కావున మదిందలపోయుచుఁ దత్క్రియార్థమై
పేరిమియత్నముల్ సలిపి వెన్నుని సన్నిధిఁ జేర నాశమా.





## ౨౨

# వేణుగానము

శ్రీ నల్లాని చక్రవర్తుల వేంకటపెన్న రంగాచార్యులు గారు

ఉ. వ్రేళుల యంగుళీకములు వెన్నెలలోన వెలుంగ నందమా
మౌళి మయూర పింఛము స మంజస మోహన రీతితోడ నాం
దోళన సేయ లేనగవు దోఁపగ మోదమున నేత్రయుగ్మ సం
చాళనతోడ మోహనుఁడు చక్కఁగఁ జేసెను వేణుగానముల్. ౧
ఉ. అంబరవీథియం దనిమి షాంగన లబ్బుర మొంద భారతీ
తుంబురు నారదాదు లతి తుష్టిని శీర్షము లూప వృక్షరా
జంబులు లేఁ జిగుర్పొడముఁ జప్పున రాల్గరుగంగ వేణుగా
నంబును జేసెఁ గృష్ణుడు వినందగు భైరవి రాగ మాధురిన్ ౨
చ. విమల సుగంధ నవ్య సుమ వృక్షములందునఁ గీర చక్రవా
కములు వసించి చూడ నుర గంబుల మస్తకము ల్చలింప నా
కమున విరించి దేవతలు కౌతుక మొందగఁ జేసె వేణుగా
నమును ముఖారి రాగమున నందకిశోరుఁడు సుస్వరంబులన్. ౩
మ. మధుపంబు ల్మకరంద పానమునకై మందారపుష్పాళినిం
గదియం బోవక యాలకింప మదభృంగంబు ల్నినాదంబులన్
వదలన్ గ్రేపులు నాలమంద దరియింప న్వేణుగానంబు శా
రద రాగంబునఁ జేసె కేశవుఁడు సంరంభంబు శోభిల్లఁగన్. ౪



## ౮౯
# రామచంద్ర స్తుతి

శ్రీ మేడిసెట్టి బృహస్పతి గారు

ఉ. శ్రీరమణీ మనోహరు విశేష వరప్రదు దీనబంధు నోం
కార సురూపు దైత్య రిపుఁ గంజదళాక్షు మహాత్ము భక్తమం
దారు సురేంద్ర వంద్యు వర తాపస మానసధాము దివ్యు నా
శ్రీరఘురాముఁ గొల్చెదను జిత్తమునం దనిశంబు భక్తిమైఁ. ౧

గీ. దుఃఖముంగూర్చి మఱలఁ దోఁడ్తేడ సంత
సంబుఁజేకూర్చు చుండుమో సదయ హృదయ
నీదు మహిమంబుఁ గొని యాడు నేర్పుఁగలదె
రమ్య గుణసాంద్ర శ్రీరఘు రామచంద్ర. ౨

---

## ౯౦
# విచార మేల!

శ్రీ ఆర్తినమ్మళ్వారు గారు

చ. ప్రవిమలపాద రేణువున రాతిని నాతిగఁ జేసి యంతటన్
శివువిలుద్రుంచి మించి తగ సీతను మోహముతో వరించి తన్
గవిసిన నుగ్రభార్గవుని గర్వమడంచిన జీడికంటి స
ద్భవనుఁడు రామమూర్తి మనపాల గలండు విచారఁమేటికిన్. ౧

చ. సవినయభక్తిలక్ష్మణుఁడు జానకిఁగొల్వఁ విరాధుద్రుంచి స
త్కవులునుతింప దుష్టులను గర్వమణంచి జటాయుకప్పుడున్
ధ్రువముగ మోక్షమిచ్చి పరితోష మొనర్చిన జీడికంటి స
ద్భవనుఁడు రామమూర్తి మనపాలఁగలండు విచార మేటికిన్ ౨

చ. పవనజవాక్యపద్ధతి కృపామతితో రవిసూనునేలియున్
జవమునవాలినప్పుడును సంహరణంబొనరించి సేనతో
గవిసి పయోధిదాఁటి దశకంఠునిఁగూల్చిన జీడికంటి స
ద్భవనుఁడు రామమూర్తి మనపాలఁగలండు విచార మేటికిన్ 3



౬౧

# శ్రీ అర్ధనారీశ్వరస్తవము

శ్రీ చంద్రమౌళి గారు



శా. శ్రీవిశ్వేశ్వర చంద్రమౌళిధర కాశీ వాససర్వేశ మం
త్రావిర్భావప్రసన్నరూపధనదార్త త్రాణపారీణబు
ద్ధి విద్యాదికవిత్వ సత్పటిమవాఙ్మ్యు ద్ధీరత్వమైశ్వర్యముం
దేవబ్రహ్మణభక్తిముక్తులిడు దేవాయర్ధనారీశ్వరా. ౧

మ. వరకైలాసనివాసయీశ త్రిజగద్ వంద్యావిరాడ్రూపవ్యా
త్పర సీజాంతరవాసభక్తవరదా సర్వేశ త్రైనేత్రశం
కరమృత్యుంజయ కృత్తివాసహిమవత్ కన్యాప్రియాయంచు నే
నారిగల్ జేసిస్తుతింతునెప్డు సుమనోన్మ్రదార్ధనారీశ్వరా. ౨

మ. బతిమాలఙ్బనిలేదు భూవిభుల నిం బ్రార్థించినంజాలు స
మ్మతితో శ్రీలనొసంగి బ్రోచెదవు సుమ్మా సర్వజీవాళులఙ్
పతివై రక్షణసేయు దేవరవు త్వత్పాదంబులర్చింతుదు
స్థితిబాపంగదె తండ్రి దైవమ కృపాబ్ధీ యర్ధనారీశ్వరా. ౩



౬౨

# హయగ్రీవ స్తుతి

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీమదభినవ రంగనాథ బ్రహ్మతంత్ర
పరకాల స్వాములవారు



విష్ణుం కృష్ణంయమేకం విదురపిబహుధాబుభుత్సితా వార్యవిప్రాః
స్రష్టావిస్రంసమాణః స్వమథసమదధాచ్ఛందసాంయేనదానాత్
కృష్ణంవిష్ణుంచజిష్ణుంకలయితురపియత్సంహితామాయురుక్తమ్
వాచాశ్లిష్టంవయస్తంహయముఖమనుసందధ్మహేకింవృథాన్యైః- ౧

ఇన్ద్రోవృత్రం హనిష్యన్ సఖవరవితరం విక్రమస్వేతివిష్ణుమ్
సంప్రార్థ్యాత్తోహతారిస్తత ఉపజనితాంబ్రహ్మహత్యాంవ్యపోఢుమ్
సూక్తాభ్యాంయంపుమాంసంప్రతిఘృతిమజుహోన్మూర్ధ్నిగంధర్వపణో
దేవానాంనామధారీసమమదృఢమతాదద్యవాచస్పతిస్తాత్. ౨

ఈశానాసర్వస్యా వాచో దేవీయదఙ్ఘ్రిమధ్యాస్తే
కర్ణాటదేశభాగ్యంవాగీశ్వర ఏషమమమనోవిశతాత్- 3

ఆచార్య పాదుకాశతకే:—

గురుపాదం రామపాదస్పర్శాదేశాశిలాఙ్గనాభూతా
పాషాణకాష్ఠభూతాః సర్వాఙ్గమయస్యమన్దమానన్దంత్వమ్. ౪

శిశుపాలశిరశ్ఛేత్తాకృష్ణఃపార్థాయసారముపదేష్టా
సారార్థానుష్ఠాతాశిశుపాలశ్రేయసేత్వదీశానః ౫



## ౯౩
# శ్రీరామనుతి

శ్రీ విద్వాన్ పండిత శిరోమణి ఆచ్చినరసింహాచార్యులు గారు

సీ. శ్రీరంగనాథుండు శ్రితజనపోషుండు
    కామితఫలదుండు కారణుండు
వేదాంతవేద్యుండు వేదహర్తృహరుండు
    భావజజనకుండు భాసురుండు
బ్రహ్మాదిసేవ్యుండు పరమ కల్యాణుండు
    శేషాహిశయనుండు చిన్మయుండు
నారద పూజ్యుండు నాగారి వాహుండు
    నతలోక రక్షుండు నక్షరుండు
గీ. వారిజాక్షుండు శ్రీరమా వల్లభుండు
పద్మదళ నిభనేత్రుండు పావనుండు
శేషశయనుండు ప్రహ్లాద పోషకుండు
మిమ్ము నెల్లర రక్షించు మించువేడ్క.

---

## ౯౪
# దేవస్తుతి

శ్రీ గుండా కేశవులు గారు

గీ. దైవమా నీమకృపలేక ధైర్యమెల్ల
సడలఁ గృశియించుచుంటినీ సమయమందు
నాదుకొనరావదేల నా యార్తిఁబాప
నార్తజనరక్ష సర్వ లోకాధినాథ. ౧
గీ. సత్యమైనట్టి వైరాగ్య సంపదలను
గరుణతోనిచ్చి కాచెడి గురుఁడవగుచు
నమ్మియుంటిని నిన్ను నా నెమ్మనమున
భక్తజన పారిజాత సద్భద్రమూర్తి. ౨



౬౫

# శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాలస్వామి ప్రశంస

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ వాగీశబ్రహ్మతంత్ర పరకాలస్వాముల వారు

---

శ్లో॥ అతిపాతకిలంకాధిపసంసర్గసమేధమానకలుషభరం
శోధితవాన్భరవర్షేసోఽయంజగతిజయతిరఘువీరః ౧
శ్లో॥ వ్యాకర్త్రీం బహుధాభవేయమితియాసంకల్ప్యనామ్నాసమం
రూపంజీవశరీరకేణకరణేనానుప్రవిశ్యాత్మనా
తస్మాత్సర్వపదాభిధేయమసుకృతంసైషాపరాదేవతా
భూయాన్మేకరుణావశీకృతమనాస్తత్త్వార్థసంపత్ప్రదా ౨
శ్లో॥ వైష్ణవ్యాఽపాంగసృత్యాసమధిగతమహాసత్వరాశిఃప్రభావైః
ప్రాప్యాయత్పాదపంకేరుహయుగళనిధిధ్యాపనాకల్పవల్లీ
దుర్వాద్యారబ్ధగర్వప్రలపితకుహనాయుక్తివిచ్ఛేదనాయ
శ్రీకృష్ణబ్రహ్మతంత్రాగ్రిమపదపరకాలార్యవర్యంశ్రయేతం ౩
శ్లో॥ యత్పాదాంభోజతీర్థామృతరసకణికాసేవనాదేతిలోపం
పాపంసంసర్గలబ్ధంనిజమపిచమనఃకాయవాగాదిమూలం
తానేతాన్స్పృహయాస్యాఖిలజనదురితధ్వంసనాయావతీర్ణాన్
శ్రీకృష్ణబ్రహ్మతంత్రాదిమపదకలిజిద్దేశికేంద్రాన్ప్రపద్యే ౪
శ్లో॥ శ్రీకృష్ణబ్రహ్మతంత్రోత్తమకలిమథనానుగ్రహప్రాప్తవిద్యా
వైశద్యేనాత్తగద్వాలనగరమహిమాస్థానధర్మాధికారాత్
ధర్మ్యామావిష్కృతాంధ్రాకృతిమిహనరసింహార్యవర్యాత్సు
దేతాంనిష్పక్షపాతాందురితపనదవాన్సజ్జనాన్సజ్జయంతుధీంద్రా





౬౬

# శ్రీ కర్మచంద్రోదయము

కవికేసరికిశోర అవధానకుశల
శ్రీ ఆచి వేంకట నృసింహాచార్యులు గారు



సీ. న్యాయవాదాస్త్ర విద్యాభ్యాస మొనరించి
కృతకృత్యుఁడౌ రాజకీయవేత్త
కఠినోప వాసదీక్షలచేత నాత్మీయ
యౌవనంబును గన్న యోగికుండు
హరిజనాభ్యుదయ పుణ్యాంభోజ పుంజ వి
కాసంబు నేసిన కర్మసాక్షి
పత్నీసుతాలయ వసు ధనాదికము ను
దాసీనతఁగఁ జూచు త్యాగి యతుఁడు
గీ. భూరి భూమిమాతృ్రుణ విముక్తి కొఱకు
బంధనాలయావాసి యా భాగ్యశాలి
ధన్యమోహన దాస చైతన్యమూర్తి
కర్మచంద్రుఁడు బొడిచె లోకము సుఖింప. ౧

సీ. తల్లిదండ్రులకు విశంతుపుత్రీపరి
తాపంబు గాంచుటే ధర్మసరణి
జాతిమతాది వైషమ్య వివాదముల్
వృద్ధిగావించుటే విద్యమహిను
దీనజనాళివిహీన పరిస్థితుల్
గనుచుంటయే యధికార విధియు
నంగనామణుల విద్యావాప్తి ప్రతిబంధ
కోపాయ చింతయే యుక్తిఫలమ
గీ. టంచు జనులను వంచించి హాయిగాను
వాసిఁగాంచితి విందాక నోసనాత

నాంధకారమా! యిపుడె నీ యంత్యకర్మ
చంద్రుఁ డుదయించెఁ దిన్నగా జాఱుకొనుము. ౨

సీ. కటిమాత్ర వస్త్రవైఖరి విశేషమె కాని
నాణ్యమౌ వారవాణంబు కాదు
రాటంబుపైన దారంబుదీయుటె కాని
నవ్యకార్మిక విధానంబు కాదు
క్షురితశిరోజప్రచుర శీర్షమె కాని
చలలసమ్మార్జ్ర కుంతలము కాదు
స్థవిరతాక్రాంత విచార వేషమె కాని
యౌవన పీనావయవము కాదు

గీ. క్రిందు మొగముతోఁ జింతిలు క్రియయె కాని
స్వైరితా జీవికా విలాసంబు కాదు
కాని యిదియేమి మహిమయో కర్మచంద్ర
రీతియే భారతీయుల నీతియయ్యె. ౩

సీ. తన వస్త్రధారణంబున భాంతీమాత్ర
తుదిలేని స్వాస్థ్య సంపద భజింపఁ
దన సత్త్వభావ సదాగతి పెంపున
శత్రుభూరుహ తతి సంచలింపఁ
దనదు దీనావనోద్యమమున నిఖిల హైం
దవజాతి భువి మహోన్నతి వహింపఁ
దన దయాశాంతి సత్యములకు దేశారు
లధిక పశ్చాత్తాప మనుభవింపఁ

గీ. దన విభూతియు సేతు శీతనగ మధ్య
ధరణి రంగస్థలంబునఁ దాండవింపఁ
గర్మ చంద్రోదయంబయ్యె గాంధివంశ
జలధి నీమహాత్మునికగు జయము సతము ౪



## ౬౭

# రామేశ్వర ప్రశంస

శ్రీ హూణదుర్గం శ్రీనివాసరాఘవాచార్యులుగారు



సమ్యక్కోఙ్మ్ములఘట్టునామనిగిరాయః ప్రాదురాసీత్పురా
తత్త్రాద్యగ్వనపర్త్రిరాష్ట్రికుశలాధానాయమానాయకః
రమ్యాం పుష్కరిణీంవిధాయవితతాంతత్ప్రీత యే తద్గిరౌ
మాసే కార్తికికేమహోత్సవమపిప్రావర్తయద్వార్షికమ్ ౧

అసౌదిక్పాలాళీమకుటమణిపాళీసఖయశా
విశాంనేతాహ్యేతాదృశఇహానభూతో నభవితా
ఇతిశ్లాఘ్యే౽ సర్వప్రగుణగుణా వన్మాన్యచరితో
వశీనానాభాషా లిపివచన లేఖాతి చతురః ౨

ప్రసన్నాత్మానిత్యంవిలసదసదృక్ఛౌర్యమహిమా
కృమాణాలీకాలీకృతరిపుజనాలీకఫలకః
దయాదాక్షిణ్యశ్రీనయవినయవిజ్ఞానజనిభూః
ప్రభూణాంమూర్ధన్యస్సుమతిరతిధన్యస్పురసవాక్ ౩

ప్రభుత్వేతారుణ్యేఘనకనకరత్నాదివిభవే
మహోద్దామేసత్యప్యనధిగతగర్వాఙ్కురకథః
గభీరో౽దారాత్మాకులసముచితాత్యద్భుత గుణో
ల్లసద్భూమారామేశ్వరధరణిపాలోవిజయతామ్. ౪



౬౫

# శివాజీ ప్రశంస

శ్రీ కో. క. అణ్ణా. సంపత్కుమారాచార్యులు గారు



సీ. ఎవ్వానిశకమందు హిందూమతంబున
జాతీయవైరముల్ సక్కఁబడియె?
నెవ్వానిశకమందు హిందూమతంబున
నరవిక్రయముగూడ నురుమఁబడియె?
నెవ్వానిశకమందు హిందూమతంబున
వర్ణాశ్రమాచారవసతినిలిచె?
నెవ్వానిశకమందు హిందూమతంబున
గోబ్రాహ్మణులభక్తి కొమరుమిగిలె?
గీ. నతఁడు రాజన్యలోక చూడావతంసుఁ
డనఘుఁడార్యుఁడు ధైర్యశౌర్యాఢ్యుఁడనఁగఁ
బొగడఁబడియెడి సద్గుణభూషణుండు
శ్రీశివాజీమహారాజశేఖరుండు. ౧
సీ. పరమతాభిమతంబుఁ బ్రకటింపయవనుల
గోరీలనేటికి గొప్పసాక్షి
పరభామలఁ మాతృభావంబుతోఁజూడ
ఛత్రపురనవాబు పుత్రిసాక్షి
దానధారనుఁదెల్పఁ దనమహారాజ్యమ్ము
యతికినొసంగినాఁడనుటసాక్షి
గోసంఘములయందు గొప్పప్రేమనుజాట
ధర్మశాలలవన్ని తగినసాక్షి
గీ. సాక్షులింకేల? సజ్జనాచారసరణి
ధర్మమూర్తియటన్న సద్యశమొకండె

దిక్కులన్నింట నిక్కుచుఁ బిక్కటిల్లఁ
దక్కువేమి శివాజీకి ధాత్రిలోన. ౨

సీ. వ్యాయామసంఘముల్ బద్ధతుల్ జనులకు
విరివిగా నీవకా కలిపినావు
ధైర్యశౌర్యాదిసద్గుణముల నభివృద్ధి
నొందుటకీవకా యొజ్జవైతి
పరరాజబలగర్వ భంజనమార్గమ్ము
నీవకా జనులకు నేర్పినావు
స్వాతంత్ర్యసాహస సాధనసంపత్తిఁ
గాంచుటకీవకా కారణంబు
గీ. అరయనన్నింటికాదర్శమగుదువీవ
నిన్నుఁ బోలినవ్యక్తులే సున్ననుమ్ము
పరమపావనచారిత్ర! భరతపుత్ర!
శ్రీశివాజీమహారాజ! సిద్ధతేజ!! ౩

గీ. కడుపుకూటికి నెండలో కాళులొత్తి
జీవయాత్రలఁ గడపుచుఁ జేవఁ దక్కి
మడియనున్నారు స్వశరీర మాత్రులగుచు
భారతాంబికి దౌర్భాగ్య భరముకతన. ౪

చ. నరపతిలేని రాజ్యమటు నాథునిఁ బాసిన నాతికైవడిన్
వరశశికాంతివీడిన విభావరిచందముగాఁగ నేఁడు దు
ర్భరమగుశోకవార్ధిఁబడి వందురుచున్నది భారతాంబ శ్రీ
వరదుఁడ! వేగఁ బంపుమ శివాజినిఁ గ్రమ్మర నుఃఖమారెడిన్.



౯౯

# నీలకంఠ గురువు

శ్రీ రంగధామ నాయుడు గారు



గీ. జాతిభేదము నెంచక జనులకెల్ల
పరమ తత్వోపదేశంబు గరిమతోడఁ
జేసి సంతుష్టి నిచ్చిన సిద్ధపురుష
సచ్చిదానంద గురుమూర్తి చారుకీర్తి ౧

గీ. బుద్ధిమాంద్యతచే నిన్నుఁబూజ్యుఁడనుచు
మదిని నెంచక సామాన్య మానవునిగ
నెంచి మెలఁగిన నన్ను మన్నించవయ్యా
సచ్చిదానంద గురుమూర్తి చారుకీర్తి. ౨

గీ. సతిసుతాదులఁ బోషింప జన్మమెల్లఁ
గడిపివైచితి నీకసూక్ష్మకాలమేను
గేలు ముకుళించి ప్రార్థింతుఁ గృపను జూడు
సచ్చిదానంద గురుమూర్తి చారుకీర్తి. ౩

గీ. సకలశాస్త్ర పురాణముల్ సదువనేమి
జ్ఞానసంపత్తి ప్రాప్తంబు గలుగదయ్యొ
బ్రాపుఁజేరితి గతిచూపు ప్రణుతిసేతు
సచ్చిదానంద గురుమూర్తి చారుకీర్తి. ౪

గీ. పూర్వ సుకృతంబుచేనీదు పూజ్యమైన
పాదదర్శన లాభ సంప్రాప్తి కలిగె
మనసు చపలతలేనట్లు మనుపుమయ్యా
సచ్చిదానంద గురుమూర్తి చారుకీర్తి. ౫



## ౧౦౦
# రామానుజ ప్రశంస

శ్రీగోవర్ధనం నారాయణాచార్యులు గారు

శ్లో. తవపదాంబుజంతత్వదర్శనం భవమహాంబుధేర్భద్రతారకం
భువనసుందరంభూరిదానదం భవతునోయతేర్భావుకప్రదం.

శ్లో. యతిపతేర్వచోయన్మఖేస్థితం పతితపావనం పావకర్పనం
తతపరంపదంతత్కశేస్థితం మతిమతాంమతంమన్మహేద్యతత్.

శ్లో. కనకకుండలం కాయవాసనం జనకకేశవంజైనశాసనం
ఘనకమండలుంఘాతిసౌగతం వనరుహేక్షణంవచ్మ్యహంయతిం.

శ్లో. వదయతీశ్వరం వాఞ్ఛితార్థదం సదయమన్వహంసారసాననం
పదసరోరుహంపద్మలోచనం మదనసుందరం మాధవప్రియం.

శ్లో. చరమసారదం చారువిగ్రహం పరమతాహిరాట్పన్నగాశనం
కరకుశేశయంకల్మషాపహం స్మరయతీశ్వరం సాత్వికంముహుః.

---

## ౧౦౧
# మాణిక్యప్రభుగురువు

శ్రీ ఖండవల్లి నరసింహ శాస్త్రిగారు

శ్లో. దూరీకృతైవణీకస్స్వీయ యశోవ్యాప్తనిఖిలధరణీకః
ముఖనృత్యద్వాణీకోజయతి శ్రీగురువరేణ్యమాణీకః ౧

శ్లో. శ్రీమన్మాణీకగురోయస్మాకపదాంబుజాతరజఆప్తేః
అరిజన్కతాజనస్యప్రభవతిఖలుచిత్రమేతదిహజగతి. ౨

శ్లో. అపూర్వోమార్తండశ్శ్రితజనహృదాభ్యన్తరతమః
పరిచ్ఛేత్తానక్తందివమవికలస్వచ్ఛసుషమః
సదానద్భృందస్యప్రసృజతిమహానన్దమతులః
కలిప్రీతిస్థానంజయతిభువిమాణీకనగరే. ౩

శ్లో. మార్తండమాణికగురోశ్చరణాబ్జయుగ్మ
మాపన్నతారకమితిప్రవదన్తిసంతః
యుక్తంయదేతదమలాంఘ్రిసమాశ్రితానాం
సంఘోపినంవహతితారకతాంనఖానామ్. ౪

---

# ౧౨౨

# బమ్మెర పోతన

శ్రీ భవానిసింగ్ ఠాకూర్ గారు



మ. సరసంబున్ సహజంబు నౌకవితయున్ జాల్వట్టియాంధ్రావనిన్
విరియన్ బారిన వెల్లువన్ బరఁగనీ విశ్వంబు భక్త్యంకుర
స్ఫురితంబై తనరారె నేశిఖరి నా పోతన్నయున్ బర్వతం
బరరే! చూడు నిజాము రాష్ట్రమున నెట్లానందమున్ గొల్పునో. ౧

ఉ. పండితశేఖరుండు కవి పట్టపురాజు గుణప్రకాశమా
ర్తాండుఁడు పోతనార్యుఁడు కృతార్థుఁడు తద్వదనప్రభూతని
ష్యందనచోఝరిన్ దొరలు గండశిలల్ వలె నుద్ధృతోక్తులు
ద్దండత రా నెవండు చటఁ దాళితరింపఁగ శక్తుఁడిమ్మహిన్. ౨

చ. నిరుపమభక్తిపూరవర నిర్ఝరిణిం బడి యీదులాడు నీ
శ్వరగుణవర్ణనప్రకట వైఖరి విస్మృతిఁ జెందు మేనలం
కరణము లూన్చుచోఁ దనకుఁ గల్గిన యర్థమలుబ్ధచిత్తుఁడై
పరిపరివెచ్చపెట్టు నటువంటి మహాత్ము నుతింపశక్యమే. ౩

మ. జననం బందితి వోరుగల్ నగరి నైజాంరాష్ట్రమే కాక పా
వనమయ్యెన్ భవదీయజన్మమునఁ బ్రాక్పాశ్చాత్య లోకంబునిన్
వినుతిన్ జేయుటచేఁ ద్వదీయకవితా విఖ్యాతి నే భారతీ
యునిచిత్తంబు సగర్వమై వెలుఁగఁ దత్యుచ్చైఃప్రభావంబునన్ ౪

మ. నుడులా ముత్తెపుఁ బేరులై తనరఁ జెన్నున్ గాంచు సింగారపుం
బొడులా మేలిమిసొమ్ములై వెలుఁగ సొంపుల్ నింపు మేలాగొనాల్
మడుఁగుల్ వోలె నెసంగఁ బల్కు చెలువన్ మన్నించుచున్ బెంచితే
కడు ప్రేమంబునఁ దెల్గుమన్నియలకున్ గన్నెత్తుగాఁ బోతనా. ౫



౧౦౩

# రామరాజ భూషణుఁడు

శ్రీ అంబటి లక్ష్మీనృసింహరాజు గారు



సీ. రామరాజాస్థాన రత్నమీవౌటచే
రామభూషణుఁడన్న నామమలరె
రసకవిత్వంబుతో రంబైనసాహిత్య
రసపోషణుఁడటన్న వసతిగల్గె
బహునృప బహుమాన పటిమచే నిరుపాధి
కైశ్వర్యయుతుఁడన్న యశముగల్గె
ధారణా పాండిత్య తత్వమబ్బుటచేత
శారదామూర్తియన్ బేరుగల్గె
గీ. వసుచరిత్రప్రబంధంబువంటికావ్య
మొకటిఁజూపెదమన్న నేఁటికినిఁగలదె
యద్వితీయంబు నీ కవితాతిశయము
రామరాజ విభూషణ నామసుకవి. ౧

శా. కర్ణాట క్షితిపాల రామధరణీకాంతానుకంపారసో
దీర్ణప్రాపిత రత్నహారహయదంతిగ్రామ రాట్పీఠసౌ
వర్ణాంచన్మకుటాభి భూషణకళావాల్లభ్య సత్కారముల్
వర్ణింపన్ వశమే చతుర్విధకవిత్వ ప్రౌఢ నీ పుణ్యమున్. ౨

క. మీయప్పటి సన్మానము
మీయప్పటిరాజవరులు మీజీవనముల్
మాయందుఁగల్గియుండిన
బాయక కవులెల్లడఁగనఁ బడరెమహాత్మా.



౧౦౪

# పోతనామాత్యుఁడు

శ్రీ దేవులపల్లి వేంకటాచలపతిరావు గారు



క. కవులకుఁ దలమానికమై భవబంధంబులఁ ద్రుంచు భాగవతంబున్
దవిలి రచించితి తెనుఁగున భువినీకిఁక భవములేదు పురుషవతంసా.

చ. కొందఱు రెడ్డిరాజులును గొందఱు వెల్మవజీరులున్ మహా
నందముతోడ నీకృతికి నాయకునన్నొనరింపుమంచు ని
ర్బంధము సేయఁగా వినక పంకజనాభునకే యొసంగి సం
బంధముఁ ద్రెంపుకొంటివి నృపాలురతోఁ గృతివయ్య పోతనా. ౨

ఉ. హాలికుఁడంచు నిన్నుఁ బరిహాసముఁ గొందఱు సేయ "సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీములఁ గందమూలకౌ
ద్దాలికులైననేమి" యని దార్ఢ్యముతోఁ ఋతఁ బల్కినట్టి నీ
శీలము నెన్నఁగాఁ దరమె శిష్టజనాధిప పోతనాధిపా. ౩

ఉ. ఆఁకలిబాధచేత నడయాడిన యాలును బిడ్డలందఱున్
వీఁకదొలంగిపోయినను వేమరు బంధుగులెంత చెప్పినన్
నీ కమనీయదీక్ష విడ నేరవు చేలను గొల్వఁ బోవు వ
హ్వా కలరే కవీశ్వరు లవారిఁక నీ కిలసాటి పోతనా ౪

మ. పదలాలిత్యము, భావవైభవము, సత్పాత్రౌచితుల్ వ్యర్థపున్
బదరాహిత్యము, సత్ప్రబంధరచనా పారీణతల్ భక్తిసం
పద నీకావ్యమునందు గాకపరికింపన్ గల్గునే యెందు, దో
హదమున్ గూర్చితివయ్య భారతి కమేయప్రజ్ఞతన్ బోతనా ౫



౧౦౫

# ఘట బ్రహ్మ

శ్రీ సిద్దప్ప రాజయోగి గారు



సీ. కులముగుండ బ్రహ్మ కులము మాయది వినఁడు
బంకి రేగడిఁ దెచ్చి పరగఁ ద్రొక్కి
సారెపై మన్నేసి చవురంగ కఱ్ఱతోఁ
ద్రిప్పి కుండలు వాని దీక్షతోడ
గుంటలోపలఁ బెట్టి గుణముతోడ జరసి
కుండరూపముఁ జేసి యెండఁ బెట్టి
కర్మంపుటావానఁ గాలఁ బెట్టియు వాని
జనులకిచ్చితినయ్య జయము నొంద
గీ. కర్మచేఁ గుండ బ్రహ్మముగానఁ బడియె
ఎంచిచూడ నా కులంబెచట లేదు
వినఁడి మాయప్ప సిద్దప్ప విహితుఁడప్ప
కనఁడి కరమొప్ప కవికుప్ప కనకమప్ప. ౧

సీ. వేమనార్యునిఁ బోలు విజ్ఞానియును లేఁడు
కాళిదాసుని బోలు కవియు లేఁడు
పోతులూరయ్యంత బోధకుండును లేఁడు
సిద్దప్పయంత శిష్యుఁడును లేఁడు
ఘనకబీరును బోలు కనినదాసుఁడు లేఁడు
సుమతితో సరిబోలు సుమతి లేఁడు
రామదాసుని బోలు రాజయోగియు లేఁడు
తల్లిదండ్రులఁ బోలు ధనము లేదు.
గీ. ఘటముకంటెను వేఱైన మఠము లేదు
ఆత్మకంటెను వేఱైన హరియు లేఁడు
వినఁడి మాయప్ప సిద్దప్ప విహితుఁడప్ప
కనఁడి కరమొప్ప కవికుప్ప కనకమప్ప. ౨

౧౦౬

# యాదవ ప్రబోధము

శ్రీ జి. యం. దేవీప్రసాదు గారు

సీ. విశ్వమంతటమహా వినుతమౌయాదవ
వంశంబు నిలఁబెట్టి వరలె నెవఁడు
కాఁపింటిబిడ్డఁడై దాపుఁజేఁరగవచ్చి
యల్లుఁడై దేవుఁడై యలరెనెవఁడు
ఖడ్కతిక్కనస్నానఘట్టాన పసుపుంచు
దుర్విధిఁగూర్చిన దొడ్డయెవఁడు
ఆహ్లాదకరమైన యక్షగానాదుల
రచియించిసత్కీర్తిఁ గ్రాలెనెవ్వఁ
గీ. డట్టికృష్ణుండు, మైలారు నధిపుఁడైన
కాటమవిభుండు యాదవ కవివరుండు
గలరు వేల్పులు శూరులు కవులుచాల
యాదవా! మేలుకొనుము నీయాత్మఁదలచి. ౧

చ. భయపడి కంస భూపతికిఁ బారినయాదవు లెల్లగోవులన్
బ్రియమునఁ బెంచఁగా జనులు పిల్చిరి గోపక గొల్లలంచు సం
దియమిసుమంతయుం గలదె దేవగిరిన్ మఱి ద్వారసీరధిన్
జయజయ నాద ముప్పతిల సల్పిరి రాజ్యము గాదె యాదవా. ౨

మ. బలిమై పోయెను గోలకొండకొక గోపాలుండు మండాదిలోఁ
బొలియయ్యెం దురమందు వేరొకఁడు గోపుంజంబుకై యిట్లుభూ
తల మందెక్కుడు స్వామిభక్తికయి కాదా ప్రాణమర్పించి స
త్ఫలముంగీర్తినిఁ దెచ్చిరీతెగకు సద్భావంబుతో యాదవా. ౩



## ౧౦౭

# మహాకవి కాళిదాసు

శ్రీ శ్రీరాముల లక్ష్మీనారాయణ గారు



చ. పలుకుల యందు మార్దవము భావములందు విచిత్రభంగి వ్య
క్తుల కథనంబు నందు రసగుంభనముల్ రచనాక్రమంబు నం
దలఘుతరప్రశక్తి చెలువారఁగఁ గబ్బము లల్లికీర్తిమై
చెలఁగిన కాళిదాస కవిశేఖరు పాదము లాశ్రయించెదన్. ౧

ఉ. అల్లికలందు వర్ణనములందుఁ గథాంశములందు భవ్యభా
వోల్లసనంబు నందు నొడయండయి సంస్కృత వాఙ్మయంబురా
జిల్లఁగఁ జేసినట్టి కవి శేఖరభూషణుఁ గాళిదాసునే
నుల్లమునం దలంతు సరసోజ్జ్వల నవ్యకవిత్వసిద్ధికిన్. ౨

ఉ. లేరె కవీశ్వరుల్ ధరణి లెక్కకు మిక్కిలి గాఁగవారిలో
నేరయినన్ గవిత్వమున నిప్పటికేనియుఁ గాళిదాసునిన్
మీరఁగఁ జాలిరే రస సమృద్ధియు, భావ సమృద్ధిగల్గి యొ
ప్పారిన కాళిదాసకృతు లాంధ్రజగత్తునఁ బెంపుఁగాంచుతన్. ౩

గీ తెలుఁగు కవితయందుఁ దిక్కన్న నేర్పరి
దైవభాషఁ గాళిదాసు ఘనుఁడు
ప్రకృతి వర్ణనమున భరతవర్షమ్మున
కాళిదాసుజోడు కానరాఁడు. ౪



## ౧౦౫
## గురుప్రణతి

శ్రీ ఇబ్బనూరు చంద్రయ్యగారు

సీ. శ్రీదస్వరేడీడ్యముట్ శ్రీద్యభేద్ధవ్యవా
డ్బ్రిధ్న ధగ్ద్వారిధన్వి భర్మకుద్ధ్రి
కుంభిద్ధితిజసింధు కుంభరుద్ధరద్విష
చ్ఛంబదంష్ట్రోఘూద్రిజంభదుస్స్య
స్ప్రభేభఛేట్కభుక్స్వగీడ్వషత్స్వర
ధకుస్మహచ్ఛ్రిద భృద్దండజౌక
విశ్వస్పృట్ ఛీర్షదృవిశ్వేడ్గునేట్కుభ్రూ
డేహార్వగేరాడ్జ గేడ్జజాని
గీ. కంధికూణీరమేచకకంధరాహి
జాలఫణపతిశ్చందన జాగురంగ
పాణిమాసీంద్రహృత్పద్మబంభరనిభ
మల్లికార్జునశ్రీశైలమామిడీశ.

## ౧౦౬
మహారాజా

## సర్ కిషన్ ప్రసాదు బహద్దరుగారు

శ్రీ పైడికంటి వేంకటసుబ్బారావుగారు

శా. శ్రీ నైజాంప్రభు మన్ననల్బడయుచున్ క్షేమంబులన్గూర్చుచు
న్దీనత్వంబును బాపుచొప్పరయుచున్నేర్పంత యున్జూపుచు
న్నానాసౌఖ్యములిచ్చి రాజ్యమున మా నైపుణ్యమున్గావ నీ
కేనిత్యంబగుఁగీర్తి జెల్వగుఁగదా! కృష్ణప్రసాదాధిపా. ౧
మ. ప్రతిభావంతునకున్ నిజాంప్రభునకున్ బ్రాసిల్లగా మంత్రివై
మతిమంతుండవునీవు గల్గనల ధర్మంబందు గంధంబు రీ
తితగన్ దుల్యములేని సత్పథమువర్తింపంగ సత్కార్యస
త్కృతులన్దక్కువలేదు మాసుకృతమే కృష్ణప్రసాదాధిపా. ౨

## ౧౧౦

# ఆచార్యప్రశంస

శ్రీ నేరళ్ల వేంకటాచార్యులుగారు

శతావధాని



క. కారి మహనీయునకు సుకు
మారుండై చింతతొరిచె మధ్యంబందున్
గూరిమితోఁ దిరువాయ్ముడి
సారంబును దెలిపినట్టి శఠరిపుఁదలఁతున్ ౧

సీ. పూర్వమునందు సంపూర్ణ ఫణీంద్రులై
శ్రీహరిశయ్యగాఁ జెలగినారు
త్రేతాయుగంబున ఖ్యాతిగా రాఘవా
దరులయి వైరులఁ దరిమినారు
ద్వాపరమునహాల ధరులయి శ్రీకృష్ణ
పూర్వజులనకీర్తిఁ బొందినారు
కలియుగంబున మహాత్మకాషాయవసనత్రి
దండయతీంద్రులై తనరినారు

తే. గీ. సకలపాషండులను ద్రోయఁ జాలినారు
నియతవైష్ణవమతముల నిలిపినారు
శ్రుతితతులకు సదర్థముల్ సూపినారు
స్వామి రామానుజా నీకు ప్రణతి శతము. ౨





[౧౬౬] శ్రీ నల్లంతిఘల్ చక్రవర్తుల రంయాల
లక్ష్మీనృసింహాచార్యులుగారు



శ్రీ తెలకపల్లి రామచంద్రశాస్త్రిగారు





శ్రీ యం. రామకృష్ణా రావుగారు

శ్రీ డా. కే. అళ్వార్ సంపత్కుమారాచార్యగారు

## ౧౧౧

# ప్రథమ రామేశ్వరరాయ ప్రశంస

శ్రీ అమరచింత రామచంద్రకవి గారు

---

సీ. శ్రీజనంపలి కులక్షీరాబ్ధి జనియించి
కంజారి సంపూర్ణ కళలమించి
కకుబంతములనెల్ల ఘనకీర్తిఁ బరగించి
సామంతజనసంస్తవముగాంచి
చాతుర్యమొప్ప భూచక్రంబు పాలించి
ద్విడ్జనంబుల నెల్ల ధిక్కరించి
వినుతగుణాఢ్యుఁడై విబుధులఁ బోషించి
సద్ధర్మశీలఁ బ్రసిద్ధిగాంచి
గీ. అతఁడు పొగడొందు భూమండలాంతరాళ
రమ్య వనపర్తి పట్టణ రాజ్యమునకు
రాజితాకార రామేశ్వర క్షితీంద్ర
చంద్రుఁడలరెను గాంతి నిస్తంద్రుఁడగుచు. ౧

సీ. ఒకచెంత విబుధులో యుర్వీసుర శ్రేణి
రమణీయ ధర్మమార్గములు దెలుప
నొకదండ సుకవీంద్ర నికరంబు లనవద్య
గద్యపద్యార్థ సద్విద్య లెనయ
నొకయోర నత్యంత సుకుమార గణికాంబు
జాతాస్య లభినయ ఖ్యాతిఁజూప
నొకదారి సన్మంత్రి నికురంబమనువంద
నప్పటప్పటికిఁ గార్యములు దెలుప
గీ. సకలకకుబంత కీర్తిరాణీ కరదత్త
మందసం బన వెలసె భూమండలమున
రమ్య గుణసాంద్ర రామేశ్వర క్షితీంద్రుఁ
డదరె! భూలోక దేవేంద్రుఁ డనఁగఁ దనరె. ౨

---

౧౧౨

# ఆలా వేంకట నారాయణ రెడ్డిగారు

శ్రీమతి లక్ష్మీబాయిగారు



ఉ. దారసుతాదివర్గములు తల్లడమల్లడమందుచుండగా
భూరిసుహృజ్జనాళి మదిఘోరనిదుఃఖము నొందుచుండగా
మీరిటనున్కిమాని పరమేలుటకేగితిరయ్య నిత్యస
త్పూరిజనంబులో నధిక శోభవహించితిరయ్య నాయనా ౧

చ. పరమపవిత్ర సత్యపరిపాలనసక్త జనానురక్త సుం
దరతరగాత్ర వైష్ణవ మతాగమవేత్త పటంచుఁ గీర్తిని
ద్ధరణినిఁబొంది రెడ్డికుల ధాములు ఘోరనికుందుచుండగాఁ
బరమపదంబుఁ గన్గొనెడి భాగ్యముగంటివి కాదె నాయనా. ౨

మ. శరణంబంచువచించు శత్రుసమితిన్ శీఘ్రంబుగాఁ బ్రోచితౌ
పరనారీమణులెల్లఁ జెల్లెలనుచున్ భావించి రక్షించితౌ
గురుపాదంబులు నాత్మలోఁదలఁచుచున్ గోరక్షగావించితౌ
ధరనీరూపము నేటితోముగిసె నా ద్వైవాజ్ఞ యోనాయనా ౩

గీ. శ్రీకరంబగునింబాద్రి శ్రీనృసింహు
పాదయుగళంబు నిశ్చల భక్తితోడఁ
దలఁచుచును విష్ణులోకంబుఁ దరలినావె
అయ్యోనాతండ్రి నారాయణావనీశ. ౪

గీ. వసుధనాలాకులాంబుధి వరశశాంక
మేలుమేలనిభక్తులు మెచ్చుచుండ
శ్రీశుపదములఁగంటివా శీఘ్రముగను
అయ్యోనాతండ్రి నారాయణావనీశ. ౫



౧౧౩

# యేసు క్రీస్తు

శ్రీ రెవరెండు యం. వై. జీవరత్నంగారు



క. శ్రీమన్నామా సుగుణ
స్తోమా యేసూ! పవిత్ర శోభితనామా
భూమీజన రక్షణ స
న్నామావిస్ఫురిత భూషణస్థితప్రేమా. ౧

క. భువిగగనంబులు శశిమణి
రవితారలు మారుతంబు రాత్రింబవళుల్
అవిరతముగ నడిపించున
దేవుడా త్రయ్యాత్మకునగు దేవున్ గొలుతున్ ౨

మంగళంబు దేవదేవ మహితధర్మభూషణా
మంగళంబు "మేరి" పుత్ర మనుజపాపనాశనా
మంగళంబు హృదినిసేకు మనుజశుద్ధికారకా
మంగళంబు త్రైక్యదేవ మహినిభక్తపోషకా. ౩

క. నిరతము సిదయుంబడయుచుం
బరమకృపాలబ్ధ విభవ భాగ్యాత్ముండగాన్
శరణంటిని భవభయహా
కరుణించవె యేసు దేవ! కలుషాత్మననున్ ౪

క. యేసే మార్గముసత్యము
యేసే జీవంబు నాకు నెచ్చోటైనన్
యేసే పునరుత్థుండగు
నేసే యాద్యంతములగు నేమీకకొదువల్. ౫



౧౧౪

# జోహారు

శ్రీ పుతుంబాక దుర్గాప్రసాదరావు గారు



శ్రీయును మోక్షము శాంతి రాట్నసే
వాయుతి భారతమాత కబ్బునని
తా ననుభవించి లోకమున జాటు
తండ్రి గాంధి కిదె జోహార్. ౧

రాట్నలక్ష్మి మన రాజ్యలక్ష్మి యని
రామభక్తి భవతరణశక్తి యని
స్వీయానుభవానంతరము జెప్పు
శ్రీ మహితమూర్తి గాంధికి జోహార్ ౨

భారత ప్రపంచము సర్వస్వమ్ము
పాశ్చాత్య నాగరికతా వార్నిధి
బడి మునుగుచుండ తెప్పయై తేల్చు
పరమ కృపానిధి గాంధికి జోహార్. ౩

అంతరించవలె నస్పృశ్యత యే
నస్మజ్జీవిత మేని తదర్థం
బని చాటి చెప్పు ధీరమూర్తి యగు
నా మహాత్మునకు జోహార్. ౪

స్వీయ సౌఖ్య సర్వస్వత్యాగము
జేసి మాతృ దేశోద్ధరణార్థము
కార్యరంగమున కొదమ సింగముల
కరణి దుముకు త్యాగుల కిదె జోహార్. ౫



## ౧౧౫
# ఉద్భటారాధ్యశంకరస్వామి

శ్రీ పులిపాక మహానంది శాస్త్రిగారు

శ్లో. ఫాలేయస్యవిభాతి భూతిరనిశం వక్త్రేచపంచాక్షరీ
కంఠేకాంచనలింగగేహ మురసి శ్రీకంఠనేత్రస్రజః
హస్తేపుస్తకమైశ్వరం శ్రుతిశిరోమీమాంసయాధిష్ఠితం
తంవందే గురుముద్భటాన్వయభవం శ్రీశంకరస్వామినం. ౧
శ్లో. చేతోయస్యపరోపకారకరణే చింతాంతనోతిప్రియాం
ధత్తేయస్యవచస్సమస్తసుజనత్రాణేనుకంపాంపరాం
కాయోయస్యకరోతి భూతవితతేస్తుష్టింపరాంసంతతం
తంవందే గురుముద్భటాన్వయ భవం శ్రీ శంకరస్వామినం. ౨
శ్లో. వాక్యంయస్యగిరీశభక్తహృదయాజ్ఞానాపహారక్షమం
బాహ్వోర్యస్యబలంసుధాంశుమకుట ప్రత్యక్షపూజారతం
ద్రవ్యంయస్యశివాంఘ్రి సేవకమనోభీష్టార్థసంపాదకం
తంవందే గురుముద్భటాన్వయభవం శ్రీశంకరస్వామినం. ౩

---

## ౧౧౬
# శ్రీమద్రామానుజ ప్రశంస

శ్రీ చిలుకమర్తి వేంకటనృసింహాచార్యులు గారు

మ. ఒకనాఁడైన భవత్పదాబ్జరజము న్నొక్కింత గోలించి మీ
యకళంకోజ్జ్వల దివ్య దేహరుచి భుక్తాసక్తుఁగావించి దా
సకదంబాఖిల దాసదాస పద దాస్యంబైననేమించిధా
రకమున్నోపక భోగ్యసిద్ధికిఁ గృపన్ రానిమ్ము రామానుజా. ౧
మ. ప్రకటంబైన భవద్గుణానుభవము న్బ్రాజ్ఞుల్ వినందెల్పమా
మకచిత్తంబునఁ జేరదింతయయినన్ మాంద్య స్వభావంబుచే
నకటా కర్మవిపాక మీవిధమ భాగ్యచ్ఛత్ర సంపన్నగాఁ
బ్రకటించెన్గద త్వత్కృపారసము నాపైనుంచు రామానుజా. ౨

౧౧౭

# కీ. శే. కాళ్లూరు రాజేశ్వరరావు గారు

శ్రీ కొండపల్లి గోపాలరావు గారు

శ్రీ హరిరామలింగశాస్త్రి గారు



సీ. దొర యేనుగంబారిఁ ద్రొక్కిచూచిన నాఁడు
కవిరాజులకు గల్గుఁ గౌరవంబు
కన్నెపెండ్లి కళింగుకడ కేగు రాయల
గఱపు నప్పాజి తిమ్మరుసు నీతి
ధర్మార్థ మాత్మనందను ప్రాణ మొసలించు
మాధవ వర్మ ధర్మంపు ఘణీతి
రుద్ర సమర్చనారూఢ ప్రతాప రు
ద్రుని శివాయతన విధ్యుక్త నియతి

గీ. నీయెడన్నిండి తెల్గు నిర్నిద్రకీర్తి
విరిసిన దినంబు లెడఁదల మరువ లేదు
చెట్టవిధి నిన్ను నొక కీర్తిశేషుఁ జేసె
నకట! కాళ్లూరు రాజేశ్వరార్య వర్య.





## ౧౭

# లలనా!

శ్రీ కర్నమడకల అనంతాచార్యులుగారు



త్రైశంకవావాసనివాస దోషదుష్టాద్వియత్తోధరణీం ప్రపన్నాః
తారాఇవా భాంతి సరోరుహాక్ష్యస్తారాధి నాథోజ్జ్వలవక్త్రబింబాః ౧
మృగమదతిలకకళంకంముఖచంద్ర తావకంవీక్ష్య
యువజననయనచకోరా మోదం తేతన్వతెనళతరనయనే ౨

నయననళినరమ్యేవాలశైవాలజాలే
వదనసరసిశోభావారిపూరాభిధానే
తవతరుణిమనోజ్ఞంచిత్రకంభాతినీలో
త్పలమివవరపుల్లంచోద్గతం చంచలాక్షి. ౩
వలమానమీనమిథునోపమేక్షణా
లలనాలతాంతమృదులాంగవల్లికాః
బలసూదనోపలవినీలకుంతలాః
కులశైలవిభ్రమకుచాశ్చరంత్యహో. ౪
కేశపాశజితనూత్నకాళికాః కంధరోల్లసితరత్నమాలికాః
కుంకుమాంకితకపోలపాలికా స్సంచరంతిపరితశ్చబాలికాః ౫

తారానాయకసుందరంతవముఖం తామ్రోఽధరోవిద్రుమ
చ్ఛాయస్తాళనిభౌకుచౌ కువలయశ్రీసూచనేలోచనే

బాహూ బాహువిసంగరక్షణఖనౌ బాహూలతాభిస్స్ఫుటం
శ్రోణీనిర్జితవారిరాశిపులినశ్రేణిర్మనోహారిణీ. ౬
పరిస్ఫురతిపూర్ణిమాశశధరాననాసుందరీ
ధరాధరవరోన్నతస్తనభరావిచిత్రాంబరా
పురందరపురోల్లసత్సరసిజాననావాజిత్వరీ
కరీశ్వరగతిర్మదంమమవితన్వతీపశ్యతః. ౭
హరిణశిశురేషముగ్ధో ముగ్ధేదూర్వాంకరస్థితాంత్యక్త్వా
గారుత్మతమణిహారంచుంబతిదూర్వాంకురభ్రాంత్యా. ౮
యజ్జాతీయాతిమోహేనసీతా రామౌచదుఃఖితౌ
తంమోహాయసికల్యాణికురంగం కుటిలాలకే ౯
న్యస్తన్యస్తనకోశపద్మయుగళీరత్నార్ధమంగేశవ
ప్రద్యుమ్నావనినాయకేన విలసత్తారుణ్యసేనాపతేః
హస్తాదంచితచారుఖడ్గలతికేవాభాతిరోమావళి
స్తత్తస్వర్ణసవర్ణవర్ణరుచిరే తామ్రాధరేసాంప్రతం. ౧౦



## ౧౧౬
## మోహలత
శ్రీ జాజాల వాసుదేవశర్మ గారు బాలకవి

---

ఉ. ఎచ్చటనుండి యిప్పుడెట కేగెదునో గద యాలతాంగిబల్
ముచ్చటలాడ నేగెదనొ మోమున లేనగవంకురింపఁగన్
పచ్చని చీరఁగట్టి నునుఁ బ్రాయపు సోయగముల్ ధరించి యా
పచ్చని విల్లు దాలుపున బాపురె పైకొన నేగు నోయనఘా.



౧౨౦

# మనోరమ

శ్రీ ఉదయరాజు శేషగిరిరావుగారు, బి. ఏ.,



చ. విపులసితంబ బింబ పరివేష్టితకాంతదుకూలవై యురో
జపరివృతాచ్ఛకంచుక లసన్మణిహార విహారహారవై
యపరిమితాసితాళి నికరాజిత రాజిత కేశరాజిత
ప్రపురుషనాగవై, హృదయధామము సేరఁగదే మనోరమా! ౧

ఉ. వావిడిపల్కవేల మఱవా! విడియిమ్మడవేల? యిస్సియ
వ్వా! విరిదోఁట తెమ్మలను వావిరిపూవుల బొండుమల్లెలన్
వావిలిపూలఁగోయ బరువా? విలిఖించెదవేల నేల? బా
వా! విడినావు నన్ననుచు వావిడిగం దలతే మనోరమా! ౨

ఉ. పుత్తడిజగ్గువిగ్గు చినబుచ్చెడు మేనిమెఱుంగు వెల్లువల్
మత్తడిదూఁక, బిట్టదరి మాఁటికి బెళ్కులచూఁపు దీలుపే
రొత్తడివార, చేతి వలనొప్పుచు నామెదఁ బోయచిల్కరా
తత్తడిసామిగొల్వనకుఁ దాసుపడే నిను నో మనోరమా! ౩

చ. అకలుషనీలిమ ప్రథితహారి శిరోజ నిరస్త షట్పళి
న్నికరరదచ్ఛదారుణిమ నిందిత విద్రుమబింబికాఫల
ప్రకరమనోహరానన విభాపరిభావిత పంకజాత శ్రీ
తకర శిరీషపేశల సుధామృదుగీరమ యో మనోరమా! ౪

ఉ. తెమ్మెర తేరుపైఁ జిలుక తేజి హుటాహుటిఁ జౌకళింపఁగా
నిమ్ములమీను డాలెసఁగ నించువిలుంగొని తేఁటినారి జుం
జుమ్మనఁ బూవుటమ్ముదెసఁ జూచుచుఁ గోయిలపిండు కూయఁగా
నమ్మరుఁడల్లస్వారిజను నామనితోమని యో మనోరమా! ౫

చ. నళినవిశాల కమ్రసితనైగనిగీ పరిహాసిలోచనాం
చలవయి, హంసకాచరిత ఝుళాఝుళీరవ మంజుయానవై
తలఁచినయంత నీవు నిరతంబు మదీయపవిత్రహృత్సర
స్సలిలవిహారముల్ సలుపఁజాలుదు హంసికవై మనోరమా! ౬

చ. ఉపవనవీథి కాఁగుసుతహూత్కరకంపనశీలి యధ్వనీ
నపటలమానసేంధన కనద్ఘనశీలి, విఖండితాభ్ర పా
లి పటపటధ్వనిస్ఫుటదళేశ దృషత్కనగాలి వానగా
లి పొరిఁబొరిం భయమ్ముగను లేచెను స్వప్నమునన్ మనోరమా!

చ. నవరసభావ విప్రకటన క్షమమంజుసుధారసప్లుత
ప్రవచనబోధకమ్మ సితవాఙ్మహభాసురదృక్ప్రరః పత
ద్యవనిక, దుర్భరానవధి దంతుర భార వినమ్రశ్లీరభా
గవదనబింబమై నిడదుగా నినుసిబ్బితి యో మనోరమా! ౮

చ. వరములుసస్తటాక భవభవ్యసరోజగుళుచ్ఛమంజిమా
కరములు లోలహారలతికా బిసమోహ నిలీన చక్రబం
ధురములు మీనకేతు ఫణితుంజిక హాటక కందుకత్వమో
ధరములు కామిలోక జనతా ఘనతాహారముల్ మనోరమా! ౯

చ. నికటవనీధునీ వికచ నీరజకైరవహల్లకోత్పల
ప్రకట పరీమళోదరిల పార్శ్వ దరీహృదరీణ వైఖరీ
నికరదరీపరీత మహనీయ సుకీకబరీబరీభృతో
రుకుసుమ వాసనాయుతమరుద్వ్యసరమ్మొరసెన్ మనోరమా! ౧౦



౧౨౧

# సందేశము

శ్రీ గంధం వేంకటనరసింహాచార్యులు గారు



క. ఉన్నది, నినుఁ గాంచఁగ రమ్మన్నది, విరహార్తి కోర్వనన్నది, సర్వం
బున్నను నీదయలేనపు డన్నియు వ్యర్థంబటంచు నన్నది కృష్ణా ౧

ఉ. ఎమ్మెయిఁ బ్రాణనాథు వలపించి దృఢంబుగఁ గౌఁగిలించి సౌ
ఖ్యమ్మును గాంతునెట్లు విషమాయుధ కార్ముక ముక్తకాండ తా
పమ్మును బాయనేవిధినిఁ బ్రాణము నిల్పుదు నంచు నీదునా
మమ్ము జపించుచున్నది శ్రమంపడుచున్నది వేగరాఁగదే. ౨

చ. కుడువదు, భూషణంబులను గోరదు, పెన్నెరి వేణియందుఁ బూల్
ముడువదు, నెచ్చెలుల్ పిలువ మోముఁద్రిప్పు, నహర్నిశంబుఁదాఁ
బడకను వీడకుండుఁ, బలుభంగుల నీకయి చింతనొంది యె
క్కుడు కృశియించుచున్న యది కోమలిరాధ ననుగ్రహింపవే. 3

క. వెన్నెలకోర్వదు, పవనుండన్న మహాగ్రహమునొందు, నత్యాతురతన్
నిన్నుఁగన నున్నదిఁకనా విన్నప మాలించి వేగ వేంచేయఁగదే. ౪

సీ. ఎచటఁ దళుక్కన్న నేతెంచె శ్రీహరి
యంచు నల్దిశల శోధించి చూచు
నెచట గానమొకింత వింతతా వినిన నీ
మురళీరవంబంచు మురియుచుండు
బాలకుల్ దధిభాండ పరిసరంబున కేగ
యదుకుంజ రుండంచు మదినిఁ దలఁచుఁ
బరిహాస మునకు నీవరుదెంచితి వటన్నఁ
బరికించి కానక నురిమి చూచు

గీ. నిట్లు భవదీయ సందర్శ నేచ్ఛఁగలిగి
దుర్భరమనోభవార్తి దోదూయమాన
యగుచు హా కృష్ణ కృష్ణా యటంచు నన్నుఁ
బనిచె, జాగైన నేమౌనో? పద్మనయన. ౫



౧౨౨

# విరహిణి

శ్రీ అన్నగారి వేంకటకృష్ణారాయుఁడు గారు

---

సీ. సంతోషకరపుష్ప సముదయోద్యానవ
నంబులనంగకా నలనిదోచె
కనుచిత్ర చిత్రప్రాకారసౌధాగ్రమం
దిరమును దఃపోయ దిగులుడగెతె
మణిమయ సకల భూషణవితానము లెల్లఁ
గనినఁ బన్నగముల గతివహించె
వినుటకు సొంపుఁగా వింపువీణాదిగా
నధ్వనుల్ సహ్య శూన్యంబులయ్యె
గీ పతిని విడుచుట దేహమే వసదొలంగె
నేమిదోచదు నింకనేనేమిసేతు
వేగనీవేగి శ్రీబీబి నగరవాసుఁ
గృష్ణమూర్తిని దేగదే కీరవాణి. ౧

సీ తెలుపవే నావెతల్ సలుపవే బహునుతుల్
కలుపవే యనుమతుల్ కాంతునకును
మలుపవే సతిజాడఁ గొలుపవే మరులీడ
నిలుపవే ననుగూడ నిజముతోడ
వద్దనే యానుద్ది కద్దనే యతిరద్ది
పద్దనే యీబుద్ధి పదుగురింతు
రమ్మనే తగనేలు కొమ్మనే రతిమేలు
లిమ్మనే తననమ్మ కొమ్మననవె
గీ. కొమ్మనా మెద మదనుండు గ్రుమ్మెననవె
నన్ను మరుబారికోపింప కన్నదనవె
వేగనీవేగి శ్రీబీబి నగరవాసు
గృష్ణమూర్తిని దేగదే కీరవాణి. ౨

---

౧౨౩

# విరహిణీ విలాసము

శ్రీ చిదిరెమఠము వీరయ్యగారు



చ. కలకల మాధురీ ధ్వనులు గ్రమ్మ పికంబులుఁ గూయశారికల్
చిలుకలుఁబల్కఁ భృంగములు చేరువఝుమ్మని మ్రోయపుష్పము
ల్వాఁగొని గంధవాహుఁడు జవంబున డాయగఁ దాళఁజాలనా
వలన వశంబె మౌక్తికము వారక తప్తము సేయనిల్చునే. ౧

సీ. భువనంబులెల్ల నద్భుత కృపారసముచేఁ
బోషించు శౌరికిఁ బుత్రుఁడవయి
మేలొర్చి సురలకు మెసవ నన్నంబైన
యంబుజాక్షిని మే నల్లుఁడవయి
సకల జనంబుల సంపత్కరులఁ జే
సెడురమాదేవికిఁ గొడుకు వగుచు
ననయంబు ధర్మ వర్తనలచేఁ బెంపొందు
సుమతియౌ రతిమనో రమణుఁడవయి

గీ. మఱియుఁ గరుణాగుణంబిసు మంతలేక
రసిక మతిని పరోప కారంబుమాని
సంచరించుట మేర దోషప్రచార
మంచిదికలేర మార రమాకుమార. ౨

పం. మురారి సత్కుమారనీవు మూఢవృత్తి నిత్తరి
స్మరాబరిఁ గడంగిపొంగి బాధసేయఁ బూనియుగ్ర
శరాన నీ కఠారినూరి సారెసారె నాదు వే
రురాన నేయమేర గాదురోరి పోర మారుఁడా. ౩



౧౨౪

# హృదయ నిర్వేదము

శ్రీ పెండ్యాల హనుమచ్ఛర్మ గారు



గీ. దుర్భర వియోగ వారిధిఁ ద్రోసిపోయి
వత్సరము లెన్నొగడచెను వన్నెకాడ
తిరిగి యీజన్మమున నీదు దరిసెనంబు
గలుగ నేసేయఁ గాంతును గౌతుకంబు. ౧

నీదు ప్రేమాతిశయమును నిష్కళంక
వర్తనము గాంచి యానాడు ప్రాణనాథ
నీవు సర్వస్వమని నమ్మి నెమ్మితోడఁ
బొంగితిని గాని నేను నన్బోలినట్టి
హీనభాగ్యలు లేరని యేడ్చుచుంటి.
యడవి గాచినవెన్నెల యయ్యెఁ బ్రతుకు
క్షణము బాయక విహరించు చక్రవాక
దంపతుల సానురాగ విధంబు లరసి
మాటిమాటికి వచ్చి సంభ్రమ మొసంగఁ
బుష్పరసమాను భృంగము పోల్కిఁ జూచి
యింక సంతాపమెటుల సహింతునోయి.
అశిథిల ప్రేమ పాశము నట్లు ద్రెంపి
వైచితివి సఫలమాయె నీ వాంఛితంబు
నాదు "మానస నిర్వేద నంబు" కాన్క
గాఁగ నర్పించు చుంటిని గడకు నీకు.



## ౧౨౫
# రాధవలవంత
శ్రీ నల్లాన్ చక్రవర్తి ప్రతాపం రాఘవాచార్యులు గారు

గీ. గహన సుమమాలికలు నీదు కంఠమందు
మెరయ మురళిని కరమున మీటిపాడు
నీదు సుందర రూపంబు నేనుమరలఁ
జూచుటెన్నాళ్లకో చిత్తచోరకృష్ణ. ౧

గీ. మురళి యెంతటి మంచి నోములను నోచి
నీదు యధరసుధారసాస్వాది యయ్యె
నట్టి నోముల నోచంగ నైతిగాన
నట్టి నాకెట్లు సంప్రాప్త మౌదువీవు. ౨

గీ. మంత్రముల నేర్చుకొననైతి మందుపెట్టు
టెఱుఁగనైతిని తంత్రంబు లెవ్విలేవు
కపటవలపంత కంటెను గానరాదు
యిట్టి నను బాధపెట్టుట యేఁకృష్ణ. ౩

గీ. వంశమా యెవ్రతంబుల ప్రాపుఁజేసి
యెట్టి పుణ్యంబు జేసి నీ వీనుఁకుందు
దయకు పాత్రతవైతి వద్దానిఁదెలిపి
మాన్పవేనావగపుఁ బ్రతిమాలుకొందు. ౪

## ౧౨౬
# తరుణీ
శ్రీ ముదిగొండ బ్రహ్మయ్యలింగ శాస్త్రిగారు

శ్లో. కటకధ్వనిమోహితప్రజా
కటివిన్యస్తసుహస్తపల్లవా
కరుణామలలోచనాంచలై
స్తరుణీవీక్షతి సత్వరావిటం.

౧౨౭

# కంజాక్షి

శ్రీ మేల్నాటి రంగయ్యగారు



మ. కనదబ్జాకరతుంగ భంగములఁ దక్కంజాక్షి హర్షంబునం
గనఁగానప్పుడు బెస్తవాఁడరిగి తద్గంభీరతోయంబున
న్ఘనమత్స్యద్వయముం గనుంగొని వలంగాంక్షించివేవేసి క్ర
క్కునఁదాలాగుకొనన్వృథావృథయగుంగాకెందుకో మీనము
ల్తనజాలంబునఁజిక్కవంచు మదిలోఁదర్కించు నశ్రాంతమున్ ౧

చ. అరయఁగనన్నుమిన్న మొగమందము రాజిత సోమభాన మా
హారివిభవంబు మధ్యమము హస్తము లాకమలేజరూపమా
గురుకుచ యుగ్మముం బ్రబలగోత్ర పరత్వములోచనద్వయం
బరుమగఁజూడఁగా ననిమిషాధికలక్షణ మారుకాశియా
వరకటి కాంచి కాయుతము వర్ణనసేయ విచిత్రమిమ్మహిన్. ౨

మ. ఘనచాంపేయసునాస చంద్రముఖి తాఁ గాంక్షించి కాసారతీ
రనివాసంబొనరించి భృంగతతుల న్రాజీవబృందంబులం
గనిభంగంబులఁజూడఁ దేంట్లుసతియొం గంజంబులున్వాడె న
ల్లనికల్వల్వికసించెనా పగలిదేలాచిత్రమూహింపఁగన్. ౩

శా. పంకేజేక్షణ మోముగాంచి శశితాఁ బల్మాఱు కందె న్నను
ల్జింకల్చూచి తృణంబు నోటఁగఱచె న్సింగంబుకానంగన
న్బింకంబేగి వనింజరించె ఫణియున్వేణి న్నిరీక్షించి స
శ్శంకంబుట్టమదూఱె బాసవినుచున్గీరంబు చెట్టెక్కెనా. ౪



౧౨౫

# వ్యామోహము

శ్రీ వెల్లాల సదాశివశాస్త్రి గారు



కిమియం కనకస్య పుత్రికా
కిముసౌవా మదనస్య చాతురీ
అథవాకిమియం తటిల్లతా
నృపపార్శ్వేత్ర సచేతనావసంతీ. ౧

నతాంగీనైవేయం నహిచపునరక్షిద్వయమియం
నవానూనం రోమావళిరపిపరంతు త్రిజగతాం
జయాయాధిజ్యం తన్మదనధనురిందీవరమిదం
తదీయం సన్నద్ధం వికసదరవిందాస్త్రమపిచ ౨

నిజవర్ణవైపరీత్యన్నిత రామభజత్తులామి యాన్నళినం
నయనేనతాదృశేన ప్రయాతువా పంకజంకథంసామ్యం ౩

అథశ్శీర్షంకృత్వా సదవజమా కంఠముదఘా
నిమజ్యాత్యుగ్రాణి ప్రచరతు తపాంసి ప్రతిదినం
తథాప్యేతద్భూయాజ్ఞన వదనమేవక్వవదనం
తన్వైతత్కుత్రేదం జలజమథవాశాబలవతీ. ౪

వక్త్రింథాత్మపదం ద్విజైరపివృతం నేత్రేశ్రుతీనాంపరం
పారేసంయమినః పరంసుమనసావాసాశ్చకేశాఇమే
ముక్తానాం పురవైరిణశ్చపదవీ పీనౌకుచౌ మధ్యమం
విష్ణోరేవపదం విభో కథమసౌ జాతాపునః కోపనా. ౫



౧౨౯

# ఆశాభంగము

శ్రీ చిదిరె రాజేశ్వరరావు గారు

---

గీ. ఆశకును మేర యుండదు లేశ మైన
నవిద సౌందర్య సామ్రాజ్య మొదవు ననుచుఁ
దెరపి లేకుండ ముద్దుల మురియు చుంటి
మేర కలిగించితివి భంగ మిపుడు చేసి
నా మనోరథ మిట్లు నా నావిధాలఁ
బాడు సేయఁగఁదలఁచిన ఫలమ దేమొ

*　　*　　*

వాసనలఁజల్లు నుద్యాన వనము లందు
నవనవ పరిమళము లొల్కు పువ్వులు లేవా
యొకఁడు చూచినపువ్వు నింకొకఁడు వెదకి
కోయఁదలఁచు నిదేమి యన్యాయ మొక్కొ
యిదియె సృష్టిరహస్యమో వెదకియొక్క
విరినిఁగానమి యాశకు విలువలేదొ
యొకఁడు ప్రేమించు నది తన కొదవదేని
యప్పుడే మూల్యమింతని చెప్పఁగలఁడు

*　　*　　*

నీదు మోహనమూర్తి నో నీరజాక్షి
హృదయ ఫలకంబు పైవ్రాసె సదయుఁడెవఁడొ
చిత్రకారుఁడు చిత్ర విచిత్రమైన
రంగులను ప్రేమరసమునఁ బొంగఁజేసి
మాపఁదలఁచిన మాత్రాన మాసిపోవ
దెట్టిరంగులో ప్రతిబింబముట్టిపడును
దలఁచినప్పుడు నామనో దర్పణమున.

---

## ౧౩౦
# మదన
శ్రీ అమరవాది వేంకటనృసింహాచార్యులు గారు

మలయ పవనయుక్తం మాధవీ కుంజసక్తం
మిధున జనవిలాసం మీనకేతోర్నివాసం
సురభిసుమ విభక్తం సుందరాంగోపభుక్తం
వనమిద మతిభాసం వల్లరీభిర్వికాసం.
ధనురతి మృదు పుష్పం ధీరహృద్భేద బాణం
పటు మధుకరపంక్తి జ్యాముహు శ్శోకకారీ
సుమశర ఇతి సంజ్ఞా ధీరవీరప్రతిజ్ఞా
మదన తవ సమస్తం మానినాం మానవిఘ్నం.



## ౧౩౧
# వియోగము
శ్రీ పటూరి సత్యనారాయణ రావుగారు

మ. అమితోల్లాస పరీత మోదమున బాల్యావస్థలం బుచ్చు కా
లమునం దప్పడెరుంగవేని తమినన్ లాలించి పాలించు నీ
సుమనస్సంపద యీ వియోగ జలధిన్ సూచింపవే నావగా
గమకింతున్ దరహాస చంద్రికల వేడ్కన్నూర్తు నశ్రాంతమున్
ఉ. పిన్నటి నాటి స్నేహమది ప్రేయసి నేటికె దూరమయ్యె నా
కన్నులు రాల్చె వేడికణికల్ తలపోయ వినూత్న యవ్వ నా
భ్యున్నత రత్నమాలిక నభోంతర కానన సీమలందు నే
మున్నది నిన్నుఁ గాంచు దిన మున్నది యిన్నిదినాల సౌఖ్యమున్.



౧౩౨

## విరహము

శ్రీ మాటేటి గోపాల రావు గారు

ఉ. తోఁకముఁగాఁగ మన్మథుఁడు తూపులు నాయెద నాటనేసె నే
నారక యున్న తాపమది యుజ్వల మందెను పల్కరించినన్
జారిణిరీతిఁ గాదు పలుచాయలఁ బల్చదనంబు లింక నే
యూరట యన్ని సెల్లునని యుండెఁ వియోగ విహార సంపదన్ ౧

శా. స్వాంతంబందు ననేక భంగుల తదిచ్ఛాపారతంత్ర్యంబునన్
భ్రాంతింజెందియుఁ జిత్త విభ్రమకళా పారీణతం జిక్కి బల్
కాంతింబైన తదాకృతిం దవిలి వైకాసంబుఁబోఁ బెట్టి యీ
కాంతుం జూచుచునుండె మన్మథ వశీకారాత్మయై వ్రేల్మిడిన్. ౨

---

౧౩౩

## సుందరి

శ్రీ మునిపల్లె పట్టాభిరామరావు గారు

గీ. మృదుల పరిమళ కుసుమ సమ్మిళితమగుచు
లతలచేఁ జుట్టుపట్టమై యితర దుర్ని
రీక్ష్యమై దంపతి రహస్య సాక్ష్యమగుచుఁ
బొదలుఁ బొదరిండ్లుఁ జూడుమా పూవుఁబోఁడి. ౧

చ. పొడిఁగొనె స్వేద బిందువులు మోమున వేనలి బల్పిసుందుపైఁ
జెదరి నటింపఁగాఁ దొడఁగె శీతల వాతము లల్లనల్లనన్
గదురగ వట్టివేర్విసన కఱ్ఱను గైకొని వీతునా శ్రమం
బుఁ దొలఁగఁ బూలుచుట్టి తుఱుముం గరముం గయిసేతునా చెలీ

చ. వనలతలే సువాసినులు భావభవుం డె పురోహితుండళి
స్వనములె మంత్రముల్ ప్రసవ పల్లవముల్ తలఁబ్రాలు కోకిల
ధ్వనులె సుగీతముల్ హృదయ తాపభవాగ్నియె హోమవహ్ని య
య్యొ నిచట మత్సవంబున కిఁకేమి కొఱంత వచింపు సుందరీ. ౩

---

## ౧౩౪
# నెచ్చెలీ!

శ్రీ వీరపల్లి నృసింహాచార్యులు గారు

చ. బడలికచేరతాంతమునఁ బానుపుడిగ్గుచు జారుపయ్యెదన్
సడలిననీవినిన్ గురులఁ జక్కనొనర్చుచు మెల్లమెల్లఁగా
నడుగిడఁ బాదముల్ వెణఁకి నంతన కొంగుదొలంగనిల్వఁగన్
నడుమసియాడ నీవివిడ నవ్వుచురివ్వున వెన్కఁబోవఁగ్రో
మ్ముడివిడి శ్రోణిభారమును మూయఁగ హాయిజనించె నెచ్చెలీ.



## ౧౩౫
# శృంగారమంజరీ

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారు

భజతాంహృదయాంభోజభాగధేయముపాస్మహే
యజతామధిదైవంయద్వ్రజమృగీదృశామ్ ౧
అంకాయమానం మృగనాభిపంకం పంకేరుహాక్షీ వదనేనిధాయ
సభృంగపంకేజమివాజయత్స్వముఖస్య పంకాజ్జనిమత్త్వహానాత్ ౨
స్మరదీపదీప్తదృష్టింఘనాంధకారేఽపిప్రియమభిసరంతీం
ఝటితిప్రాదురభూవన్సఖ్యాదివచంచలాః పరితః. ౩
ఖిద్యతిసాపథియాంతీ కోమలచరణానితంబభారేణ
ఖిద్యంతిహాంత దృష్ట్వాపరితస్త్రపావిభ్రమంతరుణాః ౪
అరుణమపివిద్రుమమణింమృదులతరంచాపికిసలయంబాలా
అధరీకరోతినితరామధరస్యాస్యమధురిమాతిశయాత్. ౫
కమలాసనశుద్ధాంత భాగధేయ ముపాసినాం
కళాకలితవైదుష్యదాయి వస్తు నమామ్యహం. ౬



## ౧౩౬

# కలవరింపు

శ్రీ గండూరు వేంకటశర్మగారు



చ. తళతళలాడు నెమ్మొగము తామరపై వసనంబువైచి వి
చ్చలవిడినేగు నొక్క మృగశాబవిలోచనఁజూచి తద్దయున్
సులలిత వాక్చుసత్కృతిని సుందరి యీ నడిరేయి యొంటిగా
గళవళపాటుతోడఁ జనుగార్యము నాకు వచింపవేడెదన్ ౧

చ. వినుము కృపాల నాపలుకు విశ్వవిలోచను డస్తమించుటన్
జననమునొందుటన్గని విచారణసేయరు యొక్కరైన నీ
ఘనతర దుర్భవాంబునిధిఁ గాయమటంచుఁ దలంచి దుష్కృతం
బును సుకృతంబు నీకరణిబోధయొనర్చు మహానుభావునిన్ ౨

ఉ. చక్కనిచుక్కఁబెట్టి నెరచక్కని మాటలనాడి ప్రక్కనన్
మిక్కిలి నాట్యమాడు నలమీనవిలోచన కన్నగేహమున్
గ్రక్కుననిత్తు విప్రునకు గాయకవర్యునకన్న యంగుళం
బెక్కగనీయనట్టి కలుషేతర శూన్యులు సూవెయిద్ధరన్ ౩

చ. నదులనదంబులన్గిరుల నవ్యవనంబుల నష్టదిక్కులన్
ముదమున మోతుఁగాని యొకమూర్ఖశిఖామణి మాయఁజాలనా
పదమిది సూర్యచంద్రులును పశ్చిమభాగమునందుఁ దోచినన్
యుడజము రాయి మొల్చినను యుండదుబో పొరపాటుదీనికిన్ ౪

చ. అనునెడ లోచనద్వయము నప్పుడె విచ్చితనేమి చెప్పుదున్
ననుగని మాటలాడి సతినాకు నగోచరమయ్యె నెంతయున్
ధనమును గోలుపోయి మును దానువెరించెడు రీతులెల్ల నె
మ్మనమునఁగోరునట్టి యొక మానిసిరీతిగ నైతి నత్తరిన్ ౫



## ౧౩౭

# హితోపదేశము

శ్రీవనం సీతారామ శాస్త్రిగారు



శ్లో. కామేసంజనితే తదీయవిషయప్రాప్త్యై ప్రయత్నాదర
స్తత్సిద్ధౌ పరిరక్షణశ్రమభరః క్రోధోదయస్త్వన్యథా
ఏవంభూతిమవర్ధజాతవిషమం సంత్యజ్యకామంసఖే
బ్రహ్మానందఫలాప్తి సాధనమిమాంశాంతిం భజశ్రేయసే ౧

శ్లో. విశ్వాసంనకదాపిమాకురుసఖే కామేతినీచాత్మజే
సత్వామేవహినస్తి నిర్దయమతిః క్రూరస్వభావఃఖలః
నానాపుష్పఫలోపశోభిత తరుస్కంధాంతరాళోత్థిత
స్తత్త్వాదృగ్విపినంహినస్తి నచకిందావానలోఘస్మరః ౨

శ్లో. తాపప్రలాపపరిశోషణకంప్రహేతుం
కామంపరిత్యజమహాహిమివాతిదూరం
యత్సంగృహీతవిషయాబహవోతిహింస్రా
జన్మాంతరేపిస్వగుణాంనపరిత్యజంతి ౩

శ్లో. యదధీనమువైతిమానసం సతుతే నైతిసమున్నతింపరాం
అవశేనతుతేనబాధ్యతే ఖలనావేవమహాబ్ధి నావికః ౪

శ్లో. మదమోహాసమద్ధిశంతమః పరిభూయాత్మవివేకభానునా
భజశాంతిమతఃపరంభవేత్పరమానందలయోనిరామయః ౫



౧౩౮

# మానసబోధ

శ్రీ గొబ్బూరు సంజన్నగారు



మ. వినుమా కామ్యము కష్టదాయకము గోవిందున్బ్రశంసించకన్
ధనమాద్యష్టవిభూతిఁ గోర తరమా ధర్మాతిరిక్తంబుగా
ననుమానింపక నవ్యయున్గనుటకే వత్యంతసద్భక్తినో
మనమా సత్పథమాశ్రయించి మనుమా మాకాంతుఁ జింతింపుమా

మ. నిను నిర్మించిన మేటిసామిఁ గనకన్ నీచప్రసంగావళిన్
గనులార న్దిలకించి రిష్టఫలమున్ గాంక్షించి గారించుటల్
ఘనమా నీకిది చూడ భవ్యతరమా గంభీరమా వైరమా
మనమా సత్పథమాశ్రయించి మనుమా మాకాంతుఁ జింతింపుమా

మ. మనవాడు స్వైరవారటంచనెదు సన్మాన్యుల్ బ్రమోదింతురే
మనవారేమిముదంబుఁ గూర్చెదరు నీ మర్యాదఁ గాపాడఁగన్
మనువారే మరణంబుమాని సతము న్మాంద్యంబుఁ బోనాడిరో
మనమా సత్పథయాశ్రయించి మనుమా మాకాంతుఁ జింతింపుమా

మ. నిను నిందించికనంచు నల్గకుము బల్ నిక్కంబు లాగాధలీ
వను సంధించగ నెంచెదేనియగు నీ కర్థంబు వర్తింపగా
నను వందన్వినుతించి వేడెదను సాహాయ్యంబు నేనెంతయున్
మనమా సత్పథమాశ్రయించి మనుమా మాకాంతుఁ జింతింపుమా

మ. వనజాతత్రయమూర్తిన్ నా నరహరిన్ వర్ధిష్ణు నవ్యామనున్
మునిసూను న్రఘురాముఁ గోపతనయున్ నోమ్మైత్రప్రదున్ బుద్ధునిన్
ఘనకల్మిన్వినుతించి సంచితముల న్ఖండించి కాపాడగన్
మనమా సత్పథమాశ్రయించి మనుమా మాకాంతుఁ జింతింపుమా



# ౧౩౯

# సత్యము

శ్రీ పండిత భావికృష్ణ శాస్త్రిగారు



మ. ధరలో శాశ్వత కీర్తి నొందుటకు పాదానంబు గోవింద స
త్కరుణా పూరము కబ్ధి సర్వవిధ సౌఖ్యప్రాప్తికిన్ గల్ప భూ
తరు వత్యంత విపత్తరంగ మిషవాతఘ్నుధ్యరుగ్రారిసా
గరమున్ దాటఁగ నావయన్నిటికి ముఖ్యత్వంబు సత్యత్వమే. ౧

మ. ధరణీశుం డజసూనుఁ డుగ్రతరయు ద్ధంబందు కైకేయికై
వరదానంబు నొసంగి సత్యమునకై ప్రాణాధికుండైన దా
శరథిన్ గానలకంపి ప్రాణములఁ దాఁ జాలించి సత్కీర్తినిన్.
వరుసన్ నిల్పెను పేరు సత్యమునకున్ వస్తూత్తమంబున్నదే. ౨

మ. హరికై మున్ను పదత్రయావనినిఁ దానర్పింపగా దైత్యరా
డ్గురుఁడే తెంచి హితంబు గాదనిన సంకోచింపకన్ తద్వసుం
ధర గోవిందునకిచ్చి సూనృతమునన్ దైత్యేంద్రుఁడబ్జాక్షుస
త్కరుణాపాత్రుఁడుగాఁడె యన్యములు సత్యత్వంబుకున్ సామ్యమే. ౩

మ. తొలి త్రైశంకుని గాధిపుత్త్రుఁడు మహాదుఃఖాబ్ధిలో ముంప ని
శ్చల సత్యవ్రతుఁడయ్యుదారసుతసంసర్గంబు నుంబాసి మా
లలకై దాస్యముఁ జేసి సత్యమున భూలక్ష్మిన్ ముదిన్ జెందఁడే
భళిరే సత్యముకన్న నన్యముగు సద్వస్తూత్తమంబున్నదే. ౪

మ. తరుణిన్ గేశములందుఁ బట్టి సభలో ధర్షించినన్ గౌరవుల్
ధరణీ భాగము మీకు లేదనియు ఛద్మంబంతగా జేసిన
క్షుద్రమాసత్యముఁ దప్పకే యమతనూజాతుండు దుర్మార్గులం
దరినిర్దున్ని సుఖింపలేదె మఱి సత్యత్వంబుకున్ సామ్యమే. ౫



# ౧౪౦
# విశ్వరూప
శ్రీ ఆర్తి కిష్టయ్య గారు

సీ. పాడుమంత్రాలచే ప్రజలను బాధించఁ
బట్టి పండ్లూడఁగాఁ గొట్టవచ్చుఁ
బాటివంపులఁజేరి పసుల భక్షించెడి
పులినైనఁ గాల్చి యుఁ గెలువ వచ్చు
వసుధ పాలనసేయు వచ్చు మానవులను
దిట్టనాగినవాని మొట్టవచ్చుఁ
బొక్కలోపల నిల్చి నిక్కి జనులఁ గర్చు
సర్పంబు నైనను జంపవచ్చు
గీ. కవివరుల నోటి తిట్టును గడుపరాదు
ధర కళింగాధిపతి ముష్టి కలుగకున్న
సత్య గుణసీమ హితసోమ సార్వభౌమ
వీరగిరి వాస రఘువీర విశ్వరూప. ౧
సీ. ఏ వర్తికుండైన నిల ధర్మపద్ధతిఁ
బాలింపుచుండె నా ప్రభువతండె
సత్యమందున నిల్చి సంసారులను బ్రోచి
పరమేలు మెచ్చిన ప్రభువతండె
పూర్వు లిచ్చిన వృత్తిఁ బోనీక మన్నించి
బాధింపకుండెనా ప్రభువతండె
సంగీత సాహిత్య సకల విద్యలయందు
బ్రాంతుఁడై యుండెనా ప్రభువతండె
గీ. యేమి యెరుఁగక తిని క్రొవ్వి కాముకతను
బరగు నా కొంటె కొడుకెట్లు ప్రభువటయ్య
సత్య గుణ సీమ హితసోమ సార్వభౌమ
వీరగిరి వాస రఘువీర విశ్వరూప. ౨

౧౪౧

# ఆత్మవిచారము

శ్రీ రంగరాజ వెంకటకిషన్ రావు గారు



ఉ. ప్రొద్దున లేచి స్నాన జప పూజలు సంధ్యలు సత్క్రియల్ సదా
నొద్దికఁ జేసి మంత్రముల నోట జపించి స్మరించి మానముల్
పెద్దగఁ దాల్చి మానియని పేరు వహించుట లెల్లకల్ల స
ద్బుద్ధిగ నాత్మరాముగఁని బొందుము ముక్తి పదంబు జీవమా. ౧

ఉ. మక్కువ వేద శాస్త్రముల మర్మము లెల్ల నెరింగి విద్యలన్
పెక్కులు నేర్చి నేర్చి ధర పేరు వహించ ధనాది భోగముల్
నిక్కుచు గాంచి నిత్యమని నెంతువు నీయిహ సౌఖ్యముల్ సదా
చిక్కులు వచ్చు నాత్మఁగని జెందుము ముక్తి పదంబు జీవమా. ౨

చ. జప ముపవాసముల్ గనుచుఁ జేతులఁ దాళముఁ బట్టి మద్దెలన్
దపతపఁ గొట్టి దక్కటికి ద్వైతగాలాడుచు బుర్రమోటుచున్
చపలత రాగ బంధముల జిక్కుచు హా యని యేడ్చు టేమి ఛీ
నిపుణతనాత్మ రాముఁగన నీకగు ముక్తి పదంబు జీవమా. ౩

ఉ. కల్ల ప్రపంచమందుఁ బడి గాంతలు వీడఁగ లేని నిష్ఠలన్
జెల్లఁగఁ జేసి మానమును జెందుచు దండకమండలంబున
త్యుల్లసిఁ బూని తంత్రములు యూహలు యోగపు గారడీ క్రియల్
నేలగనంగ జేసినను నెంతయు సద్గతి నొందబోవు ఛీ
యుల్లమునందు నాత్మఁగని యొందుము ముక్తిపదంబు జీవమా. ౪

ఉ. గుట్టు నెఱుంగలేక మడి గుడ్డలఁ గట్టుచు మేన పట్టెలన్
బెట్టిన నేమి గోచి బిగఁ బెట్టుచుఁ గానల దిర్గి యోగముల్
బట్టుచు మూతి ముక్కు తగఁ బట్టుచు విడ్చుచు వాయువుల్ సదా
గట్టిగ నూది పట్టినను గాంచవు మోక్షముఁ గాన దుర్భ్రమల్
నెట్టుచు నాత్మ రాముఁగని నేర్చవు ముక్తి పదంబు జీవమా. ౫



౧౪౨

# శాంతి

శ్రీ తూము వరదరాజులు గారు.



మ. ధరణీపాలునకున్ ధనాధిపతికిన్ దారిద్ర్య సంతాపికిన్
సరసోల్లాసికి సత్యవాదికిని సత్సంతాన సంశోభికిన్
వరుసన్ గన్పడు నీ మహత్త్వము భళీ వర్ణింపగా శక్తులె
వ్వరు నీ కెద్ది సమానమౌను ధరణీభాగంబునన్ శాంతిరో ౧

అరయన్ బర్వతకందరంబు పురి దివ్యారామమున్ భవ్యమం
దిరమున్ ఘోరవనంబు బంధుర నదీతీరంబు సంసార సా
గరమున్ నాటకశాలలున్ వెదకినన్ గాంచంగలేమోదు నీ
స్థిరవాసంబిది స్పష్ట్యె నెందుఁగలదో తెల్పంగదే శాంతిరో ౨

చిఱునవ్వొప్పఁగ వాఁడి చూడ్కు లలరన్ జేడెల్ మనంబిచ్చినన్
చిఱుతల్ పల్కులఁదేనె లొల్కఁ జివురుంజేసాచి పైప్రాలినన్
సరసీజానన వీణచే మృదుకృతుల్ శ్రావ్యంబుగాఁ బాడినన్
పరమాహ్లాదము కల్గునే యచట నీ ప్రాపుండమిన్ శాంతిరో ౩

రచన ప్రౌఢిమ శ్రావ్యమై లలితమై రాజిల్లు కావ్యంబులన్
వచనశ్రీలు రసాభిరామములుగా వర్తిల్లు నాఖ్యాయికా
ప్రచయంబందుఁ బ్రసన్నజీవకళలన్ భాసిల్లు చిత్రంబులం
దెచటంగానము నిన్ను నీ నిలయమెందింపారునే శాంతిరో. ౪

అతివృద్ధాంగనయైన వంధ్యసుతుఁ దానైకన్న పుట్టంధుఁడే
వెతలేకుండఁగఁ గన్నులంబడసినన్ వేశ్యాంగనాలోలుఁడా
పతియర్ధాంగిని గౌఁగిలించుకొనినన్ భావింపఁగా వీనియు
న్నతి యెట్లున్నదియౌను నీవలరకున్నన్ పేర్మియై శాంతిరో. ౫

## ౧౬౩

# సుబోధ

### శ్రీ పులిజాల గోపాలరావు గారు



సీ. నాగేంద్రపదఘట్టనలకోడి రాయంచ
కొరకుండునె బిసాంకూరములను
అశనిపాతంబుల కడలి సారంగంబు
గ్రోలకుండునె ఘన స్రుతరసంబు
ఫలములు దమ మేనఁ బడునంచుఁ గోయిల
యొల్లకుండునె చూతపల్లవములఁ
జెఱగల్లుననుభీతిఁ జెంది షట్పదము లు
మఱచునే మకరంద మధురిమంబు
గీ. నిరత సత్కీర్తి కాంత సచ్ఛర్గాంకమల
మధురస స్ఫురితానంద మామకీన
బుద్ధి యన్యప్రసాదితో ద్బోధనలకుఁ
గలుషితంబౌట కొప్పునే కన్నతల్లి. ౧

చ. గిరిశిఖరాగ్రమెక్కిఁ దలక్రిందుగ సాహసమేర్చి దూఁకినన్
శరనిధి మున్గినన్ మదగజంబుల కోరలఁ బట్టిలాగినన్
గరళము మ్రింగినన్ ఫణిఫణంబులఁ బట్టిన వహ్నిఁ జొచ్చినన్
మరణము రాదకాలమున మర్త్యులకెప్పుడు మానవేశ్వరా. ౨

గీ. పిడికెడన్నంబు నెవరైనఁ బెట్టిరేని
మారుమాటాడక విధేయుఁడై రయమున
నెట్టియాజ్ఞలనైనఁ జేఁబట్టవలయు
సేవకులకిది విధిగాదె క్షితితలమున. ౩



౧౪౪

# కృతజ్ఞతాతత్త్వము

శ్రీ అయితరాజు కొండల్ రావు గారు



క. వెసనీని కోర్కు లెన్నియొ
పసజెడి వైళంబె యహిత పరిణతినొందున్
పొసఁగదు మామతిగావున
నొసఁగని వరములకు సైత మొగివందనముల్. ౧

క. దొసఁగులు మూడెడివరములె
యొసఁగవనుటజూడవాని నొసఁగమియే,మే
లొసఁగుటగావునతండ్రీ
యొసఁగని వరములకు సైత మొగివందనముల్. ౨

క. పసియిది పసిగాదిదియని
పసిబాలురఁ బోలుమాకుఁ బాడియెచూపన్
గొసదీర్పరినీవగుటను
నొసగని వరములకు సైత మొగివందనముల్. 3

క. పసగ్రదికరణవిపాకం
బెసఁగని కోరికలనీయ నెగ్గగు దాన్
కసిగాయ వగరెగాదే
యొసఁగని వరములకు సైత మొగివందనముల్. ౪

క. కసిగొని హిరణ్యకశిపుడు
ఉసిగొని ఘంటాసురుండు నొడిసిరివరముల్
మసఁగె నెశుభములు!గావున
నొసఁగని వరములకు సైత మొగివందనముల్. ౫



## ౧౪౪
# సామెత
శ్రీ అమరచింత పద్మనాభయ్య గారు



ఉ. రంగదరాతిభంగ కరరాజితచారుకురంగ నిర్జితా
నంగ కృపాంతరంగ భువనత్రయపూజిత రామలింగస
త్సంగశుభస్ఫురాంగ పరతత్త్వసమంచిత మానిపుంగవో
త్తుంగమనస్సరోరుహావధూవ్రతచంద్ర గిరీశ శంకరా. ౧

ఉ. కోతికి పుండు గర్కటికకుంతితగర్భము రంభకున్ఫల
వ్రాతము హస్తికి న్నిదుర బాలునకు న్నెలసందిరోగికిన్
దూతనిదర్శనంబు నవతోయజగంధికిసహ్నిపాతము
న్బ్రతుకుశూలరోగమును పోకకెచంద్రగిరీశశంకరా. ౨

ఉ. దాతలటన్న పూర్వబుణదాతలుదాతలుగారుయాచక
వ్రాతకళాసమర్థత కృపామతియైకనిగౌరవించిన
న్దాతయతండెధాత్రికి విధాతయతండెధనప్రమత్తులా
ప్రేతలుదాతలౌదురె ధరిత్రినిచంద్రగిరీశశంకరా. ౩

ఉ. వేటసిఫాయిడేగ రణవీరునిచెంగటిపెద్దకత్తిమం
దేటుతుపాకిదెబ్బ మొలకేసినబాకు ఫిరంగిగుండుభి
న్నోటుతెమంచరాపుశమనోగ్రపుచూపుభవత్సుకీర్తనల్
గాటపుదుర్విపన్మదమ్ము గాళికిచంద్రగిరీశశంకరా. ౪

ఉ. పొందుగధర్మశాస్త్రముల పోకడమూర్ఖులకెంతజెప్పిన
న్విందురె యూరబందులకు వేడుకమీరగ భక్ష్యభోజ్యము
ల్మందరబెట్టినం దినునె మోదముజెందునె చెందబోదురా
కేందుయశోవిశాల జగదీశ్వర చంద్రగిరీశశంకరా. ౫



౧౪౬

# హితము

శ్రీ బొమ్మకంటి యోగానంద రావు గారు

---

చ. అరయఁగ నెన్నిమార్గముల యత్నమొనర్చినఁ గార్యసిద్ధి చే
కురుట హుళక్కి కార్యములు కొన్ని ప్రయత్నము చేయకుండినన్
దొరకొను సత్ఫలంబు దరితో నదిగావున సర్వకార్యముల్
ధర సఫలంబుఁ గాంచుటకు దైవము కారణమంచు నెంచుఁడీ. ౧

మ. అరరే పొట్టకుఁ బట్టెడన్నమునకై యత్యంత కష్టంబులన్
ధరణిన్ బొందుచు నీచమానవుల చెంతన్ దాస్యమున్ సల్పుచున్
నరులై సత్కృతులిచ్చుచున్ బహు దురంతంబైన కార్యంబులన్
జరియించున్నరుఁడాత్మయందెపుడు నెంచన్ బోడు మోక్షంబొగిన్.

చ. నడవడి మంచిచేయుటకునై కడుకష్టము దోఁచుచుండు దు
ర్నడవడి లభ్యమౌట సుకరంబగు నొక్కశిలన్ నగంబుపైఁ
గడపుట భూమినుండి కడు కష్టముతోఁచునుగాని యాశిలన్
దడయక కొండనుండి వడిధారుణిపైఁ బడద్రోయ చుల్కనౌ. ౩

చ. ఒరులకుఁ గష్టమబ్బినవు డుర్విఁ దయాళువు లార్యులైన వా
రరయఁగ స్వీయ కష్టముగ నాత్మదలంచి విచారమొందు చుం
దురు సకలేంద్రియంబులకుఁ దోఁచెడు కష్టములెల్లఁగాంచి తా
మరుమగ దుఃఖమొందు నయనాంబురుహద్వయమెన్ని భంగులన్

చ. తరుగని ద్రవ్యమున్నదని తద్దయు గర్వమునొంది క్రందు మీ
రెఱుఁగక సంచరింపకుఁ డహీనమతిన్ ధనులార చూడుఁడీ
యురుతర హేమ భూధరము నొక్కని దావలచేత నక్కటా
ఎఱుఁగమె వంగిపోవుటయు నెంచఁ జెప్పను యొప్పిదంబుగన్. ౫

## ౧౪౭

# దుస్సాంగత్యము

శ్రీ చిదిరె లక్ష్మణ శాస్త్రిగారు



ఉ. దండవిఘట్టితంబొ పదతాడితమైననుగాకభోగి యు
ద్దండరయంబునన్ గరువఁ దాఁజనుదెంచు నదంతెకాని దు
ష్టుండహికంటె ఘాతుకుఁ డసూయతవైరముఁ బూనుగాన నీ
వండకుఁ జేరఁబోకు కడు హానిఘటించును నీకు మిత్రమా. ౧

గీ. కఠినరావంబహేతుక కలహబుద్ధి
నిజగృహాగతవారణ నీచగుణము
నిరతి సంతోషహీనమై నెగడునట్టి
శ్వాన ఖలయుగ్మ భేదంబు గానలేము. ౨

సీ. కన జగతినిధని గర్వమొందఁడెవండు
విషయి యాపదలేక వెలసెనెవఁడు
వనితలఁగని కామవశుఁడు గాఁ డెవ్వండు
భువినర్థి పూజ్యతఁ బొందె నెవఁడు
దండధరుని బారిఁ దప్పిపోవు నెవండు
నృపులకిష్టుండయి నెగడెనెవఁడు
నవని నిర్ధనుఁగని యాదరించు నెవండు
పొలఁతిబుద్ధులమేలు పొందెనెవఁడు

గీ. కుజనవాగురనిపతిత కోవిదుండు
పుడమినెచ్చోట నిమ్మలఁ గుమువఁ డెవఁడు
కుతలమున దుష్టసంగతి కూడదన్న
నయము నా నుడి సత్యంబు నమ్ము మన్న. ౩



౧౪౫

# కామగ్రహావేశము

శ్రీ నరహరి గోపాలాచార్యులు గారు

---

మ. స్థిర సమ్మోహన యంత్రముంగనితి నేధీరుల్నునుంచాక నం
బర దేశంబు గమింతురంచు మదిలో భావింతువా పూర్వ మి
ద్ధర సర్వజ్ఞునిచేత భంగపడి ప్రేతంబైతి వింకైన భీ
కరమా విష్ణుసుదర్శనంబెరుఁగు మా కామగ్రహావేశమా! ౧

శా. బాల్యంబందు నెరుంగనైతిని భవద్వక్త్రంబెవో నైన వా
త్సల్యంబేర్పడ యౌవనాగమమునన్ సంతోషినై కోర్కె సా
ఫల్యంబౌనని నీదుసఖ్యమటు సంభావించితింగాని సా
కల్యంబేర్పడదయ్యె కాలమహిమన్ గామగ్రహావేశమా! ౨

మ. చెడుగా గర్వముఁబూని సాధుజనులన్ జీకాకు గావింతు మ్రు
క్కుడివై యిక్కడ శత్రు మర్దన సమగ్రక్రోధులౌ వారి ముం
దడుగే సాగదు నీకునాగినటులైనం బాదరక్షాప్తిఁ బో
కడలంబెట్టుదు రంత గర్వ మడఁగన్ గామగ్రహావేశమా! ౩

శా. జంగంబుం బరికించి శ్వాన మతిరోషంబొప్ప బౌబౌ యటం
చుం గర్జించిననేమి యాతనికి సంచుల్నిండవా? పౌరు లె
ల్లం గారాబముతోడ భిక్షమిడరా? లాభంబునుం గాంచఁడా!
కంగారుంబడబోకు శ్వానము బలెన్ గామగ్రహావేశమా. ౪

శా. ఎన్నాళ్లిట్టులు వాగినన్ వృథయె లక్ష్మీనాథుఁ గీర్తించుటా?
చెన్నుంగాంచెడి రామమూర్తి కథయా శ్రీకృష్ణు చారిత్రమా
చిన్నంబుచ్చుటె కాని స్వాంతము వృథా చింతా భరంబెందు కిం
కన్నా జోలికి రాక శాంతి గనుమా కామగ్రహావేశమా! ౫

---

## ౧౪౯

# వేశ్యాగర్హణము

శ్రీ తిరుమల బుక్కపట్టణం రంగాచార్యులు గారు

---

సీ. గవ్వకై నను గాని గతిలేకయుండిన
పండుగ దినములు పరిఢవిల్ల
అంగటింటికిఁబోయి రంగుగా బొంకించి
దీనతతో నైన దినుసు తెచ్చి
పంచభక్ష్యంబులు పరమాన్నములు చేసి
నీకుఁజూపింపక నీరజాక్ష
నాయకసానికి నైవేద్యమిచ్చిన
తలిదండ్రులును స్వర్గతలము జెంది
గీ. నటుల హర్షించి యవనిలో విటజనంబు
తుదకు దారిద్ర్య రోగజవ్యధలు చెంది
బ్రతికి చచ్చియు నరకాళి భాక్కుగాడె
శీత కాహాస కుముమతి శ్రీనివాస. ౧

సీ. వేశ్యతో మాటలే వేదపాఠంబులు
వేశ్యయే దైవంబు వేరెలేదు
వేశ్యవేశ్య యటన్న వివిధ పాప హారంబు
వేశ్య సంపర్కమే వృద్ధికరము
వేశ్యల పాటలే వీనులకందంబు
వేశ్యలఁ జూచుటే వేడ్కమాకు
వేశ్యలుండినచోట వృషభవాహనుడుండు
వేశ్యలుండినచోట విష్ణువుండు
గీ. ననుచు మూర్ఖుఁడు నరకంబు లందుఁబడిన
సమయములయందు నాయకసాని జఘన
కుచయుగంబులుఁ గాచునే కోమలాంగ
శీతకరహాస కురుచుతి శ్రీనివాస. ౨

---

## ౧౫౦

# శారదా!

శ్రీ మోటుపల్లి కృష్ణమాచార్యులు గారు



చ. జనని విషంబుఁ బెట్టఁదలఁచెన్ జనకుండు కుమారునమ్మఁగా
మనమున నిశ్చయించినను మాన్యుఁడు గానటువంటిరాజు స
జ్జనధనముల్ గొనంగ సతి సంపదలన్ హరియింపనెంచినన్
ధనికుఁడు లోభియైన వలదంచను చెప్పఁగలారె శారదా. ౧

ఉ. నవ్వకు సత్సభాస్థలిని నవ్వకు నీదగు తల్లిదండ్రితో
నవ్వకు పెద్దలన్ గనిన నవ్వకు నీయజమానుతో డుతన్
నవ్వకు లేనివానిఁగని నవ్వకు మన్య సతీలలామతో
నవ్విన చేటుమూడునని న్యాయవిదుండన వింటి శారదా ౨

ఉ. అక్కరగల్గు కాలమున నాపదవేళలఁ బిల్వకుండ నే
చిక్కి దరిద్రతాదశను చింతిలుచుండినవాని నార్తితోఁ
జక్కఁగ స్వార్థరీతిగ విచారణచేసి మెలంగువాఁడె పో
నిక్కపు బంధువంచు జననీ సుజనుల్ వచియింత్రు శారదా ౩

చ. విషము విషంబుగాదకట విప్రులసొమ్ము విషంబు సుమ్మి యా
విషము మదంబుచే ననుభవించినవానినె సంహరించు నీ
విషమది పుత్రపౌత్ర సుపవిత్ర కులంబడుగంటఁ జేయు దు
ర్విషమని నమ్మి భూసురుల విత్తమునంటఁగ రాదు శారదా. ౪

ఉ. బొంకనివాఁడెయుత్తముఁడు పుణ్యుఁడు శత్రువుతోడఁ జివ్వకున్
జంకక నిల్చువాఁడె బలశాలియు నర్థికరంబు సాచఁగా
గొంకనివాఁడె దాత నిను కూర్మి భజించి తరించువాఁడె యే
వంకయు లేనివాఁడనుచుఁ బల్కిరి కోవిదులెల్ల శారదా. ౫



౧౫౧

## హితబోధ

శ్రీ ఆత్మకూరు అంజనిదాసు గారు

గీ. వలదురా కల్లు సార నీ తెలివిఁజెఱచు
నూడఁబైబట్ట పైత్తెక్కలాడఁజేయు
సిగ్గువిడఁగొట్టుఁ బట్టించు సిగలుసిగలు
సకలపాపంబులకుసిల్లు సారకల్లు. ౧

గీ. కల్లు భంగు సారాయిచే నిల్లుకల్లఁ
గా వికారులై చెడెడి మూర్ఖత్వమేల
నీచ దుర్వ్యసనంబుల న్వీడి సకల
భూతదయఁగల్గి వర్తింప నీతియగును. ౨

గీ. చాలుచాలు వాదన కురులీలఁ దెలియ
కేల వాగెదు ధనమద మేలఁజూప
తను బలములకు గర్వింపఁ దగదుసాధు
జనుల దూషింపఁబోకు నాశనముగల్గు. ౩



౧౫౨

## చిత్రము

శ్రీ వైద్యం రాజారామ్ గారు

మ. అవధూతోత్తములైన జ్ఞాననిధి యోగాభ్యాసులైనన్సదా
సువివేకుల్ మునిముఖ్యులైనను ముముక్షుల్ భక్తివైరాగ్య భా
గవత శ్రేష్ఠులునైన వైష్ణవులు నిష్కాముల్ జటాధారులై
జవరాండ్రంగని కాములైరి యకటా చర్చింపఁగాఁ జిత్రముల్. ౧

౧౫౩

## నమ్మరాదు

శ్రీ కందాళ లక్ష్మణాచార్యులు గారు

చ. వనితల నమ్మరాదు చెలువంబగు పల్కులఁ బల్కి యూరకే
మనముఁ జలింపఁజేసి దమమర్మముఁ జెప్పక మాయఁబుత్తురో
దనుజవరేణ్య నామనవిఁ దప్పకఁ జిత్తమునందుఁ జేర్చి కా
దనకను దీనిఁబంపు మహాదావద చేకురు నిక్క మియ్యెడన్. ౧

౧౫౪

## విచారణా

శ్రీ బి. కృష్ణదేశికాచార్యులు గారు

శ్లో. శ్రీస్త్రాద్యష్టాకమత్యుజ్వలనిజకరుణాలోకమాత్రైకపాత్రం
యంకంచిన్మర్త్యమాత్రంకలయతిపురుహూతోపమైశ్వర్యధుర్యం
యన్నిత్యావాసహేతోరురసిమురరిపోఃకౌస్తుభప్రస్తరోపి
ప్రఖ్యాతాంమణ్యభిఖ్యాంకలయతిమహతాంసన్నిధిఃకింనధత్తే ౧
లోకేసంతిమహాన్తోలౌకికవిద్యాప్రచండతరధిషణాః
నహిసన్తిబ్రహ్మవిద్యానిపుణాస్తత్రచసంతివక్తారః ౨
అతిధనవన్తోబహవోనచ తేకుర్వంతిసత్సువినియోగం
తద్వత్కుశాగ్రధిషణాఃప్రయతంతిహినైవబ్రహ్మవిద్యాయాః ౩
యతమానాఅపికేచనస్వయంతుతీర్త్వాంప్రయాంతిముక్తిపథం
లోకోపకరణదక్షాదృశ్యంతేనైవభూరిశస్సంతః. ౪

౧౫౫

# మానసబోధ

శ్రీ రాణీ వేంకటలక్ష్మ్మయమ్మ సర్ దేశాయి గారు



గీ. అంగమా యిది కడు క్షణభంగురంబు
సంపదది యెన్న మిగుల చంచలముఁగాంచఁ
గాలుఁడు సమీపవర్తియై కాచుచుండు
హరినిధ్యానించు మానందమబ్బుమనసా. ౧

గీ. బాహ్య శత్రుజయంబునఁ బ్రాభవంబు
గలుఁగ దెప్పుడు జగతి నిక్కంబుసుమ్మి
యెదుగు కామాదిషడ్వర్గ మదిమిభక్తి
హరిని భజియించు మానంద మబ్బుమనసా ౨

గీ. సారమునులేని సంసార సాగరమున
మునిఁగి పుట్టుచు గిట్టుచు మోహమొంది
దరినిఁగానవు నీబాట నెరుఁగలేవు
హరిని ధ్యానించు మానందమబ్బుమనసా. ౩

గీ. బలవదింద్రియ నిగ్రహపరతఁగల్గి
వీతరాగాత్మయుతమవై వెలసిదంభ
వృత్తిఁబోనాడి విమల సద్వృత్తిచేత
హరిని భజియించు మానందమబ్బుమనసా. ౪



## ౧౫౬

# ఆత్మబోధ

శ్రీ గొట్టుపర్తి సుబ్బారావు గారు



ఉ. దగ్గఱరాదు చుట్టములు దాతయుఁ దల్లియు నాలుబిడ్డలున్
మ్రగ్గెడు నట్టికాలమున నాయకు లోఁబడి యట్టివారికై
యెగ్గను సిగ్గులేక యెటొ హీనధనం బొడఁ గూర్చుచుంద్రుతా
మొగ్గి యనేక దుష్కృతుల గోలి మనుష్యులు వేంకటేశ్వరా. ౧

చ. పరగ పురాకృతానుగతి బ్రాహ్మణులై జనియించి ధర్మమున్
దొఱఁగియుఁ బొట్టకోసమయి దుష్కృతకర్మము లాచరించుచున్
దరమని యైహికంబు విరతిన్ గొనకల్పుల సేవకే త్తైరం
దొరలుచు మూఢచిత్తులయి ద్రోతురు కాలము వేంకటేశ్వరా. ౨

చ. పరసవయో విలాసములు సౌఖ్యమటంచని మోహపాశమున్
దురుమఁగలేక దుర్భ్రమల తోడుత దృశ్యపదార్థమెల్ల సు
స్థిరమని నమ్మి నీ పరమ తేజముఁ గాంచెడి దారిఁ ద్రొక్కఁగా
నరుగరు మానవాధము లయారె ధరాస్థలి వేంకటేశ్వరా. ౩

ఉ. స్నాన జపాగ్ని హోత్రముల సల్పఁగశక్తి యొకింతలేదికే
దానముగాని లేశ మెడ ధర్మము గాని యొనర్పయాత్రలన్
బూని చరింపఁగా మదినిఁ బూననొకప్పుడ శేనియెట్టులీ
దీనునిఁ బ్రోవనెంచెదో యతిప్రమదమ్మున వేంకటేశ్వరా. ౪

చ. తనువు లశాశ్వతంబులని దారసుతాదులు వ్యర్థమంచు నే
మనమున నూహఁ జేసియును మానఁగలే నతిసౌఖ్యలోలతన్
నినునొకసారియైన కడు నిశ్చలతన్ గొలువంగలేనహో
వనరుహనేత్ర నన్నెటులఁ బాలనఁ జేసెదొ వేంకటేశ్వరా. ౫



## ౧౫౭
## కలికాలవాహినీ తరంగములు

శ్రీ కే. రామచంద్రం గారు

ఉ. ముక్కు మొగంబు లేదనుచు మూల మెఱుంగక నల్లజాలకున్
మ్రొక్కెద రంచు భక్తులను మూర్ఖప్రదూషణఁ జేసినంతనే
చిక్కనె యీశ్వరుండు చెయిఁ జిక్కెనె పండిత రాజ్యపీఠముల్
అక్కట నాస్తి వాదమున నంతయు శూన్యమె యైనసత్యమే. ౧
ఉ. కామము వీడలేరు పరకాంతలఁ జూచిన నోర్వలేరు ని
ష్కామముఁ బూనలేరు కనకంబునుఁ జూపినఁ గ్రూరకృత్యముల్
సామము వీడి చేయుదురు సంధ్యలు నింద్యము లంచుఁ బుచ్చి దు
ష్కామముచేత నాలయము గంగను గూల్చెబె వీరి ధర్మముల్ ౨

---

## ౧౫౮
## ధర్మబోధ

శ్రీ పూజారి సోమలింగం గారు

గీ. పరుల కుపకార మొనరించుకొఱకె మనము
తనువుఁ దాల్చితి మని యెంచి ధర్మబుద్ధి
నెప్పుడును మనోవాక్కుల నెట్టిజీవ
రాసులకు హింసఁగల్గింప రాదుసుమ్మ. ౧
గీ. సజ్జనుల యందు లేని దోషములఁబన్ని
నింద పాల్జేయఁ బూనెడి నీచులెల్ల
కాలిపోదు రసూయాగ్ని కీలలందు
ముందుఁగూడ దుర్గతులనే చెందఁగలరు. ౨
గీ. తెగఁబొగడుకొను తనుఁదానె తెలివిలేని
మానవుఁడు గొప్పవారలఁ గానలేఁడు
గర్వమున నెంచుఁ దనవంటి ఘనుఁడు లోక
మందునేఁడును గనరాఁడటంచు మదిని. 3

---

౧౫౬

## జీవమా

శ్రీ రెడ్డిసెట్టి హనుమద్దాసు గారు



చ. పరులను వేఁడఁబోకు శివభక్తులఁ గన్గొని దూరఁబోకు పా
మరులనుఁ జేరఁబోకు ధనమత్తులతోఁ గలహింపఁబోకు భూ
వరులను నమ్మఁబోకు గుణవంతుల సంగతి మానఁబోకు శ్రీ
గురునిపదారవిందములఁ గోరిభజించి తరించుజీవమా. ౧

చ. కలిమియె శాశ్వతంబనుచు గర్వమునెందకు మెల్లకాలమున్
నిలువదు భోగమెప్పటికి నిత్యముకా దిఁక నెంచిచూడ వె
న్నెల జనుచుండు మాడ్కి మదినేరక మాయనుజిక్కి దుర్మతిన్
దలఁపకఁ గీర్తిచేనిలను ధన్యతఁబొందుట మేలు జీవమా. ౨

చ. అమిత ధరాతలంబు కనకాద్రి సమానధనంబుఁ గూర్చియున్
సమహిత గోప్రదానములు సామజదానము లశ్వమేధముల్
క్రమముగ నెన్ని సేసినను కామవిరాముని కీర్తనాళికిన్
సమమవిరావునమ్ముమిది సత్యము నీమదిలోన జీవమా. ౩

చ. నిముసము నొక్కతావునను నిల్వదె యీమనసేమి పాపమో
కమలభవుండు దీనిమతి కల్పనసేయుటకేమి మూలమో
క్రమమునుదప్పి యక్రమముగాఁ జరియించుటకేమి న్యాయమో
భ్రమఁగొని దీనితోఁజెలిమిఁ బట్టుట మోసముసుమ్ము జీవమా. ౪

చ. ఎక్కడి దుర్దినంబొ యిది యేమివిచిత్రము చెప్పరాదిఁకన్
మ్రొక్కదు పెద్దలంగనియు మోదముతోడుతి మోమువంచియున్
జక్కని స్త్రీలఁజూచి యతిసంతసమంది వరించుచుండు రీ
కుక్కగుణంబు మానవులఁగూడుట మోసముసుమ్ము జీవమా. ౫



## ౧౬౦
# సంసార తరణము
శ్రీమతి రూబ్ఖానుపేట రత్నమ్మగారు

క. సకలార్థప్రద నీకృప, యకళంకులకబ్బుఁగాక నవనిన్ దయ దా
ప్రకటించుకొనెడి జనకం, టకులకు దుర్లభము వేంకటాద్రివిహారా.
క. పలుమరు సంసారంబను, వలలోఁబడి పక్షివిధము వాపోవుచుబల్
కలహములుపూని యముబా, టలుపట్టిరి జనులు వేంకటాద్రివిహారా
క. ఎరుకఁగల వారలైగురు, కరుణామృతమందిరేనికర్మముదొలఁగున్
ధరనట్లుఁగాక తుదము, ట్టరు నరులెన్నటికి వేంకటాద్రి విహారా.



## ౧౬౧
# ధూర్జటీ
శ్రీ గుండా ముక్తిలింగం గారు

చ. అరయఁబతివ్రతాంగనల కడ్డములే దొనరింపఁ బూనినన్
హరిహర పంకజాసనులనైన గణింపర దెబ్బలన్నచో
మురిపెము తోడుతన్ మును త్రిమూర్తుల నత్రి మునీంద్రుభార్య బా
లుర నొనరించి తొట్టియల లోనిడి యూచినమాడ్కి ధూర్జటీ ౧
ఉ. దానముఁ జేయునట్టి నెఱ దాతలఁ జేరియు వద్దటన్న య
వ్వానికి శిక్షగల్గు మురవైరికి మూడడుగుల్ ధరాస్థలిన్
దానముఁ జేయఁబూన బలి దానవనాథుడు దాని మాన్పగాఁ
బూనియు భార్గవుండు చెడిపోవఁడె కన్నొకటయ్యు ధూర్జటీ ౨
చ. హరుని భజించువారు చతురాస్యుడు వ్రాసిన మూడుపంక్తులన్
జెరపియు మృత్యువున్ గణనసేయఁగఁ జాలరు షోడశాబ్దముల్
పరిమితి జీవనంబజుఁడుఁ వ్రాసిన తొల్లి మృకండుసూతి శం
కరుని భజించి మృత్యువ కగమ్యుఁడుఁగాడె తలంప ధూర్జటీ. ౩

౧౬౨

# మిత్రమా

శ్రీ వ్యాపర్ల మహబూబలీ గారు



క. శ్రీకర వృక్షలతాదు ల
నేకవిహంగములు జంతునికరములెల్లన్
లోకోపకారములు కవి
లోకులు, లోకోపకార లోలురుమిత్రా ౧

చ. ఇది తగదయ్యె మద్కృతము నిందున నీకపకీర్తి యన్ననా
కెదురువచించె నంచతని కెంతయుఁ బాధలొనర్పఁ జూతురే
యది విహితంబటంచుఁ గడు నాదరభావముఁజూపు వారలన్
మది ముదమొందమేలనుచు మాన్యతఁ బిల్తురుగాదె మిత్రమా. ౨

ఉ. తాననేక తప్పుఁజేసి తొలుతన్ యజమానినిఁ జేరి చెప్పరా
గా నతఁడే కదన్ సుజన గణ్యుఁడటంచును వానిపక్షమున్
బూని యనేకవాదములఁ బుణ్యజనాళికి నగ్గనేతు రీ
మానవకోటి కెక్కడిది మంచియు చెడ్డలుసూడ మిత్రమా. ౩

చ. తెలివియొకంతఁగల్గి గుణదీక్షితులై తగినంత భూస్థితిన్
నిలయములన్ సువర్ణము వినిర్మల కీర్తియుఁగల్గి సౌఖ్యతన్
మెలఁగినవారికిన్ మదిని మిక్కిలి యీర్ష్యవహించి పెక్కు చి
క్కుల నొనగూర్తు రిద్ధరణి క్రూరులు న్యాయముఁదప్పి మిత్రమా. ౪

క. పరధన యువతీహరులయి
కరమరుదుగఁ దనదునేర్పు కల్పనచేతన్
హరిహరి "మిమునే చెఱచను
నిరుపేదలఁ బ్రోతు" ననెడు నిపుణులు మిత్రా. ౫



## ౧౬౩

# పుష్పికాజయతు

శ్రీ పేరక రామానుజాచార్యులు గారు

---

యత్పుష్పశ్రవణేన జాతకవితాసామాజికేజృంభితా
యత్పుష్పస్థరజోఽప్యమూల్యమభవత్ప్రీతాపిసైపోషణాత్
యత్పుష్పంవిబుధాళిశక్తికథనే ప్రారంభతూర్యస్వనం
తత్పుష్పంజయతాంసదారఘువరశ్రీపాదపంకేరుహైః. ౧

విద్వద్భృంగసమూహతుష్టికరణే కించిచ్చనాలక్షితం
తస్మిన్నైవనిరపేక్షసాహసకరీ దీపావళీపుష్పికా
తత్పూర్త్యైతదభూతపూర్వసురభిర్యేనేహసంప్రేషితా
దద్యాత్తాంరఘునాథపాదకమలేతస్మై శ్రియంసాహసం. ౨

భోభోనాటకకావ్యలక్షణసుధీ శ్శీఘ్రంసమాగమ్యతాం
గచ్ఛామోఽద్యవయంతు భాగ్యనగరే భోక్తుంతిదీయంమధు
కింనజ్ఞాతమిదం వృథాచరసి కోలాభోఽత్ర సంలప్స్యసే
పుష్పేస్థాస్యసిచేద్భవిష్యతి సదాకీర్తి స్స్వకీయాస్థిరా. ౩

సురభితదిగధీశా శోభితాశేషలోకా
కుమతిదళనదక్షా కుత్సితధ్వాంతభేదా
విబుధజనమదాళీ విస్తృతాశాంతకీర్తిః
జయతుసకలలోకే పుష్పికాదీపికాఖ్యా. ౪

ప్రతాపరుద్రేణ కృతం సుసాహసం
శ్రుత్వైవతాదృక్ప్రతిబింబితాత్మికా
ప్రతాపబుద్ధిశ్చ కవిత్వగౌరవే
ధనేన ధైర్యేణచయత్నితాఽభవత్. ౫

౧౬౪

# దీపావళీపుష్పము

ఉభయభాషాప్రవీణ

శ్రీనలంతిఘుళ్ చక్రవర్తుల రంయాల సింగరాచార్యులు గారు



శ్రీమచ్ఛ్రీనారసింహస్సురగిరినిలయ స్సర్వదాపూజ్యమానో
దేవై ర్గంధర్వసాధ్యోరగనరనికరై శ్చక్రధారీ స దద్యాత్
శ్రేయోభూయోఽప్యకృష్టం ధనమతివిమలం విద్యయా కోటిశత్వం
తద్వాతే పత్రికాయై కలయతు విభవం పత్రికాస్థాపకస్య. ౧
కావ్యకారమ దేభానాం
వాఙ్మక్తావళి మందసం
దీపికావళి పుష్పాఖ్యం
జృంభతాం సత్పథే సదా. ౨
ఉద్యత్సూర్యసహస్రకాంతి సదృశ శ్శ్రీకాంతయాలింగితో
వర్షారంభఘనస్వరూపకలిత శ్శంఖాదిదివ్యాయుధైః
యుక్తశ్శ్రీసనకాదియోగిసహిత స్సద్భూషణై ర్భూషిత
స్సర్వేశః కృపయా వివర్ధయతు తాం దీపావళీపుష్పికాం. ౩
త్వాం కేశవః పద్మదళాయతాక్షో
హ్యవాచ్యసంస్తూయ గుణాంబురాశిః
సురేశవిశ్వేశమహేశదానవై
రాచంద్రతారార్క మిహాభివర్ధతు. ౪
విపశ్చిద్వర బర్హిణాం
నిస్వనజ్జలదాగమా
దీపికావళి పుష్పాఖ్యా
జయతాం పత్రికా భువి. ౫

౧౬౫

# ప్రశంసా

శ్రీ ఒద్దిరాజ రాఘవ రంగరావు గారు



బోధాభిః సాధువాద ప్రకటన పటువాగ్వైఖరీమాధురీభి
ర్గాథాభిర్హృద్యపద్యైర్మధుమయకలితైర్వ్యాసజాతైర్విశాలైః
స్తోత్రైశ్చిత్రైశ్చరిత్రై ర్వివిధవిషయశాస్త్రార్థవాదైర్వినోదైః
సంయుక్తాగోలకొండా విలసతుసతతమ్పత్రికాహ్యత్రభూమ్యామ్ ౧

గుణప్రసక్తాచసువర్ణగుంఫితా
పత్త్రైఃప్రయుక్తా బహులక్ష్యగామినీ
నిశాతవృత్తిశ్చకరేవిరాజితా
తనోతిసమ్మోదమతీవ పత్త్రికా. ౨

ఏకత్రగాయతి మనోహరగీతజాలా
నేకత్రశాసతి పితేవ హితైస్సుబోధైః
ఏకత్రమిత్రమివవక్తికథాకలాపాన్
కింపత్రికానవిదధాతిముదం జనానామ్. ౩

వాణిజ్యమేధతే విద్యావర్ధతే మోదతేమనః
జనశ్రుతీనాంశ్రవణాత్తస్మాద్వై పత్రికావరా. ౪

నిజాముఖ్యామాన్ధ్రీలిఖితుమపివక్తుంనశక్తాః
సరస్వత్యామాన్ధ్ర్యామితి జనితనిర్మూలవాదమ్
ప్రమాష్టుంసత్కావ్యాన్ జుడతి యతతే గోలకొండా
కృతాన్ దేశీయాన్ధ్రైఃకథ మహ మిహా శంసామి చైనామ్. ౫



౧౬౬

# ప్రశంస

## శ్రీ నలంతిఘల్ చక్రవర్తులరంయాల లక్ష్మీనృసింహాచార్యులు గారు



సీ. రమణమీరంగ మహా రాజవంశోత్పన్న
రాజకుమారాభి రామజనిత
మైత్రగృహంబున నరయంగఁ బాల్యోచి
తక్రీడలను జాల తనివిఁదీరఁ
గ్రీడించి యౌవన శ్రీయంకురించిన
రాజకీయాధిప రాజితంబు
గా భాగ్యనగరాంత రా భోగభాగ్యస్థ
నృపధనాఢ్య కవీంద్ర విపులకర్ణ
గీ. పుటయుగానందదాయక ముఖ్యమై త
రలి సువార్తలఁ దెల్పంగ రవళిఁగోల
కొండయను పత్రికాభిఖ్య కువలయాక్షి
వృద్ధియగుచుండు చక్కని వృత్తిఁగలిఁగి. ౧
సీ. ప్రాసాదకుట్టిమ ప్రాభవంబులు శ్రీకిఁ
గాపురంబై యొప్పు నే పురంబు
విద్వదుత్తమధనీ విలసితానేక ప్ర
సాఫల్య యగుచుండు నే పురంబు
దానధర్మాది సంతాన ప్రకాశత
చే పొలుపందందు నే పురంబు
అఘహార గుణగణ యవననృపాలక
దీపితంబై యొప్పు నే పురంబు
గీ. అట్టి శ్రీ భాగ్యనగరాంతరాతి రమ్య
గోలకొండ సమాభిఖ్య గురుతరమగు

పత్రికా తరుణీమణి పలువితముల
వృద్ధియైయుండు చక్కని వృత్తిఁగలిఁగి. ౨

సీ. దేశవిదేశ విస్తృత రాజకీయార్థ
వార్తలం దెలిపెడి వన్నెలాఁడి
కవిరాజమానసా కరతిరోహిత భావ
మలరింపఁజేసెడి కులుకులాఁడి
యువకుల హృదయసంభవ మృదువాగ్గుంభ
నల దెలివిడిసేయు నవ్యభావ
కలకాలమెల్లఁ బ్రాక్స్థల మహనీయుల
వర్తనలను దెల్పు వామనేత్ర

గీ. ప్రకృతిగ ననేక గోప్యశబ్దప్రవచన
మాలికాలంకృతాచార మహిమలకును
నాటపట్టగు పత్రికా హంసయాన
వృద్ధియైయుండు చక్కని వృత్తిఁగలిఁగి. ౩

సీ. నవనాగరికతయు న్యాయవిచారమ
తియు కవినాథప్రార్థితయునగుచు
సుందర సంచికా సురభిళపుష్ప మా
లికను దాఁజేఁబూని ప్రకటితమతిఁ
జరియించుచున్న దీ పరమహితంబైన
శ్రీ గోలకొండ పత్రిక సమగ్ర
కరుణామలేక్షణ ఘనసంపదవ్యాప్తి
కలుఁగంగ వెలసిన కమలకమల

గీ. నాథ హృదయనివాస పున్నాగయాన
సకల కలికలుష నిరస్త కమలహస్త
ఘనతరైశ్వర్య విస్తార కాంతకాంతి
కాంతుఁగాఁజేసి రక్షించు గారవమున. ౪

౧౬౭

# పత్రికేశ్వరీ

శ్రీ విద్వాన్ గోవర్ధన అళహసింగరాచార్యులు గారు
ఆశుకవి



ఉ. శ్రీ యువతీమనోహర విశేషకృపా పరిలబ్ధభాగ్య భో
గ్యాయురఖండ కీర్తి వినయాది గుణాకర సన్మనీషవై
పాయక సత్కవిప్రకర పద్యములన్ దగ వెల్లడింపుచున్
గేయచరిత్రవై వెలయు కేవలమొప్పుఁగ పత్రికేశ్వరీ. ౧

ఉ. శారద నీరదాబ్జ విధుశారద ఫేనతుషార మల్లికా
శారద తారహీర ఘన సారపటీర మరాళకాశమం
దారఫణీంద్ర జాతులను దప్పక మించెను నీయశంబహో
ధారుణి గోలకొండ పురధామిని భామిని పత్రికేశ్వరీ. ౨

శా. రాజా వేంకటరామరెడ్డి సుతవై రాజద్యశశ్శాలివై
తేజోరూప విభాసమానవతివై దివ్యప్రభారాశివై
భ్రాజత్పండిత పద్యగద్య నికరోద్భావైక సంభావ్యవై
భూజానుల్ నుతియింపనుండుమిఁక నీ భూమిస్థలిన్ బత్రికా. ౩

గీ. సురవరాన్వయాబ్ధి సోమసమానుఁడౌ
శ్రీ ప్రతాపరెడ్డి శేఖరుండు
వృద్ధిసేయ నీవు వేయువత్సరములు
దనరుమమ్మ భూమి ధైర్యమతితో. ౪



౧౬౭

# కవికోకిల

శ్రీ వేలూరు మాణిక్యరావు గారు



సీ. ఎలమావిఁ జివురుటాకులనున్న యొగరునీ
తలకెక్కఁ గనులెఱ్ఱఁ దనముఁగాంచి
యల మధూకముల లేతాకుఁదాకిన తావి
యొగసి మత్తనుమేన నిగుడఁజేసి
మందగతులవన మందు నిద్దురఁజెంది
పంచమశ్రుతిఁగూడు పాఁటమఱచి
యుండివత్సరమున కొకతూరి ధ్వనిఁజేయ
కవివరు లెన్నియో కథలఁజెప్పి

గీ. బయటి కీడ్చిరి నిన్ను తీవ్రముగ గోలు
కొండ సంచికా! నిద్రించి గుఱకవెట్టు
కవుల మేల్కొల్పఁ జీరిన కరణి నీదు
నియతి మంచిది కావున నేర్పు సకవి
కోకిలాకీర్తిఁ గాంచుమా కొఱఁతలేక. ౧

మ. గిరులున్ గైరికముల్ వనంబులు మహోత్కృష్టంబుగా నీరజా
కరముల్ నిత్య పయఃప్రపూరితతటాకంబుల్ నదుల్ దుర్గముల్
పురముల్ పూతశివాచ్యుతాలయములున్ బుణ్యస్థలంబుల్ నిరం
తరమున్ గీర్తికి మూలమైనిలిచె మా నైజాము రాజ్యంబునన్. ౨



౧౭౯

# గోలకొండ పత్రిక

శ్రీ కే. వి నృసింహాచార్యులు గారు



సీ. భైక్షమే కవిరాజు బ్రతుకుఁగాఁ జేసిన
        కాలమింతటమార్పుఁ గల్గనయ్యె
నేఁడుబియ్యము రాగి చెంబు దుప్పటి కల్గు
        కవిత కెంతో భాగ్య గరిమయబ్బె
సంభావనమె వచ స్థలపరీక్షాలబ్ధ
        దినములు కవులకుఁ దేజమొసగె
యుద్ధవీరులఁబోలె మొక్కుమ్మడి నిజాము
        కవిచంద్రు లుదయించు కాలమొదవె
గీ. లలిత కవితా వితానవిలాసభాస
    వాసపేశలతాంగి! దీపావళీసు
    మంబునీతల నమితంపు మంజులతనుఁ
    గూర్పుఁగావుత సిరిపండ గోలకొండ. ౧

సీ. అధునాతనకవి వ్యాప్తవా గ్బద్ధమహా
        యతుల ప్రబంధవాహ్యాళిఁజూడ
నవరసభావ విన్యాస నాటకరాజి
        పటలి గాంభీర్యంపు నటనఁగాంచ
శ్రవణపేయానూన కువలయామోదుతా
        చాటుధారలఁగుల్కు నీటులరయ
ప్రాచీనశాసన ప్రాభవసంకీర్త
        నామృతపూరంబు నభిలషింప
గీ. నేఁడు సత్కావ్యవీచికా నివహమందు
    వ్యగ్రమతినీదు తండ్రి యుయ్యాలలూచి

పెద్దఁజేయఁగఁ దలఁచె నీ పేరు నింక
రత్నములకుండ గోల్కొండ ప్రతిభ నిండ. ౨

గీ. అనుపమానమమేయ మత్యంత యోగ్య
మయ్యె నీసౌకుమార్య మవ్యాజశీల
లెన్న నైజాము కవులవా గ్విధినిధియె
నిన్న నీతండ్రి విజ్ఞాన నిధియగుటను. ౩

గీ. వీధినాటకములు చాల పెరిఁగినవ్య
భవ్య లలితంపు టాకీలు ప్రజ్వరిల్లు
నట్లు పేరూరులేకుండ నణఁగియుండు
కవులఁ బిలచితె? గోల్కొండ కళలునిండ. ౪

గీ. పిన్నదానవు గోల్కొండ పెద్దవాఁడు
నీదు జనకుండుగా భాగ్య నిలయమైన
హైదరాబాద నీయున్కి నన్నివిధుల
చనువుచే సాకువాఁడు నైజాము రేఁడు. ౫

౧౭౦

## కుసుమము

### శ్రీ కవి రంగదాసు గారు



కం. శ్రీపతికృపఁగల నైజాం భూపాలుని రాష్ట్రమునను భూరికవులకుర్
బ్రాపునఁగలసుజ్ఞానము దీపావళి కుసుమమనఁగ దిక్కులు వెలిఁగెర్

ఉ. ఆంధ్ర కవీంద్ర సంస్కృత మహాత్ముల సత్కవి తావిలాసముల్
సాంద్రతఁ గూర్చె నీకవుల సంచికనామము గోలకొండ నై
జేంద్రనృపాల రాష్ట్రమున నింగితసత్కృతి సంగ్రహార్థమై
చంద్ర యశోవిశాలఘన సారవిచారము పారమొందగర్. ౧



౧౭౧

# దీపావళీ పుష్పము

శ్రీ శిరిసినహాళ్ కృష్ణమాచార్యులు గారు

అష్టావధాని - దైవజ్ఞశిఖామణి



శ్లో. కతిచిన్మధుమాధురీధురీణాః కతిచానర్ఘతరార్థభావబంధాః
నిజదేశకవీంద్రసాంద్రవాచః ప్రకటంయాంత్యనిశంభవత్ప్రభావాత్
నైజాంసురాష్ట్రకవినాంకవితానటీయ
మాటీకతాన్నటనమాశువిదేశరంగే
శ్రీగోలకొండకవిసంచికయాచచేట్యా
ప్రోద్ఘాటితప్రభమతిరస్కరణీనితాంతమ్. ౧

మ. అలగీతాములఁ జూపుచున్ మృదుపద న్యాసంబుఁ గావించి ని
ర్మల భావోదయ మబ్బఁజేసెడు నిజాంరాష్ట్రాంధ్ర విద్వత్కవీం
ద్రులనృత్యత్కవితామతల్లి నిపుడుం దూరస్థులౌవారికిం
దిలకింపంగనుఁ జేయుచుంటివి గదా దీపావళీ పుష్పమా. ౩

మ. పలుపూతేనియ లొల్కు పల్కులను కబ్బంబుల్ రచింపన్ విని
ర్గళపాండిత్యము గల్గియున్న నెదలో గాంభీర్యముంబూనియు
మ్ములలోనుండు నిజామురాష్ట్రసుకవుల్ మోదంబుతోఁ బాండితిం
దెలుపఁబూనిరి నీసుగంధమున నే దీపావళీ పుష్పమా. ౪

మ. విరులన్ నంద వనంబునందుఁ గనుచున్ వేర్వేఱుగాఁ దీయుచున్
సరులం గూర్చినమాడ్కి నీవు నిజరాజ్యంబందు విద్వత్కవీ
శ్వరులంజేర్చి విదేశవాసవిబుధోత్సాహంబుఁ జేకూర్చిను
స్థిరకీర్తిన్ భువిఁగొంచుచుంటివిసుమా దీపావళీ పుష్పమా. ౫



౧౭౨

## పత్రికాభివర్ణనము

శ్రీ సముద్రాల లక్ష్మీనృసింహాచార్యులు గారు

సీ. సంస్కృతాంధ్ర కవిత్వ చాతుర్యములటన్న
డాయకముంగాలు వేయువారు
తర్క వేదాంత శాస్త్ర ప్రశంసలటన్న
సభలోన నిలువంగఁ జాలువారు
అవధానహృద్య విద్యా గౌరవములన్న
ధారణాభాసంబుఁ దనరువారు
శబ్దశాస్త్రవిశేష సారస్యములటన్న
వితతవిఖ్యాతిని వెలయువారు
గీ. రసికులైనట్టి నైజాము రాజుగారి
రాష్ట్రమందుండు పండిత ప్రతతి నెంచి
లెక్కసేయంగ వేలకు లెక్కమించెఁ
గాన వీరికి సాటి జగానఁ గాన. ౧

చ. దినదిన వృద్ధిగాంచియుఁ బ్రతిష్టవహించెను గోలుకొండయం
దునజనియించి పత్రిక బుధుల్ గొనియాడఁగ నిత్యవైభవం
బునను స్వదేశసంగతులు పొల్పుగఁ దెల్పుచు రాజమాన్యతన్
గనియు యశోవిశేషము ననారతమొప్ప జగద్ధితంబుగన్. ౨

క. బాలులవృద్ధులకునునను
కూలంబుగ సౌఖ్యవృద్ధిఁ గూర్పగనుర్వి
జాలిన పత్రిక నిదివే
మేలను గోల్కొండపత్రికే నిజమింకన్. ౩

చ. కరమను రక్తిపాదముల గజ్జియలందెలు మ్రోగుచుండసుం
దరమగు దివ్యగానను హితంబుగఁ బాడుచు బాలవృద్ధహృ
త్సరసిజ రంగసీమల యథార్థమునిల్పి యనారతంబులన్
తరికిటతత్తధిమ్మనుచు నాట్యముఁజేయును పత్రికాసతీ. ౪

౧౭౩

# దీపావళీ పుష్పాభినందనము

శ్రీ టి. కృష్ణశాస్త్రి గారు



మ. కవితామార్దవ సత్ప్రబంధముల మీకై జెప్పి సర్వావనీ
కవిలోకంబు స్వకీయకీర్తి రమ నా కంబెల్ల నిండ న్తదో
కవిహారుల్ గనలేని ఖ్యాతిఁగని మీ కందిచ్చిరారీతిలో
కవిమోదంబున గూర్పు మంచి పుడు శ్లోకవ్రాత మోమాధవా. ౧

సీ. చిరుతపత్త్రాల నివసించుపండితజన
భ్రమరాళి కామోద భాగ్యమబ్బె
మారుమూలలనుండి మనియెడు విబుధేంద్ర
గంధేభములకు ప్రఖ్యాతికల్గె
నిజగేహపంజర నిర్బంధి సుకవివా
క్పికసంతతికి స్వైరి వెడలఁగలిఁగె
గౌరవఁబెరుఁగని కవితాలతాంగికి
ధరణీశ రాగ బంధంబు గలిఁగె

గీ. నాంధ్ర గీర్వాణ పాండితి నాదరించు
కాల మెపుడేగుడెంచని గాంచుచుండ
నదిర దీపావళీపుష్ప మవతరించె
సకల రాజన్యమకుట సంస్థాయియగుచు.

సీ. సుకవీంద్రులునుమన స్ఫూర్తి మైస్థైర్యంబుఁ
గాంతువటంచు దీవింతురమ్మ
బుధవర్గములు తమ పుత్రిక రీతిని
వెలలేని ప్రేమఁ జూపింతురమ్మ
రాజన్యులధిక గౌరవముచే జగమందుఁ
బెక్కు ప్రసిద్ధిఁ గావింతురమ్మ

విద్యాధికారులై వెలయు పండితులెల్ల
వింతసారముల గ్రహింతురమ్మ

గీ. తమ నిజాంలోనికవులు పూజ్యమనఃప్రాజ్ఞు
లంతనతిశ్రద్ధనూని సేవింతురమ్మ
యఖిలభారతీయాంధ్ర భాగ్యాంకురమ్మ
మహిత దీపావళీకుసుమాభిధమ్మ.

సీ. నేఁడుఁగా సుకవీంద్ర నిబిడ యశశ్చంద్రి
కావళి దశదిశ లాక్రమించె
నేఁడుఁగా పండిత నివహంబున కగణ్య
ఘనమానసోల్లాస గరిమకలిఁగె
నేఁడుఁగా సద్విద్య నేర్చినందుకు ఫల
మిదియేయటంచు నూహింపనయ్యె
నేఁడుఁగా విబుధాళి నిజవంశ నామముల్
సకలోర్వినతిచిర స్థాయిఁగాంచె

గీ. నేఁడుఁగా మహాఘనత నిర్విప్రకీర్తిఁ
ప్రభువరేణ్యుల సత్కృపా పరవశమున
నలరి గోల్కొండ కవిసంచికాఖ్యతోడ
నిలను దీపావళీపుష్ప మేగుదెంచె

మ. వసుధాస్థాన విరాజమాన సుకవి ప్రజ్ఞావృతంబయ్యు పెం
పెసఁగెన్ బండిత సుప్రతాప జలముగ్భిందు ప్రసారంబుచే
దినలెల్లన్ గనఁ గోలకొండపయి నుద్దీపించుఁ దీపావళీ
కుసుమంబియ్యది లోకమోదమునుఁ జేకూర్చంగఁ జూపట్టెడిన్



౧౨౪

# దీపావళీ పుష్పము

శ్రీ నేరెళ్ల వేంకటాచార్యులు గారు



సీ. కవికాంతులకు గీర్తిఁ గలుఁగింప నొనరింప
బొనరు దీపావళీ పుష్పమొకద
సకల భూస్థలిగేరు సద్వార్త నెరుఁగింపఁ
బొలుపు దీపావళీ పుష్పమొకద
పండిత పక్షమై బరుల బింకమడంపఁ
బొసఁగు దీపావళీ పుష్పమొకద
జ్ఞానహీనులను సుజ్ఞానులఁ గావింపఁ
బూను దీపావళీ పుష్పమొకద

గీ. అహహా యిద్దాని గుణము లింతని వచింప
నలవియే శేషునకును నిత్యముగణింపఁ
జోకఁబడు మేల్మిచె విశదీకరింప
మేటి దీపావళీపుష్ప మేనలంప ౧

ఉ. తావక సద్వచస్తతి సుధారస బిందువు లుప్పతిల్ల దీ
పావళి పుష్పమా! తమక మూర యశోమణి హారవాసివై
పావన సజ్జనభ్రమర పంక్తులు నీదరి నాశ్రయించఁగా
నీవు జగత్ప్రసిద్ధిఁబడు దేయను వారి కొకింతవింతయే. ౨



౧౭౫

# దీపావళీ ప్రసవము

శ్రీ పరవస్తు నంబెరుమాళ్లు గారు



చ. చెదరుగదా నిజాం కవులఁ జెందినదుర్యశమింతలోనఁ గాం
చెదరుగదా యశోరమ నశేషకృషన్ గవిరాజులిందు మిం
చెదరుగదా విదేశకవి సింహులవాక్పటి మంబుకంబెఁ బు
చ్చెదరుగదా స్వకీయముగఁ జెప్పినపద్యము లెల్లమీరు గూ
ర్చెదరుగదా సుమోపమ సువృత్తసరంబులు దేశమాత కి
చ్చెదరుగదా ధరింపఁ బరసీమలవారు భ్రమింపఁగా లిఖిం
చెదరుగదా స్వదేశకవిశేఖరు లిందరటంచునప్డు మె
చ్చెదరుగా నిజామున విశేష కవీశ్వరు లుంటచే నుతిం
చెదరుగదా కవిత్వమునఁ జెందెడుకీర్తి నగణ్యమంచు నెం
చెదరుగదా నవీనముగఁ జేరి పఠింపఁగడంగుచుండఁ దీ
ర్చెదరుగదా త్వదీప్సితము రేబవలున్ గడు శ్రద్ధతో గణిం
చెదరుగదా యశోధనము శ్రేయముపండిత నామమున్ నుతిం
చెదరుగదా విదేశనిజసీమల వారలు మీసహాయ మెం
చెదరుగదా నిరంతర మశేషభవత్కరుణారసత్వమున్.



## ౧౭౬

## కవి సంచికా

శ్రీ పల్లా చంద్రశేఖర శాస్త్రిగారు.

శ్లో॥ స్వచ్ఛన్దచారికవికౌశికధూమకేతుర్విస్తారభావకిరణాన్వివిధాన్వికీర్య
ఆహ్లాదికాచసుమనోవరసన్తతీనాం సూర్యప్రభేవవివిధార్థవికాసశీలా.
శ్రీగోలకొణ్డకవిరాజవిరాజమానా
శ్రీశారదోద్భవవిచిత్రకలాప్రపూర్ణా
శ్రీచన్ద్రికేవవితతాకవిసఞ్చికేయం
జీయాత్సదాకువలయప్రతిబోధదక్షా.
గఙ్గేవసారసవతీయమునేవేయమ్కృతాన్తశరణవతీ
సాజయతువిపులభావాసరస్వతీవగుప్తవిషయావతీ.
యేఽజానన్తః కార్యర్బ్రౌఢవాదమ్
దుర్గ్రాహ్యం యేపణ్డితంమన్యమానాః
తేషాం తేషాంమూకభావంవదన్తీ
జీయాత్సేయంసఞ్చికాసత్కవీనామ్.
యేభాగ్యాద్భాగ్యవాస్తవ్యాః ప్రవృద్ధకవికర్మణః
తేషాముజ్జీపికానిత్యముదేతి కవిసఞ్చికా.

---

## ౧౭౭

## గోలకొండ

శ్రీ ఆవునూరు వేణుగోపాలరావు గారు

శా. శ్రీ రాజిల్లు నిజాము రాష్ట్రమున సంశ్రేయంబుగా నాంధ్ర భా
షా రామామణి వృద్ధిఁ జెంద నిజ దేశంబందు వార్తావళిన్
ధారాళంబుగఁ దెల్పఁగా వెలసె నీ దక్షన్ యదృష్టంబె యా
కారంబై యలవార పత్రికయనంగా "గోలకొండా" ఖ్యతోన్. ౧
ఉ. ఆర్థిక సాంఘికైహికమతాదిక నైతిక ధర్మ కర్మ శా
స్త్రార్థ విమర్శనల్ సకల సారములన్ గొని చర్చఁజేసి కీ
ర్త్యర్థము దేశసేవ సుకరంబుగఁ జేయఁదలంచి నిర్దరన్
వర్థిలుచున్న దాంధ్రమున వక్తలవాగ్విభవంబు తోడుఁగాన్. ౨

---

౧౭౮

# "ధర్మము"

శ్రీ హెచ్. గుండేరావుగారు వాచస్పతి



శ్లో. విశుద్ధసత్వాత్మకయాసదాస త్కర్మాద్యనుష్ఠానతఏవలభ్యమ్
ధర్మంనిజాంతఃకరణస్యవృత్తి విశేషరూపంప్రవదంతిసాంఖ్యాః

తాన్ పుద్గలాన్ పుణ్యవిశేషలభ్యా
నారంభకాన్ దేహవినిర్మితౌస్ఫుటం
వదంతిధర్మం పరమాణురూపాన్
జనానుగా అర్హత తత్వవాదినః. ౨

ఆమ్నాయసందర్శితమార్గవర్తినః
సదా సదాచార పరాయణస్య
అదృష్టరూపోగుణ ఆత్మవృత్తి
ర్ధర్మోభవేత్తార్కికసమ్మతోయం. ౩

యజ్ఞేనయజ్ఞం హ్యయజంతదేవా
ధర్మాణితాని ప్రథమాని చాసన్
ఇతిప్రమాణం పరిపశ్యతాంసతాం
మీమాంసకానాంయజిరేవధర్మః ౪

యదర్శ్యగతస్సంఘటతేజనానాం
శ్రేయస్కరందర్శనమాత్మనోహి
తమేవధర్మం పరమంపవిత్రం
శ్రద్ధాలవోభాగవతావదంతి. ౫

ఇత్థంమహాజ్ఞానిషు ధర్మవాచ్యే
సందృశ్యతే విప్రతిపత్తిరేవ
అథాపిసామాన్యతయాసుబోధ్యం
యచ్ఛ్రేయసాంసాధనమేవధర్మః. ౬

శ్రేయస్త్రిధాసీంకదరత్ జనస్య
స్వభావతోభిన్నరుచిప్రవృత్తేః
కిశ్శాన్తియన్యూనతయా జనోఽయం
శ్రేయస్తుతత్పూరణమేవమన్యే. ౭

అవైదికోవాస్త్వథవైదికోవా
సుధారకోవాస్తు సనాతనోవా
సామాజికోవావ్యవహారవాదీ
నైక్యంప్రవిందన్ననిశందునోతి. ౮

తస్మాదనేకత్వమనన్యయుక్త్యా
స్వార్థైఃప్రహాతవ్యమితీవసిద్ధం
శ్రేయోజనైక్యం తదభావరూపం
తదేవధర్మః పరమోమతోమే. ౯

తద్బ్రహ్మసాక్షాజ్జనతాస్వరూపం
తదైక్యసంపాదనమేవధర్మః
లోకేఽపివర్ణాశ్రమ భేదభిన్నే
సమంసమాభాతిహిభారతత్వం. ౧౦

సమాజసౌధస్యమహోన్నతస్య
స్తంభాఇమాబ్రాహ్మణముఖ్యజాతయః
తస్మాత్తదాధారతయాసమానాః
సాధర్మ్యమేతత్ ఖలుధర్మతత్త్వం. ౧౧



౧౭౫

# ఆంధ్రనామ సంగ్రహము

శ్రీ శేషభట్టర్ వేంకట రామానుజాచార్యులు గారు

---

దేవవర్గు

తే. గీ. భాగ్యవంతుల కోర్కులు పండఁజేసి
భాగ్యహీనులఁ గష్టాల పాలొనర్చి
జగములెల్ల నిరంకుశ సరణినేలు
వ్యక్తి పేరొప్పు భగవంతుఁడన నుమేశ. ౧

బ్రాహ్మణవర్గు

తే. గీ. యజ్ఞమన భ్రూణహత్యకు నగ్నిహోత్ర
మనఁగ సిగరెట్లు గాల్చుట కాఖ్య లమరు
యాచకున కొప్పుఁ బండితుండనఁగ వేద
పాఠమనఁగను గవినాఁగఁ బార్వతీశ. ౨

ఆశ్రమవర్గు

ఆ. వె. గుడిసెస్రవేటు నుంచు కొనుటచేఁ బెండిలి
కానివాఁడు పెండ్లికాక ముండ
నుంచుకొన్నవాఁడు నుర్విపై విలసిల్లు
బ్రహ్మచారి యనఁగఁ బ్రమథనాథ. ౩

కం. దినమెల్ల బిచ్చమెత్తుట
యును నిశలందెల్లఁ జౌర్య మొనరించుటయుఁ
బనిగల హిందూ దేశపు
మనుజుఁడు సన్యాసి యనఁగ మహినొప్పు శివా! ౪

దరిద్రవర్గు

సీ. అద్దెకొంపనఁగఁ దాటాకులగుడిసెనాఁ
జెట్టునీడయనంగఁ జెల్లునిల్లు
వికృతవేష కృశాంగి పిల్లలకోడి పెం
గయ్యాళియనుపేళ్ల గ్రాలునాలు

సజ్జయన్నము జొన్నసంకటి మంచినీ
ళ్లుపవాస మననొప్పు నోగిరంబు
కోటిమూక దరిద్రగొట్లు సోమర్లన
నామముల్ బరగు సంతానమునకు

గీ. నాస్తనము పేళ్లు విలసిల్లు నప్పసంగఁ
జౌర్యవృత్తి యనంగ భిక్షంబనంగఁ
బనియనఁగఁ జెల్లుఁ బనిలేనితనము పేరు
పురదనుజభంగ శేషాహిభూషితాంగ. ౫

వ్యవహారవర్గ

సీ. 'అప్రయోజకుఁడు' నా 'నవివేకి' యన రెండు
సంకేతములు సెల్లు సజ్జనునకు
'రండ' యన 'నపుంసకుం' డన నాఖ్యలై
యొసఁగుచుండును విజితేంద్రియునకు
'చాందసుం' డన, 'వేదజడుఁ' డన నామముల్
బరగు సదాచార వర్తనునకు
'స్నేహదూరుం' డనఁ 'జెనఁటి' నా నభిధలై
క్రాలుచుండును సత్యశీలునకును
తే. గీ. జరగుఁ 'బిసినిగొట్టనఁగఁ', 'బిశాచి' యనఁగ
ద్రవ్యశాలి కభిఖ్యలై ధరణియందుఁ
'దత్త్వవేత్త' కు 'గంజాయిదమ్ముగాఁ' డ
నంగ నభిధేయమైయొప్పు నంగజారి. ౬

స్వదేశవర్గ

కం. ధనధాన్యములన, శౌర్యం
బన ధైర్యమనంగ విద్యయన విజ్ఞానం
బనఁ జెల్లు భరతఖండం
బునఁగానఁగరాని వస్తువులవెల్ల భవా! ౭

కం. వేసారక శుష్కోప
న్యాసములిడువాఁడు దేశనాయకుఁడనఁగా
భాసిలుఁ దచ్ఛ్రోతలకగు
వాసవముఖవినుత 'దేశభక్తు' లనంగన్ ౮

---




ఉ. భండనమందు నన్నుఁ బలు భంగులఁగా సిలఁ జేసినట్టి ధూ
ర్తుండగు కర్ణు శీర్షమునుఁ దున్మెదవీవని పుట్టెఁడాశతో
నుండఁగఁ గయ్యమందతని కోడి బిరాన గృహంబుఁ జేరు నీ
దండి మగంటిమేల? రణధర్మ వివేచనమేల? కాల్పనే! ౧

ఉ. గాండివముం ధరించి రిపుకాండము గుండెలు ఝల్లనంగ ను
ద్దండ విరోధిమధ్యమున దర్పమెలర్ప వెలుంగువేళ మా
ర్తాండుఁడొ? రుద్రుఁడో? పరశురాముఁడొ? రాముఁడొ? యంచుఁ (దోచు పా
ర్థుండొక సూతపుత్రునకు స్రుక్కెనటన్న హసింపరే జనుల్. ౨

ఉ. సూతుని జూపు మాపఁగల శూరుఁడెవండని నంత నీవునే
నేతగువాఁడనంచు వచియించు ప్రగల్భము లెల్లనమ్మి ని
ర్భీతిని సంగరంబు నొనరింపఁగఁ బూనితిఁ గాని; యయ్యయో!
యీతలవంపుఁ గూర్చు బలహీనుఁడవంచెఱుఁగంగనైతిఁగా! ౩

ఉ. అట్టులెఱింగియున్న నిటు బాలము జోలికిఁ బోక హాయిగా
నెట్టుచునుందుఁ గాలము ముని ప్రవరార్చనలం వనాళి ని
ప్పట్టున రెంటికిం జెడి యభాగ్యుడనైతిని నీకతాన నే
నెట్టులనింక మీఁద మొగమెత్తి చరింపఁగలాఁడ నక్కటా! ౪

సీ. మోహరమ్మునఁ నిల్పి మూఁడు కన్నులవాని
నలయించి దివ్యాస్త్ర మందునాఁడు
ప్రళయానలునిభంగి భాసిల్లి విశిఖాగ్నిఁ
గాలకేయాదులఁ గాల్చునాఁడు
ఖాండవంబు దహింపఁ గనలి కండెత్తిన
యింద్రుని దాఁకి జయించునాఁడు
నతిబలోద్ధతుఁడైన యంగారపర్ణునిఁ
గొఱవిఁ జేఁబూని లోఁగొన్ననాఁడు
గీ. కలిగినట్టి మగంటిమి గంగఁ గలిపి
ప్రిదవిడనాడి పగఱకు వెన్నుఁజూపు
పిఱికిపందకు నీకేల వింటిగొడవ?
కృష్ణున కొసంగి మూల వసింపరాదె.

---

## ౧౫౧
## కోవెల
శ్రీ వడగం రాజేశ్వరరావు గారు

---

ఉ. కోవెల! యస్మదీయమగు కూఁతలు నీయుల కింపొసంగఁగా
నే వినుచుంటి నేఁటివఱ కెంతయొ మూఁగెడి వానకారునన్
బోవుచునుంటి నీవకట పువ్వుల దేనెలు నింపు నీ కళా
రావములింక నాచెవుల డాయునొ యెచ్చట గ్రుంగిపోదువో. ౧
ఉ. కో యని నీవు గూయవినఁ గోరెదు నామరు కూఁతలన్నియున్
మాయముగాఁగ శ్రోతల మనంబులు ప్రేమము పొంగులెత్తఁగాఁ
జేయఁగఁ బాడుచుంటి వెటు జేరెదొ వర్షము దాపరింప? హా
కోయిల తాళలేను విన కుండిన నీమృదు గీతికావళుల్. ౨
ఉ. ఏను వసంతమున్ వదలి యేఁగఁగ నయ్యెను వానరాకచేఁ
గానమదీయ నేత్రములఁ గన్నులకింపుగఁ గాంచలేవు నా
గానము నెప్పుడున్ వినవుగా యనునట్టులఁ బాడుచుంటివా!
మానసమందునన్ దృఢతమంబుగ నాటిన ప్రేమతోడుతన్. ౩

---

౧౫౨

# సుందరుఁడు

శ్రీ బెల్లంకొండ వేంకటాచార్యులు గారు

---

సీ. ననవిల్తు సరిబోల్ప నగుఁగాని వాఁడు దే
హావిహీనతనుగుంచి యడలకున్న
నామని దొరయీడు నావచ్చు మఱియెల్ల
నడవులపాల్గాక నడరియున్న
జాబిల్లి దొరయగాఁ జాలునేమోకాని
పమనాఱువక్రులై బరఁగకున్న
పెట్టుచెట్టెకిమీని పట్టినెన్నఁగవచ్చుఁ
గానికాకత్వంబుఁ గాంచకున్న
గీ. భవహితాత్మజుఁ డెనయంగ వచ్చునేమొ
యతఁడు పుణ్యజనేశత్వ మందకున్న
నేమిసెప్పుదు నాత్మ్రత లేశుపుత్రుఁ
బోలఁగల సుందరుఁడు లోకమునను గలఁడె. ౧

సీ. జేజేలరారాల జిగిమించు పసనించు
లలితభాసురకుంతలములవాఁడు
చెలువారుబంగారు కలతీసులను గేరు
కమనీయతర దేహ కాంతివాఁడు
సుమబాణు హరిసూను సొగసూనగాఁబూను
గరమొప్పు సౌందర్య గరిమవాఁడు
శశిమాపు గతిమాప సరినోపు గలయేఁపు
గల్గిచెన్నారు ముఖంబువాఁడు
గీ. కరము తాఁబేళ్లనొంచు మీఁగాళ్లవాఁడు
వాలుఁ గ్రొమ్మిమ్మలనేలఁగాఁ జాలుగాలు
గనుల వాఁడు వెడంద వక్షంబువాఁడు
వీని కెనయైనవాఁడునే వీట లేఁడు. ౨

---

౧౮౩

# మయూర

శ్రీ ఓరుగంటి లక్ష్మీనారాయణశాస్త్రి గారు



శ్లో. విశ్వోత్తేతరవో విహారనిలయాస్స్వచ్ఛంద చారీధవా
న్ద్రైత్యధ్వంసవిహారకార్యచతురస్స్వామీకుమారో విభుః
వీణాగానవినోదినీ శిఖిసఖీ సేవ్యాపరా దేవతా
సంజాతార్య! సఖే! మయూర! భవతాకింనామతప్తంతపః ౧
మాహేంద్రోపలరాజితంచ మకుటం చూడాభిసంచిత్రితం
ఛత్రంపింఛమయం మయూర! మృదులేపక్షాభిదే చామరే
ధృత్వాసద్గగజ్జితోజలముచే లాస్యోపహారాన్వితం
కేకాస్వాగతమాహరన్నసిసఖే! కింనామతప్తంతపః. ౨
పింఛాధస్థితనూరుహారవమయం భేరీధ్వనింఖ్యాపయ
న్నత్వాన్నృత్యరణాఙ్గణం సునిశితం చూడాసి మాకమ్పయన్
కేకావీర్యముదశ్చయ న్జయకృతే చోధృత్యపింఛధ్వజం
సజ్జోఽసిద్వివతాన్మయూర భవతాకింనామతప్తంతపః. ౩
కేకాపూర్వకసాంధ్యనర్తన విధిత్వత్తాలవృత్తిర్భవ
న్నానావర్ణ మనోజ్ఞపింఛరుచిభిర్వ్యాఖ్యాన్విధేశ్చాతురీమ్
కాలేకించిదదన్క్వచిద్వనతలే నిద్రాంసుఖంయాపయ
న్కాలంచాసిసఖే! మయూర! భవతాకిన్నామతప్తంతపః. ౪
లోకోపద్రవకారి ఘర్మమదహా ప్రావృట్పయోదాగమ
ప్రశ్నజ్యోతిష వైదుషీమ్ప్రకటయన్నానన్దతో నిస్తులామ్
విశ్వద్రోహ పరాయణాన్విషధరాన్నిర్మూలయన్మానసై
ర్మాన్యశ్చసిసఖే! మయూర! భవతాకింనామతప్తంతపః. ౫



## ౧౨౪
# శ్రీ భాష్యము

### శ్రీ గోవర్ధన సింగరాచార్యులు గారు



శ్లో. శ్రీరామానుజసూక్తి సారసరణిర్విష్ణోః పదస్యానఘా
సంసారాగ్ని విదీపన ప్రశమనీ శ్రీవిష్ణు దీపోజ్జ్వలా
శ్రీనాథస్య పరస్య చాంధతమసో దుర్వాదిగర్వాపహా
సర్వాశాఘువిఘట్టనీ సుసరణిర్ద్వార్యర్చిరాదిర్నృణాం. ౧
శ్రీరామానుజ భాష్యపంక్తిరనఘా సంసారభీరోర్భీ
దీర్వ్యాదేవ నృతిర్యగాదిజనుషస్సర్వాఘ నిర్వాపణీ
గీర్వాణీ యదికంఠగా యదిహృదా సంస్మారితా వాసకృ
త్సైవాముష్యజనస్య జన్మజలధేస్సంశోషణే బాడబీ. ౨
పాషండాద్యశనిః కుదృష్టిముకుటారో బాధబుధ్యర్థిత
స్సాంధ్రప్రాయకృదస్య చాంధతమసో భానుర్యసంతోజ్జ్వలః
చార్వాకోరగభేదనేపిగరుడో జైనేభసింహస్స్వయం
త్రయ్యా మంగళసూత్రమే తదనఘం శ్రీ భాష్యమత్యుజ్జ్వలం. 3
పఠేద్వా శ్రీభాష్యం యదియతిపతేః పాదయుగళం
స్మరేద్వాతద్భక్త్యుజ్జ్వల హృదయ సంశోభితధియః
స్మరేద్వాంఘ్ర్యంభోజే సకృదపిహృదాజన్మజలధిం
తితీర్షుశ్శ్రీవిష్ణోః పదసరణిరేషాహివిమలా ౪
శ్రీరామానుజభాష్య మేతదుడుపం జన్మాబ్ధిసంతారణం
ప్రాప్యం తత్కృపయైవ నాన్యదుడుపం నిర్మాంగళం నిశ్చితం.
తద్వక్త్రాపిశిఖోపవీతవిధురః క్వాస్త్యధికారోనఘో
భాష్యం సూత్రవివర్జితం యదికలేః కారుణ్యసంశోషణం ౫



౧౨౫

# రుక్మిణి

శ్రీ యం. ఉమామహేశ్వరరావు గారు



మ. కులగోత్రాదివిచారముల్ సలుపకే గోపాలు నవ్యక్తుఁ గే
వలమాయాగుణశీలు శ్యాముఁ గరముల్ బట్టంగ విఖ్యాతరా
ట్కులసంజాతవు మానినీమణివి నీకుల్ జెల్లునే! జాతికా
దలవంపుల్ ఘటియింపకున్నె యిది? కాంతారత్నమా! రుక్మిణీ ౧

చ. అనిశమువల్లవీజనసమాగమ సౌఖ్యవిలోలతన్ జరిం
చిన జనుఁడట్టి వానికి వశీకృతవాటకు నెవ్వరేని కృ
ష్ణుని పరమాత్ముఁడాదిపురుషుండని చెప్పి భ్రమింపఁ జేసిరం
చునెటో తలంచినన్ యదుకిశోరుఁడె కాఁడొకో? రుక్మిణీసతీ ౨

ఉ. ఇంతియ కాదుసుమ్మ, వచియించెద విన్నది చిన్నిమాట సు
స్వాంతవుగాన, వాపవరుసల్ గణియింపక, లోకనింద కా
వంతయు భీతిలేకఁ దనయత్తను గుత్తగొనెంగదమ్మ! శ్రీ
మంతుని చెయ్దముల్ గనుక మాన్యతరమ్ములవయ్యె రుక్మిణీ! ౩

ఉ. ఖండితవాదినౌట, గినుకన్ వహియింపకుమమ్మ పుష్పకో
దండశిలీముఖవ్యథలఁ దాళకఁ గోపవనితంబినీ శర
ణ్యుండగు కృష్ణుఁడేడ; భయదోగ్రరణాంగణమందు దుర్దమో
ద్దండవిరోధి శాతశరధారకు నోర్చుటదేడ; రుక్మిణీ! ౪

ఉ. అండజయాన; విన్మ జవరాండ్రకు నైజగుణంబదేమొ నా
థుండు నిరంతరంబు దమతోడిద లోకమటంచునెంచి వే
ఱొండు తలంపుమాని ప్రణయోదధిఁ దేల్చుచు నిష్టుఁడౌను భృ
త్యుండునునై మెలంగఁ బురుషోత్తముఁడంచు నుతింత్రు రుక్మిణీ!



# ౧౨౬

# బలి

శ్రీ నల్లాన్ చక్రవర్తి ప్రతాపం రాఘవాచార్యులు గారు



ఉ. మందిరమందుఁ బుత్రికిఁ గుమారున కెట్టి యజీర్ణదోషసం
బంధము లైన రోగముల పాటవమెచ్చిన తుచ్ఛులందరా
నందముతోడ గొఱ్ఱెల ఘనంబుగఁ దెండిది యాదిశక్తి యా
క్రందనమే యటంచనిరి కాలముగాదె యిదేమి యీశ్వరీ. ౧

ఉ. ముడుపులు గట్టి నీకనుచు మూఢులు లెక్కడరాని గొఱ్ఱెలన్
గడుపునఁ బెట్టుచుండెద రకారణవైరులిదేమి రోగమో
జడియరు పాపభీతికిని జంకరు కొంకరు చంపువేళ నా
ఘుడియా ఫలంబో లేక కలికాలమహామహిమంబో యీశ్వరీ. ౨

చ. శివములటంచుఁ గల్లరి వశీకృతవేషములన్ ధరించి భూ
ధవుల ధనాఢ్యులందఱి నధర్మపదాప్తులఁ జేసి మా యుమా
ధవపదపద్మపూజలు వృథాయను కైవడిఁ జేసి దుర్మదో
ద్భవులయి వామమార్గులయి పాడగుచుందురిదేమి యీశ్వరీ. ౩

చ. గొరియలఁ గోళ్ల దున్నలను ఘోరముగా బలిపెట్టనేల కా
పురుషులు గారె వీరలల పుణ్యము భక్తియె గాయటన్న సం
బరమునఁ గన్న పుత్రులను బట్టి వధింప రదేలనో మహే
శ్వరి నిను నిందపాలు మనసారఁగఁ జేసిరి దుష్టులక్కటా. ౪

చ. జ్వరముల సీతిబాధలను జంతుభయంబులఁ గల్గఁజేసి ము
ష్కరుల మదంబడంచి కలికాలమహాత్మ్యముఁ జూపి దోర్బలో
దరపరిపూర్ణులన్ ఖలుల దండన కంతకు తోడఁజెప్పి యీ
ధరణి నహింసయే పరమ ధర్మమటంచని చాటుమీశ్వరీ. ౫



## ౧౫౨

# గున్నచింత

శ్రీ పస్పుల కోవ్రూముభరతయ్య గారు



సీ. సరివయస్కులను బాలురమెల్లఁ జెలరేగి
కూడియాడినది యీ గున్నచింత
గ్రామంబులోని గోగణమెల్ల నుదయానఁ
గూడి నీడవసించు గున్నచింత
మార్గంబు నడచెడు మనుజులందఱకును
గురుతరవిశ్రాంతి గున్నచింత
కడలేనిదీర్ఘశాఖలచేతను చతుర్ది
శోన్నతంబైనది గున్నచింత
తే. అనతి దూరంబులోని రామాద్రితరులు
సఖులుఁగాఁదన్ను వేష్టింప సకలఖచర
భూత భేతాళ గణరవ పూరితప్ర
సన్నరాద్ధాంతపస్పుల గున్నచింత. ౧

సీ. నాతాత తండ్రి యనంతరాముఁడు నిన్ను
స్థిరలగ్నమునఁ బ్రతిష్ఠించినాఁడు
పురుషోత్తమాఖ్యుండు పుణ్యుండు నాతాత
బహుగౌరవమునఁ గాపాడినాఁడు
నాయనవల్లభ రాయఁడు నినుబెద్ద
కాలంబు సత్కృపఁ గాంచినాఁడు
యూరనున్నప్డు నేనొక ఘాతలేకుండఁ
జెలువుమీరఁగను రక్షించినాఁడ
గీ. నిప్పుడు పరదేశములకు నేనేగినాఁడఁ
దెలియరాదయ్యె నీక్షేమ దివ్యవార్త
తావకాశ్రమ నానావిధద్విజాళి
కూర్మినన్నదె తెల్పుమా గున్నచింత. ౨

౧౮౫

# దుర్యోధనుఁడు

శ్రీ ఏటూరు సత్యనారాయణరావు గారు

శ్రీ బోయినేపల్లి రంగారావు గారు



గీ. పసితనంబందె భీముఁ జంపంగఁదలఁచి
విసముఁబెట్టించియును నది విఫలమగుడు
పాండవులనంత మొందింపఁబంతమూని
లక్కయింటినిఁగట్టితె! లాఘవమున. ౧

ఉ. సూనులఁ బాండునందనుల సూనృతవాదుల ధర్మజాదులన్
ధారుణి నేలుచున్ విభవ తామరసాక్షినిఁగూడ నోర్వలే
కూరక మాయజూదమున నోడఁగఁజేసియుఁ గానకంపితో
రోరి దయావిహీనుఁడ సుయోధన నామము కూడదెంతయున్ ౨

గీ. మానవతియగు ద్రౌపదిన్ మాతరీతి
మానసంబునఁ బూజింపమాని వేడ్క
మానభంగంబుఁజేయఁగఁబూనినావు
యింతపాపిని నిన్ వచియింపరాదు. ౩

చ. కదనమునందు పార్థసుతు కార్ముకవిద్యకు భీతిఁజెందియున్
దదితరయోధులన్ గలిసి ధర్మవిరుద్ధపు యుద్ధమందు నా
పదియును నాలువర్షముల బాలుని నస్త్రవిహీనుఁజంప నీ
మదికలఁగంగలేదుగద మానవమాత్రుఁడవే నృపాధమా! ౪



## ౧౫౬

# మారుతము

శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు బి. ఏ. ఎల్. ఎల్. బి.

---

సీ. లలితరసాల పల్లవఖాది కోకిల
గానంబుతోడ సంగతమొనర్చి
విభ్రామకాపగా వీచికాసందోహ
నినదంబుతోడ నిస్వనము సేసి
విరహిణీజన దీర్ఘ తరతప్త సాంద్రోష్ణ
నిశ్వాసములతోడ నిశ్వసించి
యుద్యానవిహరణ ప్రోత్సుకితాంగనా
కిలకిలారవములఁ గలిసి నవ్వి
గీ. వనవిహంగమ కుహుకుహూస్వనముఁగూడి
ప్రౌఢకాంతాకరముల విపంచి గలిసి
గాన నిస్వన నిశ్వాస కలితహాస
వివిధవిభ్రమములఁ దేలె పవనుఁ డద్ధి. ౧
సీ. అతులవిషాద సంభృతగాన మొనరించు
కలకంఠిరవము సంచలనమొంద
సాంద్రపుష్పనికుంజ సౌధంబులఁ జరించు
ప్రియదంపతులకుఁ దబ్బిబ్బుగల్గ
ప్రియసమాగమకాంక్ష బయలెల్లవీక్షించు
నభిసారికలకెల్ల నాసఁగొలుప
నవవిలాసస్ఫూర్తి నవఘుళింపఁగఁగోరు
కన్నెయద్దమువద్దఁ గళవళింప
గీ. గటికగింజలు మునుపంటఁ గోటికియిచ్చి
పాలనముసేయు శాలికా జాలమునకు
సంభ్రమముగూర్చ నల్లన సంచరించె
వాతపోతంబు సకల దిగ్వ్యాప్తుఁడగుచు. ౨

---

౧౬౦

# హైదరాబాదు ప్లేగు

శ్రీ కె. ఎస్. జాషువ. గారు

---

ఉ. ఆవుల దొడ్డిలో దుముకు వ్యాఘ్రముకైవడి గొఱ్ఱెలందు సా
లావృకమట్లు "ప్లేగ"నెడు రక్కసియొక్కతె నేఁడు హైద్రబాద్
లోవడిఁజొచ్చి యిట్టునటు లోవుచుఁ జోవుచుఁ గాపురస్థులం
దావులఁబాపె దానిదగు తాడనమేమని చెప్పఁదక్కటా. ౧

చ. నెలవులయందు రాత్రమున నెమ్మదినుండిన లేళ్లపుంజముల్
వెలువడు సింహగర్జనము వీనులసోకఁగ భీతి నష్టది
క్కులఁబరువెత్తు మాడ్కిఁదగఁ గ్రూరతరంబగు ప్లేగుగర్జనన్
బలుదిశలేగి క్యాంపులను బన్నరె యీపురవాసులెల్లరున్. ౨

చ. ధరపతి యెవ్వఁడో తనదు తండ్రికిఁ ద్రోహము సేయ క్షాత్రులౌ
పురుషులమాత్రమే దునిమెఁ బూనిక భార్గవరాముఁడాతతిన్
దరుచుగ ప్లేగుతండ్రికిని దాతకు నే నరుఁడేమిచేసెనో
వరుసఁగ మ్రింగనాయె ప్రతివారిని జాలియొకింత లేకయున్. ౩

ఉ. మారణమొక్కచో మృతుల మాడ్చుట పూడ్చుట వేరుచోటఁ గ
న్నీరులు నించుటొక్కస్థలి నెత్తులుమోదుట వేరువీథిలో
మీఱినశోకనాదములు మింటినిముట్టుట లెల్లచోట్ల నీ
తీరున యుద్ధభూమిస్థితిఁ దెల్పదె యీపురరాజమారయన్. ౪

చ. కసువునుఁగోయఁగోయ నికఁ గత్తియునైనను మొక్కవోవుఁదా
పసులను మెక్క మెక్కఁదుది వార్ధకమొందును వ్యాఘ్రమైన వే
లసువులఁదీయఁదీయఁ బరమాధమ ప్లేగున కేలకో మదిన్
విసువుఁగలుంగకున్నయది వృద్ధతయున్ గనరాకయున్నదే. ౫

---

## ౧౬౭
# భావకవిత
### శ్రీ అజ్మతుల్లా గారు



గీ. కటికి చీఁకటియందునఁ గానరాఁడు
వీడు గలఁడేఁడు దనసరి వాఁడులేఁడు
భూరితరశక్తి యుక్తులఁ బరగువాఁడు
మానవుఁడుగాఁడు మమ్మేలు మహితయశుఁడు ౧

గీ. ఘనుల దూషించు వాఁడిల ఘనుఁడుగాఁడు
దోషియగువాఁడు వృద్ధి నిర్దోషిగాఁడు
యోగ మొనరింపకున్న సద్యోగిగాఁడు
సత్ప్రవర్తనలేక సజ్జనుఁడుగాఁడు. ౨

గీ. ప్రవిమలాంబర పథమునఁ బర్వులిడుచు
రమ్యముగ భావగీతికల్ రాత్రులందుఁ
బాడుచుఁ గులశీల ప్రాభవముఁజాటు
ఖేచరానీక ప్రాకట ఖేలనంబు. ౩

గీ. పలల భక్షణ మొనరించు భ్రాంతిమీర
పా మొకటివేగ మండూక పతినినోరసి
పట్టి భీకరదంష్ట్రల బలము మించ
లాగినప్పుడు తాఁ దనలాఘవమున

గీ. మక్షికంబొండు వీక్షించి మాయఁగప్పి
తున్ని వారణసేయు దీక్షుద్రజంతు
నైన లభియించునను గోర్కె నాత్మఁబూని
పట్టుచో సృష్టి వైచిత్ర్యభాతిఁగంటి. ౫



## ౧౬౨
# ప్రవరుని విచారము

శ్రీ కూడవెల్లి శ్రీనివాసరావు గారు

ఉ. విద్యయె మూలమంత్రము కవివేత్తలు సద్విజనాళి కంతయున్
విద్యయె భోగ భాగ్యములు వేడుకతో నొనఁ గూర్చునందురా
విద్యయె తెచ్చు గౌరవము విద్యయె నీతికి నాలవాలమౌ
విద్యలు లేనివాఁడు పశువే యని వేదము పల్కు మాతరో. ౧

గీ. తల్లిదండ్రులు నింటఁగాసిల్లుచుండ
వనిత నాలేమికై శోక వార్ధిఁ దూల
యాజకీ యాగ్నిహోత్రంబు లారిపోవ
ముందు నినుఁగూడి యే సుఖ మందువాఁడ. ౨

గీ. సంధ్యలందున బైట సంచారమునకు
బోవనియ్యని నాతల్లి పుత్రు రాక
కెంత యడలుచు నుండునో? యింటనుండు
నతిథి పూజలు భంగంబు లాయె నకట. 3

## ౧౬౩
# కులాంగనా!

శ్రీ రంగరాజు వేంకట ధర్మారావు గారు

చ. అనువుగ నత్తమామలకు నంచిత సేవలొనర్చి భక్తిచే
ననవరతంబు నాత్మధవు నాజ్ఞ మెలంగుచుఁ బ్రీతిఁ గొల్చుచున్
వినయ మెరంగి బంధువుల వేడ్కలు గూరఁగ నాదరించుచూ
యనిశము బుట్టినింటికిని నంచితలీలల మెట్టినింటికి
ననుపమకీర్తి సద్యశము నందఁగఁజేయుఁగదే కులాంగనా.

౧౬౪

# విద్య

శ్రీ బాలసరస్వతి కందాళ వేంకట నరసింహాచార్యులుగారు



మ. పరఁగన్ ద్రవ్యచయంబు నెంతయును సంపాదించినన్ ధాన్యసు
స్థిరగేహాంబర గోవ్రజంబులను దా సిద్ధంబుగన్ గూర్చినన్
సరసాలంకృతి సద్గుణాళియుతమౌ సద్విద్యలేకున్న నా
నరజన్మంబు నిరర్థకంబు విగతానందం బిలన్ జూడఁగన్ ౧

మ. సరసంబై చెలువొందు విద్యయె కదున్ సద్జ్ఞానసత్ప్రవృత్తియున్
వరధర్మంబును దెల్పు సద్వినయమున్ వాక్ప్రవృత్తిఁ గల్గించి శ్రీ
కరపాత్రత్వవిశుద్ధ సంపదలచేఁ గల్యాణసౌఖ్యంబుచేఁ
బరఁగన్ జేసి యఘంబుఁ బోఁదుడిచి గాపాడున్ సతంబీమహిన్ ౨

మ, ధరలో ధాన్యసమస్తరత్నముఖ సద్ద్రవ్యంబు తాఁ గూర్చినన్
బరఁగన్ దస్కరభూప పావకులచే భగ్నంబగుంగాని యీ
పరమార్థంబగు విద్యఁ జూడఁగ మహాభాగ్యాప్తికి న్మూలమై
బరఁగున్ సత్యమిదెందు విఘ్నతతిచే బాధ్యంబు గాదెన్నఁడున్ 3

మ. పలుకున్ సత్యయుతంబు జేసియు సభా భాగప్రదేశంబునన్
జెలువొందన్ మహనీయ గౌరవముచేఁ జెన్నొందఁగాఁ జేసి స
త్కులజాతంబగు కాంతరీతి సుఖమున్ గూర్చించి సర్వార్థులన్
విలయంబొందఁగఁ జేసి గాచును మహిన్ విద్యాధనంబీ ధరన్. ౪



౧౬౫

# మంగళ గౌరీవ్రతము

శ్రీమతి సోమరాజు ఇందుమతీబాయి గారు



ఉ. పున్నెములందు సద్రచనఁబొందిన యీ పరమవ్రతంబులోఁ
బన్నిన కంకణమ్ము కరపంకజమం దలరారి భక్తి సం
పన్నతినారి తేరిన యుమా సమలక్ష్మి బదమంటి మ్రొక్కి న
య్యన్నులమిన్న లాడెడి ప్రియంబులు చెల్లియ? నిన్నునోముతన్.

ఉ ఎవ్వరునేర్పి రే చెలియ! యీగతి వాయనమిచ్చి పల్క నీ
నవ్వున నవ్వులోఁ దెలుఁగునాటి మనోహరకీర్తి వల్లికల్
పువ్వులు పూచెనమ్మ నరపుంగవుఁడౌపతి నెమ్మనంబులోఁ
గ్రువ్విన భావముల్ వెలికిఁ గూర్చినవే నును సిగ్గుదోఁతరల్. ౨

చ. కొసలమరల్చి వేసినది క్రొమ్ముడి నూతనధూపసౌరభ
ప్రసరసువాసితమ్మునయి వ్రాలెను వెన్నున నంటి దీర్ఘమై
ప్రసవచయమ్మునం దుపరిభాగమునందిటు నిల్పితమ్మ! యీ
పసపదిలించికొన్న పతిభాగ్యము నేమని ప్రస్తుతించెదన్. ౩

శా. ఆచారమ్ములలంకృతమ్ములు స్తుతివ్యాపారముల్ నేఁటివా
ప్రాచీనంబులు నిండికొన్నవి సమారబ్ధవ్రతంబందునో
హో చైతన్య కళాస్వరూపిణి! త్రిలింగోర్వీసుమారామముల్
బూచెంగా మధురాననేందు మధుసంపూర్ణప్రవాహంబునన్. ౪



౧౬౬

## సుమవిలాపము

శ్రీ కోదాటి రామకృష్ణరావు గారు బి. ఏ.

గీ. త్రుంచినాఁడవు కఠిన! నాదోషమేమి
విడువలేవె జీవంబుల వీడువరకు
శాఖలో దుఃఖపర్యవసానమిట్టి
మఱపెమని నేనెఱింగిన మఱవకుండు
స్వాంతహారుఁడగు పవను గిల్గింతలకును ౧

గీ. పాకె నన్నెంత పేరిమి శాఖ యొసఁగి
యందమఱి మలయ! నన్ను పర్యంకమందుఁ
బడయఁద్రోచితివీవు నా పరిమళంబు
శయ్యనింపుము రాత్రి నిశావియుక్తిఁ
బారవేయుదునను మంటఁ బడి నశింప ౨

గీ. ఎగిరిపోయెడి చెదరినా యింపులోలుకు
రేకులు క్రమానుగతిని విస్మృతినిఁగనెడి
మన్నులో మన్నయి నిమేషమాన్య శోభ
కై యచిరసౌఖ్యలాలసతాప హేతుఁడ
వైహరించితోయి నా యసువులకట ౩

గీ. చారురుచిహీనమయ్యెడు శాఖ మధ్య
యోగమున నక్కటా తల్లియొడినిఁబిడ్డఁ
బాసి కన్నీరునించు నక్క బడయలేక
తేనెటీగలు చింతించు దీర్ఘదుఃఖ
వార్ధిలోమున్గుఁ గోకిలల్ బంభరములు. ౪

గీ. పొందె సంక్షోభమక్కటా పూవుమొలక
మాలిహృదయంబు శోకానఁ దూలిపోయెఁ
గాంతిదీపిక చల్లారెఁగా యటంచు
శాఖ యేడ్చెడు నాకునుఁ జావుఁగలదు
చచ్చెదవునీవు నందఱు చావఁగలరు
తరుణమరణంబు జగతికంతముగదోయి. ౫

---

౧౬౭

# దీనకర్షకా

శ్రీ బోయినపల్లి విశ్వనాథరావు గారు



చ. ఇనుములనెన్నియో సతము నీవు భరింతువు ఘోరదుర్దశల్
బడయుదు వెల్లకాలముల బాధను గాంతువు క్షుత్పిపాసలన్
మిడుకుచునుండి దుఃఖమును మ్రింగుచునుందువుగాని సౌఖ్యమున్
గుడువఁగ నెన్నఁడైన మదిఁ గోరవదేలనొ దీనవర్షకా. ౧

ఉ. నేరుపు కార్యశోధనమునీషత సత్యపథానురక్తి దు
ర్వారదరిద్రపీడితుఁడ వైనకతంబునఁ జెందలేక ని
స్సారములైన భూములను జాలగదున్ని ఫలంబుఁగాన కే
ధైర్యముఁదక్కి దిక్కులు వృథా పరికింతువు దీనకర్షకా. ౨

ఉ. వీనులవిందుగా మధురవేణునినాదముసల్ప వెన్నమున్
మానినులన్ వినోదమగు మాటలఁదేల్చు టెఱుంగవెందు సం
తానముఁ గల్గి పోషణ యథావిధిసేయఁగ శక్తిలేక య
జ్ఞానుడవయ్యు దుఃఖముల కాకరమైతివె దీనకర్షకా. ౩

చ. అడవుల భస్మరాసులుగ నద్రుల ఘోరముగాఁగఁగాల్చుచున్
సుడవడఁజేయు దారుశిఖి చొప్పున నీహృదయంబు లేమిచే
నుడుకునఁజెంది దేహమును నుగ్రతరార్చులఁగాల్పగా దరి
ద్రుఁడవయియెట్లు సైచుదువొ తోచదునీగతి దీనకర్షకా. ౪

చ. అడకుఁవ క్రొత్తభావములు నాత్మవిచారణ క్రొత్తభావమున్
జెడని వివేకము న్గుణవిశేషత, మాటలసొంపు, మందిరా
నడవడి, విద్య, పట్టుదల నాగరికంబును గాంచి జాణవై
పుడమిని నీవు జీవితముఁ బుచ్చుట దెన్నఁడొ దీనకర్షకా. ౫



౧౬౮

# గంగాలహరి

శ్రీ పల్లా రామచంద్రశర్మ గారు



శా. శ్రీరామాహృదయారవింద సరణిన్ శృంగారభృంగాత్మ సం
చారంబొప్పఁగ సేయు శౌరి పదకంజాతంబునన్ బుట్టి లో
కారాధ్యున్ హరు నుత్తమాంగము నివాసాహంబుగా నుండి మా
భూరిప్రార్థనలాన వచ్చితిటకున్ బుణ్యాబ్ధి గంగానదీ! ౧

మ. తరమా పంకజసంభవాదిసుర సంతానంబుకైనన్ భవ
ద్వరచారిత్రము సన్నుతింప గణుతింపన్ గాండ ఖండంబువే
పరుగెత్తించెడి పాపపుంజముల నిర్భావించు పౌరాళి నా
తరమా వర్ణనసేయ నిన్ను కలుషత్వచ్ఛేది గంగానదీ! ౨

శా. ఆనాడా సగరాఖ్యభూమిధవుడే యాగాశ్వముం బీడ పు
త్రానీకంబును రక్ష సేయనిడఁగా నామూకకున్ యోగిసం
తానాలంకరణుండు నా కపిలుచేతన్ జావు సిద్ధింపఁగా
నానాకస్థలవాసులన్ సలుపవే యంభోధి గంగానదీ! ౩

మ. హరగంగే, యని యొక్కమాటు నినునాహ్వానించి వే గ్రుంకినన్
బరమామ్నాయవిదుండు భాస్కరుడు ప్రాగ్భాగంబునన్ దోఁప నా
చరమాగంబునుగూర్చి పారు రజనీసంఘంబులన్ బోలె నా
వరపాపౌఘములన్ దొలంగవె దయాపాథోధి గంగానదీ! ౪



౧౬౬

# అధునాతన విద్యార్థి

శ్రీ తాటిపర్తి గోపాలాచార్యులు గారు

---

శ్లో. విద్యార్థినంతమధునాతనమంగ; విద్ధి
యఃప్రీతిరాంగ్లజనతా మనుయాతివేషే
వాఙ్మాత్రకేస్ఫురతి యద్వినయోఽపి యస్య
విద్యాచపుస్తకగతా, గతిరన్యసేవా. ౧

ఏకేపురోఽగ్రానపరేఽభితోఽగ్రా
నన్యేశిరోఽగ్రానితి కాకపక్షాన్
అనేకధైవాస్తృణతే యథేష్టం
తత్రాపిభూయాంసి మతాని నూనం ౨

యావంతీకిలకాకపక్షరచనా సంస్కారసంపాదనే
లీలాకందుకఖేలనాదిషుచయా కాఫీపయశ్చూషణే
యాచోపానదుపాసనే పటపరిష్కారక్రియాయాంచ యా
శ్రద్ధాఽర్థాపినతత్రపాఠసమయే విద్యార్థినాంప్రాయశః ౩

పరిణమతి యథాయథాచపాఠ్యం
సులభతరం పరీక్ష్యప్రకర్షణాయ
అనుసరతి తథాతథైవశాఠ్యం
మతిరలసాపిచ హైందవాన్ ప్రకామమ్. ౪

అహో! అధీయానమిహాత్మసీనాన్
గృహేషు సందర్శయతే స్వమేషః
విపీతభావాభినయోఽప్యముష్య
యథాగురుత్వాభినయో గురూణామ్. ౫

---

౨౦౦

# సంపెంగ

శ్రీ చెన్నమరాజు కొండలరావు గారు



చ. ప్రకట దిగంతరంబులకు బారులు వెట్టు సుమాళిసౌరభ
ప్రకరములద్దిరా! భువన భాసురలీలఁ జెలంగ నీదు సొం
పొక మలినాంగయౌ మధుపి యొల్లకయుండిన నేమిసేయునో
వికవికఁబోయి యన్యసుమవీచులఁజిక్కులఁజిక్కె సంపెఁగా. ౧

చ. అనిశమరందమాధురిమ నచ్చక నిశ్చలమూని చేరకే
చనెను భవత్ప్రసూనముల సారమెఱుంగమి భృంగమద్దిరా
జననవిధం బెఱింగి యల జాతులమాతులు నాకుచుంటయో
తనవుడఁజూచుకొంచుఁ దను దాఁదగ మద్యపి నంచొ సంపెఁగా ౨

చ. కదలి రసాలపల్లవ ముఖంబుల నాయుధము ల్ఘటించి నీ
వదనము చిన్నబుచ్చ మురవైరికుమారుఁడు నారిఁగూర్చెఁగా
మధుపినటంచుఁ గుందకుము మాటికి సంపెఁగ నీమరంద మే
విధమునఁ గ్రోలు కీటకపు వృత్తిమలీమస మొందుఁబోయెడిన్. ౩

చ. జగముతెఱుంగు హేమసుమ సౌరభమారయ చంపకంబ! నీ
సొగసు విలాసినీ మణుల సుందరనాసికఁ బోల్చకుందుమా
వగవఁబనేమి నీదు మధువాసన నొల్లకయున్న తేటియే
తగువరి దాని హీనతకుఁ దార్కొనితర్క మొనర్చఁ బోకుమా. ౪



౨౦౭

# శరత్తు

శ్రీ బి. కె. వేంకటాచార్యులు గారు



చ. అకలుష సుప్రసన్న మధురాంబువులన్ నదులొప్పెఁ గాశ మిం
చుక విరియంగఁ బూచె నడుసుల్ తెగనారె విధూతవారి ద
ప్రకర కృతాంధకారమయి రాజిలె దిగ్వలయంబు చంద్రికా
వికసనముల్ తనర్చెఁ దెగవిచ్చె జపార్జునకోవిదారముల్. ౧

మ. హరిదీశప్రమదాశిరోజములఁ జెల్వారెం బ్రసూనంబులై
సరవిన్ దీపవతీచయంబులడఁగెన్ స్వచ్ఛాంబుపూరంబులన్
గరమొప్పెన్ ధవళాంబరంబులయి దిక్కాంతావలగ్నంబులన్
స్మరజీవాతువులైన శారదజగన్మాంగళ్య కీర్తిద్యుతుల్ ౨

సీ. మంచుచుక్కలతోడి మించుపచ్చికబయల్
తావిపూవుల గసుల్ దీవపొదలు
చందిరంబలఁదిన సంధ్యాభ్రగిరిశోభ
పలుతెఱంగుల పులుంగుల బెడంగు
వెన్నెలపూవుల వెలయించు నెలహొయల్
జలజలఁ బాఱు నిర్ఝరుల సిరులు
మలయానిలంబుల చలువలచెలువంబు
శ్యామలారామ కళ్యాణరుచులు

గీ. మొదలుగాఁ బ్రకృతి విలాసములఁ గరంబు
కవులయూహాప్రపంచానఁ గ్రాలునటుల
నీయలఘుశక్తిఁ బ్రసరింపఁ జేయరాదె
ప్రియగుణోద్దామ శారద శ్రీలలామ. 3



౨౦౨

# నేను

శ్రీ వేంకటరామకృష్ణులు గారు



గీ. నన్ను గనిమీరు నవ్వీన నవ్వవచ్చుఁ
దనువుకొననేల కవికుమారుఁడను నేను
అమలమోహనమైన కావ్యములలోన
తతరుచిర మృదుతరాలంకృతులఁ జేర్తు
హృదయశాంతికి నిర్జన పదనివాస
మర్హమనియెంచి తిరుగు నన్నాపవలదు!
స్నిగ్ధకవితాలలామ హృత్సుమయాంము
ప్రసవములఁగూర్చ నిందు యీ ప్రణయకవిని
ధర్మమనియెంచి యాకవితాలలామ
దృక్ప్రసారాభిలాషదోధూయమాన
మానసంబునఁ బచరింతు నేనుగాని
సఖుఁడ, గాఢానురాగార్ద్ర కలితకవిత
మేడ సోపానసరణి యే జాడఁగలదొ
దారిఁజూపిన మెలమెల్లఁజేరఁబోదు
నింపుగుల్కుచు నవనవోన్మేషరక్తి
ధారయనిమెషి దూతిక దారిఁజూపఁ
గలదు భయమున నేటికో కలతఁజెందు
లేతప్రాయమ్ము ధైర్యమ్ము లేదుసుమ్ము.



## ౨౦౩

# భాగ్యపురోపవనము

శ్రీ చెన్నమరాజు వేంకటేశ్వరరావుగారు



సీ. మాధవీ పున్నాగ మాలతీమల్లికా
మాగధీ శోభిత మండపములు
తాపిఞ్ఛ సురసాల దాడిమనారంగ
కుంచిత వైచిత్ర్య కుంజగృహాలు
సహకారపల్లవ స్వాదనాదర శుకా
లాపకోకిలరవా లంకృతంబు
కలహంస కలకంఠ ఖంజరీటరథాంగ
సారసకలరవ సంకులంబు

గీ. జలపిరశరవ్ర పూరిత పటుమరంద
పాన ఘూర్ణితబంభర భర్జితంబు
పూర్ణసంశోభితానేకపుష్పరజము
భాగ్యనగరోపవనము సుపర్వవనము. ౧

గీ. అభినవ లతాంతిక పరంపరాధ్య యగుచు
తతసుమాయుధ తూణీరతావిలాస
గరిమఁజెన్నొందె శుకకల కంఠమధుప
లలితరవములు పాంథులఁ గలఁచు నౌర. ౨

గీ. నిబిడ తరుశాఖ లెసఁగియు నింగిఁబ్రాకఁ
బ్రావృడంబుదవిభ్రాంతి బరిఢవిల్లఁ
గాంచి పురివిచ్చి సరి నీలకంఠమాడు
వేసవిని నిమ్మహారామ వీథులందు. ౩



౨౦౪

# విశ్వకర్మ

శ్రీ రాఘవనగరం రామసింహము గారు

సీ. ఆదరించినవారి కపకార మొనరించి
ప్రజ్ఞఁదెల్పుట మహాపాతకంబు
ఆపదఁబొలఁగించి యాప్తులౌ వారితోఁ
బగఁబూనుటయు మహాపాతకంబు
నిజమేదొ తెలియక నిర్నిమిత్తంబుగాఁ
బరనిందఁజేయుట పాతకంబు
నావంటి పరిపూర్ణుఁడేవంక లేఁడని
భావించుకొనుటయుఁ బాతకంబు
తే. తగనిపాపిష్ఠిగురుని పాదమునుబట్టి
భక్తితో మ్రొక్కుటయు మహాపాతకంబు
భక్తజననిందనము మహాపాతకంబు
విశ్వపాలనధర్మ శ్రీ విశ్వకర్మ. ౧

సీ. ఘోరరక్షోభట క్షోభకసహకార
కారణాంచిత నిర్వికారవిభవ
భవమిత్రపద్మసంభవ భావజ జనక
జనకభావప్రపంచజాల గర్భ
గర్భస్థలోకభాగ్యఫలప్రదనయజ్ఞ
యజ్ఞభృజ్జగదసాధ్యప్రతాప
తాపసాఖండ నుతశ్రీహృషీకేశ
కేశవప్రాత శ్రితక్లేశసంఘ
తే. సంఘటితజయ నిస్తంద్ర జాయమాన
మానపరిపూర్ణ వసుపరిధానహీర
హీరఖచితకోటీర కోటీరధారి
విశ్వపాలన ధర్మ శ్రీ విశ్వకర్మ. ౨

౨౦౫

# శింగమ్పల్లి

శ్రీ అభినవ పాణిన్యాచార్య నరసిబ్జ శాస్త్రిగారు



రఙ్గత్తుఙ్గవిహఙ్గపుఙ్గవలసచ్ఛృఙ్గారవేషోజ్జ్వల
త్సఙ్గద్దివ్యభుజఙ్గ భూషణసదాఽలిఙ్గద్విపశ్చిచ్ఛటా
గఙ్గానవ్యతరఙ్గరిఙ్గణసువాగఙ్గప్రధానద్దదా
శిఙ్గమ్పల్లిపురీచకాస్తి వసుధా శ్రీరమ్య కీర్త్యుజ్జ్వలా ౧

శ్రౌతాయస్య జగచ్చయత్ర జఠరే సమ్బాధమావిష్కృతమ్
ఖ్యాతా విశ్వహృదిత్యసౌ త్రిగుణభాక్సఙ్ఘాతహర్షోదయః
సీతారామ ధరామరస్య భవనేచిత్రంవసత్యాదరా
ద్దాతాభక్తిగుణప్రబద్ధహృదయోభక్తాభిసంరక్షకః. ౨

పురాజనకభూధరప్రథితపత్తనాత్సుస్థిత
శ్శ్రుతిస్మృతివిగీత సద్విబుధపూజనానన్దితః
హరిశ్శరణదోఽస్యభూసురమణేస్సపర్యాదరో
గృహేసదారమణయాసరసమావిరాసీద్దృఢమ్ ౩

నరీనర్తి చేతః కరీన్ద్రార్తిహన్తు
శ్శరీరేమదీయేవరీవర్తి విశ్వం
ధరాదేవమాలేః కలావత్సుహేతో
ర్ధ్రువస్తస్యపుత్ర్యోరగత్న్యోః పరీతమ్. ౪



౨౦౬

# భాగ్యనగర మారి

శ్రీ వేంకట పౌండరీక యాజుల వారు



శ్లో. పూర్వందూరతరేస్థితా ప్రభుభిరేవైషా మహామారికా
దిష్టం ప్రాప్తవతి ప్రభాగతభయాగత్యాత్ర సమ్యక్స్థితా
ఆరభ్యాశ్వినమాసమాసురసమామాఘాంత మత్యుగ్రతః
ప్రత్యావృత్యహరత్యసౌ ప్రతిగృహం ప్రాణాన్ నృణాం ప్రత్యహం.

ప్రాత స్తృథతరోద్ధానం సంగమే జ్వరదీపనం
మధ్యాహ్నే స్ఫోటకోత్పత్తి స్సాయ మగ్నిప్రవేశనం. ౨

ద్వారాణ్యనాబధ్య ధనాభిలాష
మచింత్యసంత్యజ్యచ బంధువర్గం
ఆరామవాపీవనకూపభూమి
మాశ్రిత్య జీవామ ఇతిప్రజగ్ముః. ౩

వీథ్యాంవీథ్యాం మందిరేమందిరేవా
గోష్ఠేగోష్ఠే చత్వరే చత్వరేచ
పశ్యేపశ్యేయః తత్రతత్రావిజంతు
ర్వారంవారం మారికాతో వానదృష్టః ౪

ఏవంమహామారికయాజనానా
మభూత్తయః పూర్వ కృతాఘదోషాత్
సోప్యాది దేవీచరణారవింద
స్మృత్యా పునర్నైవ భవేత్కదాపి. ౫



౨౦౭

# వారాణసి

శ్రీ శ్రీకృష్ణానంద భారతీ దేశికుల వారు



శ్లో. శ్రీమదుద్భాసురమణిమణీగళలసత్ప్రాసీయసన్నాళికా
మధ్యాంచన్మణిసన్నిభాతి విపులార్యావర్తదేశస్థితా
రోదస్యాహ్వాయశుక్తిసంపుట సుముక్తాభాత్రిలోకీసఖ
వక్త్రాంభోరుహమార్గ పంకతిలకో భాభాతి వారాణసీ.

గద్య. సేయంపురీ గండమండల పరిభ్రమద్భ్రమర మండలాఖండల మణికుండల మండితప్రకాండపాండురమదశుండాల మండల మండితా ఖరతరఖురఘట్టనోద్భూతధూళీపాళీపాళీ సముద్భూత మృగపాళిమండలైరతిమానగతిమానైరవమానితపవమానై రత్యుచ్చైరుచ్చైశ్శ్రవశ్శ్రవః క్షపణనిపుణైరశ్వబృందై స్సుంద రాభిస్సుందరాభిరభినందితా జంభాసురదంభాపహ కుంభీశ్వర డింభావళికుంభస్థలసంభూతసుముక్తావళీ యుక్తాఖిలవస్త్రావళీ శస్త్రప్రియకరకంజార్పితమదిరాపానసంజాతమదఘూర్ణమానాం జనాంచితనేత్రకంజవిలసత్కుంజరయానాపుంజరంజితగంజావళీ మంజులా.

శ్లో. నేదంమహీమండలమత్ర మేవ పురాణినేమాన్యురుభానిభాని
శైలాశ్చనైతేంబుముచోసహీయంవారాణసీపూర్ణమృగాంకఏవ.



౨౦౭

# కుసుమాపచయము

శ్రీ ఎం. వి. మాధవరావు గారు

వికసిత మనోహరములైన విరులఁగాంచి
కోసి యానందపడెదవు కొంతసేపు
తమక మొకయించుకేనియుఁ దగ్గగానె
మూలఁబడవైచెదవు దాని ముక్కలెల్లఁ
దరువుఁబాసిన కుసుమంబు దక్కఁదనుచుఁ
బూర్వలావణ్యకాంతియుఁ బోవుననుచుఁ
దెలిసియునుగోయ యత్నించుఁ దెలివిలేని
పనిని, నేమనుటో? పిల్లతనముగాక
కొమ్మనున్నట్టి పుష్పంబుఁ గోయఁబోక
తావులనుగ్రోలు టుచితంబు దాపునుండి
మధువునాస్వాదన మొనర్చు మధుకరంబు
హానిసేయుటకలదె? ప్రసూనములకు
సుందరములైన వస్తువుల్ చూచినపుడు
భ్రాంతిఁజెందని మనుజుండు పరగఁగలఁడె
చక్కఁదనమును బ్రేమించు హక్కె కాని
దానిఁజెరచు బ్రయత్నంబు తప్పుకాదె?





[౮౩] శ్రీ కాప్లూరి రాజేశ్వరరావుగారు





[౯౯] శ్రీ రంగధామనాయుడుగారు



శ్రీ వారణాసి రామయ్యగారు





శ్రీ రామకవచం అనంతశాస్త్రి గారు

## ౨౦౯
## విధి
**శ్రీ శ్రీరామకవచం కృష్ణయ్య గారు**

సీ. కలయెల్ల పక్వాన్నములవండి తినిపింపఁ
జవిలేదనుచు గోల సలుపువారు
భూమిపైయడుఁగిడఁ బురబురఁ బొక్కుచు
నడువలేకను జాల నడలువారు
తులనెఱుంగని హంస తూలికపైనుంచ
మేను కందెనటంచు మిడుకువారు
మేనసొమ్ములువెట్ట మేలిమిగాదని
యులకచే దిక్కులకురుకువారు
గీ. నట్టికొమరులకే కూడదనక నేడు
నాకులాహారములు కంటకాకినడక
తాలపడకలు చివురులు రమ్యభూష
లయ్యె నెంచఁగ విధికసాధ్యంబుగలదె.

---

## ౨౧౦
## క్షయోదయము
**శ్రీ చకిలం శ్రీనివాసరాయశర్మ గారు**

క్షయయు నక్షయమును లలికలిమిలేమి
వ్యయము నాదాయమును బరాజయము జయము
కష్ట సుఖములు లేశంబు ఘనము దీర్ఘ
హ్రస్వములును స్థూల సూక్ష్మంబులాదిగాఁగఁ
గడచె "క్షయ వత్సరంబా! నక్షయయొ గాని.



౨౧౧

## స్మృతి

శ్రీ షబ్నవీస్ వేంకటరామనరసింహారావు గారు

సీ. సకలసత్కృతులందుఁ జాయపోలికనన్ను
　　ననుసరించినయట్టి వినయభరిత!
ప్రాణంబుకంటె న త్యధికంబుగను నన్నుఁ
　　బ్రేమించినట్టి స త్ప్రేమధామ!
స్వర్లోకమున కేగు సమయమందైననా
　　మాటదాటనియట్టి మహితశీల!
పెనుగష్టములయందు బెగడొందనీక న
　　న్నాదరించెడునట్టి ధీరచరిత!
తే. గీ. మగువ! నీఋణ మెన్ని జన్మములకైన
నగునె చెల్లింప నీమ సాయంబులేక?
జానకీ! నాయుదయలక్ష్మి సమసిపోయె,
నదయ వైసివె నను వీడి యరుగుకతన!

---

౨౧౨

## కలికాల మహిమ

శ్రీ మరింగంటి సీతారామానుజాచార్యులు గారు

---

మ. అరయన్ సజ్జనులన్ హసించు దురితుండా వాక్య సంశ్రోతలై
పరిపాలించరు భూపులాత్మగత సద్భావపరాకర్షులై
హరియో స్వాత్మనిధాన మర్త్యజన స్వాధీనముల్ జేసి సు
స్థిరచిత్తుండయి మానమూనె దురితుల్ శిక్షించకెంతేనియున్.
క. వేదోపబృంహణస్మృతు లాదినిఖిలగ్రంథముల మహా నీచముగా
వేదముల నపార్థముగా బోధయొనర్తురు సమస్తమును గన కలమిన్

౨౧౩

## గ్రంథాలయము

శ్రీ ఊటుకూరు అనంతరామయ్య శర్మ గారు

మ. కృతకృత్యుల్ మతిమంతు లుద్ధురజగద్విఖ్యాతు లుద్యత్కళా
తతిశ్రేయులు పూర్వకాలికులు నిత్యం బాంధ్రభాషాసతిన్
హితరీతిం గనవృద్ధినొందె నిపుడో హీనస్థితిం జెందె దు
ర్గతిపాలై చెందెను యస్మదీయులకు దౌర్బల్యంబు సూచింపుచున్.

ఉ. ఆంధ్రకళాసతీమణిని నారసి ప్రోచెడువారు లేక సై
రంధ్రియుబోలె దాస్యముఁ గరమ్ము భరమ్ముగఁ దోటిదుష్ట పౌ
రంధ్రులచెంతనల్పె సుకరమ్మె మనోవ్యథకాదె యక్కటా
ఆంధ్రజులార! చూచుటెట్లు లాదరణంబును జూపి కావరే.

గీ. అఖిలధార్మికచింత లందతివిముఖ్య
మమల ధర్మార్థకామమోక్షముల నెలవు
శాశ్వతాధికకీర్తి శశ్వత్కరంబు
నాంధ్రగ్రంథాలయమ్మె సుమార్యులార.

౨౧౪

## విద్య

శ్రీనలంతిఘల్ చక్రవర్తుల తంయాల వేంకట నృసింహాచార్యులుగారు

ఉ. భూరిగసంశయాపహరమున్ సుకృతావహమున్ బరోక్ష సం
చారమహార్థదర్శనము, సర్వవిలోచనమైనశాస్త్రమె
వ్వారికిదుస్సహంబగునొ, వారుమహాంధులటంచు నెన్న నా
నేరికినైనవిద్యను గ్రహింపఁగఁజెల్లును సర్వకాలముల్

౨౯౫

# వర్షర్తువు

శ్రీ శేషం జగన్నాథాచార్యులు గారు



ఉ. వారిదబృందముల్ దివిని వ్యాప్తములై దిననాథు దీప్తుల
న్నారయ మ్రగ్గఁ జేసె హలికావళి భూమిఁ బెకల్చి బీజముల్
వారక జల్లుచుండిరిక వావిరి పంకిలభాజియయ్యె నీ
ధారణి పల్లవాంకురితధామములై విలసిల్లె నెల్లెడన్.

సీ. విద్యుల్లతాజాల విభ్రమభ్రమణచే
భయదగర్జిత సముద్భ్రాంతమగుచు
గాఢాంధకారమై కప్పె వారిదపంక్తి
గగనభాగము కడు సొగసుఁదనర
చల్లనిగాడ్పులు చాలవీవఁగ జొచ్చెఁ
బకులరావముల్ పరగ హెచ్చె
పుష్పఫలాదులు భూరిమై ధరఁ బ్రాలె
వడి పరాగంబు దిగ్వ్యాప్తమయ్యె

గీ. నింతవింతయు నెన్నడు నెఱుఁగనహహా
వానగురియంగఁ జొచ్చె నిబ్బరము చాల
గుడిసెలోనికి బోయెదఁ గొమరుమిగుల
నిలువఁజాలను వెలుపల నిక్కమిపుడు.



౨౦౬

# పరిదేవనము

శ్రీ దొంతిరెడ్డి పట్టాభిరామారెడ్డి గారు



సీ. సిరిగుల్కు బంగారు చెలువంబు కళలీను
తిరుమేను సేవింపఁ దివురు టెపుడు
నిండుపున్నమనాఁటి పండువెన్నెలనేలు
చిరునవ్వుఁగనుఁగొని చెలఁగు టెపుడు
పరువంపుజాబిల్లి గరువంబణఁచుజాలు
నగుమోము వీక్షించు నయమదెపుడు
తరికొండజననమౌ వరసుధారసమును
మించుఁబల్కుల నాలకించు టెపుడు

గీ. నాగురుస్వామి నాతండ్రి నాదువేల్పు
నాదుపెన్నిధి గురుని నీనాఁడు బాపె
విధియటంచును మూరుచు వెతలనొంది
యొక్కయెడ చిత్తమునకొక్కయూహదోఁచె.

ఉ. శోకమెలంగరాదు మఱిపోయినపిమ్మట సేవఁజేయఁగే
రాకకు వీలులేదు యతిరాజుల పాలికి నేఁడుపోయి వే
నాకు జనించెఁగా కలతి నాదగు భ్రాంతి నెఱుంగఁబల్కెదన్
గాకయటంచు నేఁ దలఁపుఁ గాంచినయంతట దైవసూచనన్.



## ౨.౧౪
## శరదృతువు

కవిసార్వభౌమ శతావధాని శ్రీ వరుకూరు వేంకట శాస్త్రి గారు



శరదారంభ విలోల శుభ్రజలదవ్రాతాంతరేషు స్ఫుర
ద్ధరినీలప్రతిమానసూక్ష్మజలముక్పుంజాఃపరంజజ్వలుః
కలశాంభోనిధివర్ధితేషువిపులేషూర్మిప్రజేషుస్థితా
రమణీయాఇవవారిజాసనగురోశ్శ్యామాఅభివ్యక్తయః. ౧

కింవర్షాపగతటిద్వ్యాళముక్తనిర్మోకరాశయః
కించిత్కంచిత్తత్రతత్రమలినాశ్శారదాంబుదాః ౨

ఉచ్చైశ్శ్రవోభ్రముపతీధవళౌ మఘోనో
ద్వేవాహనేవయమపి శ్రుతవాహనాని
అస్మాస్వయుక్తమతినైల్యమిమాబభూవు
ర్ధారాధరాఃపరిగృహీతవలక్షభాసః. ౩

శరదవనిభృతేసముద్ధృతాస్తే
వటనిలయాఇవభాంతిశారదాబ్దాః
ఉదధివిరహజాతదేవగంగా
గురుతరపాండిమమండలాని వాభ్రే. ౪

వరగంధర్వముఖాంచితోగ్రహపతిమార్గే నేశుభే బాహులే
సమభూద్విష్ణురితిప్రమోదభరితైర్బర్హిణముత్కరైస్సత్వరం
అవదాతానిపటానిశోషయితుముద్ధాతానిగంగాంభసా
పరికీర్ణానిదివీవసంరురుచిరే పాథోభృతశ్శారదాః. ౫

రాజాసౌ పరిణీయదాస్యతి శరత్కాంతాం వసూనాంతతిం
నిశ్చిత్యేతికుచిద్ద్విజా ఇహసమాగచ్ఛంతిసన్మానసాత్
స్వర్ణశ్రేణికృతేతదస్య భృతకీభూతౌషధీసంచయై
రాస్తీర్ణాస్తరణాని వా శరవణాన్యుద్రేజిరే సర్వతః. ౬

## ౨౧౮

# దంతము

శ్రీ రంగాపురము వాడాల నరసింహము గారు



సీ. స్వాచ్ఛేష్ట నవ్యయోషాశిరోరత్నాంచి
            తాధరపీయూష మానియాని
చటుల నూత్న ముకుర చ్ఛవిగల జవరాండ్ర
            గండస్థలకుతుక్ గడపికడపి
లవణామ్లతిక్తాది లలితషడ్రసయుక్త
            దివ్యాన్నరుచు లెల్లఁ దెలిసితెలిసి
ఘృత తైల గుడపిష్ట యుతపక్వపంచ భ
            క్ష్యాంచిత సారంబులరసియరసి

గీ. వేసరితో వృద్ధతనఁజూచి రోసినావొ
ఉదయసమయాంగుళీ ఘాతకోర్చవైతో
మిట్టిపడి కదలివిడి తోబుట్టువులను
బాసిచనుటొప్పునే యగ్రభాగరదమ. ౧

ఉ. మోమును జిన్నఁబోవఁగను ముగ్ధలుసూచి హసించుచుండ నెం
తోమదిచింత నొందఁగను దిన్నని పల్కులు దుస్సిపోవఁగన్
గోమలదంతచేల మదిఁ గుందుచు వ్రాలఁగఁ బూర్వజన్మ హృ
ద్ధామముఁ బాసిపోతివె రదంబ కదంబపరిత్యజంబవై. ౨



౨౧౯

# కపోత విలాపము

శ్రీ శ్రీరామకవచం అనంతశాస్త్రి గారు



మ. దిశలాక్రాంత తమోభయానక దశాదృశ్యంబులై యుండెఁగ
ర్కశనిర్ఘోష వలాహకప్రకర మాకాశంబునుం గప్పె దు
ర్దశలం గూర్చెను గర్మబంధ మహహా దైన్యంబు పెంపొందెఁ దా
నశనోపార్జనబుద్ధినేగెను మదీయార్ధాంగి యెందుండెనో. ౧

ఉ. ఎంతటిదూరమేగినదొ యెంతటిదుర్దశఁ దూలియున్నదో
కాంత దురంతసంతమసకాలనిరంతరబాధ లొందెనో
వంతలఁ జిక్కి సొక్కి బలవంతపు వేదన నంతె మొందెనో
యింతిసిఁ బాసి యెట్లు భరియింతును ప్రాణముఁ దోఁచ దెంతయున్.

ఉ. శ్యేనము మెక్కెనో యురులఁ జిక్కెనొ రెక్కలు నొచ్చి సొక్కెనో
మానిని రాకఁ దక్కె బహుమార్గము లెక్కను చిత్తవృత్తి లే
దేని విపత్తుగూడ నిని యింతె యుపేక్షసహించియుందునే
కానసి కన్నులన్ గతముఁ గానక నేనిఁక నెట్లు దాళుదో. ౩



౨౨౦

# స్మృతి

శ్రీ చొల్లేటి నరసింహాశర్మ గారు



మ. శ్రీ శివరామ భట్టకులశేఖర యాశ్రిత లోకరక్షణా
శ్రీశివభక్త సత్యగుణ శిష్టుఁడ సోదర బంధుమిత్రులం
బాసి యథేచ్ఛనుంటకయి పాల్పడి యీభువి వీడనెంచితో
హా! నరనేక వీడిచన న్యాయమె వేంకటరామ ధీమణీ.



౨౨౧

# దైవకృప

శ్రీ పురుషోత్తమరావు గారు



నీదయాదృష్టి కలిగిన న్మేదినిపయి
నెందుకును గొరగానివాఁడేని భార
మించుకేస్ఫురింపక నిర్వహింపఁగలఁడు
త్యాగమువహించి పెద్దకొండంతపనిని. ౧

నీదయాదృష్టికలిగిన న్మేదినిపయి
కరకు కరవాలయునఁదెగ నరకునట్టి
కటికవాఁడయిననిమేష కాలమందు
భక్తిమార్గవర్తనుఁడయి పరగఁగలఁడు. ౨

నీదయాదృష్టి కలిగిన న్మేదినిపయి
కాసులేనివాఁడు పెబాసనంగ
సరసగుణగణాలంకృత జనముఁబొగడ
చిత్రముగ దానధర్మముఁ జేయఁగలఁడు. ౩

నీదయాదృష్టి కలిగిన న్మేదినిపయి
వావివరుసలు లేనట్టి పాపియైన
కూటసాక్ష్యముఁబల్కెడు కుటిలుఁడైన
మారుపుజ్జెంది యోగవిచారుఁడగును. ౪

నీదయాదృష్టి కలిగిన న్మేదినిపయి
కన్నమునఁబోయి దొంగిలి కన్నమునను
సులభముగవచ్చు పేర్వడ్డ చోరుఁడైన
యశమునందు నిన్గూర్చి కార్యార్థియగుచు. ౫



౨౨౨

# వసంత ఋతువు

శ్రీ జి. రాధాకిషన్ రావు గారు



కొదమ తుమ్మెద గమి ధనుర్గుణము చేసి
ఫుల్ల చూతాంకురముల నమ్ములుగఁ జేసి
కాముకుల డెందములఁ జీల్పఁగాఁ దలంచి
చాన! చనుదెంచె రాజ వసంతుఁడదిగో! ౧
రమ్య దీర్ఘికాంబువులకు రత్నకాంచి
కావితతికి విలాసినీ గణములకును
సోమరుచులకు పుష్పిత చూతములకు
నొసఁగు సౌభాగ్యమీ వసంతోదయంబు ౨
కర్ణములయందు నవకర్ణికారములను
కలితచంచల నీలాల కమ్మలందు
ఫుల్లనవమల్లికాశోక పుష్పవితతిఁ
దాల్చి వెలయింతురా ప్రమదాజనమ్ము. ౩
చందనార్ద్రహారంబుల స్తనములందు
వలయముల నంగదంబుల బాహులందు
నవ్యకమనీయ కాంచుల నడుములందు
తరుణులు ధరింత్రు కామసంతప్తలగుచు. ౪
కామశిథిలంబులైనట్టి గాత్రములను
వాఁడె యుచ్ఛ్వాసచేవీడు బంధములను
గలిఁగి దగ్గఱనేయున్న కాంతులందు
కమలనేత్రలు కమ్రవేమఁ గలిగియుంద్రు.

కాళిదాసు ఋతుసంహారమునుండి



౨౬౩

# వసంతము

శ్రీ అవధానం శేషశాస్త్రి గారు

---

సీ. వేలకుమించు బల్ వింతజాతులుగల్గు
నంటుమామిళ్లు సౌఖ్యంబు దెల్ప
నల్లంబుదనియంగ ఝల్లుఝల్లనరాలు
పూలొప్పుచెట్లు సొంపులుఘటింప
చిన్న కాల్వలగుండ సన్నగా బ్రవహించు
లహరీ విశేషముల్ లలిదలిర్ప
పలురహస్యముల కిమ్ములుగా గదనరారు
బహునికుంజమ్ములు పరిఢవిల్ల

గీ. భళిరభాసిల్లు చిత్రసంపన్నమగుచు
జూచువారికి మిగుల దృష్టులకు భ్రమను
గలుగజేయుచు లక్ష్మీకాకరమునగుచు
భద్రకరమైన సుందర భవనమనగ ౧

సీ. చివురుటాకులమెక్కి చెలగిజొంపములందు
నిలచి కోకిలలు వా నేర్పు నెరప
విహితపత్రములైన వృక్షజాలములెల్ల
కిసలయంబులతోడ నెసక మొసగ
కమనీయతరములై గంధవాహంబులు
జనులకు మిక్కిలి సౌఖ్యమొసగ
దినములకంటె రాత్రిగణంబులేచాల
సౌఖ్యకారణవిశేషము వహింప

గీ. నెందుజూచిన మల్లెపూల్విందుసేయ
మహిమ పెంపొంది సౌఖ్యధామంబుగాగ
నలరెడి వసంతఋతువెన్న నగునె మాకు
బ్రహ్మకైనను వేనోళ్ల వానికైన. ౨

---

౨౨౪

# ధనగర్వితులు

శ్రీ గార్లపాటి రాఘవరెడ్డి గారు



గీ. బీదలను గొట్టియును దిట్టి సాధులట్టి
వారికట్టులఁ బెట్టి పాపమొడిగట్టి
యక్రమంబుగ ద్రవ్యంబు నార్జనంబు
చేసినామని గర్వించు చెనఁటులార! ౧

గీ. పడపుఁ బడఁతియుఁ గడియించు బాకిదియును
గూడఁబెట్టును దెరవాటు కడుఁగూర్చు
న్యాయమును వీడి ఘనతఁ బో నాడిభూత
దయవిసర్జించి యార్జించు ధనము ఘనమె. ౨

మ. ధనముం గూర్పఁగ న్యాయమార్గములఁ దద్దన్ గూర్చి శ్రీశుండు సా
ధనమాదానసె పాపభీతివిడు దుస్తంత్రాళిచేఁ గూర్చు మీ
ధనమేలక? గనలేదె మీవలనె యీ ధాత్రీతలంబం దనే
కనరుల్ మారిచి సీల్గిరందు నొకఁడున్ గర్వానఁ గొంపోయెనే. ౩

చ. మఱచియుఁ జేయఁబోవరొక మాఱుసహాయము నేరికేని సా
దరమున దీనమానవులఁ దగ్గఱదీయఁగలేరు సత్కవీ
శ్వరులను సత్కరింపఁగల వారలుఁగారిఁక నింతమాత్ర కే
గరువముఁబూననేటికి? జగంబున మీరలికెందు మిన్నలో! ౪

గీ. సత్కృతుల కై వ్యయంబును సల్పనట్టి
విబుధ సత్కారమున వెచ్చఁ బెట్టనట్టి
హితులకాపదవేళ నందీయనట్టి
ధనము వహ్నిని వ్రేల్చు నింధనము నిజము. ౫



౨౨౫

## సూర్యాస్తమయము

శ్రీ మాడభూషణం దేశికాచార్యులు గారు

శ్లో. నమఃకమీణకరోమ్యేనం వమంతంధామసామగం
నమస్యల్లోక చిత్తైక శర్మదంకర్మసాక్షిణం. ౧
శ్లో. అప్రియాయామయో భాస్వాం శ్చరిద్వ్యాపి సతాంపథి
విశేష్యవారుణీంకాలా ద్ధంతిస్నాతుంగతోంబుధిం. ౨
శ్లో. పాశ్చాత్యపానీయనిధౌ పపాతైషపతిస్త్విషాం
పశ్యతా రాగణవ్యాజా దుత్పతంతి పృషంతిచ. ౩
శ్లో. ఆకాశవృక్షాన్మిహిరాపదేశా త్ఫలంసముద్రస్యతలేపపాత
తదుత్థితాంభఃకణసన్నికాశాః స్ఫురంతినక్షత్రగణాస్సమంతాత్.
శ్లో. వసుమాన్ తరణిర్మజ్జత్యధునాపశ్చిమాంబుధౌ
ఇతివ్యోమాగ్రమాక్రమ్య క్రందత్యండజమండలీ. ౫

౨౨౬

## గోపికా విలాపము

శ్రీ యామవరం వేంకట రాజశర్మగారు

మ. కచసౌగంధ సుమాపకర్ణణకటుం గాంతాముఖాబ్జాత భా
స్కుచసంశ్లిష్టవధూవిలాసు నధరాంకూరామృతాహారు ద్వ
క్ప్రియచయానందకరాంగునిం గనినచో రామల్మనోజాత బా
ణచలత్స్వాంతలు గానిచో శిలలపో నారీమణుల్ భూస్థలిన్. ౧
ఉ. మెచ్చి కనుంగొనంగను సమీపముచేరి సుమాస్త్రకేళిలో
ముచ్చటలుగ్గడింపుచు ప్రమోదముఁజెందఁగఁజేరి తల్లప్రో
ల్లచ్చికి పంచపందిరుల లాగుననుండు వనంబులోనికిన్
బొచ్చెములేని గూర్మిఁగల పొందొనరించిన మానరెవ్వరున్. ౨

# నిశీథము

శ్రీ చెరుమట్ల నారసింహాకవి గారు



క. వరకిసలయమంశుకభా సురవిద్రుమములకుఁ దనరు శోభితము లగాఁ
బురణింపనరుణరుచిచే జరతారాల్తపములింపెసఁగెఁ బేశలమై ౧

గీ. భుజగభుక్కాంత కలకంఠపురవిరోధి
కంఠకాదంబకాకోల కాకవితతి
తనమురుచిరంబుచేఁ గేరననువుఁ దనరి
యురులువాటిల్లె జనులకబ్బురముగాఁగ. ౨

సీ. జలజాప్తుఁ డబ్ధి గ్రుంకులిడంగఁ బైకుబ్బు
పూనికఁ బెల్లెగయు తుంపురులనంగఁ
గమలియల్లక్ష్మి శృంగార కలాపోన్న
తముల కైకూర్చు ముత్యములనంగ
లలిదేఱి కాలమాల్యకరిఁదా గగనదే
వతమైనిఁ జల్లుపువ్వులనంగ
నమరులాశశికళోఁ గ్రక్కనుముఁ గ్రోలెడివేళ
లను జారనగు సుధాకణములనఁగ.

గీ. ప్రాగ్వ్యఘూఘున హేలానుభవకరండ
మటుల బిసల్లి చిత్రంబు లలవరింప
బరఁగివిరిసిన కపురంపుఁ బలుకులనఁగఁ
బెక్కులై క్రిక్కిఱిసె మింటరిక్కగుంపు 3

శా. అంధప్రక్రియలంది పుల్లుగమి డాయంబోయి యత్రాత్తిమో
హాంధత్వమ్మున మేచులన్ నిమిరి యహాహా కెంపియూ దాఛనా
సంధిన్ ప్రమ్మ్రేడస్సినల్లడలఁ గాంతుం జెంది కంజస్థితిన్
జెందెన్ వేజతపక్షి గానకరవల్ చర్చింపఁ గాఁజక్రముల్ ౪

సీ. మేల్త్రోపనగు కప్పుకాల్ద్రాపు హారముల్
గళములందొకవింతఁ జెలువలర్ప
మించుతళ్కులజమాయించు నెమ్మేనుల
జెలిమికస్తురిచుక్క చీరలమర
చెలఁగుచన్నవలము స్త్రీము గాఁగనునీలి
రవికలు బలుకేవి రాజిలంగ
వితతమహామృగనాభి వెడదయానెదగుంపు
లందలి తావులు గ్రందుకొనఁగఁ

గీ. దల్లుననులీలఁ బెల్లించి కల్లపల్కు
తెల్లమగలకువ్వాక్కుచ్చియింపు సొంపుఁ
జెంపు వాటిల్లఁ దమతమప్రియులఁగదియ
నేగి రభిసారికాంగన లిరవలర్చి. ౫

మ. తరుమూలంబుల భిత్తిసంఘముల చెంతం గొండలందన్ సరో
వరతీరంబులఁ బొడు దేవళములన్ వంగళ్ళ బెంపూడ్చి బ
ల్సురతభ్రాంతిఁ బొసంగ సుందరులపై శోభాయమానోన్నతుల్
నెటిఁదూలన్ భుజఁగుల్ మెలంగిరటు మేన్నిటుల్ ప్రశంసించుచున్.



౨౨౯

# గొల్లఁడా!

శ్రీ కేశవపంతుల వేంకటనరసింహ శాస్త్రిగారు



మ. పరకీయాన్నముఁ గోరవీవను జగత్ప్రఖ్యాతి నిక్కంబుగా
నరుణోద్యద్గమనంబుఁజూచి వెస నీకై నీవె నీయింట నా
పరమాత్మున్ దానఁగూర్చినట్టి కలియో పక్వాన్నమో మెక్కి దు
ర్భరమోదంబున నేగుచుందువట నీ భాగ్యంబదేమో కదా. ౧

మ. రసనా చంచలతన్ గణింపవు లసద్రాజీవ పత్రాక్షులిం
పెసలారన్ బరిచర్యసేయ నది పాపీయస్త్వ సంపాదకం
బసిరోయంచుఁదలంచి పోయెదవు నీ వేవస్తువున్ గాంచి దు
ర్వ్యసనంబున్ మనిడింపఁగల్గితివో ధీరా! చెప్పుమో గొల్లఁడా. ౨

చ. కృషికులు నిన్ను నీచుఁడని గేలినొనర్ప గణింపవైతి ప్రా
వృషికపయోదజాల జలవేగమునన్ భయమొందవీవు పం
చషముగు తానకంబువడి సాయముగాఁగ మృగేంద్రుడైన నా
మిషమును మెక్కనీవు తరమే వచియింపఁగ నీదుచెయ్వులన్. ౩

ఉ. క్రేవలఁ గొన్నిపూరిఁగొనఁ గ్రూరవృకాళి యొకింత దూరమం
దావికభీషణార్భటుల నాడ భవత్ప్రభుతా విశేష సం
భావనమద్దిరా యన భ్రమన్ బురికొల్పెడి నీదుసింహ నా
దావళి వీనులారవిను ధన్యతముండవెవఁడయ్య గొల్లఁడా. ౪

మ. భవుఁడో మాధవుఁడో విధాతయొ శచీప్రాణేశుఁడో కాక నిం
కెవఁడో నీహృదయాబ్జవాసి కన నీకే వేద్యమానాకు నీ
వవనిన్ మౌనముతోడ నేగుటయు నూహా బాహ్యమాపల్కు లి
య్యవియే గోచరమింతకేది నిజమూహల్ సేయనో గొల్లఁడా. ౫



శ్రీ

# దుష్టసతి

(శ్రీ యాముజాల వేంకటశాస్త్రిలవారు

---

సీ. వినుఁడు పితామహ వినయవిహీనయై
పతియాజ్ఞ జరుపని భార్యయేల
ధర్మార్థ కామాదికర్మలకెల్లను
మూలమే భార్య సత్పూజ్యమైనఁ
గాకుండి శుభవిఘ్నకారిణియై క్రూరయై
మేరమీరి స్వతంత్రధారియగుచు
భర్తనుల్లంఘించి భయభక్తులెడఁబాయు
భార్యనువిడుచుటే భావ్యమనుచు
గీ. వేదశాస్త్రములును వివిధపురాణము
ల్వాదకిజూచి వారు వేరువేర
కోరిజెప్పిరన్ని క్రూరభాషిణియైన
భార్యసేయుపనులు పతినివిడిచి. ౧
సీ. కఠినురాలై క్రౌర్యకార్యముల్సేయుచుఁ
బతితోడ కలహించు భార్యయొకతి
బుద్ధివిహీనయై ప్రొద్దులుబుచ్చుచుఁ
పొరిగిళ్లుదిరిగెడి పొలఁతియొకతి
పనులుసేయకనింట పాలుమాలుచునుండి
సోదిమాటలుజెప్పు సుదతియొకతి
పరులతో ఘనమని బలుమాటలాడుచుఁ
బకపకనవ్వెడి పడఁతియొకతి
గీ. మగనిమాటవినక మారుమాటలుబల్కి
భర్తతోట్టి తిరగబాటుజేసి
తనకుతోచినంతె ధర్మంబటంచును
వినని భామ నపుడె విడువవలయు. ౨

---

౨౩౦

# మాతృభాష

(శ్రీ గంగా లక్ష్మన్న గారు



మ. మనమీరీతిగ మాతృభాషలను సన్మానింపుచున్ వేడ్కమై
మనుపంజాలక మూలఁద్రోసిన ఘనంబాయంచు జాత్యేతరుల్
మనమందక్కటికంబు దక్కకను వెల్వన్ వారలెగ్గాడ నే
మనఁజాలంగలనయ్య మానములు పోనై యుండఁగా నీయెడన్. ౧

గీ. ఆంధ్రులే తప్ప నితరు లేరైనఁ గాని
మాతృభాషను గాదని మారుభాష
నభ్యసించిరె భూలోకమందు నెందు
మానధనులార భాషాభిమానులార. ౨

మ. కరుణాసార పరంపరల్ చిలుకుచున్ గౌతూహలంబొప్ప శ్రీ
కరులారా! మఱి మీరు నాదరమునన్ గన్గొంచు సొంపారఁగాఁ
గరమున్మాతృకమైన యాంధ్రసుకలాకాంతామణిం బ్రోవఁగా
నరుదా మాతృక కీర్తికై బరఁగదే యాచంద్రతారార్కమున్. ౩

గీ. మానసమునందు కడునభిమానముంచి
మనుపుఁడీ మీరు దయతోడ నాంధ్రభాష
దాన మీగౌరవము లేమి తగ్గిపోవు
కులము వెలిగాను కీర్తియుఁగోలుపోదు. ౪



## ౨౩౧

# పాండవుల సందేశము

శ్రీ మేడిశెట్టి వీరాస్వామి గారు



తే. గీ. భండనంబున కురుపతిఁ బరఁగ నేఁడ
చెండివేసెద నిదెచూడు ఖండితముగ
మండలేంద్రుని యాజ్ఞలో నుండనేల
కొండలడవులయందును గుండుచుండ ౧

ఉ. ఈరును వేగ దంతిపురి కేగి ముదంబున వారితోడ సత్
కారణకార్యముల్ మిగుల గల్గినఁ గీడు జయంబు ధాత్రిలో
వారక నొంచు నిర్వురకు వైరము వద్దని చెప్పి యెంతయుఁ
గోరుమ యైదు గ్రామములఁ గూరిమి నిచ్చినఁ జాలు మాధవా. ౨

క. ఒడఁబరచి మాకు వారికి
పుడమి సగముఁ జేసి పొందుపొసఁగి మనుచు నం
డెడునట్టి తెరఁగుఁ జేయుట
కడు మేలది గౌరవము సుఖంబును గల్గుఁ. ౩

తే. గీ. కౌరవేయులు పాండవుల్ గలిసియుంట
స్వప్నవార్తయె గాని నిజంబు గాదు
ఎట్టులైనను సంతసమే జనించుఁ
గాన కోరుము సగఁబాలు మానివినుత. ౪

తే. గీ. పాండవేయులు కౌరవుల్ పుండరీక
యొక్కటే గద బంధుత్వమునను మాకుఁ
గాన వారలు మేమును గలసిమెలసి
యుండునట్టుల నొనరింపుమో గుణాఢ్య! ౫



౨౩౨

# హనుమత్ ప్రతిజ్ఞ

శ్రీ తుమ్మగోటి సోమశేఖర కవి గారు



ఉ. భూరితరంగ మాలికలఁ బుష్కరమార్గము నడ్డగించు నీ
వారధిదాటి రాక్షస నివాసముఁ జొచ్చి విదేహ రాట్పుత్రికన్
ధీరతఁ జూచి రేపిటకుఁ ద్వీపముగాఁ జనుదెంచకున్న నే
మారుతినే మదీయఘన మంజులవాలము వజ్రతుల్యమే. ౧

ఉ. దూరమె వాయుపుత్రునకుఁ దోయనులేమను పిల్లకాల్వ లిం
పారఁగ మీరుఁ జూడ లవణాంబుధి గోష్పద లీలఁ దాటి వే
సారక లక్ష్మణాగ్రజుని సాధ్వి సువార్తనఁ దేకయున్న నే
మారుతినే మదీయఘన మంజులవాలము వజ్రతుల్యమే. ౨

ఉ. క్రూరుఁడు రావణుండిపుడు కోమలిఁ దాచినఁ జూపుమంచు నే
దారుణలీల వాలమునఁ దప్పకఁ గంఠములన్బిగించి యా
నీరధి ముంచియెత్తుచును నిక్కముగా నిటుఁ దేకయున్న నే
మారుతినే మదీయఘన మంజులవాలము వజ్రతుల్యమే. ౩

ఉ. మీరినయుక్తి శోధనల మానవిలోచనఁ జూచువేళ నా
బారినఁబడ్డ రాక్షసులఁ బట్టివధింతు సురారులంతటన్
బీరముఁదక్కి కాననకు భీతిని బారఁగఁ జేయకున్న నే
మారుతినే మదీయఘన మంజులవాలము వజ్రతుల్యమే. ౪

ఉ. శూరుఁడనై విదేహజనుఁజూడక వత్తునె జాంబవంత గం
భీరపరాక్రమప్రకట భీకరవాలము గ్రాల లంకలో
మారిమసంగిన ట్లసురమండలిఁ గూల్చుటరాకయున్న నే
మారుతినే మదీయఘన మంజులవాలము వజ్రతుల్యమే. ౫



## ౨౩౩
## ఉత్తర ప్రబోధము

శ్రీ బి. వి. రామరాజుగారు

చ. అరదము డగ్గి చెచ్చెఱ నగవాహపుఁ డాయెడ జేని గానమిన్
మరలి విచారతప్తుఁడయి మత్స్యనృపాల తనూజుఁడైన యు
త్తరుని నృపాంగనామణుల దండవసింపఁగఁ గాంచి మ్రొక్కి యా
కరణి వినమ్రుఁడై పలికెఁ గంపితగాత్రి భయాంతరంగుఁడై ౧

చ. మును మనుజేంద్రుఁ డాడె సభఁ బ్రోల మదీయతనూజుఁ డాజి దు
ర్జనరిపు మండలప్రణుత చండతరోగ్ర సమగ్రశస్త్ర సా
ధనుఁడసమాన దోర్బలుఁ డుదారగుణుండని నిన్నుఁ గాన నీ
వని యొనరింప లెమ్మిఁక నరాధిపనందన జాగ దేటికిన్. ౨

మ. అరిదుర్వార భుజప్రతాప రణశౌర్యాఢ్యుల కోదండ ని
ర్భరచక్రాసిగదాస్త్రపూర్ణ నటనప్రాగల్భ్య మెల్లన్ భవ
త్కరనిర్ముక్త శరప్రయోగగరిమన్ ధ్వస్తంబు గాదే జగ
ద్భరణాయత్త కనత్ప్రభావుఁడ వసాధ్యం బెద్ది నీ కారయన్. ౩

## ౨౩౪
## ఋణబాధ

శ్రీ అబువాల శేషయ్యశర్మగారు

చ. పసగలయన్ని నాళ్లు తమబంధువులాప్తులమంచు వత్తురా
పస చెడిపోవ నెవ్వరును బంచకుఁ జేరరు బిల్చుచుండినన్
వినుకునఁ జెంది కోపమున భీషణ వాక్యములాడుచుంద్రు నల్
దెసలకుఁ బర్వులెత్త నరుదేరరు గావఁగ నెవ్వరేనియున్. ౧

గీ. మహిత మకరంద ముండఁగ మధుపచయము
పుష్పములఁ జేరుచుండును ముదముతోడ
నట్టిమధువును గోల్పోవ నంతవిరుల
చెంతఁ జేరునె తలఁపఁగా సంతసమున. ౨

## ౨౩౫
# ధన్యులు.
శ్రీ పోతంశెట్టి బాలయోగి గారు

సీ. అష్టాంగ యోగముల్ గష్టసాధ్యంబులే
　　　　యైననవియె పరమార్థమగుట
నిగ్రహంబును నపరిగ్రహంబు నహింస
　　　　సత్యము లను యమ సంజ్ఞఁ దెలిసి
వీరాబ్జసిద్ధమయూరాది కాసన
　　　　ములయందు స్థిరముగా నిలువఁగలిగి
ప్రాణాదులను తమ వశమొనర్చు కరేచ
　　　　కము పూరకము కుంభకములఁ దెలిసి
గీ. పొరలివచ్చెడి సంకల్పముల జయించి
నిగ్రహంబున బుద్ధి నేకాగ్రపరచి
ధ్యానమున మగ్నులౌచు సమాధినొందు
నట్టివారలె ధన్యులైనట్టివారు

---

## ౨౩౬
# నారికేళము
శ్రీ కొత్వాలు రామరాటుగారు

చ. ఫలభరితంబులౌ గెలలఁ బావనమౌ చదలేటి నీటితో
నిలసమమైన తియ్యఁదన మిచ్చుచుఁ దెల్లని నిగ్గులీనునా
సలిలము దెల్పు నిట్లనుచు సజ్జనులై సుయశోవిరాజమా
నుల కనువైనచోటు గడునున్నతమైనది విష్ణులోకమే. ౧



౨౩౮

# వర్షర్తువు

శ్రీ చెన్నమాధవ వేంకట రామరాజు గారు



శ్రీరామః ప్రదిశేచ్ఛుభం సభవతాం హంసస్తుతోద్యద్యశాః
సత్యానందకర స్సురాంగవరదో గోరాజసంసేవితః
కృష్ణో నంతమనోజ్ఞభోగరుచిర స్సద్ధర్మభృద్విగ్రహో
భాసీశేజపదస్థితో బుధగురుస్సంస్తుత్య ధామాఘుడః. ౧

సీ. అఖిలాగమప్రీతి నావహించుటచేతఁ
బరపయోధరభారభరణచేత
శరజన్మహేతువై మెరయుటచేతను
బరమ హంసాళి శంప్రదముచేత
పూజ్యాజభాహారముఖకాంతిచేత నా
యమృతంపుగోనివహంబుచేత
నతనుసుఖావాప్తి నలరియుండుటచేత
నీలకంఠప్రియ లీలచేత

గీ. వామ దేవాంగనారీతి వర్షఋతువు
వెలయుచుండఁగ నప్పుడు విశదముగను
మెరుములుత్తరదిశయందు మెరయుచుండఁ
బడమటను నింద్రచాపంబు ప్రబలుచుండె.



౨౩౫

## మంథెనద్విజులు

శ్రీ తిరువరంగం పాపయ్య శాస్త్రి గారు

సీ. నేపాలదేశావనీపాలసభలలో
నగ్రతాంబూలంబు లందినారు
ఆదరంబొంది బరోదాధిపునిచేత
వస్త్రాశనభృతులఁ బడసినారు
పూనానగర రాజధాని రారాజుచే
నగ్రహారాదుల నందినారు
గద్వాల సంస్థాన విద్వత్పరీక్షలో
మనవారలదియె పెట్టినది భిక్ష
గీ. అరయనిట్లు స్వదేశదేశాంతరముల
స్థిరతరంబైన కీర్తి నార్జించి రట్టి
వారలొక్కరిపుడు లేకునికి వలన కనుల
నీరు రాదొకో మంథెన్న నిలయులార.

౨౩౬

## కురంగమా!

శ్రీ బాలకవి అమరవాది వేంకటనరసింహాచారి గారు

చ. హరిణి తపోవనంబిది మహాసుఖకారి యటంచు భ్రాంతిచే
నరగితివెందు కచ్చటికి నమ్మ కిరాతపురీవరంబునన్
నరుకుము మ్రింగు ప్రాణముల నల్పుము జీల్చుమటంచుఁ బల్కెడిన్
దురవహశారికానికర దుర్భరవాక్యము లన్ని వింటివే. ౧
చ. జ్వలనసమావృతాటవియుఁ జక్కఁగ దిక్కునవాప్తపాశమున్
సలిలము నజ్జ్వలద్విషము సారెకు సారెకు గర్తమైన భూ
తలమున నిన్నుఁ జుట్టిరి మదంబునఁ జాపకరుల్ కిరాతకుల్
పలురక మేల వచ్చితివి బాలురతో నకటా కురంగమా. ౨

౨౪౦

# దంపతివాదము

శ్రీమత్తిరుమల పంచాంగం వేంకటాచార్యులు గారు

---

సీ. జూదంబు ధర్మంబు గాదు నాథాయని
పలుకదే భీమ భూపాలపుత్రి
వేటాడ నంపుఁడీ వీరభటుల నని
తెలుపదే చంద్రమతీ లతాంగి
చనకుఁడీ మీ రిప్పుడని నొనరింపఁగా
నని వాలితోఁ దార యనఁగలేదె
పరసతులను గోరభావ్యంబు గాదని
దశముఖుతో మయతనయ యనదె
గీ. బోటులాడిన మాటలఁ బాటిచేసి
వీరు నెలఁతలఁ గడుఁ గౌరవించినారె
సతుల మాట లవిన్న మీ మతులు సెడవె
సాటివారలతో నగుఁబాటుగాదె ౧

సీ. దాక్షాయణిం గోర్కె దక్షాధ్వరంబున
కనుపడే శంకరుం డనఘుఁడయ్యు
కైకగోరిన రాముఁ గన్నకుమారుని
దండకాటవికంపె దశరథుండు
జానకి గోరఁగా జనియె లోకేశుండు
హేమమృగము వెన్క రామవిభుఁడు
పారిజాతము సత్యభామ గోరినఁ దెచ్చెఁ
బాకారిఁ గెలిచి గోపాలవిభుఁడు
గీ. పూరుషుని కమృతమ్మై యొప్పు బోటిపలుకు
చెప్పినట్టుల సేయుటఁ గొప్పపదవి
నాతి వెనువెంటఁ దిరుగుట నాకపదము
వినక యుండుట యెట్టులో కనకగాత్రి ౨

---

౨౪౧

# శ్రీకృష్ణవిలాసము!

శ్రీ కాళ్ళూరు సీతారామరావు జమీందారు గారు



క. ఇక్కడనునిచితి పాపని
నిక్కడఁ గ్రీడించకోమరుఁ డికనేమందుఁ
మిక్కుటమూయెను దుఃఖము
తక్కువకాదకట సుతుఁడు దక్కకయున్నన్. ౧

గీ. పాప! నీకయి యీపెద్ద పాడుగాలి
మృత్యువై వచ్చి చెచ్చెర మీఁదికెగరఁ
గొట్టుకొనిపోయె నేమందు కొడుకనీదు
చేష్టలన్నిఁటి మదినెట్లు చింతసేతు. ౨

ఉ. ఘోరనిశాచరుండు తనుగొంచు దివంబునకేగ బాలుఁడం
భోరుహపాణి యుగ్మమున భూరిశరీరు కఠోరకంఠమున్
జేరగఁబట్టి శల్యములు చిందరవందరమై ధరంబడన్
జారగద్రోచె వజ్రి కులిశక్షతిఁ గూల్చుధరాధరంబనన్. ౩

ఆ. ఇట్లు ధరనుగూల నిలఁగలగోపికా
జనము సంతసించి చక్కనయ్యఁ
దెచ్చి తల్లికీయ దీనమానసయగు
తల్లి జెందె ముదము వెల్లివిరియ. ౪



౨౮౨

# చిలుక

శ్రీ జాతక మార్తాండ ఆరుట్ల వేంకటనృసింహాచార్యులు గారు



సలలితోద్యాన వనముల సంచరించి
పుష్పసౌధాగ్రముల యందుఁ బొంచి నిద్ర
నుంకనిలయానిలసినాద మహిమతోడ
నీదు మృదుమధుర వ్యక్తి నిస్వనంబు
మేళవించియు తరుల సమ్మేళనముగఁ
గూడి ప్రకృతి విచిత్రముల్ పాడుకొనుచుఁ
గవికుమార సుఖంబులఁగాంచినావు
బరగ స్వేచ్ఛాను సంచార నిరతవగుట
సౌఖ్యమునఁ గాలమంతయు జరిపినావు
చిలుక నీకీసుఖంబు శాశ్వతమె యెపుడు
మిగుల సుందరమగు నీదు మేనుఁగాంచి
మధురసముఁజిల్కు త్వద్గాన మహిమనరసి
చిన్నిబాలుండు పాల్ద్రావ చన్నుమరచె
నేడ్పుఁజాలించి తల్లిరాకెపుఁగడయ్యె
పంజరంబున బంధింపఁ బడుదువీవు
నైన దుఃఖింపవలదు నా యానసుమ్మ
బ్రహ్మ లిఖియించు వ్రాతఁ దప్పంగఁదరమె
బంధమున మోక్షమొదవు నిర్బంధముగను
జిలుక దీని నెరుంగు నిశ్చింతసుఖము.



## ౨౪౩

# ఆయుర్వేదము

శ్రీ పి. వి. వరదాచార్యులు గారు



ఉ. శ్రీకరుఁడా పరాత్పరుని సేవలఁజేయుచు సాధువృత్తిమై
ప్రాకట వైభవంబుల నపారసుఖంబులఁ జీవులందఁగా
నాకరముల్ శరీరములె యయ్యదె సత్యము భూతలంబునన్
లోకులకెల్ల తెల్లమది లుప్తతనొందఁ జగంబె లుప్తమా. ౧

ఉ. కాన శరీరమాద్యమనఁ గాఁదగు ధర్మమునాదరించియే
మానవులీప్రశస్తమగు మార్గముఁదప్పక సంచరింతురో
యానయశీలులైన ఘను లాయురభీష్టఫలంబులంది స
న్మానితులై ప్రజాళిరుజ మాంద్యములేక చరింతురెయ్యెడన్. ౨

శా. ఆయుర్వృద్ధి వినాశధర్మముల కత్యంతంబు సుస్థానమై
యాయారోగములందు పాకవిదశా వ్యాపారపారీణమై
యాయావ్యాధినిదానసాధనల సత్యస్ఫూర్తి కాధారమై
యాయుర్వేదముసెల్లు నీయిలను సౌఖ్యానంద మందారమై. ౩

శా. మీయుల్లాసము దేహదార్ఢ్యమునదా మీయాత్మశక్త్యాదులున్
శ్రేయో వృద్ధులుగోరి యాశ్వినులు దా రేయింబవల్ గావఁగా
నేయేరోగములున్న నేమి వినుఁడీ రెక్కాలమీయుర్విలో
నాయుర్వేదము నాదరించి గనుఁడీ యారోగ్య మాయువ్యమున్

చ. వరమతులార మీకొక సువార్తను దెల్పెదఁ జిత్తగింపుఁడీ
ధరనెట నెవ్వఁడుద్భవిలు తద్దగఁబుట్టిన యౌషధంబుత
న్నరహితమౌ చరించును మనంబుల నన్యధరోత్థమూలికా
వరములఁజేయఁబోకుఁడీ కృపామతి మీజనయిత్రిఁజూడుఁడీ ౫



౨౪౪

## శ్రావణి

శ్రీ వెలికట్టె నరసింహాచార్యులు గారు

మ. కరిసంఘంబులరీతి నాకసమునన్ గాదంబినుల్ దక్షిణో
త్తర దిగ్భాగములన్ జరింపుచు వడిన్ ధారాళిచే నీరముల్
గురియన్ సస్యములెల్ల సుందరముగా గ్రోగ్రాస సంపూర్ణమై
నరసంఘంబులకెల్ల హర్షముగ విన్నాణంబుగా నొప్పెడిన్. ౧

మ. ఎచటన్ జూచినఁ బాడిపంటలు మహిన్నెవారి సౌఖ్యంబుచే
రుచులుంగ్రోలుచు మానవుల్దనువులన్ రోచిష్ణులై దేవతా
నిచయంబుల్ తగు పూజలందుటకు మున్నే జాజిమొల్లల్ లతాం
త చమత్కారములయ్యె మానవనముల్ తత్కాలశోభాకృతిన్.

మ. వరలక్ష్మీవ్రతమున్ సుమంగళముగా వర్ధిల్లు గౌరీవ్రతం
బరయన్ కృష్ణునిజన్మ సద్దివసమున్ హర్యక్షరాశిం దివా
కరుడుంటన్ దగు పౌర్ణమీశ్రవణ నక్షత్రంబుతోఁ గూడి భూ
సుర దేవాళికి పూజ్యమై వెలసె విట్పాద్రాది సంఘంబుచేన్. ౩

---

౨౪౫

## ప్రభాతము

శ్రీ చింతామణి నరసింహాచార్యులుగారు అష్టావధాని

మ. నళినీ పుణ్యఫలంబు కోకమిథునానందాలవాలంబు ది
గ్వలయాలంకరణంబు మోక్షపదవీ ఘంటాపథంబంబర
స్థలమాణిక్యము బ్రహ్మవిష్ణు శివతేజఃపుంజ మాపాసకో
జ్వలనిక్షేపము భానుబింబము ప్రకాశంబయ్యెఁ బ్రాచీదిశన్. ౧

గీ. పూర్వపశ్చిమ దిగ్భాగముల నలంకృ
తంబులై సూర్యశశిమండలంబు లొప్పె
హరుని తేరికి బండికండ్లైన నాటి
చంద మిటువంటిదని తెల్పు జగములకును. ౨

౨౮౬

## విద్య

శ్రీ చక్రహరి నారాయణభట్టుమూర్తి గారు

సీ. రారాజచంద్రుఁడై రంజిల్లిననుగాని
విద్యాధికునె గారవించుచుండ్రు
నీచుఁడైననుగాని నిరుపమపాండిత్య
మునఁగదా సభలోన ముఖ్యుఁడగును
వికటరూపుండైన విద్వాంసుడగుటచే
పలువిధంబుల శ్రీలఁగులుకుచుండు
ధనవంతుఁడై లోక ధన్యుఁడైననుగాని
శాస్త్రజ్ఞులనుజాల సన్నుతించు
గీ. ఐహికంబెల్ల విద్యచే లభ్యమగును
దుదకు మోక్షంబునకు నిదే తోడుపడును
విద్యయే మానవాళికి వినయమిచ్చు
గానదీనికి సాటియే కానమెచట



౨౮౭

## కార్పాసలక్ష్మి

శ్రీ వానమామల జగన్నాథాచార్యులు గారు

సీ. తలదాఁచుకొనుటకై తగునీడయునులేని
యొకచిన్నగుడిసెవా రుండువసతి
యాదాయమది ఱోళ్ల యడుగునఁబడియున్న
నొకకొన్ని గింజల నూడ్చుకొనుటె
భార్యయా తానొక పరమసాధ్వీమణి
యిలుదాటి పొరుగిల్లు నెఱుగదెపుడు

మానమ్ముగాపాడు మాత్రపుంజినుంగుడు
          వెలికే వారికి చాలకరువు
గీ. ఇట్టికష్టజీవనమున నేని నాథు
ననదుపల్లెత్తుమాటయున్నైన నెపుడు
పతిపదారవిందములె శ్రీపతిపదార
విందములటంచు లక్ష్మినా వెలసెభువిని
వరదగురుగృహలక్ష్మి కార్పాసలక్ష్మి-



౨౪౮

## మాతృఋణము

శ్రీ వానమామల వరదాచార్యులుగారు

---

సీ. కనరాని ననునీవు గర్భంబునన్ దాచి
          నవమాసములు పెంచు నాంటిఋణము
దుస్సహప్రసవార్తితోంగని యొడిగట్టి
          కంటకన్నిడిసాకు తొంటిఋణము
సవ్యాపసవ్యహస్తములంటియెత్తుచు
          మూత్రపురీషాల మున్గుఋణము
రుధిరమ్మె స్తన్యమ్మ రూపుగ చేపురా
          నర్లొంది చన్నిచ్చు నట్టిఋణము
ఆరాటపడుచేగె నాకటిప్రొద్దని
          గోటిబుక్కలంద్రుప్తింగొల్పుఋణము
గీ. రోమరోమాన విరంబారి రుధిరనాళ
సంతతులప్రవహించు నక్షయఋణమ్మ
జన్మమున్నంతవఱకును చర్మమొలిచి
పాదరక్షల వినియోగ పఱతు నేని
పాసిపోవునె నీఋణబాధ జనని.

---

౨౮౬

# అద్వైతము

శ్రీ శివరామ సిద్ధాంతి గారు



శ్లో. శ్రీ కాశీశశ్శ్రితజనతమోనాశకో విశ్వనాథః
శ్రీవాణీశ ప్రభృతిదివిజస్తూయమానాఙ్ఘ్రియుగ్మః
వాచాం దూరశ్శశికలకలాలఙ్కృతో వేదవేద్యః
సిద్ధమ్పల్లీకృతనివసతిం రక్షతాద్బ్రహ్మభూయమ్. ౧

శ్రవణసుభగ వార్తాద్వైత వేదాన్తసారః
శ్రవణసుభగవార్తా బోధ కాన్తాకికాన్తి
శ్రవణసుభగవార్తాదాయకో విశ్వనాథః
శ్రవణసుభగవార్తాన్యాయ వేదాన్తసింహః. ౨

అద్వైతమతసిద్ధాన్త నీరదే గర్జితే సతి
ధరాన్తరగతాద్వైతిబీజానాం హర్షణస్తదా. ౩

అద్వైతిన్యాయవేదాన్తభాస్కరేఽభ్యుదితే సతి
సుధాంశుకిరణస్పృష్టపద్మానామివ న స్సుఖమ్. ౪

అద్వైతిన్యాయవేదాన్తపఞ్చాస్యే గర్జితే భవేత్.
పాఖణ్డబౌద్ధకాపాలగజానాం హృద్విదారణమ్. ౫

అద్వైతమతసిద్ధాన్తస్థాపనే శఙ్కరో యథా
తథా మతానాం సంస్థానే త్రయాణామ్మోబ్ధనేపిచ. ౬



# ౨౫౦

## ఉషఃకాలము

శ్రీ రాజవైద్య డాక్టర్ పింగిలి లింబాద్రిరెడ్డి గారు



పరభృతావళి నదిగో చూడుము
నిరతమును గొంతెత్తి పాడఁగఁ
తరతరంబుల రవమునొలుకఁ
బరఁగుచుండె పికముల్. ౧

మేకములప్పుడు బయలువెడలెను
మెరకచాటుల దాగుకొనుచును
మెదవుగను దమ యడుఁగులిడుచు
మేఁతజాడఁ బట్టి. ౨

తెమ్మెరలు తమనేర్పుఁ జూపఁగఁ
నెమ్మితోడుత సాగఁదొడఁగెను
కమ్మగాడ్పులఁ గలువదవ్వ
తమ్మిఁగానదుగా. ౩

వేఁడి వేలుపు జాడకొఱకై
వేడ్కగా నాతోయరుహము
వెడలెనో యనునట్లు దోఁపఁగ
వేగుఁజుక్క పొడచెఁ. ౪



౨౫౧

# బృహన్నలోత్తరులు

శ్రీ బి. వి. శ్యామరాజు గారు



సీ. ప్రాగ్గిరిచ్ఛిన్నకంఠభాగ మోఘప్రభా
యతభగ్న నిర్మితలతికయనఁగ
నఖిలప్రపంచావ నానురాగైక ల
క్ష్మీశదివ్యకటాక్ష దృష్టియనఁగ
నటమహఃకాంతాక్షి నవఫాలఫలక సం
కలితకాశ్మీరజ తిలకమనఁగ
ఘటకరోద్ధృతసముత్కట పద్మరాగగు
చ్ఛ చలద్విషాకరణచ్ఛత్రమనఁగ

గీ. నాదిరేఖాకృతియు మీఁదనర్ధమూర్తి
పిదపఁ బూర్ణబింబము కాంతిసదనమగుచుఁ
దోప రవిపూర్వదిక్సుమద్యుతిఁగాంచి
యంతకంతకు గగనంబు నదిమికొనియె.

మ. ప్రథనాభీలవభీష్మ కుంభజకృప ద్రౌణ్యంగరాణ్ముఖ్యులౌ
రథికశ్రేష్ఠులు ధార్తరాష్ట్రులు సమగ్రక్రోధులై పోరిరే
నధరీభూతుఁడుగాఁడె యా శతముఖుండైనన్ జుమీ వచ్చుచే
వృథయేలా మన కీవ్యథన్ బొగుల తే రెవ్వారు దప్పింపఁగన్. ౧

మ. అరదంబింక మఱల్పుమా నగరి కేలాపోయెదల్లే భయ
జ్వరబాధన్ దపియింపఁజొచ్చెదను విష్వాసంబు హస్తచ్యుతిన్
బొరసెన్ దారియెఱింగి కంపదుముకన్ బోనేమి యుక్తంబటే
సరసాన్నంబుల గీతవాద్యనట నాసౌఖ్యంబులన్ గోల్పడన్ ౨

గీ. చలముఁ బిది సాహసంబును బలిమికలిమి
పరుసము జయేచ్ఛ యాశ్రితపాలనంబు
నదభిమానము యుద్ధకౌశలముఁ దొలఁగి
పందతనముఁ బూనుట రాచ పాడియగునె. ౩

గీ. తెలిసి యిల్లేల నెత్తైనె పలికెదీవు
కురుబలంబు నోర్చెడు శక్తి యరిదినాకు
బ్రతుకఁగలిగిన శుభములఁ బడయవచ్చు
ననెడిప్రోడల నుడుగు మున్నైన వె చెపుము. ౪



## ౨౫౨

# హిరణ్యకశిపుని శాపము

శ్రీ కందాడ నరసింహాచార్యులు గారు

---

మ. అతివా! నాకులముద్ధరింతువని నే నత్యంత సంతోషినై
ప్రతిలోకంబు జయించి మద్భుజబల ప్రౌఢత్వముఁజూపి య
ద్భుతరాజ్యంబును ద్రవ్యముం యశము నీ మూలంబుగాగెల్చి సం
నుతి నీ కర్పణఁజేసియుంటి బదులీ మాయాసుతుంగాంచితే. ౧

చ. పలువిధిమారణంబులకు బాలుఁడుఁజావడు వెన్కఁజూడ నే
బలమునులేదు నైజపుప్రభావ మభేద్యము దండనాదులం
దలువఁడు నొవ్వఁడించుక సదా చిరునవ్వొలయించు శాంతుఁడై
కలికి! నిజంబు నాసుతుఁడ కాలపుమృత్యువు నన్ను జంపఁగన్. ౨



౨౪౩

# విశేషము

శ్రీ ఒద్దిరాజు గోపాలరావు గారు



ప్రాప్తి గలదేని యొనఁగూడు ననుచు శక్తి
కలిగియు పరిశ్రమము సేయకను నిలుచుట
కన్న వ్యవసాయమున ఫలప్రాప్తి నొంద
జతన మొనరించుటే విశేషంబు సుమ్ము. ౧

గురుఁడు నేర్పినఁ దా నేర్చుకొనవలెనని
తలఁచుట మనుష్యబుద్ధికిఁ దగనియూహ
బుద్ధిగలదేని తెల్వొని బూని విద్య
సంగ్రహించుటయే విశేషంబుసుమ్ము. ౨

స్వల్పఫలము నొసంగెడు పనులఁ గూర్చి
కాలము వ్యయింపఁ జూచుట కన్ననోడిని
చేతులను బెట్టుకొని నిరీక్షించి మంచి
సమయము గ్రహించుటే విశేషంబుసుమ్ము. ౩

పెద్దవారలతోడుత నృపులతోడ
గురువుతో భాషణ మొనర్చు తరిసి తాను
హాస మొనరించుచుండరా దనుచు మదిని
నమ్మియుండుటయే విశేషమ్ముసుమ్ము. ౪

అనృత మాడుటచేఁ దన యాపదలు వి
ముక్తిఁ జెందెడుపట్ల స్వశక్తి ననృత
మాడకుండియు కష్టంబు ననుభవింప
సహనమూనుటయే విశేషంబుసుమ్ము. ౫





౨౧౪

# కపోతము

శ్రీ యామవరము రామశాస్త్రి గారు



శ్లో. నమ్యేమానిమనోయనేనయ యమేనన్యేమనూనామినే
నానామ్నాయమయే మనోనియమయన్ నోంనామమాన్యేమనో
మామానిన్యయనామనాననుయమా నో యామినీనాననో
మాంమాయామయనున్నయేన్నయమనామోమేనమాన్యాయనం

శ్లో. సదానందాగారేవ్యహారదలమ క్రూరహృదయ
ప్రియస్వత్యోపేతో నరకమరుణచ్ఛేద్ధవచుతః
అఘ్రగస్తానా విచ్ఛిన్నతతిమధోకం సమహార
ద్గురుశ్శ్రీకృష్ణః కింనభవతి సయోగోపజననః.

ఉ. మిక్కిలి సంగమమ్మున చెలిమిన్ రచియింపఁగరాదెవారితో
నెక్కడనేని చేయనట నించుకభంగముగల్గఁ జింతచేఁ
బొక్కను దాపమొందును గపోతము పోలికదీనబుద్ధిచే
నక్కట! ప్రాణముల్ వదలు నాకథఁదెల్పెద నాలకింపుమా. ౧

తే. ఒకకపోతము కానలో నొక్కమ్రాను
పయిని గూఁడొనఁగూరిచి భార్యతోడఁ
గాలమొక్కింత నిరువురు గడుపుచుండఁ
జెల్మి దినదిన మింతింత పెరుఁగుచుండె. ౨

క. అవయవముల నవయవములు
దవిలిచి మతితోడమతిని దనచూపులతో
సవరించి చూపుజతనా
కవస్నేహమ్మినుమడించె గార్హస్థ్యమునన్. 3

క. పండుకొనినఁ గూరుచుండిన
నడచిన నిలచినను బలికినను గ్రీడించన్
వెడలినఁ గుడిచినఁ బ్రేముడి
విడకఁదిరిగె రిరువురడవిఁ బ్రషుమిథునతతోన్. ౪

క. తొయ్యలి యెయ్యెదిగోరిన
నొయ్యన నెయ్యంబుమీర నురుకష్టముతో
నెయ్యెడ కేగియొ నయ్యన
నయ్యది గొనితెచ్చి యిచ్చున జితేంద్రియుఁడై. ౫

క. తొలిమాలుఁదాల్చియంతం
బులువునెలత నీడమున స్వపురుషునికడ గ్రు
డ్ల నీనె వానియందుం
గలిగెను నిసువులునకాల కలనమువలనన్. ౬

క. హరి దుర్విభావ్యశక్తిన
చిరకాలమునందె మృదురచిత తనురుహ వి
స్ఫురణములై వ్యక్తాఖిల
కరణములై పక్షిశాబకము లిల వెలసెన్. ౭

వ. మఱియు నాపులువులజత తననిసువుల ననువులంబలె గనుచు వీనుల తేనియలొలుకు చెలువంపుకులుకుపలుకుల నాలకించుచు మిక్కుటంబగు నక్కటికంబుల నొక్కొక్కపరి గ్రక్కున నక్కున నెక్కించుకొని చెక్కుల నొక్కుచు, చెక్కుచెదరి చిక్కులువడు నిసు ప్రక్కలరెక్కలఁ దనముక్కున నొక్కటొక్కటి చక్కఁజేయుచు, నప్పుడప్పు డప్పుడమిఁ దప్పటడుఁగులిడుచు దొడదొడంబడుచునడుచు బుడుతలనడతల పోడిమి వేడుకతోడం జూచుచు, ముదమ్మునలకు వద

మ్ములగు చెయిదమ్ములు కనుదమ్ములు కందమ్ము మందమ్ముగ నొన రించఁదిలకించి పులకించుచు; చెలిమికలిమి ననోన్యస్నేహాబద్ధ హృదయులై విష్ణుమాయా విమోహితులగుట నాశిశువులఁ బోషించుచు తోషింపుచు నొక్కనాఁడు. ౮

చ. పులువులకంటకానఁ దమబొట్టెల కన్నము దేరఁబెద్ద ప్రొ
ద్దిలఁ గడుదవ్వుఁజేరి చరియించుట నీడమునందు పిల్లలా
కలిఁగొని యిందునందుఁ దిరుగంగని యచ్చొ జరించు వేటకాఁ
డెలమి వలల్ దవిల్చి గ్రహియించె కపోతకపోత జాతముల్. ౯

శా. ఆహారోచితవన్యవస్తుతతిఁ ద్రోట్యగ్రమున్నందాల్చి యు
త్సాహంబొప్పఁ గపోతదంపతులు వత్సశ్రేణి నీక్షింప సు
స్నేహాక్రాంత మనస్కులై యరిగి యాసీడంబునన్ బుత్రక
వ్యూహమ్మున్ గనకచ్చొ జాలకృతమృత్యుగ్రస్తముల్ త్రస్తముల్.

క. కనికని కరమునఁగనలుచుఁ
దననెనయఁగనెగసి వలలు దవిలికొనుట నే
లనుబడి బుడఁబుడనేడ్చుడి
చినిబుడుతలఁజేరి తల్లి చెదరినమదితోన్. ౧౧

ఆ. విష్ణుమాయతోడ ద్విగుణీకృతస్నేహ
దీనచిత్తయగుచుఁ దెలివిమాలి
వలనుమడియనున్న పాపలం గాంచుచుఁ
దానుగూడ దానఁ దవులుకొనియె. ౧౨

వ. అంత కపోతరాజు పరేతరాజనికేతనాతిథులైన యాత్మాధికప్రియుల నాత్మజుల, నాత్మసమయును దుఃఖలతాలవిత్రమగు పవిత్రకలత్రంబు నాలోకించి శోకించి విస్మృతింగాంచి మేల్కాంచి యిట్లనియె. ౧౩

మ. కనఁడీ నాకడలేని దుఃఖమును సత్కర్మమ్ములం జేయనే
రని దుర్బుద్ధినిఁ గాన నైహికసుఖ ప్రావీణ్య భోగమ్ములం
దనివింగాంచక మున్నె యక్కటకటా! త్రైవర్గికమ్మైన నా
ఘనగేహమ్ము నశించె నాకిపుడు మార్గమ్మెద్ది హా దైవమా! ౧౪

క. అనురూపయు ననుకూలయు
నను దైవముగాఁ దలంచు నాతి సుతులతో
డను జనుచున్నది స్వర్గ
మ్మున కకటా? శూన్యగేహమున నన్నిడుచున్. ౧౫

మ. సుతులా పోయిరి భార్యయాత్మలఁగె హా శూన్యాలయమ్మందునే
గతి జీవించెద నేమి సేయుటకు నీకాయమ్ము నే మోయు దీ
మృతకప్రాయము దుఃఖజీవితము స్వామీ! చాలుఁజాలెట్లొ నా
సతిపుత్రాదులఁ జేరఁబోదునని వాత్సల్యమ్మునన్ బొక్కుచున్.

చ. వలఁబడి మృత్యుపాశములఁ బ్రాణములన్ విడనున్న పుత్రులన్
గులసతిఁ గాంచుచున్ మిగుల గుంది కపోతము దుఃఖమోహని
స్తులతరవారిధిభ్రమిని ద్రుళ్లి వివేక విహీనతన్ గటా!
బలిమిమయిన్ వలంబడియె వైష్ణవమాయబలమ్ము నేమనన్.

ఆ. అంతలుబ్ధకుండు నాకపోతము వలఁ
బడుటఁ గాంచి వాని వడి గ్రహించి
కార్యసిద్ధినొంది క్రౌర్యబుద్ధి నలెండు
నిల్లు సేరె నేన డెల్లకంటి. ౧౮

తే. ఇటులె గృహమేధి శాంతి విహీనుఁడై కు
టుంబమును గాచుకొనుచు వేడుకనుగనుచు
ద్వంద్వవనములఁ బడి కపోతంబు రీతి
సానుబంధుఁడుగను దుఃఖజలధిమునుఁగు. ౧౯



౨౫౫

# మార్గదర్శి

శ్రీ రాళ్లబండి రాఘవయ్యగారు



క. నరహరి తననను నరయుచు
మురుపనుదనరును హరివయి మునిపావనులన్
హరువగు కనులన్ బరపుచు
కరుణన్ గనఁగానినరహరిని గనుమాయవపన్. (అష్టవిధకందము) ౧

తే. అరుగుచుంటి నెందులకో కారడవిదాన
దారిఁదప్పి తిరుగుచుంటి నేరుఁగాన
రాత్రి నుండుగ్రుంకి గాఢాంధకారమంత
మెల్ల మెల్లన వ్యాపించె మృత్యువట్లు. ౨

సీ. కార్మొయిల్ గురుమహా గంభీరనిస్వనం
బున బెదరించుచుఁ బోవుచుండె
మెఱపు తీవలుకనుల్ మిరుమిట్లుగొన ఖడ్గ
ములఁబోలి మెరసి కన్మొఱగుచుండె
బాణపరంపరల్ బలెనచ్చటచ్చట
పిడుగులుఁ బడమంట వెడలుచుండె
జాలుగ్రుమ్మినరీతి జాలతో జడివాన
కదలనీయక వళ్లు మెదపుచుండె

తే. నింతియే కాదు బెబ్బులు లేన్గుగున్న
లెట్టులో ఘూర్ణిలుచు ఘీంకరించు చుండె

నఱఁగిడిన కంటకములు బారాడు పాము
పిల్లలీస్థితి నాగుండె ఝల్లుమనదె. ౩

తే. కొంతవడి కంత వర్షమొకింత వెలసెఁ
గాని శంపాలతాదీప్తిఁ గానఁబడియు
కటికచీకట్లు గ్రమ్మి నాకెటుచనుటకుఁ
దోపదయ్యెఁ గటా! ఎంత పాపమొకొ. ౪

తే. కటకటా; ములుగొమ్మలు కాయమెల్ల
రక్తమయముగఁ జేయ పారాడుచట్లు
నడవరానట్టి యడుసునఁ బడిమిడికితి
నపుడు నాకొకవ్యక్తి ప్రత్యక్షమయ్యె. ౫

క. కరమున లాంతరు వేఱొక
కరమున ఛత్రముధరించి కనఁగొనె నన్నా
పురుషుఁడు నేనాతనిఁగని
పరమామోదమునఁ గాళ్లఁబడితిని భక్తిన్. ౬

ఉ. చామనచాయ మేననొక చక్కని సౌకుననుండి తొలసీ
దామము సంతతమునఁ దాల్చును బెత్తెడు పుట్టుమచ్చయున్
మోమున నందమౌ తిలకమున్ జిఱునవ్వును గల్గి యాతఁడెం
తో మహనీయుఁడంచు మదిఁదోపకపోవ దెవారికేనియున్. ౭

ఆ. ముద్దులొలుకు వాక్యములనన్నుఁ బ్రశ్నించె
నెచటివాఁడ వెచటికేగుచుంటి
విట్టులేలయైతివిఁక నీకు వలసిన
దేమి చెప్పుమనుచు నెంతొప్రేమ. ౮

తే. ఏనువిని గద్గదమున నేమేమొ చెప్పఁ
బోయి యంటి "మార్గ"మని యాపూజ్యుఁడనియె
భయపడకుమీ విదేదారిఁ బట్టిచనుము
చేరగలవు స్వస్థానముం జిన్నవాఁడ.

చ. అరుగుచునుండ నొక్కెడ మహానది పారుచునుండు పూర్ణమై
తరణము నేఁజాలవది దాటిననీయిలు సేరుదల్ల దే
తరణియునుండె నీవుతగు ధైర్యముగల్గిన వెళ్లజాలు దే
కరణిని గాని యోడపయి కాలిడువేళకు తెల్లవారెనే. ౧౦

తే. తెల్లవారిన నీప్రాంతమెల్లనీకు
విశదముగ గోచరించు నేవేళగాని
సంస్మరింపుము హరిని ప్రశాంతవృత్తి
సర్వభూతములందు ద్వేషమ్ములేక. ౧౧

తే. ఇంక నేమేమియో చెప్పి యేగ స్వాశ్ర
మమున కామహనీయుఁడు మఱవఁజాల
నతని యుపకృతి యతని దయాస్వభావ
మహహా! నారాయణుండెపో యనుచుతోచె. ౧౨

తే. దీనవత్సలుఁడు కృపానిధియు నమేయ
మహిముఁడీ ననుఁగాచిన మార్గదర్శి
ఈతని యనుగ్రహమ్మున నేఁగఁగలను
నాదు స్వస్థానమునకు నేనాఁటికైన. ౧౩

మ. ఘనసంసారమహావనీ స్థలినహం కారాంధతా మిస్రమం
దు నరుండైహికభోగజాలముల నెంతోకష్టముంబొంది దు
ర్ధన దారాత్మజ మోహపంకమున బాధంజెందునిట్లే మహా
త్ముని యాదేశముగల్గ భక్తిపథమందుంగాలిడుఁ దాలిమిన్. ౧౪

తే. దీనడుచుచు మాయామహానదిఁదరి
యించి స్వాత్మధామముఁజేరనేగి యచటి
చిద్ఘనానంద మనుభవించి చెలఁగుటకు
మనకుఁ గావలయునుకదా! మార్గదర్శి. ౧౫

## ౨౫౬

# పాండవోత్పత్తి

శ్రీ కడుకుంట్ల పాపశాస్త్రి కవికరి గారు



అస్తిసమస్త కురూణాం
హస్తినసంజ్ఞాగరీయసీవిభవైః
హస్తిరథతురగపదగ
శ్రీరృద్ధిమితానాకపత్తనాదమితా. ౧
తత్రావసదవనీన్ద్రో
విత్రాసితశత్రుభూమిభృచ్చంద్రః
పాణ్డురితిప్రఖ్యాతః
పాణ్డుతరస్ఫూర్తి కీర్తివిఖ్యాతః. ౨
ఉగ్రాహావధీస్సమరే
జగ్రాహ ద్వేవధూమణీరమణీ
మద్రయదూత్తమపుత్ర్యౌ
భద్రమతీవికసితాంబురుహ నేత్రే. ౩
జాతుసమృగయాసక్త
స్సంసక్తః పరికరైర్వధూయుక్తః.
అవిశద్ధిమవత్ప్రాస్తం
పవిధరవిభవోవిభుర్మృగదురంతం ౪
సత్వానీకమటవ్యాం
హత్వాకురువీరర్షసమపశ్యత్
అసమశరసమరయుగళం
లసదనురాగఞ్చమృమృగీయుగళం. ౫
తదనుజఘానసరాజా
మదనహతేమృగయుగేతదాపురుషమ్
తస్మిన్ననుమయే మృగరా
డ్విస్మితచేతాదధారము నిరూపమ్. ౬

కిందమనామాసమునిః
క్రందన్మందంనృపంప్రతిశశాప
అనవసరేఽనుచితాన్మృగ
హననాత్త్వమపిముఖమిహాభవత్వమితి. ౭
ఏవంరాజాశప్తః
పావనవనకందమూలఫలగుప్తః
ప్రాచ్యంసైనికనికరై
రాజ్యమ్మనసాజహౌసపత్నీకః. ౮
బుధజననిగదితభగవ
త్కథయానిత్యాదినానివసభూమౌ
అథరహసిసద్రాజా
పృథయాసాకంవిచింత్యతామూహా. ౯
పుత్రధనాఖ్యానపయ
మపుత్రస్సగతిర్నహీతివిదురార్యాః
పాతివ్రత్యమహిమ్నా
సూతింప్రాప్నుహినచాన్యథాలలనే. ౧౦
పత్యధునామద్వాక్యం
సత్యంకురుదైవతంపతిస్స్త్రీణామ్
పత్యావిత్థంవదతి
ప్రత్యాహస్వానుభవకథాంకుంతీ. ౧౧
హేప్రాణనాథబాల్యే
మేప్రతిహతచేతనక్రియబాల్యే
పర్వణిమంత్రశ్రేష్ఠో
దూర్వాసస్సేవయాసముపదిష్టః. ౧౨
తత్సామర్థ్యాన్నస్యా
ద్వత్సానీకోత్సవస్తవాఞ్ఛాచేత్
ఇతిపత్యనుమత్యాసా
ప్రతిసుషువేపుత్రపంచకంమాద్ర్యా ౧౩



౨౫౬

# హంవీర సంభవము

సురవరము ప్రతాపరెడ్డిగారు బి. ఏ. బి. ఎల్.

సీ. కుకుమాపుచీర నిగ్గులుదేర నెమ్మేని
క్రొమ్మించుకాంతులు గ్రమ్ముకొనఁగ
అఖిలప్రపంచ మోహనశక్తిఁ బ్రకటించు
తెలిఁగన్నుగవవింత చెలువునీన
వడిసెలవలకేలఁ బట్టిత్రిప్పెడులీలఁ
గంకణకింకిణీ క్వణనమెసఁగ
ఒఱపైన కుచ్చెళ్లు చిఱుగాలిసోకునఁ
జెదరిపిక్కలకాంతి చెంగలింప
గీ. అవని విహరించునాది భిల్లాంగనావి
లాసమును దోఁపచేయుచు లలనయొత్తు
జొన్నపొలమునఁ బెడిసెల జోపుపాంచ
మంచెమీఁదనఁ గన్పట్టె మహితదీప్తి. ౧

క. అంతఁ జిత్తూరుపురీ ప్రాంతాతిగహన వనమృగయావ్యసనపరి
శ్రాంత మహీకాంతవర నితాంతత్రస్తంబగు కిటి తద్దయు వచ్చెన్.

గీ. ప్రథిత రాజపుత్రస్థాన రాజధాని
యైన చిత్తూరురాజగు "అర్సి"యతఁడు
అద్రి "యంద్వా" యనెడి వనమందు వేట
కొఱకువచ్చి వరాహంబు దఱుమఁజొచ్చె. ౩

క. భయదోత్కట ఘుర్ఘురరవ
మయమై కకుబంతరములు మారోగ్రియుంగా
రయమున సూకరముగ్ర
ద్రియగాచెడి చేనిలో నదృశ్యంబయ్యెన్. ౪

గీ. మంచెనుండిన కన్నియ మానవేంద్రుఁ
గాంచి ముగ్ధభావంబు వ్యక్తంబుగాఁగ



[౨౦౯] శ్రీ రామకవచం కృష్ణయ్యగారు





[౩౦౯] శ్రీ పుల్లగుమ్మి వేంకటా
చార్యులుగారు

పైటసవరించి యల్లన పజ్జకేగి
కలరవంబున నీరీతిఁబలుకఁదొడఁగె. ౫

గీ. రాజచంద్రమ! మీరు విశ్రాంతిగొనుఁడు
గడియకాలములోన సూకరముజాడ
వెదికి వేటాడి మీకు నర్పింతుగనుఁడు
సెలవొసంగుఁడు కార్యసంసిద్ధికొఱకు. ౬

క. అనవిని పకపకనగి యి
ట్లను భూమీశుఁడు తలఁపఁగ సబలవె యైనన్.
గనివినని మాట లహహా!
వినిపించితి గుండ్లుదేలి బొమలుముడిఁగన్. ౭

క. నీ తెఱఁగెట్టిదియో గన మో తెఱవా సాహసంబు నుడుగుట తలఁపన్
నీతియ యైనం జూతము నీ తెగువన్ దోలు ముకిటి, నేర్పున ననుఁడున్.

గీ. ఉవిద కోడవలియె తన యాయుధముగాఁగ
జొన్నపొలమునఁ జొచ్చి యస్తోకశక్తిఁ
పందితోఁబోరి, చెండాడి, బారిసమరి,
దానినీడ్చుచుఁదెచ్చె భూధవునికడకు. ౯

క. తెచ్చిన నత్తరళాక్షిని నచ్చెరువునఁజూచి ప్రీతి నధిపతియనియెన్
మెచ్చితివనితామణినినుఁద్వచ్చరితము తెల్పుము వినవలతును వేడ్కన్.

వ. అనిన నక్కాఁపుకన్నె యిట్లనివిన్నవించె.

గీ. ధనికులకు మోకరించని దర్పయుతులు
నిత్యదారిద్ర్యమందును నియతిపరులు
యుద్ధమున వెన్నుజూపని యోధవరులు
మామకీనవంశ్యులు సుమ్మి మాన్యచరిత. ౧౨

గీ. పజ్జపల్లియె నాదు నివాసభూమి
కాఁపుకులమున జన్మంబు గలిగెనాకు
వృద్ధపితరుల సతము సేవించుచుందు
నిదియె యీకన్యచరితమో యింగితజ్ఞ. ౧౩

క. తడవాయె సెలవొసంగుఁడు
పెడిసెల జోపవలయు నని వెడలికడంకన్

వడిసెల గిరగిరఁద్రిప్పుచుఁ
బడవేసెను గాలినొప్పఁ బార్థివహయమున్. ౧౪

గీ. భళిర! యీకన్య శౌర్య ప్రభావగరిమ
దీని మాధుర్యంబు చతురత దీనియతుల
మధురపీయూషనిష్యంది భాషణములు
దీని మోహనాకార మెన్నానిధన మొ.
యనుచు భూజాని తలపోయు నవసరమున. ౧౫

గీ. కలికి యల్లన నేతెంచి పలికెనిట్లు
కాకతాళీయమైన యికార్యమునకుఁ
గనికరంబున క్షమియింపు మనుజనాథ
యనుఁడు నొక్కింత యోజించి యనియె రాజు. ౧౬

మ. అతివా! నీయతిలోకరూపమది నాస్వాంతంబులోనాటె నా
కతిలేశంబును గోపతాపములు లేవబ్జాక్షి నీమీద స
మ్మతితో నీజనకున్ మదీయసభలో మాటాడరమ్మన్న సం
గతివేగన్ వినిపించు పొమ్ము కలుగున్ గల్యాణముల్ నీకిఁకన్.

గీ. సాంధ్యరాగంబు పర్వెను సకలదిశల
మస్తకన్యస్త కుంభలై మగువయపుడు
మత్ప్రియల మృదుస్వనతాళ మానములను
అత్మగేహాభిముఖయయ్యె నల్లనల్ల. ౧౭

గీ. భరత నాట్యంబుసేయు స్వర్భాముఁదెగడి
సుధను జేఁగొన్న మోహినీ విధముమెఱసి
మేఁతమోపును నొకకేల మేఁకనొక్క
కేలఁబట్టి సాగెను దన గృహముదిక్కు. ౧౮

ఉ. అత్తఱి వెంటవచ్చు నృపుసానుచరుం డొకరుండు వేడ్కమై
బిత్తరిమీఁదికిన్ హయము బ్రేరణసేసిననా కువాళమున్
జిత్తమునందలంచి ప్రతిసేయఁగ మేకను శేప లీలగాఁ
దత్తరపాటుతో హయము ధాత్రినిఁ గూలెను సాశ్వికంబుగా. ౨౦

గీ. ముదితమోమున లేనవ్వు మొలకలెత్త
నృపునిసమ్మతి కన్నుల నింపియుండె
ఒండొరులదృష్టి ప్రేమార్ద్ర నోలలాడె
అంత భూకాంతుఁడనియె నయ్యాతివతోడ. ౨౧

గీ. తరుణి మనత్రోవ చీలెడి తావువచ్చెఁ
బోయివత్తుము చిత్తూరు పురము సేరఁ
దప్పకుండఁగ నెల్లి నీ తండ్రిననుపు
మనుఁషుఁ బ్రేగంటఁజూచుచుఁ జనియెనృపతి. ౨౨

గీ. కరువఁబోసినయట్టి బంగారుబొమ్మ
ప్రాణమందిన నవ్యచిత్రంపుఁబ్రతిమ
సౌరభంబెగఁజిమ్ము గొజ్జంగితీవ
విరియఁబూసిన తంగేడు, వీరకాంత

నవరశృంగార వనలక్ష్మి త్రిపురవైరి
వైరి సామ్రాజ్యదేవత, భవ్యచరిత
నెదను ధ్యానించుచున్న మహితతేజు
సభను మరునాఁడు సేరంగఁ జనియెఁగాఁపు. ౨౩

గీ. కాఁపుకూర్పుని యెకిమీని గద్దెమీద
తనను బిలుపింపనేలన ననియెరాజు
వియ్యమందంగ మదిఁగోరి పిలిచినాఁడ
మామనగుటకు నీకు సమ్మతముకలదె? ౨౪

గీ. కాఁపుకన్నెను బెండ్లాడె క్ష్మాతలేశుఁ
డఖిల జనసమ్మతంబుగ హృష్టుఁడగుచు
వారికింబుట్టె వీరాతివీరుఁడైన
సుతుఁడు "హంవీర" నామ సుశ్లోకయశుఁడు. ౨౫



# స్వైరిణీవిలాసము

శ్రీ గుడిమంచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు



శ్లో. కదాచిద్గద్వాలాం మదననగరీం ఘూమశకటే
ప్రయాస్యన్నద్రాక్షం నయనయుగసాఫల్యమబలాం
కచేశ్యామామంగేఽప్యకృశచపలాంవృత్తకఠినాం
కుచేక్షామాం మధ్యేపులినమృదులాంసాధుజఘనే. ౧

ఘూమానోద్వారదేశేఽవసతరుచిరసత్పూర్వకాయాహ్వయన్తీ
బాలామామంగుళీభిర్ఘనపవనచలత్పల్లవస్పర్ధినీభిః
పశ్చాన్మయ్యప్రమత్తే సవిధముపగతే ద్వారముద్ఘాట్య విద్వా
న్నారోహేత్యబ్రవీత్సా వినయమృదుగిరా స్పష్టమావేదయన్తీ. ౨

ప్రథమమహమేవకింవా, ఘూమరథం మన్మనోరథంసైవ
ఆరూఢాకిముతత్వం నోవేద్మిభినత్తి సంశయంకఇహ. ౩

కిమపికిమపిమందం మందమాభాషమాణా
వదనమవనమన్తీ చారుమందం హసన్తీ
కుటిలచికురజాలం లాలయన్త్యఙ్గుళీభిః
కుచవిగలితపైఠాం పాణినాచ్ఛాదయన్తీ. ౪

మయిప్రేతావేక్షే భుజయుగమథోద్ధృత్యవివశం
ప్రలుభ్యన్త్యాంతస్యాం వితతభుజకాయఃకుచతటాత్
పరిస్రస్తాసైరాత్రుటితఘటనాకఞ్చుకపటీ
యదేషాఽసిర్నిష్కోశితఇవ బభ్రాద్రాగతిపతేః. ౫
కరేణప్రచ్ఛాద్యస్తనతటమథైకేనరమణీ

కిరంతీ మే చేలాఞ్చలచలనవాతా నవయవే
పరేణ ద్రాగంసద్వయమపినివస్త్రావృతిమతీ
మదాస్యం దృష్ట్వా లజ్జితుమపి లలజ్జ ప్రతిపదమ్. ౬
తదీయచేలాంతసమీరణోఽయం, సమూలఘాతం సమఘాతయన్మే
ధైర్యద్రుమం జ్ఞానలఘుప్రదీప, నిర్వాపణేస్యాత్కృతమాయకమ్మాం.
పదాఙ్గుళ్యా మర్దం భువి దశనదష్టాధరదళం
స్థితాభ్యాం పైతాంతర్నిజసృదుకరాభ్యాం స్తనయుగే
బిధానా తన్వంగీ జఘనవసనే సా మిగలితే
నిరుంధంత్యూర్ధ్వం గన్త్వరితముపవిష్టా స్మితముఖీ. ౭
గాఢస్తదానీం సముపేత్య విప్ర, స్త్రీయోనిషీదన్తి హి చాత్ర తస్మాత్
పృథఙ్నిషేదేత్యవరోప్యసూంతు ప్రావేశయత్త్ర తతోఽన్యకాన్తాః.
యదాఽగచ్ఛం మన్దం తదనువికలస్వాంతమసకృ
న్నిశృత్త్యాస్యం తస్యా ముహుమనవధీచ్ఛాకులతయా
తదా ద్వారోపాంతే వదనమబలాఽదర్శయదలం
నిమేషైర్హ్యాన్యం తేన్మమహృదయమద్యాపి దహతి. ౯
జయతు భువి మనోజ్ఞా యోషితాం యౌవనశ్రీః
కమనహృదపహారాస్తద్విలాసా జయంతు
రతిపతిరపిలోకాం స్తత్కటాక్షక్షురప్రై
ర్నిధువనముదవిఘ్నం చాస్తు రాత్రిందివం వః. ౧౦
ఉత్పాదితేయం కవితావధూటీ సంప్రేషితా తత్ర భవత్సకాశమ్
త్వమేవ పాణిగ్రహణం విధాయ రమస్వ నిత్యం హృదయే నిధాయ.



౨౫౭

# ఈరాన్ న్యాయవిచారణ

శ్రీ వనం వేంకట నరసింహారావుగారు



క. ఒంటరిగ మైత్రి మెలఁగుచుఁ
గంటిని తనకండ్లననుచు కథనెఱిఁగింపన్
వింటిని వాస్తవమెయ్యదొ
బంటు పరాభవంబు న్యాయ పాలనమందున్. ౧

చ. అతఁడు మహమ్మదీయ మత మందునఁ బుట్టిన వక్త యాటచే
సతతము సాటిపిల్లలకు శాస్త్రము సంధ్యల స్తోత్రపద్ధతుల్
హితవుగ బోదసేయ జనుదెంచె నొకప్పుడు వాదమాడి మా
మతమున న్యాయపాలనము మానవధర్మమటంచుఁ దెల్పగా. ౨

క. ఈరాను దేశమందున
ఖూరానుషరీఫు నీతి గొనియాడఁబడున్
శూరత్వమందు నరబులు
ధీరులు నివసించునట్టి దేశము సుమ్మీ.

గీ. కోర్టునకు నొక్కపడుచగు గొల్లవనిత
పాలతట్టను దలమీద బట్టివచ్చి
రోదనంబానరించుచు ఖేదపడుచు
ప్రభువుగానున్న న్యాయాధి పతికిదెల్పెఁ
దాను బాజారు దిరుగుచు ధరను జెప్పి
యమ్ముకొనుపాల నొకచోట నమ్మఁబోవ
భటులు నిరువురు రమ్మని పాలుఁజూచి
గటగటనుద్రాగి పొమ్మని గంద్రగోళ
గొడవఁగావించి గెంటఁగఁ గూలఁబడుచు
వేడుకొంటిని పాలకు వెలనొసంగ
నిచ్చినంతెనె మీవల్ల నేఁగ్రహింతు

ననుచు బతిమాలుకొనినను న్యాయబద్ధ
దూరులైరి వారు జులుముకు తొలుతనుండి
నలుపఁబూనిరి నాయందు శక్తిలేని
యాడుదానను నన్యాయ మాయెననఁగ
సాక్ష్యమిచ్చెదవా? యని సహానభావ
మొదవనధికారి యడగెను మొదటనామె
అయ్య వారలు తమ నేరమంను నొప్పు
కొనక దుష్టులై నీతి సంకుచితపరుప
రుజువుఁగావింతునిప్పుడే రోజుదీర
వలనుగ దయ్య నావల్లపాల రుజువు
సర్వపరిశీలనముఁజూడు సత్యవాద
ముభయపక్షంబు పరికింప సభనుదేలు
ననఁగ న్యాయాధిపతికోర్టు నాజ్ఞసేయ
భటులు వెంటనె పాలుకుముతో పరుఁగులెత్తి
పట్టికొని తెచ్చిరిర్వుర బంధనమున
వారు ప్రభువుకు సాష్టాంగవందనములఁ
జేసి దీనతఁ బలికిరి స్థితి గ్రహించి
ప్రభువువినిపించె యాగొల్లపడుచు మోఁపు
నేరమున వాస్తవంబును యెఱుఁగఁబలుక
మనఁగ వారలు ప్రభువున కట్టివిషయ
మెఱుఁగమనుచును నేరమాపాదియెయనిరి
తమనురచ్చకు నీడ్చించు తప్పునందె
తగినశిక్ష యొసంగిన ధర్మమగును.
ప్రతిఫలంబును గాకున్న పడుచులిట్లు
నిందెలను మోపు కపటముల్ నేస్తురనిరి
తరుణిపల్కెను నేరంబు తప్పుదైనఁ
దనదుప్రాణాల కోర్టులోఁ దక్షణంబె
చెండితీయఁగవచ్చును సిద్ధపడెద

వారు నేరస్థులైన వివాదమునకుఁ
దగినశిక్షనొసంగిన తెగునుతగవు
ముందువారలు భయఁపడ ముఖ్యమిదియె
వారికడుపుల జీలిచి పాలుకన్న
నన్నునమ్మఁడి లేకున్న నాయుసురులు
వారిప్రాణాలసమము గావలయునన్న
ప్రభువు వాఙ్మూలముల సిద్ధపరచి వేగ
శస్త్రవైద్యులరప్పించి చావులేని
కైపుమందుల నెక్కించి కడుపుజీల్చ
లోన పాలున్నసంగతి లోకమెఱుఁగ
పంచునామ మురత్తైబె భద్రపరచె
మరల వారిని బ్రతికించు మందులొసఁగ
గాయములుమానె క్రమముగ కట్టువదల
న్యాయశాస్త్ర విచారణ న్యాయమునకు
ఖండితంబుగ నిరువుర ఖైదువేయ
సత్యపాలన మప్పుడే సాధ్యమయ్యె
నిట్టిక్రమచర్య విధమున్న దిట్లుగంటి
ప్రజలతప్పులఁ బరికించి పాలనంబు
శిక్షలిడుచున్న ప్రభువు ప్రసిద్ధిఁజాటు
ననుచు వచియించె వింటిని న్యాయవిధము
సత్యపరిశీలనమునకు సామ్యకథగ.



౨౬౦

# వ్యాధోపాఖ్యానము

శ్రీ కిడాంబి. వాదికేసరి. శృంగారం కృష్ణాచార్యులు గారు



శ్లో. వ్యాధః పిపాసీ వినిహత్య చర్మణి
ప్రదర్శకం తస్య కపింజలం వనే
ఆపూర్యగృహ్యాప్రియయామురాత్మనే
కృతోపకారోభవతీహ దుఃఖదః.

చ. పరులను నిందజేయుచుఁ గుభావులునై కడు దుష్టమార్గులై
హరినిఁదలంపకుండి రకటా! జనులంచును గ్రోధమూని భా
స్కరుఁడన లాభమైన కరజాలముచేఁ దగ వేపుచుండె నీ
కరణి నటంచుఁ బోల్పఁదగు కాలము వేసవి యొప్పెభూమిపై. ౨

గీ. అంత నొకనాఁడు భాస్కరుఁ డంధకార
పటల సంహారుఁడై పూర్వ పర్వతంబు
పైన వెలుఁగొందఁగని లేచి వ్యాధుఁడొకఁడు. 3

క. వనితా నేఁడడవికినేఁ జనిమెకములఁదునిమి యామిషంబునుగొనివే
జనుఁదెంతుననుచుఁ దనగృహమునువిడి శరధారియగుచు మోదము
తోడన్. ౪

చ. కరము రయంబదవ్వరిగి కాంచెను నిర్గత వాస్సరోఘరీ
సరిదభియుక్తమున్ మఱియు స్కన్నపలాశతరుప్రపూర్ణమున్
దరణి కరాతపోగ్రితర తప్తధరాధర భూప్రదేశమున్
గురుఖురకంటకప్రకర కుంఠితమార్గ మరణ్యదుర్గమున్. ౫

చ. ధనువున నంబకంబొకటి తద్దయుఁగూరిచి కందరంబులన్
ఘనతర వృక్షకుంజములఁ గ్రన్ననఁజూచుచు జంతువొక్కటేన్
గనులకుఁ గానుపింపమికి గాఢవిషాదము నొందిమెండచే
వవటనుఁజెంది నీటికయి పర్విడికానడ యెందుఁజూచినన్. ౬

[౩ప. ౪చ.] పడఁతి తోడుత నిట్లని పలికె నపుడు.

గీ. గట్లఁబొడలను దిరిగినకతనఁ జాల
నలసి మఱి యొండవేడిమి నతులదాహ
మగుట దుఃఖాకులస్వాంతుఁ డగుచునొక్క
నగముక్రిందను గూర్చుండి వగచుచుండ. ౭

కం. తిరుగుచు నొకవనచరమట
కరుదెంచియు దుఃఖితాత్ము వ్యాఘునిఁగని దాఁ
గరుణను దదీయవృత్తం
బెఱిఁగియు నుపకృతిని జేయ నెంచియుమదిలో. ౮

చ. తనవెనువెంట రమ్మనుచు దాపున నొక్కజలాశయంబు వే
గనఁబరచెన్ బరార్థముపకారము సేయుట పుణ్యమంచుఁ దా
మనమున నెంచి సల్పెనిటు పావనజన్మమటన్న దాని దే
యననగుఁగాదె జంతువులయందున నిట్టిహితంబు గంటిరే. ౯

గీ. జలములను ద్రావియును గత శ్రముఁడునగుచు
మనమునందున వ్యాఘ్రుఁడిట్లనుచుఁ దలఁచె
దూరమెంతయొ యుండు నాయూరు త్రోవ
నీరుదొరకదు కాన వనేచరమును
జంపి తచ్చర్మమున నీరు నింపికొందు. ౧౦

కం. అని యాలోచించియు నా వనచరమునుబట్టిచంపెఁ బాపంబనకే
తనకుహితంబొనఁగూరిచెనని యెంచఁడుగా కృతఘ్నుఁడతినిర్దయుఁడై

ఉ. దానినిఁజంపి వాఁడపుడు ధాతువులన్ విడఁదీసివేసి యా
వానరచర్మ భస్త్రికను వారిని నింపి ప్రసన్న భావుఁడై
కాననసీమఁ దాఁటి తన కాపురమొందఁగ నేగె దుర్మదో
న్మాననులైనవారికి క్షమన్ హితకారియె దోషియయ్యెడున్. ౧౨

గీ. ఆరయఁగ దుష్టునకు నుపకారమెపుడు
సేయఁగా నొప్పదొకవేళఁ జేసెనేని
కాలసర్పంబునకుఁబోయు పాలవెల్ల
విషముగాఁ బరిణమించిన విధమునుమ్మ. ౧౩



౨౬౧

# మానవతీలలామ

బాలకవి అష్టావధాని

శ్రీ గొబ్బూరి నృసింహాచార్యులు గారు



మ. నరనాథుం డొక నాఁడు తాత్మకాంతను మహానందంబునన్ జేరి యో
తరుణీరత్నమ రమ్మురమ్మ మన యుద్యానంబునం దేగి త
త్తరు గుల్మోరుల తావితానముల వింతల్ జూచి వేవత్తమా
సరసీజాప్తుఁడు గ్రుంకకుండఁగనె స్వస్థానంబు జేరందగున్. ౧
క. అనుటయు వల్లె మని యవ్వనితయు నిజపతినిఁ గూడి వనసీమఁ గనన్
గొనబగు సింగారంబునఁ గనుపండువఁ గాఁగ వెడలెఁ గడు మోదమునన్
ఉ. వింతలఁ గొల్పునట్టి వన వీథుల నాథునితోడ నేగుచో
సంతసమంది యత్తరుణి సాటకు కేల్గొని ప్రాణనాథ యీ
ప్రాంతమునందు గ్రుమ్మరుట భావము దేమొ చలించు గాని మీ
చెంత వసించు భాగ్యమున చిత్తమునందిగురొత్తు ధైర్యమున్. ౩
వ. కమ్మతేనియలజిమ్ము నమ్ముగువపలుకులాలించి యమ్మహీవిభుండు
సీ. అతివ! నీదగు మందగతి నేర్వఁగా బోలు;
ఘనమరాళంబు లివ్వని వసించె
కలికి! నీ ముద్దుపల్కుల నేర్వఁగాఁబోలు?
చిలుకలయ్యావె ఫలావళి మెసంగు
ప్రమద! నీయధరరూపముఁ గాంచఁగాఁబోలు?
బింబమూతరు లతాప్తిని జెలంగె?
పొలతి! నీ తనువుతోఁ బురుడొందఁగాఁబోలు?
చారులతాజాల మోఁజగిల్లె
తే. గీ. తరుణి కనుగొంటె? యాసరోవరమునందు
నీకనుంగవ కెనఁగాంచ లోకహితుని
వీక్షఁ గొలుచుచునుండె నస్తోకపద్మ
కాంత కోర్కుల వేఁకుఁ గష్టదములె. ౪

గీ. అంత సతిపల్కె నాథ! యేకాంతకైన
ధవుఁడెపో వాంఛ లీడేర్పఁదగినవాఁడు
తపనుఁడైనను స్వప్రాణధవుని సేవ
పరమహితమంచు దెల్పు నీపద్మలీల. ౬

గీ. కనుము ప్రాణేశ! మకరందకాంక్షఁ జేసి
హితముఁబొందించు వారల గతిచెలంగి
తుమ్మెదలు ఝుమ్మనుచుఁజేరె తులువమతులు
పరసతులఁజేరి టక్కులఁబన్నునట్లు. ౭

మ. తరుణీ! కాదది భృంగఝంకృతికి నర్థంబింక జాగేల? నా
సరసీజాప్తుఁడు గ్రుంకు వేళయగుటం జారాకృతింబూని త
త్సరసీజంబుల చెంతఁజేరి, యదిగో చంద్రోదయంబౌను మీ
మురిపెంబెల్ల యడంగునంచు మధుపమ్ముల్ తెల్పుచుంబోయెడిన్

శా. ఆవంకన్గనుగొన్మ పక్షిచయమాహా! యంచు విభ్రాంతిమై
తావుల్ చేరగఁ బారుచుండె దిశలందా చీకటుల్ గ్రమ్మెఁగ్రో
ధావిఖ్యాతుని మాడ్కి భానుఁడదె యస్తాద్రిందగన్ జేరెడిన్
శ్రీవిన్యాసి సరోజషండమునుఁ గుంఠీభూతమయ్యెన్ సఖి. ౯

గీ. పతివియోగాన తాస్యయా పద్మకాంత
కరులనుజయించి నీమనోహరుఁడు వేగ
తిరిగిరాగలఁడని తెల్పు తెరవుఁదోప
సంచితరుతంబుసల్పు నీ క్రౌంచవితతి. ౧౦

కం. కాన నిఁక జాగుసేయక మానవతీ గీము వంక మఱలుదమన న
మ్మానిని యటులేయని పతితో నిలుచేరంగ నేగెఁ దోడ్తోనచటన్.

గీ. సమద శాత్రవతతి ఘోర సమరమునకుఁ
బిలువ భూమీశ్వరుఁడుఁదన ప్రియనుగాంచి
సెలవొసంగుమ చని యని సేసిరిపులఁ
గెలిచివచ్చెదననిన నక్కలికియనియె. ౧౨

గీ. జనవరోత్తమ! జయపరాజయములరయ
దైవతాధీనములుగాన పోవవలదు

సంధనొనరించి మనుమట్లు సలుపవేని
సుతవిహీనను నాకేదగతి? హృదీశ. ౧౩

ఉ. సంతతిహీనమౌట పితృసంతతిశోక పరీతవృత్తినై
చింతిలుచుండఁ బాలనముసేసెడి నాథుఁడులేక రాజ్యమా
క్రాంతవిరోధి వర్గముగఁ గ్రాలఁగ నీవనుదిక్కులేక నీ
కాంతయొకర్తు కెవ్విధినిఁ గాలముపుచ్చును? ప్రాణవల్లభా. ౧౪

మ. అనిన న్వల్లభుఁడిట్లనుం దరుణి! చింతాంభోధిలో మున్గ నే
లనె? యుద్ధంబున శత్రులంగెలిచి లీలన్వత్తు వేవేగఁగా
వనజాతోద్భవు వ్రాలుగల్గునెడ నాపద్ధర్మమంచెంచి ముం
దొనరింపందగు కార్యమేఁదెలుపుదున్ బూఁబోఁడి యాలింపుమా. ౧౫

గీ. ఒరునికంటెకెఁ గనరాక యుండుచోట
దేహధర్మంబుఁదీర్చెడి దివ్యపురుషు
కరుణ సంతతిఁగని చింతఁదొలఁగుమింక
వెలఁది సుక్షత్ర ధర్మంబు విధువజాల. ౧౬

గీ. ఇటుల సతినూఱడించి పృథ్వీశవర్యుఁ
డరుల గెల్వంగ సైనిక వరులతోడ
నరుగఁ దరుణియుఁ బతితెల్పు సరణిగలుగు
పురుషవర్యునిఁబొడఁగాంచ నరయుచుండె. ౧౭

వ. అంత నొక్కనాఁడు. ౧౮

చ. ముదుసలియైన విప్రుఁడొక ముంతను జేకొని తీవ్రగామియై
పదములు తొట్రిలన్ ధరణిపైఁబడి చేఁగల మట్టిముంత నా
యదరున జారపీడిన తటాలున ముక్కలుగాఁగఁ జూచి తా
నెదవడి మోదుకొంచు నిఁక నేటికి నాబ్రదు కక్కటక్కటా. ౧౯

గీ. అనుచురోదింప నాతనిఁగనిన జనులు
హాస్యమొనరించి యీవృత్త మవనివిభుని
సతికిఁదెల్పిన నాతని చరితమేమొ
తెలియవలెనంచు విప్రునిఁ బిలువఁబంచి. ౨౦

క. జరిగినకథవిని భళిరా! ధరణీసుర! ఇంత కేడ్వఁదగునా? నీకే
పరికరములు కావలసిన వరుసఁగనిప్పింతుఁజింతవలవదటన్నన్. ౨౧

ఉ. భూసురుఁడిట్లు పల్కు నరపుంగవురాణి వివేకమందునా
చేసినపాప మెట్టిదియొ? చెప్పకతప్పదు తల్లి! బాల్యముం
బాసినదాదినే మఱొకపాత్రకు మానముఁ జూపలేదు నే
నీసరికిట్లుగల్గె బ్రతుకేటికి మానవిహీనమై ధరన్. ౨౨

గీ. సంపదలకేమి చంచలా సక్తములవి
సంతతికినేమి కర్మానుషంగ మదియు
మానవంతుఁడుఁగాఁగ నిమ్మహిఁజెలంగు
వానిదేజన్మ! వాఁడెపో మానవుండు. ౨౩

చ. నయమతి భూసురుండిటు సనాతనధర్మ నిబద్ధవాక్తతిన్
భయమునువీడి తెల్ప నృపభామిని హా! మునిలోకమాన్యయే
నయయొ కులాభివృద్ధికయి యన్యపతిన్ గమనింపఁజూచి నా
దయితుని చింతవీడి నిజధర్మము గంగనుద్రోయనెంచితిన్. ౨౪

గీ. అనలసాక్షిగ నేకమనోహరుని పాణి
నట్టెచేపట్టి యాతఁడు చెట్టఁగాంచ
నీచసంతతి కింకొక్కనిన్ వరించి
మహిఁజరింతురె ధార్మిక మానవతులు. ౨౫

క. నిజధర్మమువీడక భూ ప్రజలన్ సోదరులభంగి భావించిన యా
గజగామిని తనపతికిన్ విజయముఁజేకూర్పలేదె! విబుధులుమెచ్చన్

మ. ఇటులా విప్రుడుఁదెల్పు వాక్యములకెంతేఁ జిత్తమున్ద్రిప్పి తా
పటుధర్మంబుననుంటఁజేసి యట భూపాలుండు యుద్ధంబునన్
దృటిలో వైరులఁగెల్చి స్వీయపురికిన్ దృప్తాత్ముఁడైచేరె నిం
తటిదా? యీకథయంచునెంచకుఁడి సద్ధర్మంబుఁ బాటింపుఁడీ. ౨౭



౨౬౨

# చంద్రశర్మోపాఖ్యానము

శ్రీ రంగరాజు కేశవరావుగారు



చ. క్షితిపసమూహమౌళి ధృతకీర్తియు నజ్జయునిఁ భజించు న
యత్యతులితమూర్తి కూతురు ప్రియంవద, చారువిలాసభాసురాం
చితకమనీయగాత్రి సరసీరుహ నూత్నపలాశనేత్రి య
ప్రతిమవయోవిశాలలగు బాలలఁగూడి వనింజరించుచుఁ. ౧

వ. చంద్రశర్మ నిద్రించెడువేది కోపకంఠంబునకరుగుఁదెంచి యతనిం గాంచి తదభినవ కమనీయవిగ్రహ సౌకుమార్య సౌష్ఠవలోలుపాతిశయాద్భుత నిర్నిమేషాలోకన నయనయగుచు ననుచరీజనంబు నుపలక్షించి. ౨

చ. సరసిజనేత్రలార మనుజాతుఁడు సత్కులజుండు నిక్కవం
బరయఁగఁబోలు వీని సకలాంగ శుభాకృతి లక్షణంబునఁ
వెరవునఁజూడువీఁడు పృథివీసురపుంగవుఁడౌనొండె భూమిభృ
ద్వరసుతుఁడౌనొండె గావలయుఁగాక వరాన్వయజాతుఁడవ్వఁడో.

ఉ. ఈకనులీభుజద్వయము నీయొడలీముఖకాంతిసూడ న
ప్రాకృత పుణ్యపుంస్త్వము విభాసిలుచున్నదిగాన సత్యమీ
లోకములేలు కౌస్తుభగళుండు సృజింపఁగఁబోలు వీని భ
ద్రాకృతిగాంచిఁగోరితి మదాత్మను నెచ్చెలులార వింటిరే!

వ. వీనియందు పతిభావంబు భజించితి క్షత్రియులకు స్వయంవరంబ కర్తవ్యంబగుట నితఁడు నాచేవరింపంబడెఁగాన మీ చాతుర్యంబున సంఘటనంబు గావింపుండనిన నచ్చెలికత్తియలు చంద్రశర్మకు నిద్రాభంగంబు కలిగింపంగోరి ప్రయత్నించి విఫలీకృతలగుడు నా రాజనందన యతని నతికాలనిద్రా ప్రయుక్తుండని నిశ్చయించి వేగంబ నగరికరిగి సఖీజనముఖంబున తన యభిమతంబెల్ల జనకునకు నివేదించిన నమ్మనుజాధిపుండు.

క. ఒజ్జలఁగొండఱనాతని
పజ్జకుఁదోలింపుఁడనుచుఁ బంపినవారా
యుజ్జయినీ పత్యనుమతి
నజ్జగదే కంపువిప్రు నంతికమునకున్. ౬

చ. చని పరికించి గాఢసువిచారమొనర్చి, నరేంద్రచంద్ర! యీ
మనుజుఁడు పాలకాల మసమానఘనశ్రమ నన్నపాన వ
ర్జనమును గూర్కులేకిచట స్వప్నమునొందినవాఁడు గానఁ ద
త్తనువునఁ బూయఁగావలెఁ గదాయిరుపూటల నన్నసారముల్. ౭

క. తానై మేల్కొనువఱకీ
మానిసి మేల్కొలుపఁజనదు మనుజేశ్వర! తత్
ప్రాణములువోవు బలిమిన్
వీనిన్ మేల్కొలిపెదేని విస్పష్టముగాన్. ౮

వ. అట్లుపచరించి విప్రుండు మేల్కాంచిన నారాజతనితోనిట్లనియె. ౯

చ. ధరణీదేవ కులాగ్రగణ్య వినఁజిత్తంబయ్యె నీనామమున్
బురమున్ దెల్పుము నీయపూర్వరుచి మదోర్భగార్హాదివ్యాకృతి
స్ఫురణం బేల పిశాచజుష్టమగుటం బోలెన్ గృశీభూతమై
కొరగాకున్నది గాఢనిద్రఁగొన నీకుం గారణంబేమనన్. ౧౦

సీ. రాజేంద్ర వేదనారాయణుంబనుపేర
నంబుధికడ నొక్క యగ్రహార
మమరెడు వివిధభోగాస్పదంబవ్వీడు
మాయయ్య విష్ణుశర్మకు నొసంగె
తద్దేశమేలెడిధరణీశుఁడాతని
కొడుకులునలుగురా కొమరులందు
ముప్పురన్నలు వేదములు తదంగంబులు
మొదలగు చదువులు చదివి సకల

గీ. జనులచేఁ బూజవడసెద రనఘ నేను
కొండికనుగానఁ దల్లిమద్గురుజనైక
శిక్షఁగడపక పెంచెనన్నికతమున
ముదిరిపోతి ననక్షరముఖుఁడనగుచు ౧౧

సీ. పట్టి బాలురు బల్మి బడికిఁ దెచ్చు రాజ వీ
ధ్యంతరంబులఁ బొరలాడువాని
కోదండమెక్కించి గురుఁడుఁ బట్టఁబో భూమి
కొరగి చక్కన పరుగెత్తువాని
బలుపంబుతో వ్రేళ్లు పట్టి యొజ్జలు పూని
దద్దించువేళ నిద్రించువాని
నేలనేర్పినవాని నిమిషమాత్రములోన
మఱచి యూరకనోరుఁ దెఱచువాని

గీ. కొట్టకయమున్న బల్మొఱ వెట్టువాని
వెఱచినంతన వెన్నుపై చరచువాని
మదిజుగుప్సించి ననువీడి మద్గురుండు
వెడలఁద్రోపించె వటులతో బడికినవల. ౧౨

గీ. కన్నవారలు విడిచిన యన్నవార
లన్నవారలు వారల యాడివారు
మూర్ఖునగునన్ను గృహదాస్యమునకుఁ జొనిపి
సదువునకు నెడఁబాపిరి జనవరేణ్య. ౧౩

మ. కలుతున్ గట్టెలు దెత్తు పాల్పితుకుదున్ గ్రై సేతుగాలించి వం
టలు సేతున్ మడిదున్ను దింధనము తుంటల్ సేతు లాలించి బి
డ్డలనాడింతును గూరలేరుదును గోడల్ బూంతు నిల్లిల్ల ము
గ్గులు వ్రేతున్ గలయంపి వెట్టు దనటాకుల్ దెత్తు సద్భక్తితో. ౧౪

ఉ. అంతట నొక్కరాతిరి దురాగ్రహుఁడగ్రజుఁడాత్మ తల్పకా
భ్యంతరసీమ మేన్వయిచి యద్దమరాతిరి ప్రొద్దు కేళిహా
రాన్వ్యంతిక సుప్తుఁడై యెవఁడురా! యని లేపి మదంబెలర్ప నా
కింత పదంబులొత్తుమన నేను హసాదనఁ గాలుసాచుదున్. ౧౫

చ. అతిభయభక్తులొప్పఁగఁ దదంఘ్రిసరోరుహ మస్మదూరు సం
గతమగునట్లొనర్చి మృదుగాఁగ జటాపటి గ్రుద్ది యంగుళీ
ప్రతతి విదిర్చి యంతటను పార్శ్వపదాంఘ్రిను గుల్మజాంఘ్రిలో
రుతలము లొత్తితిం గరము ప్రొద్దతఁడూరక నిద్రఁబోవఁగా. ౧౬

వ. అంత నేనాత్మగతంబున. ౧౬

శా. నాతోడీటగు వీనితమ్ములిరువుర్ నాయన్నలాహా కళా
చాతుర్యంబునఁ బెద్దలాటకద స్వేచ్ఛన్ మందు వీడుట్ దద్ద్వ్యా నే
భూతుండై చనువారి మ్రోలఁ జనువంబోనట్టి నాదుర్దశా
వ్రాతంబీ తెరువిడ్వఁ బ్రాగ్జనన కర్మంబిట్లు బాధింపఁగా. ౧౭

చ. చదువున గౌరవంబును యశంబును వాదబలంబు సర్వసం
పదలునుగల్గి నామువురు భ్రాతలు నిర్మలధర్మవర్త్ము పుం
దుదల సభాసుఖావహ మధుప్రగతిప్రణయైకదోర్గతా
సుదృఢ శిరోవగూహనలఁ జొక్కెదరక్కట నేనుఁ దక్కఁగాన్. ౧౮

వ. అని తలపోయుచు నించుక కూర్కుబట్టిన నాయగ్రజుండు నన్ దా
చిన విసిగి యిలువెడలి.

మ. భయదవ్యాఘ్ర మృగేంద్ర భల్లసమదేభ క్రోడ వాహద్విష
చ్ఛయసంచారకఠోరముల్ మదికి శశ్వద్భీతి సంధిల్లఁగాఁ
బయనంపుందమికేప మోటుతన మొప్పంబోవు చో మ్రోలదృ
క్ప్రియ మృత్యూపముఁడైన వాఁడొక పిశాచస్వామి గన్పట్టఁగన్.

చ. చదివితినెల్ల వేదములు శాస్త్రములారును బారఁజూచితిన్
గొదువలుదీఱ శిల్పములు గూడెమహాస్త్రకళాప్రవీణతల్
బ్రిదిలితి వైద్యవిద్య గనిపెట్టితి యోగములెల్లఁ గల్ల గా
దిది యిదినాఁగనేల పృథివీశ్వర నేర్చితి నెల్లవిద్యలన్. ౨౨

వ. అనిసెప్ప విని రాజుహర్షించి ప్రార్థించి తనకూతునిచ్చి వివాహంబు
సేసిన నతండు సుఖుండై బహుకాలంబుమనియె. ౨౩



౨౬౩

# కాంత

శ్రీ గాదె రామచంద్రరావుగారు



పసిడిచాయల దేహ వైభవముగలిగి
తీక్ష్ణమగు మోహనకరంపు దృక్కులందు
హావరేఖావిలాసంపు దీపులందు
వయసుటిల్లాలి సహజ సంపదల మించి
"కాంత" యనుపేర శ్యామలు కాంతయలరు
రాజితగుణుండు ధిషణాధురంధరుండు
శ్రీయుతుండును చామన చాయవాఁడు
రహినినలువందు శ్యామలరావుపేర
పూర్వకృత పాపఫలమె యీపుట్టువందు
భార్యయాపాన "కాంత" దుర్భ్రమలఁగొలిపె
పండితుండైన సర్వ సంపదలచేత
వెలయువాఁడైన భూరిదోర్బలపుఁగలిమి
నలరువాఁడైన మగువల తళుకుబెళుకు
సరసములనమ్మి చెడిపోని నరుఁడుగలఁడె
మగఁడు మేదకుఁడైనచో మగువలహహా!
పుడమినాడింపకుందురే బొమ్మలట్లు
టక్కుటకటొంకు టాటోటు టెక్కుగలిగి
పతినిరవళించి లోలోనఁ బ్రమదమందు
మగనిబంధువు లేతేరఁ బగనుబూని
యావరణఁజేరి మొగసి క్రోధానలంబు
లుమియు దుర్వారరూక్షమహోరగంబు
ననుకరించుచు నిర్భాగ్యుఁడైనపతిని
దిట్టు కొరకొరలాడు తద్దినముపెట్టు
కులుకు బెళుకులకొంప గయ్యాళిగంప

కాంత దుష్కాంత దుర్గుణస్వాంత జంత
నయజనంబుల తలలోని నాల్కయనఁగ
శ్యామలుండైనడను గౌరవాఢ్యుఁడయ్యెఁ
బ్రవిమలంబైన వాక్సుధా వర్షధార
సారహీనంపు సంసార ఘోరభయద
దారుణాగ్ని ప్రభాపూర నీరమందు
దారిగానక నల్లాడు వారివారి
పంకిలముగాని వాంఛాలతాంకురములఁ
బ్రాణబీజము, అధికారి మానసంబు
గుర్తెఱిఁగి సంచరించెడి కోవిదుఁడు
యిహపరంబుల సౌఖ్యంబు లెన్నియేని
పొందగలఁడంచు జనులాడు కొందురైనఁ
బరమపదసౌఖ్య కోమల ప్రసవదామ
మెచ్చటోగాని యిటధరియించుటరుదు
ఐహిక సుఖంబులందుమా, ఆలిచేత
బుగ్గపోటులు లోలోన సిగ్గుచేత
మొగ్గుబెగ్గుచేతకు మన సొగ్గకుంట
చిత్తమన్యథా యత్నమై చింతనొందు
నప్రసన్నతఁ జెర్చి దురాగ్రహంబు
ప్రత్యహంబును బొంది నొవ్వంగఁజేయు
కులు! మానవద్వేషణ జ్వాలహృదయ
మందు మండుచునుండెనో! మానవాళి
తిని వహించిన రక్కసివనితయేమొ ?
మాటమాత్రాననే విశ్వమానవప్ర
పంచమంతయును వశీక రించువాఁడు
భార్యకు పిశాచమట్లు కన్పడునదేమొ
సతత జాజ్వల్య మానప్రశస్తరత్న
వజ్రనీలాబ్జ రాగప్రవాళవితత
మకర భాండార సరళిసామ్రాజ్యభోగ

మనుభవించెడి వారత్రీ వినయవినమి
తోత్తమాంగుఁడై పాదంబు లొత్తుచుండ
విధికృతంబైన పతిపాద విమలసేవ
చేయఁజాలక పూలఁబూజించుమనును
భువన మోహన కల్యాణ పుణ్యమూర్తి
భార్యకుఁ బిశాచమట్లు కన్పడునదేమొ?
ప్రకృతి సర్వంబు నయనపర్వముగఁజూడ
నిజయశశ్చంద్రికల ధాత్రి నివ్వటించి
సంతతానంద భరితుఁడౌ శ్యాములుండు
భార్యకు పిశాచమట్లు గన్పడునదేమొ?
ఏగడియ కేదివచ్చునో యెవ్వఁడెఱుఁగు
నిర్మలానంద కేలికా నిరతుఁడైన
శ్యాములుని చిత్త మొకరీతి చంచలించె
హేతువేమని ప్రశ్నింతురేమొ? దారి
వచ్చుచుండఁగఁగయ్యాలక్రచ్చులైన
కాంతభాధలు పడలేక చింతచేత
నగముకృశియించెఁజూడుమీ శ్యాములుండ
టంచు" వనితలు వ్రేలుచూపించుచుండఁ
జూచి సహియింపఁజాలక వేచివేచి
వంతఁగుందుచు గంగా ప్రవంతికడకు
మెల్లఁగాఁజనె తనువు కంపించ రెండ
డుఁగులువేసెనో లేదో దుడుకుతనమున
నే దివాంధంబు పుట్టిము నింగినట్లు
కూసె మిన్నువిరిగినట్లు గుండె, కలము
నడువఁగాఁ బోవదేఁదునో పిడుఁగుపడిన
శబ్దమువహించె ప్రకృతినిశ్చలతనుండె.



౨౬౪

# తలుపుదగఱ

శ్రీ దీక్షితుల నరసింహశాస్త్రి గారు



ఉ. యాదవనాథుఁడైన హరి యంబుజపాణులఁ గూడి క్రీడలన్
మోదము మీరనాఁడి యదుముఖ్యులతో మృగయావినోదసం
పాదనబుద్ధిచేఁదలక భాసుర సాలరసాల మల్లికా
మోద భరప్రపూర్ణ నవపుష్పవిరాజిత కాననంబునన్
శ్రీదయితుండు సేరి యతిచిత్రవిహారము సల్పి యంతటన్. ౧

చ. చనిభల్లూక వనేభఖడ్గ చమరీ సారంగ రంగద్ఘనా
ఘనసంకాశవరాహభీకర మహాకంఠీరవాక్రాంత ది
గ్వనభీమప్రద కాననంబున రమాకాంతా మనోహారి చ
య్యనమర్దించి మృగంబులన్ గనియె నయ్యబ్జాక్షి భిల్లాంగనన్. ౨

మ. కనిహాసంబునఁ జేరి చెంచువనితన్ కామోపభోగంబులన్
దనియన్ జేసియు నవ్యవస్తువుల చేతన్ బూని శ్రీ కామినిన్
గననేతెంచియుఁ దల్పుదీయుమన నక్కంజాక్షి తద్భావమున్
గనుఁగ్రేవన్ గని ద్వారమేసి నిలువన్ గర్వంబు దీపింపఁగాన్ ౩

శా. కాంతా వేగ కవాటమున్ దెఱవుమా! కంజాతపత్రాక్షి య
త్యంతప్రేమ సువస్తువుల్ గొనుచునే నాలింగనాపేక్ష నీ
చెంతన్ జేరినవాఁడనైన నిపుడో! శీతాంశు బింబాననా
వంతంజేల కటాక్షముంచుమనఁ గోపంబూని లేనవ్వునన్. ౪

ఉ. మాటలు వేయు నేల బలుమాయలప్రోడ వరాంగనామణీ
కూటసముల్లసద్రుచిర కుంకుమపంకము గానుపించు నే
బోటిని గూడినావొ యదుపుంగవ బొంకక తెల్పు వట్టి స
య్యాటలు చాలునింక పరిహాసము లెందుకు నేగు కేశవా. ౫

ఉ. భీతమృగేక్షణా యధికభీకర కాననసీమలందు నే
హేతిమృగాలఁద్రుంచఁగ మహీధ్రము లెక్కి చనంగఁ గింశుక
వ్రాతసుమోల్లసద్రజము వక్షమునన్ బ్రసరించియున్న దిగ
కే తెరువే నెఱుంగఁ గరమెందుకు దూరెదు మత్తకాశినీ. ౬

మ. పలుకాటుల్ చిగురాకుమోవిపయినన్ భాసిల్లుచున్నావియే
కలకంఠీమణినొక్కియున్న దెఱుఁగంగాఁ దెల్పు నాముందటన్
బలుమాయల్ పచరించినన్ మనములో భావింతునే నిక్కమా
పలుకంగా మగవాని నమ్మకురె గోపాలాగ్రచూడామణీ. ౭

మ. వికచాంభోరుహనేత్ర కాననమునన్ వేమారు క్రీడింపఁగా
శుకరాజంబును బింబవిభ్రమముచే సొంపొందఁగా వచ్చి యో
పికవాణీ యధరంబునొక్కె నది కోపింపన్ మదిన్ జెల్లునే
సకియా! వాదము తేలచేసెదవు బాసల్ సేతు బింబాధరీ. ౮

ఉ. మేనకురంగనాభ మతిమేదురమై గనుపట్టుచుండు నే
మానినిపొందఁగోరితివి మత్సరమున్ విడనాడి చెప్పుమా
దానవభేది నాయెదుట దాచఁగనేటికి యింద్రజాల వి
ద్యానిపుణత్వమా సఖులతావునఁ జెల్లునె పో మురాంతకా. ౯

శా. శూరత్వంబునఁ గానలోపలను గస్తూరీ మృగస్తోమమున్
ఘోరాసిన్ విదళింప తత్క్షతజమున్ గోకస్తనీ! యంటి యీ
తీరున్ గప్పుదు దైవసాక్షిఁగను నీ దివ్యత్సుధామాధురీ
తారుణ్యాధరపల్లవామృతము నొందన్ జేయుమా వేడెదన్. ౧౦

చ. కమలదళాక్ష ఘుంఘుమసుగంధము పుష్పములంగ మందు పొం
కముగను గానుపించు పరకాంత సుఖంబుల నోలలాడి శ్రీ
రమణ యిటేలవచ్చితివి రవ్వనుజెందక పోయిరమ్ము నీ
క్రమమును గానుపించు కులకామిని పొందు రుచించునే హరీ. ౧౧

చ. చిలుకలకొల్కి నామనవిచేకొనుమా విరజాజి తీగ పం
దిరులదరిన్ వసింప సుమనవ్యరజంబది పైనరాల యీ
చెలువును గానుపించు నొకచేడియ పొందును గుఱ్తుంగ నీ
చలమును మాని గబ్బిబిగిచన్నుఁగవన్ దయఁజేర్చుమా ననున్. ౧౨

ఉ. అంతట తల్పుదీసి దరహాసము మోమునఁ జెంగలింప శ్రీ
కాంతుని చెంతఁజేరి నవకంజవిలోచన హారతుల్ మహా
సంతస మొప్పనిచ్చి హరిచారుపదంబుల మ్రొక్కి తెల్లచే
మంతుల హారమేసియు రమాసతి కౌఁగిటఁ జేర్చె నాథునిన్. ౧౩



౨౬౫

# అభ్యాస పరిణామము.

శ్రీ ఇ. రాజయ్యగారు



తే. అరుణకిరణముల్ ప్రాగ్దిశనవతరించెఁ
దమమడంగుచునుండె దిక్తటములందు
పక్షిగణము మేల్కొలుపులఁ బాడుచుండ
నిద్రమేల్కొనుచుండెను నిఖిలజగము.

చ. తరుణవయస్కుఁ డొక్కరుఁడు తత్పమయంబున దారినేగుచున్
జరణము మెల్లగానిడుచుఁ జంచలమానవిభంగి నెంతయున్
బరవశుఁడై విచారమున భావముఁజేర్చి నిజాత్మనేదియో
యరయుచుఁజేరె నొక్క విపినాంతరసీమ నతండువిస్మితున్. ౧

ఉ. అచ్చటఁగాంచె నాతఁడు ననంతములైన మహీరుహంబులన్
బచ్చనితేనెలన్ మిగులఁ బక్వములైన ఫలంబులన్ మనం
బచ్చెరువందఁజేయు పొదరిండ్లనుఁ జారులతాంతసంతతిన్
మచ్చికమీఱ నల్దెసల మందసమీరము వీచుచుండఁగన్. ౨

క. ఈపగిదిఁ గొంతదూరము నా పాంథుడు నడుచుచుండ నంతఁగుటీరం
బాపజ్జనుండఁగనెనటఁ దాపసు లెవరైననుంటఁ దలఁచిమనమునన్.

తే. పాంచభౌతికమయమైన ప్రకృతిలక్ష్మి
యనువుగాఁదముఁగొల్వ నిట్లనవరతము
శాంతిమయమగు నాశ్రమప్రాంతమందు
జ్ఞానసంపద యభివృద్ధిగాకయున్నె? ౩

క. అనితలఁచి యాకుటీరం
బున నున్నటువంటి పురుషమూర్తినిఁజూడం
జనియందుఁగని యెనాతఁడు
మునివరు సదయాత్ము శాంతమూర్తిఁ దపస్విన్. ౪

సీ. శారదచంద్రికా సదృశశుభ్రవిభూతి
ఫాలభాగమునందుఁ బరఁగుచుండ

నీలమేఘచ్ఛాయఁ బోలుకాంతినిఁగల్గి
శిరమునందున జటాశ్రేణిమెఱయ
పరిపూర్ణభక్తి సంభరిత భావస్ఫూర్తిఁ
గాన్పించునయన యుగంబుతోడ
దక్షిణహస్తాగ్రతలమందుఁ దిరుగాడు
మేలైనరుద్రాక్ష మాలతోడ

తే. బద్ధకౌపీన దేహుఁడై వరపవిత్ర
యుక్తహరిణాజినాసన యోగరతుఁడు
నిశ్చలమనోగతధ్యాన నిష్ఠపరుఁడు
ననఁగమునివరుఁడుండె నిజాశ్రమమున. ౭

తే. యువకుఁడిట్లు గుటీరమందున్న ఋషినిఁ
గాంచిసాష్టాంగముగ నమస్కారమును స
వినయముగఁజేసి యకుటిలమనముగలిగి
నిలచియుండెఁ దానచ్చట నెమ్మితోడ ౮

తే. అంత ఋషియాతనింగని యనియెనిట్లు
"ఏల యోకుమారా యిప్పుడ్రప్రభాత
కాలమునవచ్చితివి; తెల్పు కారణంబు"
ననిన ఋషివరుతోడ సవినయముగను. ౯

శా. "అయ్యా! మీదరిఁజేరినాఁడ; భవదీయాజ్ఞానువర్తుండనై
నెయ్యంబొప్పఁగనుండువాఁడ; దయతోనేర్పంగదే యీశ్వరుం
డెయ్యేమార్గమునంజరింపఁ గృపతోనిష్టార్థముల్ దీర్చినా
కుయ్యాలించి ప్రపంచమందుఁదగ నాకున్ శ్రేయముల్ గూర్చునో.

క. మునివరుఁడా యువకుని ప్రా
ర్థనమునువిని శిష్యుఁగాఁగఁదన చెంతన్ దా
ననుకంప మొదవనుండుట
కనుజ్ఞనొసఁగంగ యువకుఁడచటవసించెన్ ౧౧

మ. ఒకనాఁడా యతిపుంగవుండు మదిలోనుత్సాహముల్ మీఱఁద
న్నికటస్థంబగుచిన్న కాననమునన్ నీతింప్రబోధింపఁగా

సకళంకంబగు ప్రేమతోఁ జనియె నయ్యభ్యర్థియుఁ వెంటరా
నొకయుక్తస్థలిఁ జూచుచుండి రవుడా యోగీంద్రుఁడావిన్మృటుఁ. ౧౨

తే. అచటనున్న నవీన వటాంకురమును
దరుణునకుఁ జూపి దానినిఁ బెఱికివేసి
నానతిచ్చిన వెంటనే దానినతఁడు
మూలములసహితము నవలీలఁ బెఱికె ౧౩

తే. అంతఁ దత్సమీపంబునఁ గొంతఁ బెఱిగి
యున్న మఱియొక మొక్కను యువకుఁ జూడఁ
జేసి దానిని పూర్వపుస్థితిఁ దనరఁగ
బెఱికివేయ నాజ్ఞాపింపఁ బిదపనతఁడు. ౧౪

తే. మొక్కఁ బెల్లగించెనుగాని మొదటిదాని
కరణి సులభముగా నది కదలలేదు
పిమ్మట గురుండు శిష్యుని వెంటఁగొనుచుఁ
వానికిం జూపె వేరొక్క వనలతికను. ౧౫

ఆ. మొదటఁ జూపినట్టి మొక్కలకంటెను
జాలలోతుగాను నేలయందు
నాటుకొనుటచేత నద్దానిఁ బెకలింపఁ
జాలఁ గష్టమయ్యె జవ్వనునకు. ౧౬

క. అంతట గురుశిష్యులు మఱి కొంతయడవి నడచి మిగులఁ గూరిమితోఁ ద
త్ప్రాంతమున నాగిరవృక్షము సంతోషితవదనుఁ డగుచు సాధువతనికిన్

తే. పెద్దయై కడు దృఢముగఁ బెఱిగియున్న
మొక్క నొకదానిఁ జూపింపఁ బూర్వరీతిఁ
దానినున్మూలన మొనర్పఁ దరుణుఁ డంత
శ్రమము నొందియుఁ బెకలింపఁ జాలఁడయ్యె. ౧౭

చ. మునివరుఁ డప్పుడా యువకముఖ్యుని దగ్గఱఁ జేరఁ బిల్చి యో
యనుఁగు కుమార! లక్ష్యముగ నాత్మఁ దలంపుము మొక్కలన్ గ్రమం
బున నవి యెట్లు గాఢముగ భూస్థలియందున నాటియుండె నీ
యనుభవముం గ్రహించి మది నారయు మాత్మ నిసర్గ నైఖరిన్. ౧౮

మ. వినుమోశిష్య! మనుష్యునందుఁ దొలిదుర్వృత్తుల్ దురభ్యాసముల్
జననంబొందినకాలమందుగని విజ్ఞానంబుతోనట్టి వ
ర్తనముల్ దూరముఁగాఁగఁ జేయవలయున్ తద్వ్యత్యయంబైన న
మ్మనుజుండెప్పుడు దుష్పథంబునకు ధామంబై మెలంగున్ భువిన్.

తే. మూలములులోన దిగఁబాఱి భూమియందు
దృఢముగానాటుకొనియున్న తృణమునైనఁ
బెఱికివేయుట కష్టమై వెలయునట్లు
దుస్స్వభావంబుఁ దొలఁగింప దుస్తరంబు. ౨౧

క. కావున లేఁబ్రాయంబున
నేవిధమగుచెడుగుణంబు హృదయమునందున్
స్థావరమైయుండకముం
దే వెడలఁగఁ దోలవలయుఁ దెలివిశేనముచేన్. ౨౨

తే. దుష్ప్రవర్తనమును బోవఁద్రోలియిట్లు
సద్గుణము లలవడుటకు సంతతంబు
శ్రద్ధఁగొని యత్నమొనరించు జనవరునకు
సర్వవిధముల శ్రేయంబు సంఘటిల్లు. ౨౩

తే. తాపసుండప్పుడిదియె సద్ధర్మమఖిల
పూరుషార్థ సాధనకిది మూలమనఁగఁ
ద్రికరణవిశుద్ధిగా విని యకుటిలముగ
సాగిలంబడి మ్రొక్కెనా సాధువునకు. ౨౪

తే. అంతటగురుండు "దీర్ఘాయురస్తు" టంచు
శిష్యు నాశీర్వదించి తచ్ఛిరముపైనఁ
గరమునిడి కృపఁజూపినఁ గడుముదమున
ననుమతింగొని గృహమున కరిగెనపుడు. ౨౫



౨౬౬

# రామ భార్గవ సంవాదము

అష్టావధాని

శ్రీ బెల్లంకొండ నరసింహాచార్యులుగారు



ఉ. ఆతతబాహువీర్యుఁడ చలాధిప ధైర్యుఁడు భూరిశౌర్యుఁడా
ర్యేతరశిక్షణాచణుఁడహీన యశోభరితుండు రాముఁడా
సీతను బెండ్లియాడ శశిశేఖర కార్ముకఖండనంబు వి
ఖ్యాతిగ నాచరించెఁ ద్రిజగంబులు డిందుపడంగనుద్ధతిన్. ౧

శా. అంతంగాలమహోగ్ర రుద్రుగతి నుగ్రాకారుఁడై దృప్త భూ
కాంతచ్ఛేదననిస్రువత్ప్రబలరక్తస్నిగ్ధతీక్ష్ణాంత దు
ర్దాంతక్షాత్రికుఠారహస్తుఁడు ధనుర్బాణాసిధారుండు న
త్యంతక్రుద్ధత వచ్చె భార్గవుఁడు తద్ధ్వానంబు నాలించియున్. ౨

క. రామున్ రణరంగస్థల భీమున్ క్షత్రియవిరాము విశ్రుతనామున్
సౌమిత్రిగాంచి శ్రీరఘు రామునితో నిట్టులనెఁ బరాకుననగుచున్.

సీ. భసిత రుద్రాక్షవిభాసుర దేహుండు
లలిత జటాజూటలాంఛితుండు
ప్రళయాగ్ని జాజ్వల్య రక్తవిలోచనుం
డఖిలప్రపంచ భయాస్పదుండు
మౌర్వీశరాసనమౌంజీశితాశుగ
దర్భకృష్ణాజిన ధారిఘనుఁడు
వల్కలవసనుండు వల్గుగౌరాంగుండు
పరశుకమండలుకరుఁడు వగుఁడు

గీ. బ్రాహ్మణక్షత్రవర్ణ సంభావితుండు
శాంతవీరరసంబులు జాలువారఁ
బ్రేక్షకజనంబు భీతిచేఁ జెదరిపోవ
వచ్చుచున్నాఁడు నీతఁడెవ్వాఁడొ తెలుపు. ౪

శా. రాముండిట్లను తమ్ముఁడా యితఁడు క్షత్రచ్ఛేదనాదక్షుఁడు
ద్దామస్కందవిజేతఁ క్రౌంచధరణీధ్రప్రాభవోద్భేదనా
సామాన్యుండును హైమవేంద్రభుజశిక్షాయాక్షధారాకన
ద్భీమప్రౌఢకుఠారహస్తుఁడు జగద్వీరుండు రాముండనా. ౫

గీ. అనుచు సానుజన్ముఁడై యెదురేగియు
భక్తిమీఱ నతని పాదములకు
మ్రొక్కినతఁడు ప్రేమనెక్కొనదీవించి
రాముఁగాంచి మదిని భ్రాంతిఁజెంది.

శా. సౌందర్యంబున శౌర్యధైర్యముల తేజశ్శాలితన్ముగ్ధతన్
గందర్పున్ బురవైరి దైత్యమథనున్నక్షత్రపుత్త్రుంచెనా
నందుండున్ గదనాతివీరుఁడతి శృంగారుండుఁ గారుణ్యావి
స్తంద్రుండీరఘురామచంద్రుఁడు జగద్వంద్యుండుఁగాకుండునే. ౭

గీ. క్షత్రపోతమ! మా సదాచారగరిమ
నీకు దీవన నిడితిఁగానీ గిరీశ
కార్ముకవిమర్దనర్ధిత గర్వితాత్మ
నీకుఠారంబు దునుమకున్నె యనంగ. ౮

శా. రాముండిట్లను కోపమేనొదయమో రానిమ్ముగానీ ముని
స్వామీ? పాత్రుఁడనయ్యెదన్ గని జగద్వంద్యంబునౌ శాంభవీ
భీమప్రౌఢశరాసనంబు విరువన్ వీర్యంబు నాకుండునే
సామాన్యంబుగ ముట్ట విర్గెనన నాత్మోద్దేవుఁడత్త్యుగ్రుఁడై. ౯

ఉ. మాయలమాటలేలఁ బలుమారు వచింతువు నేనెఱుంగనే
నాయెడఁజూపుదో ఘనత నాదుకఠోరకుఠార మిప్పుడే
బాయక తావకీనగళబంధుర రక్తసుధారలన్ లఘూ
పాయముగాఁగఁ గ్రోలు మధుపంబులఁ దేనెలఁ ద్రావురీతిగన్. ౧౦

గీ. అమితబలుఁడు భార్గవాత్మజుండాడిన
కటుదురంతవాక్య ఘనతనెల్ల
నాలకించి సస్మితాంబుజవదనుఁడై
చతురసరణి రామచంద్రుఁడనియె. ౧౧

చ. గలమునహారమో నిశితగాఢకఠోరకుఠారధారలో
లలనల నేత్రసీమల లలద్ఘనకజ్జలమో జలంబులో
దలపసుఖంబో ప్రేతపతి ధన్యముఖంబునో చూతుమైనమే
మిలనుద్విజాతికడ్డముగ నెప్పుడునిల్వ మనాఁగమానియున్. ౧౨

శా. అన్నా! యెంతటిమర్త్యసీతుఁడవు దారాముక్త వస్త్రావృతుం
డన్నారీకవచుండు మత్పరశుభిన్నాంగుండుఁగాకుంట నేఁ
డిన్నిచాలపనంబులన్నియితి నెంతేశత్రుగోత్రంబులన్
మన్నించంగలవాఁడు మూర్ఖుఁడనుచు న్మాన్యుల్ ప్రబోధింత్రుగా.

క. పాఱుఁడవు బ్రహ్మవేత్తవు నోరుపులేకుంటఁదగునె యోర్తురె పెద్దల్
వేరెవ్వరడ్డమంచని బీరములాడంగ సెల్లెఁ బెద్దవుగానన్.

గీ. స్నానసంధ్యాదికంబులే సాగరమున
మునిఁగిపోయెను శాంతత్వ మణఁగెనచట
భైరవునిబోలి భీకరాకారుఁడవయి
శస్త్రధారుఁడవై తిర్గ సరణియగునె. ౧౪

క. తనపెగ్గెలఁగొండాడెడు
జనునెవ్వఁడు మెచ్చఁబోడు కుమనదియఘు కా
రణమనిపెద్దలు సెప్పిరి
తనివారగఁబొగడికొనెదు ధర్మంబగునే. ౧౬

తే. అట్లుఁగాకున్నఁజలమూని యల్పమతిని
కూరసుతుఁక్షత్రియులతోడఁ బోరుసల్పి
మానహానియు నదిగాక ప్రాణహాని
గాన, వచ్చినత్రోవను బూని పొమ్ము. ౧౭

ఆ. అనుచుఁదెగడనాడునా సుమిత్రాసుతు
పలుకులాలకించి భార్గవుండు
పరశునెత్తివేవఁ జరతెంచునంతలో
గౌతమాత్మజుండు గడఁగిపలికె. ౧౮

తే. శమదమ తపోభిరాముండు శాంతమూర్తి
నీదుజనకుండు జమదగ్ని నీతిపరుఁడు
నతనికి సుతుండవై నీవు నధికకోపి
వగుట తెగదన్నఁగోపించి యతఁడు బలికె. ౧౯

తే. ఎంతయో పెద్దవలెవచ్చియిచట నీతిఁ
బలుకవచ్చినవాఁడవా తొలఁగిపొమ్ము
జామదగ్న్యుని యార్భాట సరణిదెలియ
వనినఁగోపించి శ్రీరాముఁడనియెనిట్లు. ౨౦

మ. పవికాఠిన్యము భర్గకార్ముకము నే భగ్నంబుగావించినన్
భవదీయాత్మసుశల్యమగ్నమయి యుబ్బంగిన్ విరోధించెఁగా
న వృథాలాపములేల శైవమయిన న్నారాయణీయంబు గా
ని వరాకంబుగఁజేతు నన్నవినిమా నిశ్చేష్టుఁడత్యుగ్రుఁడై. ౨౧

మ. వనమాలీ వనమాలికా పరిమళభ్రాంతి భ్రమద్భృంగని
స్వననీరంధ్రము దుష్టలోకభయదజ్యాఘోషముల్ దానవీ
జనతాశీకరరోదనధ్వని తతిస్వాధ్యాయబీజాంకురం
బునఁ నీవైష్ణవకార్ముకంబుఁగొనుమా పూరించుమా తాల్మిమై.

చ. అనిజమదగ్నినందనుఁ డహంకృతిమీఱఁగ విల్లునీయఁగాఁ
గొని రఘువంశనందనుఁడ కుంఠితవిక్రమలీల నొంచ న
ద్ధనువును గాంచి భార్గవుఁడు దర్పము వీడి రమావిభుండుగా
మనమున నెంచి రాఘవుని మాన్యత మీఱఁగఁ గౌఁగిలించియున్.

గీ. లోకవందితపాద సుశ్లోకచరిత
నిన్నెఱింగితి నన్ను మన్నించుమయ్య
పోయివచ్చెద నా కానతీయుమనుచుఁ
జనియె భార్గవరాముండు సత్వరమున. ౨౪

౨౬౭

# భారతమాత

శ్రీమతి భో. ఆండాళమ్మ గారు

సీ. అనుపదోజ్జృంభ మాణాన్యధర్మత
ఖండనాఖండ ప్రచండమతులు
సర్వవిద్యాసార సంప్రదాయవిచార
బోధనాచరణ ప్రపూర్ణధృతులు
ప్రకటాగమాంత మార్గప్రతిష్ఠానాఖ్య
ధీరాతిధీరతోదారమతులు
అఘటనాఘటన నిరాఘాట భవ్యనైక
భావుకాత్యంత ప్రభావయుతులు
గీ. అజ్ఞసముదయోజ్జీవనాభిజ్ఞసహజ
మంగళకర కరుణాసమాలింగితులును
నైనశంకర రామాను జార్యసముల
దొరయు పుత్రుల గనవేమి భరతమాత. ౧

సీ. యమనియమా సనధ్యాన ధారణముఖ్య
యోగవిఖ్యాతులై యొప్పుద్విజుల
నిజవిక్రమక్రమ నిర్భిన్న ధర్మేత
రారంభదక్షులై యలరునృపుల
నిజకులోచితధర్మ నియతివిఖ్యాతులై
యూర్జితస్థితిగాంచు నూరుభవులఁ
దై్రవర్ణికార్చనారంభ సంవర్ధిత
భద్రసంయుక్తులౌ శూద్రకులులఁ
గీ. బూర్వమునఁబోలె నిపుడేలపొడమఁజేసి
నీదువిఖ్యాతి దిక్కుల నివ్వటిల్లఁ
జేయవేలొకో! చేలవో? చిత్రమగును
పరమకల్యాణ గుణపూత! భరతమాత. ౨

౨౬౮

# సోదరా!

శ్రీ గవ్వా అమృతరెడ్డి గారు

సీ. బంగారుపండించు వల్లవుభూములు
పిడికెడుగింజలేఁ బెట్టలేవు
రతనాలగనులచే రాజిల్లుతావులఁ
బలుగుఱాలైనను బడయలేము
కవికోకిలముల చక్కని తోఁటలగు పట్ట
ణములనింపగు భాషణంబెవినము
కఠినశాత్రవుల నుక్కడఁచినవంశాన
శౌర్యరేఖలలోని జాడఁగనము
తే. గీ. ఆంధ్రులమొ కామొ! మనదీ యనంతభూమి
ఆంధ్రదేశంబొ? యను సంశయంబుపొడము
తమ్ముఁడా! నిన్ను జూచిన తరుణమందుఁ
గారణంబేమొ యూహింపఁగలిగినావె? ౧

సీ. చినిగినచింపురుల్ జీరాడుచుండెడు
ధోవతి మొలచుట్టు త్రోపుదేల?
మలమలమాడెడి మండువేసంగిలో
నరికాళ్లుకాలంగ నరుగుదేల?
ముక్కారుపండిన భూములున్నవికాని
అన్నమన్నంబని యరతువేల?
సౌధాగ్రములచేతఁ సౌభాగ్యమొప్పినఁ
బూరికొంపలలోనఁ బుట్టితేల?
తే. గీ. చెడితివేల? మహా కలిచేష్టలెల్ల
నీదుమోములనె నిజముగ నిలచెనేల?
సోదరా! ఆంధ్రజాతి యశోలతాంగి
విడిచెనిన్నేల? తలఁచితె? వెఱ్ఱివాఁడ! ౨

౨౬౯

# జీవకళ

శ్రీ నీలకంఠ చంద్రమౌళీశ్వర కవులు



సీ. కంటిరే మనకెట్టి ఘనమున్నదో మున్ను
గన్నారఁ దిలకించి యన్నలార
వింటిరే మనకెట్టి విజ్ఞానమున్నదో
వీనులకింపుగా జ్ఞానులార
మనటలో మనవారి మహనీయగుణములు
దెలిసితిరే మీరు తేలపడఁగ
జగతిలో మనకెట్టి సంబంధముండెనో
కార్యతంత్రవిచారగౌరవమున
గీ. నేఁటిదినముల కేరీతి నాఁటివిధులు
నెగడుచున్నవె వానికౌ నీతులేమి
మనకుఁ జూడంగ దూరమై మసలుచుండె
మేలుకొని జీవకళనింక చాలగనుఁడి. ౧
సీ. సోదరత్వములేక యాదరత్వములేక
భేదతత్వమదేమొ పెంపుమీఱె
మేధవిత్తములేక సాధుభావముగాక
వేధకారణముల బోధలూరె
బహుయత్నములులేక సహనమొందనుగాక
శక్తిసంభావనా చర్యదీరె
కనికరంబులులేక యనుకరింపులఁ బోక
వినయవిఖ్యాతి కౌ ఘనము మీఱె
గీ. నహహ భారతదేశ ధర్మానుసరణ
మెట్టిహీనతగాంచెడి గుట్టుతొలఁగి
భావగర్భితమైనట్టి ప్రాజ్ఞులార
మేలుకొని జీవకళనింక చాలగనుఁడి. ౨

---

# ౩౭౦
# కర్షకా!

శ్రీ గంగుల శాయిరెడ్డి గారు

సీ. నీజాతివారలు రాజులైయుండియుఁ
గనఁజాలరైరి నీకష్టమెల్ల
నీకొలమందు జన్మించిన యాజమీం
దారులుగనరు నీతాపమెల్ల
నీశాఖలో ధననిలయులౌ గొండలు
పరికింపలేరు నీ బాధలెల్ల
నీ తెగలో విద్యనేర్చిన బియ్యేలు
లిఖియించరైరి నీ లేములెల్ల
గీ. న్యాయవాదులు నీవార లదుగనైరి
న్యాయమూర్తులు నీవార లరయరైరి
ఇంక పెఱవారిముచ్చట లెందుకయ్య
కర్షకా! నీదుకష్టముల్ గాంతురెవరు?
సీ. జాగీరువారులు స్థానంబులేకను
పరులపంచలఁజేరి బ్రతుకవలసె
అగ్రహారపుఁబ్రజ హక్కులన్నిటివీడి
యొరులొద్దఁజేరియు నొదగవలసె
బంజరు రైతులు బాటలుగానక
దశదిశలంజూచి తారవలసె
కౌలుదారులెప్పుడు కడగండ్లఁబడుచును
స్థిరముగు రైతులుఁగక తిరుగవలసె
గీ. గొఱ్ఱమేఁకలనావులఁ గుదువఁబెట్టి
పల్లెలోనున్న పైరుల నిల్లు విడిచి
ఆలుపిల్లలు దుఃఖింప నడలవలసె
కర్షకా! లెమ్ము వేగమే కనులువిప్పి.

౨౮౧

# నేఁటి ద్విజులు

శ్రీ "వైద్యవర" వేంకటరాజన్న అవధాని గారు

---

సీ. స్వాధ్యాయనిరతులై వరలఁగాంచినవార
        లక్షర శత్రువులైరి భువిని
నిత్యాగ్నిహోత్రసన్నిధినుండు వారలు
        ధూమ్రపానాగ్ని సంతుష్టులైరి
త్రైలోక్యగురువులై రాణమించెడివారు
        గురుమంత్రమునుదామె మరపుఁగొనిరి
అఖిలవేదార్థ విద్యావిభూషితులిప్డు
        వేదనామమున కవేద్యులైరి
గీ. పరహితార్థ సంపాదనా పరులునేఁడు
స్వార్థసిద్ధ్యైక కార్యతత్పరులునైరి
"ఆత్మవత్సర్వ భూతాని" యనెడివారు
జనులఁ బీడింపసమకట్టి రనుదినంబు. ౧

సీ. ప్రజల దుష్టులనుండి రక్షించువీరలు
        వారినేఁబీడించు వారలైరి
అరిరాజ బృంద సంహారణాభిలాషులు
        పందలై మూలలఁ బడిరినేఁడు
రాజ్యనిర్మాణ దోర్బలమండితాగ్రణుల్
        పరుల యేల్బడికిలోఁ బడిరినేఁడు
నిరతస్వరాజ్య సంస్కరణాభిలాషులు
        దాసులై బ్రదికిరి దర్పముడిగి
దిక్తటవ్యాప్త పౌరుషాధిక్యులిపుడు
సహజభీరుత్వ బోధనాచార్యులైరి
ఆత్మ బలిదానమునకుముం దంజవేయు
వారు ప్రాణభీతిని తలల్ వంచినారు. ౨

---

౨౭౨

# దేశమాత

శ్రీమతి వి. లక్ష్మీదేవమ్మ గారు



సీ. ఎండిన ప్రోవులతే సిగురులెత్తగ గీతి
కంబాడరేల త్యాగయ్యపగిది
శతవృద్ధురైన మేల్ జలదరింపంగ గ్రాఁతం
గావింపరేల తిక్కన్నభాతి
దీనౌన్నజమ్మునైన డీలువోననింజేయ
రదయేల కృష్ణరాయలను బోలి
కృతులందివేగసత్కీర్తినిం గొనరేల
ఆరఘునాథ రాయలవిధాన

గీ. ప్రాజ్యసామ్రాజ్య కార్య చక్రంబు ద్రిప్పు
మంత్రి మొనరుపరేల తిమ్మరసురీతి
కోటికొకండైన నేటి నీకొడుకులందు
దివ్యవిఖ్యాతగుణజాత దేశమాత. ౧

గీ. ఆయురారోగ్య సంపద లతిశయిల్ల
నైహికాముష్మికంబుల కాటపట్టు
పరమకల్యాణ గుణపూత భరతమాత
మమ్ముం బునరుద్ధరింపంగా నమ్మికొలుతు. ౨

గీ. వీరధర్మంబు దివికేగి విశ్రమించె
బ్రహ్మతేజంబుడస్సి విశ్రాంతిగనియె
భారతీయులు దౌర్భాగ్య పరతగనిరి
తిరిగి మమ్ముద్ధరింపుమో దేశమాత. 3



## ౨౭౩
# విద్యార్థి

శ్రీ నిర్మల శంకరశర్మ గారు

మ. మహనీయంబగు నాంధ్రదేశమున జన్మంబొందినా పవిత్ర నీ
గృహభాషన్ ప్రథమంబుగా గ్రహమవుటే కృత్యంబుగా నెంచి స
త్స్పృహ వాసంబున మాతృసేవకయి నీ సర్వస్వమర్పించి య
స్పృహ మీ సత్కృషికై కడంగుమిక విద్యార్థీ! శుభాభ్యర్థినై. ౧

మ. అకలంకంబు త్రిలింగభాషకును సామ్యంబెందు లేదంచు వ్యా
పకముం జేయుటకై యవశ్యవిధిగాఁ బాండిత్యముం బూని తా
వకదృష్టాంతము చేత నాంధ్రులను గర్వంబొందఁ గాఁజేసి పా
యక లోకంబును నుద్ధరింపుమిఁక విద్యార్థీ! శుభాభ్యర్థినై ౨

మ. ధనమార్జించుటకే కదా ప్రియతమాంధ్రంబున్ విసర్జించి యీ
దినమందన్యుల భాషలం జనువ నెంతే సన్నివిజృంభించిరిం
కనుని కాలము నిల్వనేరదు సుమీ కల్యాణవిద్యాప్తికై
యనుమానింపకు మాతృభాషయిది విద్యార్థీ! శుభాభ్యర్థినై. ౩

## ౨౭౪
# నిరుద్యోగ రాక్షసి

శ్రీ క. హే. సత్యనారాయణరావు గారు

చ. అడిగిన వాంఛితార్థము లొసంగెడి నిర్జరధేను కైవడిన్
జడియక పెక్కు దేశముల వారలకన్నము నిచ్చు వృత్తులన్
దడయక కూర్చు నీ భరత ఖండమునందు నహంపతిన్ వడిన్
ఖాడమిన ఘోరహాలహల మో! యనఁ బుట్టితి వేలరాక్షసీ. ౧

శా. క్షోణీజాతలతాదిసస్యగణముల్ సంపూర్ణవర్షంబుచే
నానాశోభల నొందఁజేయునదియూ ధారాధరస్తోమముల్
నానావస్తులఁ బెట్టు వాయుకరణిన్ సంపాదనేచ్ఛామలన్
నానారీతులఁ బాడొనర్పఁదగునే? వ్యాపారశూన్యత్వమా. ౨

౨౭౫

# దంపతుల కాశీస్సు

శ్రీ రేమిడిచర్ల వేంకట కృష్ణారావు గారు



తే. గీ. అవిరళప్రేమవాహినులందు మీర
నైక్యతను నీరు గొంచు రాయంచలట్లు
ప్రేమరాజ్యాధికారిచే వినుతినొంద
వలయు సత్కీర్తి ఘటియింప వలయు నుండు. ౧

సీ. ఆర్యభావంబుల కనుగుణ్యముగనుండు
భావంబుతో వరలుమయ్య
అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన ముగుదపైఁ
బ్రేమదృష్టిని గురిపించుమయ్య
పేదసాదలకుక్షి వేదనల్ తెగటార్చి
చిత్తమలరఁ బోషింపుమయ్య
సద్విద్యనేర్చి విజ్ఞానార్జనముచేసి
సవినయమును నిల జాటుమయ్య

గీ. ఏగుణగ్రహణంబున నీవుజగతిఁ
గీర్తిసంపదనందగా నేర్తు వట్టి
సుగుణగ్రహణంబుచేదానిఁ జూఱఁగొనఁగ
హితవునీకిది మదిని నూహింపుమయ్య. ౨

గీ. ప్రేమతత్త్వస్రవంతులు వెల్లువలయి
పారఁ గృషిసల్పినట్టి రాధారమణుఁడు
నవవధూవరులగు మీకనవరతము
నాయువొసఁగుచు దీవన లంపుఁగాత. ౩



## ౨౭౬

# పారతంత్ర్యము

శ్రీ గవ్వా జానకిరామ రెడ్డి గారు



మ. ధర స్వాతంత్ర్యమె స్వర్గతుల్యమను తత్త్వజ్ఞాన లేశంబు లో
నరయఁజాలని మందబుద్ధులిటు లాహా! మాదృశుల్ విత్తలో
భరతిఁ దుచ్ఛసుఖానురక్తి నిజ యావచ్ఛక్తులఁ రిత్తవోఁ
బరతంత్రంబున బద్ధులౌదు రిది యే ప్రారబ్ధ కర్మంబొకో. ౧

సీ. స్వర్గమ్మునకుమించు సమ్మోద మొనరించు
జన్మభూమిని బరస్థలముఁ జేసి
కని పెంచి కలిపిన జననీ జనకుల శు
శ్రూషా పరత్వంబు సున్న చేసి
పిన్ననాఁట నుగోలె ప్రీతిఁ బోషించిన
పోషకావలి మేలు బూదిచేసి
తమశుభాశుభములన్నమతిఁ బాల్గొనుచట్టి
బంధుసంతతిఁ జూడఁ బ్రాలుమాలి

గీ. నిజ సహోదరబృందమ్ము నెచ్చెలులను
సతి సుతాదులవిడిచి దుశ్శాంతిగుంది
ఐహికాముష్మిక సుఖంబులందుఁజెడుచు
దుర్విధిం జెందుచుందు రుద్యోగవశత. ౨

మ. వ్యవసాయంబుననో వణిక్సరణి నేవ్యాపారమందో స్వశ
క్తి వశంబౌ మఱియేక్రియాకళలనో! ధీశాలగుండై దృఢా
ధ్యవసాయాత్మక వృత్తిఁబూని విలసద్ధర్మార్థ కాముండునై
యవనిఁ జీవితకాలయాత్ర నడుపన్యాయ్యంబు మోక్షార్థికిన్. ౩



౨౬౭

## హరిజన దీనాలాపములు

శ్రీ పొన్నలగడ్డ హనుమంతరెడ్డి గారు

సీ. పుట్టినప్పటినుండి వెట్టిచాకిరిఁ జేయ
శారీర బలమెల్ల సమసిపోయెఁ
కులకాంత పగలెల్లఁ గూలిఁ జేసినఁగాని
యొక్కపూటకె తిండి చిక్కదాయెఁ
కొడుకు కష్టించియుఁ గొలువుఁ జేసినఁగాని
కట్టుబట్టకె గడ్డ కరవువచ్చె
ఋణదాతలెల్లరు ఋణములు రెట్టించి
యన్యాయముగఁ జేల నాచికొనిరి
కటకటా జీవనముఁ జేయఁ గష్టమయ్యె
నెవరికేనియు మామీఁద నెనరులేదు
బ్రతుకుఁదెరువును జూపియు భద్రముగను
దీనులగు మమ్ముఁ బ్రోవవే దేవదేవ.

౨౭౮

## పరితాపము

శ్రీ ఊటుకూరు సూర్యనారాయణరావు గారు

శా. నిర్భీత ప్రతిమాన పౌరుషులనన్ నిర్దిష్టులౌ వారలే
దుర్భావంబుల నీచజాతి వలలన్ దూరన్ వినాథాంగనా
గర్భంబుల్ వెలిఁజేసి సంఘములచే గర్హింపఁగాఁ జేయు నీ
దౌర్భాగ్యంబెటనుండి తారసిలెనో ధర్మంబు వమ్మైచనన్.
మ. తుదకాలంబున దుష్టదానవుల శక్తుల్ వాపి సద్భక్తులా
పదలన్ బొందక యుండునట్లుగ నొనర్పంజాలు పద్మాక్షుఁ డి
య్యదనన్ హైందవజాతి శీలములు నిర్యాణంబు గాకుండఁ గా
చి దయన్ నాయమొనర్చి బ్రోచుతనిరున్ శీఘ్రంబె మాతామణీ.

## ౨౭౯
# స్త్రీ విద్య
శ్రీ పులిగోటి కనకదమాంబ గారు

గీ. విద్యయన్నను స్త్రీలకు వెగటుఁగల్గ
వనితలజ్ఞానులగుచును వాడుకొనుట
యబ్బురంబేమి దీపంబునవలఁ బ్రోయ
నున్నయింటిలోఁ జీఁకటి యుండకున్నె, ౧

ఉ. కాంతలు మాతృభాషపయి గౌరవముంచక నన్యభాష న
శ్రాంతము నేర్చినంతటను సారములేదిక గొప్పదైన శ్రీ
మంతముగల్గి యున్నదని మంగళసూత్రముఁ బారవైచి య
త్యంత సుభూషణంబులను దాల్చినరీతిని మెంచిచూడఁగన్. ౨

## ౨౮౦
# బాలవితంతువు
శ్రీ తిరువాయిపేట రంగకవి గారు

సీ. తమ్ముపాలించు నాత్మజులపైఁగల ప్రేమ
కన్నబాలికలపై నున్నటంచు
ఆత్మజుల్తా కాంతలైపునర్లగ్నముల్
జేయుటేయొప్పని చేయుచుంద్రు
బాలవితంతువై పసుపు కుంకుములేక
ముంగిటనున్నను ముదమటంద్రు
మరుపెండ్లి తండ్రు తామగవారలకె కాని
స్త్రీకిలేదను మాట స్థిరమటంద్రు

గీ. ధర్మశాస్త్రప్రమాణము ల్దాచిదోచి
బాల్యవివాహములుచేసి భంగపఱచి
విధవలనుజేసి దుష్క్రియావిధము రోసి
నేలుగానుంద్రు జనకులిక్కాలమునను.

౨౫౧

# భవ్యమతులార!

శ్రీ పులిజాల వేంకట రంగారావు గారు



సీ. విద్యాసంపదచేత వెలుఁగొందవలెనన్న
బాల్యవివాహముల్ వదలవలయు
మతభేదములుమాని సతిశ్రేష్ఠవలెనన్న
వెఱ్ఱివిశ్వాసముల్ వీడవలయు
భ్రూణహత్యములఁ బోఁద్రోలవలెనన్న
విధవలపెండ్లి గావింపవలయు
అనుకూలదాంపత్య మమరంగవలెనన్న
వరశుల్కములరోసి ప్రబలవలయు
తే. గీ. బలము తేజంబు వృద్ధిగావలయుననిన
దురితభోగములందుండి తొలఁగవలయు
మనముకావింపఁదగు ప్రయత్నమనయమిది
భవ్యమతులార భారతవాసులార. ౧

శా. ఈరాజ్యంబు సమస్తముఁ మనది నేడిద్దాని బాలించునా
రారాజేంద్రుఁడు నెల్లవారలకు సర్వశ్రేయముల్ గూర్చుచుఁ
దారిద్ర్యంబడఁగింపఁ బూనుకొనె మీత్యాగంబుఁజూపించి దే
శారాధ్యైకహితంబు సేయఁదగు నైజామాంధ్రులారాయిఁకన్. ౨



## ౨౫౨

## రైతులార

శ్రీ అరిగె రామస్వామి గారు

సీ. మాలమాద్గు లన్యమతములఁ జేరిరి
థేడ్ చమారటంచు దిట్టుకతన
దేశమతమువిడక్కు థేడ్ చమార్లేకదా
రక్తబంధులార రైతులార.
గీ. హిందుమతము జీవహింసను నోర్వదు
మాలమాద్గులన్న మండిపడును
దనను హింసఁ జేయఁ దగసలాములఁ జేయు
రక్తబంధులార రైతులార.

## ౨౫౩

## కలిరాజు

శ్రీ కె. సీతాపిరాట్టమ్మ గారు

సీ. యజ్ఞయాగాది నిత్యాగ్నిహోత్రములెల్లఁ
జుట్టబీడీలలోఁ జుట్టఁబడియె
వేదపురాణముల్ విపరీతములటంచు
నందఱిభావంబు లమరియుండె
భక్తివిజ్ఞానముల్ పరిపూర్ణమై తలన్
గ్రాపురూపంబుతోఁ గ్రాలుచుండె
నేయింట్ పైఁజూడ నింగ్లీషు భాషలోఁ
బేర్లనుజెక్కించి పెద్దలైరి
గీ. యాడువారలు మగవారలందఱెల్ల
నొక్క సీమంతమున నైక్యమొందిరిపుడు
సెప్పఁగాలేము నీయొక్క గొప్పఁదనము
లార! కలిరాజ నీమహిమాద్భుతంబు.

౨౭౪

## ఆంధ్రపుత్ర

శ్రీ వడగం రాజేశ్వరరావు గారు

స్వీయదేశము నందుండి చిద్విలాస
మొసఁగువస్త్రముఁ బీకి వేర్వసనమునకుఁ
జేతులఁ జాచు నెంతయు సిగ్గటంచు
నరయ లేకున్న బ్రతుకేల? ఆంధ్రపుత్ర! ౧
తనువునఁ బికిలాంగుఁ డుద్భవమునొందె
నేని, నీప్రేమనిలువదా వానిపైన
నటుల నీ దేశవస్త్రము నాదరించి
ముతకదైనను దాల్చుటే ముఖ్యమంచు
నరయలేకున్న బ్రతుకేల? ఆంధ్రపుత్ర! ౨

---

౨౭౫

## రాష్ట్రప్రేమ

శ్రీ మొలుగు నరసింహాచార్యులు గారు

శ్లో. సర్వంబ్రహ్మాత్మ్యవగత మిదం వేదమూలప్రమాణాత్
తస్మాత్పూజ్యంసుకవిరితి యద్వాక్య మత్యంతపూజ్యం
మేనాత్యర్థంసుకవిజనతా పూజ్య పద్యావదాన
గ్రంథాసిద్ధిస్సుజనవితతేస్సాధితా భూదపూర్వా. ౧
నైజాంరాష్ట్రేసుజనభరితే సర్వసంపత్సమృద్ధే
సంపన్నత్వే త్కవికులతతి స్సామ్యవృత్తిస్సదాభూత్
కాలేనేత్థంవచనకశయా తాడితాతీవకష్టా
మానత్యక్త్వాభవదపగతం మానినాం మానమూలం. ౨
సత్యేనస్యాదఖిలచిదచిత్పాంధువృత్తి ప్రవృత్తః
సర్వాత్మానస్స్వపరసదృశజ్ఞాన సంపాదకాస్స్యుః
సర్వంభోగ్యం ప్రకృతిజమిదం సత్వదంస్యాత్సకాలే
నైజాంరాష్ట్రేభవతు సతతం సత్కవీనాంసమృద్ధిః. ౩

---

౨౮౬

# నిజాంరాష్ట్రవిజయము

శ్రీ ఆచి వెంకటాచార్యులు గారు

శా. శ్రీ రంజిల్లెడు నాంధ్రరాజ్యముల వీక్షింపంగ స్వాతంత్ర్య వి
స్తారంబందున నైకమత్యమున విద్యా భాషలందున్మహా
సారంబై యిల నన్నిరాజ్యముల మించన్ జాలు సత్ప్రేమ యా
నీరాజ్యంబె యటంచుఁ బేరుఁగొనె నెంతేనిం బ్రభాశాలియై. ౧

ఉ. అందమున న్నిజాముప్రభు నాజ్ఞకులోబడి యైకమత్య సం
బంధముగల్గి రాజునకు వారితకీర్తిని గల్గఁజేసి యే
తొందరలేక సౌఖ్యములఁ దూఁగుచునున్న ప్రజావ్రజంబుతో
బాంధవమున్న మాదిరిగ భాసిలుచుండె నిజామురాజ్యమున్.

౨౮౭

# యువకులారా !

శ్రీ వట్టెము నరహరికవి గారు

సీ. చాళుక్యరాజుల శాసనాంగమ్ములు
భూగర్భమునసింకి పోవుచుండ
జీర్ణావశిష్టముల్ జిన దేవళంబులు
పూర్వచిహ్నములఁ గోల్పోవుచుండె
ప్రాచీనసత్కావ్య పటలంబు లాంధ్రుల
యిండ్లలోపల నంతరించుచుండె
పూర్వచరిత్రాంశములనుద్ధరింపఁగా
దేశీయులెవరు యత్నింపరైరి

గీ. మాతృభాషాభిమాన సంపన్నులైన
నాయకులుమార్గదర్శులై నడువరైరి
యువకమణులార మీరిఁక నూరకున్న
రాదుకీర్తింత నైజామురాజ్యమునకు.

౨౮౮

# నిజాం రాష్ట్రీయ కవిజన ప్రబోధము

శ్రీ బి. విశ్వనాథశాస్త్రి గారు

---

చంపకమాల

సిరులకుఁ బాడిపంటలకుఁ జేరినవారి దరిద్రదోష సం
హారణము సేయుదాతలగు నార్యులకున్ ద్రవిడాంధ్ర సంస్కృతా
ది రుచిర సర్వభాషలకు ధీరులకున్ రణవీరపాళికిన్
బరమదయాళులైన కవిపండిత మండలి కాశ్రమంబవై
గురుతర యజ్ఞకార్యములకున్ జననస్థలివై విశేష శి
ల్పరచన చాతురీకులకు వాసమవై నట గాయకాళికిన్
శరణమవై సమస్తజన సంస్తుతిపాత్రమవై సమున్నత
స్థిరతర వైభవంబునఁ బ్రసిద్ధమవైన నిజామురాష్ట్రమా
పొరపడి నీదుగర్భమున భూరికవీంద్రులు లేరటంచు నె
వ్వరో యరయంగలేక యొకవాక్యముఁబల్కిన యంతమాత్రనే
దురపిలెదేల నీకరణిఁ దొందరఁజెందకుమమ్మ తావకో
దరభవు లెందరో కవు లుదారమతుల్ వివిధప్రబంధముల్
సరసముగాఁ దెలుంగునను సంస్కృతమందునుఁ గూర్పఁజాలు నే
ర్పరులుగదమ్మ వీరి ప్రతిభాగతి భారతి భాతి నింతలో
మరచితో వారికున్న యనుమానముఁ మానుపఁబూనుమమ్మ బం
ధురరస పూరితోరుతర ధోరణులన్ బొలుపారువాకులన్
ద్వరపడి పత్రికాముఖమునం బ్రచురింపఁగదమ్మ సత్కవీం
ద్రరచిత సత్కథాపద సుధారస ధారల నొల్కుపల్కులన్
బరగెడు భవ్యకావ్యముల నవ్యవిధానము నోపిచూపఁగాఁ
దొరకొనుమింక నీకుఁ బ్రణుతుల్ వినుతుల్ పొనరింతుమమ్మరో.





[౨౮౩] శ్రీ అరిగె రామస్వామి గారు

౨౭౬

# నిజాము రాష్ట్ర ఘనత

(శ్రీ తోపు వేంకటాచార్యులు గారు

---

శ్లో. సుందరముఖారవిన్దం సురుచిరమాలావిలోలకురువిన్దమ్
వన్దారుకజనబృన్దం వందేహం ధామగోపికానన్దమ్. ౧

సీ. తోఁగచెలికానిబల్ సొగసుమీరిన హొయల్
జిగిఁగల్గు నగుమొద్దు మొగమువాఁడు
మెఱుఁగుబంగరుచాయ మేనిసొంపువహించు
కలుముల జవరాలు గల్గువాఁడు
తెలిఁదమ్మిపూవురేకులనిగ్గుచెన్నారు
కన్నుల జగమేలు చున్నవాఁడు
తొలకరిమబ్బుతోఁ గలహించి జయమొందఁ
జాలు సొంపగుమేని డాలువాఁడు

గీ. సకలసామ్రాజ్య యుక్తమై సత్కవిత్వ
వచనరచనాధురీణ విద్వత్కవీశ
దివ్యజనభూషిత నిజాం స్వదేశమునకు
ఘనతనొసఁగుచు నిరతంబు మనుచుగాత. ౨

సీ పటుకవిత్వాభ్యాస పారీణకవిరాజ
పటలసమాక్రాంత భవ్యపురము
ఆశ్రితజనరక్షణా సక్తమానస
సామంతభూపాల సంచయంబు
సంతతేజ్యాశీల సవనసాహాయ్యక
ధార్మికభూయిష్ఠ ధనికకులము
వేదవేదాంగాది వివిధశాస్త్రపురాణ
వాచనాశీల సుధీచయంబు

గీ. సంతతార్థికమానుష సంతతికిని
దినదినము జీవనంబిచ్చి తేజరిల్లు
మహిత నైజామురాజ్యమిమ్మహి వెలుంగు
దీనికెనయగు దేశంబుఁ గానమెందు. 3

సీ. ఆస్థానసుకవీశ్వరాదరణముఁజూడఁ
జలువ ప్రేనికైన నలవికాదు
ఆశ్రాంత నిజవిప్ర విశ్రాణనముఁజూడఁ
బలుకుల చెలికైనఁ బలుకరాదు
ఉపకారులకునుఁ బ్రత్యుపకారములుఁజూడ
ధాతకైనవచింపఁ దరముగాదు
నిరతాన్నవితరణ నియమంబులేఁజూడఁ
గడుబృహస్పతికైన నుడువరాదు

గీ. ఇట్టి సంస్థానములయందు దిట్టమైన
వసుమతీపాల జాలక మెసఁగుచుండుఁ
గాన నిర్దేశముననుండు మానవులకు
సంపదలునిండి యుండు సిలింపవినుత!

## ౨౬౦

## నిజాముభూమి

శ్రీ టి. ధర్మయ్యాచార్యులు గారు

సీ. జీవనదులచేతఁ జెన్నారుచుండెడి
సస్యాఢ్యమైనట్టి చారువసతి
సోమనపోతన భీమకవ్యాదులు
పుట్టివర్ధిల్లిన పుణ్యభూమి
ప్రతిభఁగాంచినయట్టి ప్రభువరుండు స్వామ్యస్న
ధీవరుఁడేలెడి దివ్యభూమి
శిల్పచాతుర్యముఁ దెల్పు దేవాలయం
బులు మసీదులుగల్గి చెలఁగుభూమి

గీ. నిధులచే ధాన్యతతులచే నెగడుభూమి
వీరరాజన్యులునుగల్గి వెలయుభూమి
విజ్ఞులకు నాకరంబయి వివిధకళల
స్థానమైఖ్యాతిగాంచె నిజాముభూమి,

౨౯.౨

# ఆన్ధ్రజననీ పరిదేవనము

వేదకావ్యస్మృతితీర్థ సాహిత్యవిశారద న్యాయాచార్య పండిత
శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మ గారు

---

యా పణ్డితైశ్చ మునిభి ర్ధనిభి ర్మహద్భి
ర్జాతా స్మ లోకవిదితా కుహినారుముఖైః
నాఽహం త్వదీయజనని పతితాఽస్యతస్త్రీ
దుస్సహ్యదుఃఖగలితేతి కుతోఽద్య పుత్రాః. ౧

పూర్వా(ర్ధే) ఏవ కవి రస్మినిజాంవిభాగే
నైతాదృశశ్చ కవి రప్యథ పశ్చిమార్ధే
ఔదీచ్య ఆంధ్రఃకవి రుజ్జ్వల ఇత్యబద్ధం
క్షుద్రాః సుతాః కిమథవా కలియాతుధానాః. ౨

శ్రుత్వాఽపి మాతృపరిదేవన మేత దుగ్రం
సంశేరతే విశదమాధ్యవశా దిమే చేత్
ఆన్ధ్రీయ దంభశరణా దల మస్య నూనం
వన్ధ్యాఽస్మి భూమివలయే వనితాఽహ మేకా. ౩

సీ. వేదశాస్త్రపురాణ విద్యావిలాసినై
త్రుప్తి యొక్కింతేనిఁ దీర్చియెఱుఁగ
భవ్యవిశ్రుత మహాభారతీయుఁడనయి
గర్వము నిసుమంతఁ గాంచియెఱుఁగ
భూసురవరకుల పుత్రరత్నంబునై
సత్కారకాంక్షతో సాగియెఱుఁగ
ననయంబు బ్రహ్మచర్యాశ్రమసేవినై
స్వశిరమున్నతముగఁ జాచియెఱుఁగ

గీ. సకలసుఖహేతు సాహిత్యశాలినయ్యు
దుఃఖపావక కీలకుఁ దూలమగుట
భావ్యమాయని చింతాబ్ధిఁబడితపించి
పారతంత్ర్య కారణగీతిఁ బ్రస్తుతింతు. ౪

౨౯౨

# రాష్ట్రాధిక్యత

శ్రీ పురాణం మల్లయ్యగారు

---

సీ. కానఁడా యష్టావధానముల్ సల్పి భూ
కాంతులతో మెప్పుఁగాంచు కవుల
నరయఁడా పెక్కు శతావధానములన
ర్గళముగా నొనరించు కవివరులను
నెఱుఁగఁడా సకల శాస్త్రేతిహాసాది సా
రాంశముల్ చవిగొన్న యమలమతుల
యోజింపఁడా ప్రబంధోత్తమంబుల రచి
యించినయట్టి కవీంద్రవితతి
గీ. నిట్టి పండితసత్తము లెందఱో ని
జాము రాష్ట్రంబునందు నెసంగుచుండఁ
గవులు లేరన్న యతని వాగ్గరిమ నెంచ
నంధుఁడు జగంబు లేదని యనుటగాదె. ౧

సీ. ఆంధ్రగీర్వాణ విద్యావిశేషములచేఁ
గణుతికెక్కిన సుధీమణులుగలరు
జ్యోతిష ప్రముఖ శాస్త్రోత్తమవేత్తలై
చతురత మెలఁగు పండితులుఁ గలరు
సకల ప్రబంధ నాటక శతకంబులఁ
గృతులొసంగిన కవితతులు గలరు
కమనీయ సంగీత కలితబోధకులైన
గానవిద్యాధిక ఘనులు గలర
గీ. యెందు లేగాదు గద్వాలయందె వినుఁడి
యిట్టి విద్యాధికులను పోషించునట్టి
యాదిలక్ష్మీ మహారాణి ననవరతము
కేశవస్వామి కరుణ రక్షించుగాఁత. ౨

---

౨౬౩

# నిజాంరాష్ట్ర జనప్రశంస

శ్రీ ముత్యంపేట సాంబయ్య గారు



చ. ధనికత దాతృభావము బుధత్వము సత్కవితారసజ్ఞతల్
కననివియన్ని యొక్కయెడఁ గల్గినవాఁడొకరుండె ధాత్రి నొ
ప్పునుగద తాదృశోరుగుణ పూజ్యత నిచ్చటి వారలెందఱో
తనరుదు రీనిజాము జన దర్పగుణంబు వచింపశక్యమే. ౧

శా. ఆజన్మంబు శివార్చనావిమల సద్వ్యాపార ధౌరేయులై
భ్రాజత్సర్వకళా నిరంకుశమహా పాండిత్యచాతుర్యులై
సౌజన్యాన్వితులై యగర్వితమతిన్ జానొందువారౌర యీ
నైజాంరాష్ట్ర జనప్రభావముల నెన్నన్ దక్షుఁ డెవ్వాఁడిలన్. ౨

ఉ. న్యాయ ధనార్జనాపరు లయాచితశీలురు పుణ్యకార్య పా
రాయణులన్యదూషణ పరాఙ్ముఖులాస్తికతావలంబకుల్
గేయచరిత్రులంచిత సుకీర్తు లకల్మషు లీ నిజాము రా
ష్ట్రీయు లనిందితుల్గద విచిత్రముఁగాదె యవిద్యులన్నచోన్. ౩

ఉ. పండితవర్యులార ప్రతిభాయుతులార కవీశులార మీ
పాండితియున్గవిత్వమును బాగుగఁ దెల్పి సమస్త సత్కవి
ట్పండిత మండలీహృదయ పంకజముల్ వికసింపఁజేసి యు
ద్దండ భవద్యశోమల సుధాంశుమరీచికలీ నిజాము రా
ణ్మండలి నిండఁజేయుఁడు నమస్కృతులన్విరచింతు మీకిటన్. ౪



## ౨౬౪

# హనుమకొండ

శ్రీ దేవంభట్ల సత్యనారాయణశాస్త్రి గారు

సీ. ఏసీమ కవివరా వాసమై వాణీవి
హారస్థలంబను యశముఁగాంచె
నేరాజ్యరమఁగాంచె రారాజతుల్య ధ
నాఢ్యుల కాకరంబను బ్రసిద్ధి
నేదేశమత్యంత ఋజుమార్గవర్తనల్
బ్రజలన్నకీర్తి నిఁహింవహించె
లక్షింప శిల్పకళాకల్పనుల కాక
రంబయి నెగడిన రాజ్యమెద్ది
ఆ. యానిజాము రాష్ట్రమందును షోడశ
మండలాళికెల్ల మండనాయ
మాన మోరుగల్లు మండలంబందునీ
హనుమకొండ రత్నమనగనొప్పు. ౧

---

## ౨౬౫

# తెలంగాణా

శ్రీ సి. ఇ. ఆంధ్రూస్ గారు

గీ. వెలయుచున్నది దేశభాషలకు మిన్న
యాంధ్రభాషామతల్లి ప్రయాసమనక
ప్రబలుచున్నది తెనుఁగు కబ్బము చెలంగి
నివురుగప్పిన యనలమై కవులమదిని. ౧
గీ. ఓరుగంటి యగడ్తల నొరసి వేయు
స్తంభముల గుడిలోపల దవిలి శిధిల
శాసనములందు వేడి నిశ్వసనమిడుచు
బహుళవైచిత్ర్య శిల్పవైభవము వెలయు. ౨
గీ. సోమనాథ విద్యానాథ సుప్రసిద్ధ
కవివరేణ్య వాఙ్మయవిహార గములవిమల
గీతికా నినాదంపుఁబ్రభాతకిరణ
జాలమున దేలుచున్న నిజాము వెలయు ౩

౨౯౬

# నిజాంరాష్ట్ర ప్రశంస

శ్రీ మామునూరు నాగభూషణరావు గారు



సీ. తొలుఁదొల్త ఁజల్గు గంటలు మ్రోగ నాంధ్ర భా
షా సరస్వతి నాట్యమాడినట్టి
లలితశారద చంద్రికలు మల్పినఁడి తేనె
విశ్వమోహనకావ్య భిక్ష వెట్టి
కవికరీంద్రులకుఁ బ్రక్కన బత్తెమైన బీ
దరికంబుతోఁ బ్రేమ నేఁపినట్టి
వివిధశిల్పకళా ప్రవీణులచాతుర్య
సృష్టులఁదనివొంది చెలఁగినట్టి
గీ. దేశమెయ్యదియందు మాదియున లేదె
కాలవశమున సిక్కైరి గాని నేడు
మధురకవితా విలాస సామ్రాజ్యమందు
పేరలుడుఁగని కృషికులు గారె తొలుత. ౧

చ. అమలనిశాంతకాంతుల హాయల్ వెదజల్లునమూల్యరత్న రా
జములు నిజప్రభావ గుణసంగతమై భువినెల్లనిండు మో
దములొనఁగూర్ప వీలగు ప్రదర్శనపుఁ బ్రతిపత్తి లేమి మా
టుమడఁగవో సముద్రపు మడుంగుటగాధ తమోబిలంబులన్. ౨



౨౬౭

# భాగ్యసంపూత

శ్రీ కన్నెకంటి సత్యనారాయణమూర్తి గారు



శా. ధీరోదారుఁడు రామచంద్రుఁడు జగద్విఖ్యాత చారిత్రుఁడో
కారుండోముని లక్షణాఢ్యకవితా ఖండప్రతాపాయతో
దారత్వంబు నిజామురాష్ట్రనిజ భక్తశ్రేణికిప్పట్టునన్
భారంబౌకవికోటి నాస్తియను దుర్వాక్యౌఘముల్ ద్రుంచుచున్. ౧

సీ. సరసవిద్యాప్రౌఢి శారదాసింహాస
నంబునైజాము రాజ్యంబనంగ
నకలంకవైభవంబలరు లక్ష్మీనికే
తనములకునికి సంస్థానమనఁగ
భుజబల విఖ్యాత భూరిప్రతాప గాం
భీర్యులఁగాంచిన వీడనంగ
దానధర్మంబులఁ దనకెనలేదని
మురిసె మొందెడి కల్పతరువనంగ
గీ. నామమార్జించి దశదిశల్ విమలకాంతి
నింపు నీదృష్టిఁబరవ్రము నీకుజోత
లిడెదు కవికోటి యిచ్చలీ దేశ్యమమ్మ
భాగ్యసంపూత హైదరాబాదమాత. ౨



౨౯౮

# నిజాం రాష్ట్రము

శ్రీ మందడి వేంకటకృష్ణకవి గారు కవిశరభ

---

సీ. గుణదోషములెఱింగి కొమరారుకబ్బముల్
చవులూర రచియించు కవిగణంబు
సదమలానుప్రాస పదవిరాజద్గ్రంథ
రచనాప్రవీణులౌ ప్రాజ్ఞమణులు
పదపదంబున రసాస్వదపుఁబెంపొనరించి
కృతులరచించు బుధేంద్రచయము
నలుదెఱంగులకైత లలవడఁబసమీర
నవధానములుసేయు నార్యవరులు
గీ. వెలయు సంస్థానరాజముల్గల నిజాము
రాష్ట్రమునఁ గవిలేఁడని వ్రాయనగునె
తెలుఁగునకు నిక్కమైన యీ దేశమందు
కవివరేణ్యులు పండితుల్ గలరు కలరు. ౧
సీ. కవితాలతాంగి సత్కారాళిమెసయదే
ప్రతివత్సరమున గద్వాలసభల
నాంధ్రభారతిమహా దానందమొందదే
ప్రతివత్సరము వనపర్తిసభల
పండితమండల ప్రాభవంబెసఁగదే
ప్రతివత్సరమున గోపాలుపేట
నాంధ్రసాహిత్యవిద్యావినోదములేదె
యాత్మకూర్పురిని ప్రత్యబ్దమందు
గీ. నిట్టియాస్థాన చయముల కింపుఁబెంపు
తేజమొసఁగిన నైజాము దేశమందుఁ
తెలుఁగునకు నిక్కమైన యీ దేశమందు
కవివరేణ్యులు పండితుల్ గలరు కలరు. ౨

---

౨౯౯

## రాష్ట్రమాత

శ్రీ గిరిధరరావు గారు

గీ. రాజితంబగు మానిజాంరాష్ట్రమందు
నక్కడక్కడ దేశభాషాభివృద్ధిఁ
గాంచఁగల్గెడి దివసముల్ గానవచ్చె
సాంధ్యగృహదీపికలు వెల్గుచందమునను. ౧

గీ. జీర్ణవస్త్రంబుతోడ సజీవమగుచుఁ
బుత్రగర్హితవైచాలఁ బొక్కుచకట
ఈనిజాంరాష్ట్రమందతి హీనమగుచు
దిరుగకుమురోత సేవింక దేశమాత.

శా. నీపుత్రుల్ బలవంతులాఢ్యులు మహానీతిజ్ఞులైనార లే
లోపంబున్నను దీర్పనేర్పరులు చాల్పూర్ దుఃఖముఁ జెంది నా
పాపంబంచుఁదలంపఁబోకు జననీ భద్రంబు చేకూరు నీ
ప్రాపే మాకని నమ్మియుంటిమిఁక నీ భాగ్యంబు సామాన్యమే.

౩౦౦

## మాత

శ్రీ ఆసూరి మరింగంటి శ్రీరంగాచార్యులు గారు

సీ. తల్లిరో నీపెద్ద తనయుఁ డుస్మానలీ
పాదుషా కారోగ్య ఫలము నొసఁగు
మాతరో నీప్రేమ మాన్యులౌ సౌజన్య
పండితాళికి శాస్త్ర పటిమ నొసఁగు
జననిరో సంగీత జాణలౌ గాయక
నిచయంబునకు శ్రావ్య నినద మొసఁగు
మమ్మరో యానంద మిమ్ము సత్కవులకుఁ
గమ్మనిపదసమూహమ్ము లొసఁగి

గీ. యిట్టులేసీదు పొట్టను బుట్టినట్టి
సుగుణసంపదఁగలిగిన సుతులకెప్పు
డాయురారోగ్య సంపదాద్యఖిల మొసఁగు
రత్నమయజాత నైజాము రాష్ట్రమాత.

## ౩౦౭
# కవితత్త్వము

శ్రీ ఒద్దిరాజు సీతారామచంద్రరావు గారు



శా. ద్రాఘిష్ఠాసిత రుక్సముజ్జ్వల దదభ్రప్రావృడభ్రోద్భవ
వ్యాఘోష ప్రతిమాన కర్కట రవ ప్రాధ్మాన నిధ్యాన శ
బ్దాఘోచ్చార్య సమాన ఘుర్ఘురిత ధారోత్తాత బంహిష్ఠ ని
ర్ఘోషఘుష్ఠిమ కవిత్వ మొక్కకవి గూర్చున్ బ్రౌఢి దీపింపఁగన్. ౧

మ. లలితారావ లసచ్ఛలత్ప్రియకరోలం బావృతానూన మం
జులతాంతోపచిత ప్రతీత రసవస్తు స్వాదునీకాశ ని
శ్చలసుస్వాదు పదప్రయోగ మహిమా సందీపి తామేయ ని
స్తుల సారల్య కవిత్వ మొక్కకవి గూర్చున్ బ్రౌఢి దీపింపఁగన్. ౨

మ. తలపన్ బువ్వులనుండి జాల్వెడు నిద్దా తేనెలో మంచు గ
డ్డలఁ బాల్మీగడ కండచక్కెరల జంటన్ బొత్తు హత్తించు న
ట్టుల నిద్దంపుఁ దెరంగుమాటలిడి యుల్లోలంపు దిత్తిపి మె
చ్చుల చొక్కంపుఁ గవిత్వ మొక్కకవిగూర్చున్ బ్రౌఢిదీపింపఁగన్

మ. తులలేనట్టి ప్రకాశమాన మణిసందోహమ్ము నిద్దంపు గెం
దళుకుం గేరు ప్రవాళపాళినిడి ప్రోద్యత్తారహారంబు ని
చ్చలు చెల్వారఁగఁ గూర్చు భాతిపృథునిష్ఠన్ సంస్కృతాంధ్రంపుఁ గూ
ర్పులు సంధిల్లఁ గవిత్వ మొక్కకవిగూర్చున్ బ్రౌఢి దీపింపఁగన్.

మ. యతి సంబంధము ప్రాసమైత్రి పద వాక్యన్యాసపుం గట్టు సం
తత ధారాపరిశుద్ధి నేమ ముచితత్వజ్ఞాన సంబంధ సం
గతులన్ బిట్టు నిరాకరించి నిజకాంక్షాపూర్తి సంధిల్లఁ బ్ర
స్తుత మందందఁ గవిత్వ మొక్కకవిగూర్చున్ బ్రౌఢి కీపింపఁగన్

౩౦౨

# భారతి

శ్రీ బుక్కపట్టణము రామచంద్రకవి శతావధానిగారు

---

సీ. నివసించితివిగదా నిఖిలప్రసిద్ధులౌ
 కాళిదాసాది సత్కవులనోటఁ
బోషించితివిగదా భువనసంపూజ్యులౌ
 తిక్కనాదికకవి ధీరవరుల
ఆక్షించితివిగదా యార్యసంస్తుత్యమై
 యలరారు నట్టి మహాతిశయము
స్థాపించితివిగదా శరణాగతావన
 బిరుదాంకమును గృపావీక్షణమున
గీ. వసుధ నీసరివేల్పు లెవ్వరును లేరు
భక్తులకుఁగల్పకంబవై బరగినావు
సర్వదా నిన్ను సేవింతు స్వాంతమందు
తల్లి నన్నేలుమో శారదామతల్లి. ౧
సీ. నీదయనేకదా నిఖిలజనంబులు
 విద్యావిహారులై వెలయుచుంట
నిన్గొల్చియే కదా నిశ్చలస్వాంతులై
 మునులెల్ల మోక్షమార్గంబుఁగనుట
నీకటాక్షముచేతనేగదా ప్రజలెల్ల
 దారిద్ర్యమును బాసి ధన్యులగుట
నీయాశ్రయంబుననేకదా ప్రజలెల్ల
 రాజాధిరాజ గౌరవముఁగనుట
గీ. దలఁప నీపాదపద్మ సంస్తవము భవ్య
ములనుఁగూర్పఁగ మూలమై యలరుగాదె
పాకశాసనవినుత లోకైకమాత
భవ్యతరకీరవాణి యో బ్రహ్మరాణి ౨

---

# ౩౦౩

## భావకవి

శ్రీ పత్రి విశ్వేశ్వరశాస్త్రి గారు



ఉ. చల్లనిరాజుగల్గఁగ నశక్తుఁడు శుద్ధజడాత్ముఁడంచు న
ల్లల్లనఁగొండ పాల్వఱచితౌర యిరాపుఁడవై ననీవు మ
త్తిల్లవె? తెల్లవారెనిటు తెల్వితిరంబని మెంచదేల? నేఁ
డెల్లితృదీయ శత్రులుపయింబడి రాఁగశిలాఱుఁగాఁ గవీ!

మ. కనుదోయింకనివార సర్వసుమనః కల్యాణముల్ సూచి మో
ర్వని దోషాచరపక్షపాతివి "స్వయంరాజాస్స్వయంమంత్రి" వా
ట నిరాధారముగా బుధప్రముఖులుండంగన్ని నిన్నింక నే
మనరాదాడినదాట పాడినదిపాటయ్యెగా సెబాసోకవీ!

శా. స్వామిద్రోహముకాదొకో నెవియునక్షత్రోత్తముండంచు నెం
తో మన్నింపుచుఁ జేరఁజీరఁ గనమాత్యుండౌటయే కాకరా
జై మిన్నందితి వీవు వేలిడ నెడం బైనట్ బదంబూనితౌ
రా! మాంసాశన మత్తచిత్తులకుఁ జెల్లాటంబులౌఁగాఁ గవీ!

ఉ. భార్గవుఁడౌటనేమి? నగువారినిఁగూర్చితి వందొకం డపా
మార్గరతుండు వేఱొకఁడు మందుఁడు పంగుఁడు కాలుఁడిట్లునై
సర్గికమిత్రవర్గకము సామిచరిత్రము మాఢ్యదోషనం
సర్గమిఁకేమనన్ శశవిషాణములయ్యె శుభంబులోకవీ!

చ. సురగురులోక బాంధవుల సూడొనరించితి వార్యవైరమే
గరమునవార్యసంగమము కన్నవరంబగుఁగానఁ జెల్లెఁబో
పరుసములాడినాఁడను నెపంబున నేమొనరించెదో మనో
హారముహితంబు నావచనమారయ దుర్లభ మాఁగదాకవీ!



౩౦౪

# కావ్యలక్ష్మి

కవితలతిలక సాహిత్యకల్పద్రుమ
శ్రీ తెలికపల్లి రామచంద్రశాస్త్రి గారు



శ్లో. సులలితపదసమ్పచ్ఛోభినీ కామినీవా
నవరసపరిపూర్ణా జాహ్నవీవ ప్రసన్నా
కిమపివిశదయన్తీ మఞ్జులాచారతత్త్వం
రసికహృదయమాన్యా వర్ధతాం కావ్యలక్ష్మీః. ౧
నవసరసకథాభిర్నన్దయన్తీ ప్రపన్నా
నపిమధురకలానాం సారమావేదయన్తీ
హృదయహరమపూర్వం శిల్పమాలోకయన్తీ
సకలసుజనలాస్యై వర్ధతాం కావ్యలక్ష్మీః. ౨
అతులవిమలవృత్తిఖ్యాపనాత్పణ్డితానాం
హృదయ సరసిజే భృశప్రార్పయన్తీ వికాసమ్
పరమపురుషకారం వ్యంజయన్త్యార్ధ్రదేశే
కవితిలకకుమారీ వర్ధతాం కావ్యలక్ష్మీః. ౩
అతులవిమలవృత్తా పూర్ణమాధుర్యసమ్ప
త్ప్రకృతిరశపరాసానవ్య నవ్యావతారా
జగతినిజమహిమ్నః పౌరుషం శిక్షిపన్తీ
ప్రకటితనవనీతిర్వర్ధతాం కావ్యలక్ష్మీః. ౪
నవనవనిజభావాకృష్టహృద్వృత్తిపక్షే చ
సపదికు జనవాదాన్కుర్వతీ భగ్నయత్నాన్
కవిపికకులకామాన్పూరయన్తీ నికామం
సతతమిహజగత్యాంజీవభ్యాః కావ్యలక్ష్మీః. ౫



౩౦౫

# కవితాహంకారములు

శ్రీ శ్రీపెరుంబూదూరు వేంకట కృష్ణమాచార్యులు గారు



శ్లో. మధురామధురాలాపా మాధవ పదపద్మమహామామధుపా
సురసరిదివధుతతాపా సుమనః కవితా విభాతి హృతపాపా. ౧

నవరసభరితా కవితా నానాలంకారభూషితా చేతః
సుఖయతిసుఖయతి మిళితావనితే వాఖ్యాతవిఖ్యాతా. ౨

కవితాకల్పకవల్లి పల్లవితమై కన్పట్టె నద్దానికిన్
గవి తానే రసపుష్టిదోహదవిధిన్ గావింపఁ బెంపొందుచున్
భువి తావుల్ వెదఁజల్లఁ బుష్పవతియై భూరిష్టపాకంబులన్
జవులూరన్ రసికాగ్రణీజనమనస్సంతృప్తిఁ గావింపదే. ౩

మ. కనదుద్దామ కవిత్వమిద్ధరణిలోఁ గల్యాణసంతానమై
ఘనతామోదసులక్షణాజరయశః కారుణ్యధీచాతురీ
జనకంబై ధనధాన్యధన్యతమమై జైవాతృకంబై జగ
జ్జననీజాని కృపారసాంచితమునై శ్రావ్యంబుఁ గాకుండునే. ౪

శా. గీర్వాణాంధ్ర కవీంద్రులిద్ధరణిలోఁ గీర్త్యాత్ములై వారు దు
ర్గర్వాంధత్వముఁ జూపిరా తమకృతిన్ గారాబముం జూపిరా
గుర్వారాధనలేక బోధపడునా గూఢార్థతత్త్వంబు లే
యర్వాచీనుల గోలయేల కవితాహంకారహుంకారముల్. ౫



## ౨౦౬

# స్థానకవిత

శ్రీ నల్లాని చక్రవర్తుల రంగాచార్యులు గారు



శ్లో. శ్రీమచ్ఛిష్టపదార్థకావ్యరచనా సంపాదితార్థాంతర
స్తర్కాలంకృతిభావపాకవిబుధ ప్రఖ్యాపనాఖ్యాయికాన్
కర్తుం కౌశలసాధనాయుత యుతాస్సంత్యత్రనాస్తీతిత
త్సర్వాంశ్శ్రీలసత్కమాక్షికలిహః ప్రత్యర్థిభిర్గృహ్యతే. ౧

జాతం కావ్యకదంబ భూరుహాబుధః ప్రోల్లాసనత్వాశ్రయం
సమ్యక్త్వాన్యధికార్యపాత్రయా వశాన్నైవాద్యవిద్యోతితం
తత్త్వామ్యంతుకుదృష్టిధూర్వహావహా స్సద్యఃఫలం స్వాశ్రితాః
జోద్ధారఃప్రభవంత్వితీహసునునో గృహ్ణంతు కాలాంతరే. ౨

లతాన్వస్థానాద్వైఫలతివిఫలత్వాన్యవికృతి
ర్భజత్వాకాలాంతాత్పురుషఘున సంస్థాపితవశాత్
తథా వ్యాకాండాంతాత్ప్రసృతిరితిముహ్యంతిసతతం
నతన్మాలేచ్ఛేదే ప్రభవతి హి తత్కారణధియః. ౩

జాతివ్యక్తివిభిన్నవృత్తిఘునతాం జాత్యంతరాభ్యంతరే
ప్రఖ్యాతప్రబలప్రభావనిపుణాం కన్యాంకథంవిందతే
తద్వత్సాక్తనజన్మజాత సుకవిత్వాఖ్యాన పారంపరీం
జానంతోపినసంతి మానససరః కాతారకారండవత్. ౪

నగృహ్ణంతు నశోకంతు నానువిందంతు నిందకాః
నాపరోక్షు పరోక్షేత్రే నాన్యఃకర్తాస్తి దేహినామ్. ౫



# ౩౦౭
# కవిత

శ్రీ గోవిందుల కృష్ణమాచార్యులు గారు

---

శ్లో. సుదతీవ రతిప్రవర్ధనే కమలేవార్థచయప్రదాయినీ
విమలా సురనిమ్నగాయథా భవతీయం కవితామతల్లికా.
సుకవితావశగాయది సర్వదా వితనుతే తనుసౌఖ్యమివాబలా
నవశగా యదిమారభవాం దశాం దిశతిజాగరతా కృశతాదికాం.

---

# ౩౦౮
# ఆంధ్రము

శ్రీ సేనాపతి నరసింహాచార్యులు గారు

---

చ. ప్రకృతిజగంబునందఖిల భాషలకెల్లను సంస్కృతంబు త
ద్వికృతియు నాంధ్రభాష కడు వీనులవిందగు దానికన్న ని
ర్వికృతిగనున్న పైఁడిజనవిశ్రుతకీర్తి దిగంతమొందినన్
సుకృతసుభూషణావళులఁ జూచినసంతసమొందరే జనుల్. ౧

చ. శ్రుతితతి రూపధారిణివి సూతపరాశర మౌనివాఙ్మయా
శ్రితపదచారి వీవు బుధచిత్తవిహారివి సంస్కృతాంబ సం
తతమధురంబుఁ జిల్కు కవితాభుజయుగ్మము సంచలింపనీ
వతులితకీర్తిఁ గాంచవలె యాంధ్రజయధ్వజ ముద్ధరించినన్. ౨

చ. సదయహృదబ్జసంస్కృతమ సర్వకళాంచితురాలవుండఁ ద్వ
త్పదయుగళాశ్రితాంధ్రకృతి పండితపామర రంజనీయమై
నదిహితమయ్యెఁ బార్వణసుధాకరునిన్ నుతియింపరెవ్వరున్
విదియనఁబుట్టుచంద్రికకు వేయిజనంబులు మ్రొక్కకుందురే. ౩

---

౩౦౯

# ఆంధ్రి

శ్రీ పుల్లగుమ్మి వేంకటాచార్యులు గారు



మునిమానసకలహంసం జితకంసం నౌమి దేవతోత్తంసం
యాదవకులావతంసం కృష్ణంయువతీమృగీవితంసం తం. ౧
నైషికృపాశపికాత్వయి నైయోజ్యవినీతకాభవద్వానే
దేవస్వభావిమైషాయద్యస్తి భావభాయికాక్వవసేత్. ౨
సంస్కృతకవితే వృద్ధేశ్వజ్ఞాంధ్రీలసతి సుందరీతేన
మోదస్వసద్భిరుక్తం పుత్ర్యాదచ్ఛేత్పరాభవంజనకః. ౩
శంభయితా హే యుద్ధే డింభయితా హేర ఘోఃకులేసత్యే
పృథుభయితా హేశాంతే ఖరభయితా హేప్రపతా పేత్వాం. ౪
సంఖ్యాతీత గ్రంథాస్సంత్యము నాకిమితినోవిశంకధ్వం
అన్యేషు శిశుషుసత్స్వపినోపుత్రీయతి జనకీమవనితలే. ౫
తత్కాలంత్యంగారకావ్యచ్యుతనరనగరీ సర్వసంబుద్ధయఃక్వ
క్వాస్థానీక్షోణి పాలాఖిలవసతి వికల్పార్థజగ్ధిస్వరూపం
కింసూత్రంపాణినీయం వణధరపతినాక్లిబతాయేనచోక్తా
వక్తవ్యంసత్కవీన్ద్రైః పరమ కరుణయా వ్యాకృతా సంచరద్భిః. ౬

చ. వనజభవాదిజుష్టపరి భాషకు పూజనొనర్పరెవ్వరుా
మనుజవరేణ్యులందఱును మన్ననసాకు నొనర్చుచుండుగా
యనియతిగర్వహంకృతుల నాడి విజృంభణనొందకుండుమో
తెనుఁగుకవిత్వమా జనని దీవెనలందివెలుంగు మిద్ధరణ్. ౭



# ౩౧౦

## నీతి

శ్రీ తొగిటి రామబ్రహ్మాచార్యకవి గారు

---

సీ. దైవంబునెడ తల్లి దండ్రులయెడల స
ద్భక్తి మెలంగెడు ప్రాజ్ఞుఁడెవ్వఁ
డేవేళ స్వార్థపరిత్యాగ మొనరించి
సంఘసేవనొనర్చు సాధువెవఁడు
శాంతవృత్తియుఁ దాల్మి సత్యవాఙ్నిరతియు
సదభిమానముగల్గు సరసుఁడెవ్వఁ
డతిథిసత్కారంబు నాత్మరతియు పర
స్తోత్రంబు సేయు సుధర్ముఁడెవ్వఁ
గీ. డొరులమనములనొప్పింప నొల్లఁడెవఁడు
మంచినడువడిగని సంతసించునెవ్వఁ
డెపుడు విజ్ఞానమునను జరించునెవఁడు
వాఁడెపో చూడ సత్కుల పావనుండు. ౧

సీ. తామెఱుంగని వెల్ల దప్పులంచునుబల్కు
కుమతులకొలువులఁ గొలువరాదు
తమకే ధనంబను తమకే శుభంబను
కుక్షింభరుల ప్రాపుఁ గోరరాదు
అభివృద్ధిచర్యల నడ్డగింపుచు సంస్థఁ
జెడఁ జూచు భ్రష్టులఁ జేరరాదు
ప్రాజ్ఞులదూషింపఁ బాల్పడుచుండెడు
దనుజతుల్యులనింతఁ దలపరాదు
గీ. ఎపుడసూయతగలిగి వర్తించునట్టి
యొరుల యౌన్నత్యమున్గని యోర్వనట్టి
దేశకాలపాత్రంబులఁ దెలియనట్టి
మూర్ఖులన్గూడి చరియింపఁ బూనరాదు. ౨

---

## ౩౧౧

# వినుతి

శ్రీ భట్టర్ అనంతాచార్యులు గారు

ఉ. అబ్జధరుండు పౌత్రుఁడుగ నబ్జభవుండు కుమారుగా విలా
సాబ్జమెకీతిగాఁగ లసదబ్జధరుండె మగండుగాఁగ మే
లబ్జము చేతఁదాల్చి దరహాస జితాబ్జకమైన నీదు పా
దాబ్జములన్ దలంతు హృదయాబ్జమునందున శ్రీరమాసతీ. ౧

ఉ. ద్రావిడభాషలో నిగమ ధర్మజనార్దన నామమే సదా
భావనఁజేసి పద్దెము లపారసహస్రము లెల్ల చేతనో
జ్జీవనకై రచించిన విశేషకృపానిధి యాశరారిప
జ్జీవనజంబులన్ గొలతు శ్రీప పురాగత సిద్ధికై మదిన్. ౨

---

## ౩౧౨

# రాజలింగ

శ్రీ ముదిగొండ మల్లనారాధ్యకవి గారు

సీ. బాణాసురుని గేహ బహిరంగణంబున
ఘనముగాఁ గావలి గాయలేదె
పిట్టవ్వ పెట్టిన పిట్టారగించియు
నెట్టితట్టలు మోసి యేలలేదె
గిలకల మారయ్య కేలను నివసించి
గులుకుచు నాట్యంబు సలుపలేదె
కిన్నెర బ్రహ్మయ్య పన్నుతిఁ బిలువనీ
నిలయంబులలోనుండి పలుకలేదె

గీ. భక్తులడిగిన వరములు ప్రకటితముగ
నిచ్చెదనటంచు బలుకవే యిచ్చచేత
నిట్టి వాత్సల్య మెవరికి నెట్టులుండు
రమ్య వేములవాడ శ్రీరాజలింగ.

౩౧౩

# మాతృప్రేమ

శ్రీ పంతం ఆంజనేయకవి గారు

---

చ. కొడుకొకవేళ దుష్టుఁడయి కూళలఁగూడి చరించివిద్యలన్
బడయక మూర్ఖపద్ధతిని బంధులఁగేరుచుఁదండ్రిఁదిట్టి దుం
దుడుకుతనంబుఁజూపి బుధదూషణుఁడై వెసనుంటఁదండ్రి యా
బుసుతనిశాస్తిఁజేయఁదలఁ ప్రక్కదలఁబెట్టినఁదల్లి యొక్కనే. ౧

ఉ. నందను ముద్దుమోము స్మరణంబుననిల్పుచుఁ జిత్తమందునా
నందముఁజెందుఁగాని నిజ నందను దుష్టచరిత్రకెంతయుఁ
గొందలమొందదెన్నఁ డనుకూలముఁగానిజపుత్రుమానసా
నందమునందఁజేయుఁగద నాతులకుండెడు ప్రేమతోఁడయే
చందముఁబోల్పఁగాఁదగును జాలవుగా నెటువంటి వస్తువుల్. ౨

సీ. ఎండవేడిమికోర్వ కింటికినేతెంచు
కొడుకుచెమ్మటఁగొంగుఁ దుడుచుఁదల్లి
తుడిచియంతటఁగ్రాగు తోయముల్ వెసఁగూర్చి
మజ్జనమాడించి బొజ్జనిమురు
నిమిరి భోజనమిడి నియతిఁజెంతనుఁజేరి
యతులనీతులబోధ నమరఁజేయుఁ
జేసితెచ్చినవిత్త మాసింపకనుబ్రీతిఁ
దనయపోషణలోన వినయపఱచుఁ

తే. బఱచి కంటిరెప్పనుబోలెఁ గాంచుఁగాంచి
వత్స! యీరీతిఁజనుమంచుఁ బ్రోత్సహించు
తల్లి కరుణకు మించిన ద్రవ్యమెద్ది
జననికెనయైన దైవంబు జగతిఁగలదె. 3

---

౩౧౪

# తలపోత

శ్రీ విక్రాల నరసింహాచార్యులు గారు

నెనరుం జిల్కుచు నింపునింపుచు మరుల్ నిండార నన్యోన్యమై
యనుకూలించిన యామిటారి నను చెయ్యందింక నాకబ్బునే
గనుకొన్నంతనె లీనమైమనసు బ్రహ్మానందమే నేనుగాఁ
గనుచుండు న్వలిచెయ్యి లేవియు నెఱుంగంజాలకే యద్దిరా! ౧

పొగడపూదండ తావుల పొలుపుఁ దెలుపు
బిగువుపాలిండ్ల హత్తించి నగుమొగంబు
నాదుమెడచెంతఁ గదియించి నాతినన్నుఁ
గౌఁగిటను జేర్చు భాగ్యంబు గలుఁగునొక్కొ. ౨

సీ. హృదయకుడ్యమునఁ జిత్రింపఁగాఁబడెనో యా
తీరున హృదయమే తీర్చఁబడెనో
హృదయగోళమునందుఁ బాదిగింపఁబడియెనో
వజ్రలేపమున లోఁబరుపఁబడెనో
యభ్యంతరమున మూయంబడెనేమొ మ
న్మథుముల్కు లేనింట నాటఁబడెనో
చింతావళీతంతు సంతానజాల సం
భేదమందునఁ జిక్కు వేయఁబడెనో
గీ. లేకప్రతిఫలించెనో తాను లేకయెట్లు
ప్రతిఫలించును కావునఁ బాలునీళ్లుఁ
గలియుమాదిరిఁ బ్రేమసివఁపు మిగుల
నామనంబునఁ గలిసియున్నది నిజంబు. ౩

మ. కనుచోఁ గన్నులపండువై వలపులొల్కంజేయులోకాన నుం
డినయానందములెల్లఁ జిత్తమునయందే ప్రోదిఁగావించుఁగా
మునిలీరానిలయాంగణమ్ము చెలినెమ్మోమద్దిరా! బాలచం
ద్రునిసారాంశమునొక్క మారుమట్టికన్గోఁగల్గునో కల్గదో! ౪

## ౩౧౫
# శ్రీయాదవాద్రీశ్వరా

శ్రీ బొమ్మినేని రాజరెడ్డి గారు

---

ఉ. శ్రీయదుశైలరాడ్రుహా నృసింహా త్రిలోకభయంకృతాస్య ల
క్ష్మీయుత వజ్రసన్నిభవిశేషలస న్నఖరప్రదీప్త దై
తేయకులేంద్ర దుర్విపిన తీక్ష్ణకరాళకుఠారధార శ్రీ
నాయక నాయఖండవృజినంబెడఁబాపవె యాదవాద్రిపా.

మ. కొడుకుల్ పెందుడుకుల్ స్వకాంతలహితుల్ క్రూరుల్ బుద్ధ్యభిప్రాయముల్
కడుఁబేర్మింగల సుట్టపక్కములు దొంగల్ వీరలిబ్బాట యా
రడిసంసారపయోధి దాటుట కుపేంద్రా మోక్షదంబైన నీ
యడుఁగుందోయి సుభక్తినావనికు దేవా యాదవాద్రీశ్వరా.

---

## ౩౧౬
# కమలదళాక్షా

శ్రీ నేరెళ్ల నరసింహారామకవి గారు

---

క. చలిబువ్వఁ దినెడువాఁడు
న్బలుమరు నిద్రించువాఁడు పలుమాసిన బ
ట్టలుఁ గట్టువాఁడు సిరులన్
దలఁగుం దమ్మన్నపేట దళితనిశాటా! ౧

క. ధనముండి యుడనిలోభిన్
దనువుండియుఁ జక్రముద్రఁ దాల్పనిమూఢున్
నినుదలపని యాదుష్టున్
గనఁగూడదు దమ్మనపురి కమలదళాక్షా. ౨

---

## ౩౧౮

# రాఘవా

శ్రీ డింగిరి నరసింహాచార్యులు గారు



శా. సుత్రామోపలరాజితాంగ సురసంస్తుత్యాంఘ్రి పంకేజ భూ
పుత్రీవల్లభ సారసప్రియకులోద్భాతేశ సర్వేశ త
త్సత్రారాతిధనుర్విభంజన మునీశవ్రాతహృద్ధామ నీ
పాత్రప్రజ్ఞలఁ బ్రస్తుతించుటకు నాశక్యంబె యోరాఘవా. ౧
వక్రంబించుకలేక న్యాయపథ సంచారుండవై నీవు భూ
చక్రంబేలుటమాని తాపసుఁడవై చాపంబుఁ జేఁబూని పీ
ర్యాక్రాంతాఖిలలోకశాత్రవనికాయంబెల్ల మాయించియా
శక్రస్థానము భక్తసంఘమును కౌసల్యాత్మజా ప్రోవవే. ౨
కర్ణాలంబితకాకపక్షములతో కైశోరరూపంబుతో
స్వర్ణాలంకృతభూషణావళులతో భ్రాతృత్రివర్గంబుతో
పూర్ణేందుప్రతిమాననసన్ముఖముతో భూపుత్రికాంకంబుతో
స్వర్ణాంచన్మణిపీఠిపై వెలసి సత్సందర్శనంబీగదే. ౩



## ౩౧౯

# ప్రార్థన

శ్రీ మాడుగుల వేంకయ్య గారు

శా. శ్రీనారాయణ నాభిపద్మమునఁ దాజన్మించి యీసృష్టికిన్
దానే కర్తనటంచు బల్కనెడ వక్త్రింబంబుఁ గూర్చుండి పీ
ణానాదంబును మీటుచున్ విభునకానందంబుఁ గల్గించువా
ణీ నాకుం గవితారసంబునిడి రాణించంగృపం బ్రోవవే.

## ౩౧౯

# వానితోఁ జిత్రకారుఁ డొకఁడు

శ్రీ చెరుకుపల్లి నరసింహ సిద్ధాంతి గారు

మగుడునడగాక విధివిరామంబులేక
యేది యెట్లగుచుండినయేనిఁ గనక
తనపనియె తానుగా నేమొమునిఁగిపోయి
నటులుగా నేరికినిఁ దెలియంగఁబడక
పరచు కాలప్రవాహగర్భమున యందు
మొలచికీర్తలఁజూపి యంతనమునిఁగిపోవు
నణుపదార్థంబయేని బ్రహ్మాండమేని
కడచినదివచ్చునే యెంతకాలమునకు
స్రష్టకును శక్యమే పునస్సృష్టిసేయ
దానినిలఁద్రొక్కి జగముండుదాకకనుల
యెదుట నాడించునెఅజాణ యెవ్వఁడొక్కఁ
అమృతమయమైన తనశిల్పమందునిలిపి
తనదుసృష్టికి తానె స్వతంత్రుఁడగుచుఁ
దానుజేపట్టియుండిన దానిఁగూడ
నమృతమయముగఁ జేయు దివ్యాత్ముఁడనినఁ
గవి యొకఁడు వానితోఁ జిత్రకారుఁడొకఁడు.

---

## ౩౨౦

# కందగీతగర్భ చంపకమాల

శ్రీ ముదిగొండ సాంబశివకవి గారు

చ. పురహరధూర్జటీ వనజ భూసురపూజిత పాదపద్మ సుం
దరసుగుణాకరా భుజగనాయకకంకణ భూతనాథ శం
కర కరుణానిధీ గరళ కంధరమన్మథ గర్వభంగ తా
మరసనుతాభవా కుధర మందిర తాపసకోటిపోషణా.

---

## ౩౨౧

## చాటువులు

శ్రీ నంద్యాల అనంతరాఘవాచార్యులు గారు

శ్లో. కలశోదధికన్యాపదకమల రుహాలక్తలక్షితోరస్కం
కమలాపతిమనిశం మమకలయే కారుణ్యశేవధింమనసి. ౧
ఉత్సంగే వినివేశ్య చంద్రవదనా ముత్తుంగపీనస్తనీం
పద్మాం నేత్రపరాజితోత్పలసరోజాతాం జగన్మాతరం
ఉత్తుంగం శశికాంతిపీఠమధునా లంకృత్యమధ్యేసభం
బాభాత్యాశ్రితవత్సలోగుణనిధి శ్శ్రీకేశవస్సంప్రతం. ౨
కోయఙ్గోవ్యాదిసుతాకమంచతివరాః కస్యాంచరంత్యుత్సుకః
కోవామాసుజనార్దనఃకిమహారతాః దేహాభూఃకాసరః
క్వాస్తేకోబిసజోవిరాజతిరవిర్యస్యాస్స్వభూఃకీదృశో
గౌరీశంభు వినాయకోదధిసుతాపంకేజజన్మార్చితః. ౩
కోమలకమలవిలోచనయుగలారాత్రావుపస్థితంకాన్తం
నసమాఽపశ్యద్వనితా మానసజనునర్మమానసాపిదృక్షం. ౪

## ౩౨౨

## నుతి

శ్రీ కొండపాక నారాయణాచార్య కవిగారు

శా. ఓంకారాలయునిఁ జగజ్జరునిఁ వ్యోమాదిభూతాంగునిఁ
సంకాశస్థితి లీనరూపుని సదా సచ్చిత్కళాభాసునిఁ.
సంకల్పాదివికారశూన్యుని విలక్ష్యబ్రహ్మము న్నిర్గతా
హంకారాత్ముండనై స్మరించెదను సోహంసోహమంచతురుఁ. ౧
ఉ. భావమునందు నీదుపద భక్తివహించినధన్యులెల్ల స
త్పావనసత్తరటంచు మును బ్రాజ్ఞులు దెల్ప గ్రహించి నిత్యసం
జీవుడవంచునమ్మి నుతిఁజేయుచునుంటి ననంతవేదసం
సేవిత నిశ్చలాత్మ దయఁజేసి ననుస్దరిఁజేర్పరాగదే. ౨

౩౨౩

# ఎలనాగ

శ్రీ గోవర్ధనం వేంకట నృసింహాచార్యులు గారు



సీ. కుటిలభారముతన కుంతలంబులయంద
కానివర్తనమునఁ గదియనీక
చపలభారముతన చారునేత్రములంద
కానిశీలంబునఁ గదియనీక
కఠినభారముతన గబ్బిగుబ్బలయంద
కాని నెమ్మనమునఁ గదియనీక
మంజుభావముతన మహితసద్గతియంద
కానిమెలుకువలందుఁ గదియనీక

గీ. తనరు పెంపొందు నిందు సుందరితటిల్ల
తావితానసముద్భవ స్థానశుభత
నూవితాన విసర్జిత నూత్నగంధ
కుసుమవటువల్లికా వల్లి కుముదవల్లి. ౧

ఉ. కారుమెరుంగుడాలు జిగి గ్రమ్మెడు వెన్నెలడాలు మేలిబం
గారపుడాలు మారువిరికైదువడాలొకచోటఁ గూర్చి శృం
గారరసంబుచే మెదపి కాంచనగర్భుఁడు సేసినట్టి యొ
య్యారపుఁ బొమ్మగాఁదనరె నాయెలనాగ విలాసవైఖరుల్. ౨



## ౩౨౪
## కామిని
### శ్రీ ఇ. పి. వేంకటరామకవి గారు

ఉ. భానుఁడులేనివాసరము భామినిలేని గృహంబు పుత్త్ర సం
తానములేని జన్మమును దానములేనిధనంబు శాంతముం
బూనఁగలేని యోగమును భూపతిలేనిపురంబు మర్త్యు స్వా
ధీనుఁజేయలేని యువతీమణియేల పయోజసంభవా. ౧
ఉ. కంబునునేలు కంఠము పికంబునుఁబోలు రవంబు పుండరీ
కంబునుమీఱు నవ్వు కనకంబునుఁదూఱు తనూవిభూతి నా
కంబునుమించు మధ్యము శుకంబునునొంచు మృదూక్తి చక్ర వా
కంబును గేరుచన్నవలు కామినిసౌరు నుతింపశక్యమే. ౨

## ౩౨౫
## సంప్రార్థనము
### శ్రీముడిగొండ శంకరశాస్త్రి గారు

ఉ. దానజపాది సత్క్రియలఁ దన్పసమర్థుఁడగానునిన్ను "సో
మేనయజేత" అంచుజనమేజయులీల వితానసంతతుల్
పూనికఁజేసి స్వర్గపుర భోగములందఁగ నిచ్చగింప ను
త్థానభవత్పదంబుల సదాహృది నిల్పిభజింతు భక్తిచేన్. ౧
శా. లావణ్యాంచిత భస్మదేహాశిఖలన్ లాల్యాహిఁబోకార్చి వి
ద్యావైశద్యజలప్రదానమున హృత్తాపాగ్నిఁ జల్లార్చి జ్ఞే
యా వేదప్రతిపాదితా కృతిరతి ధ్యానేన యంచున్నరుల్
నీవిశ్వాకృతిఁజూచుచుంద్రు సతమున్ నిర్నిద్రరక్షింపుమా. ౨
మ. స్తవనీయంబగు త్వచ్చరిత్రవితతిన్ సాంతంబుగాఁజూడ నో
ప విశాలంబగుటన్ భవద్గుణగణ ప్రాశస్త్యమెన్నంగ వే
ద విదుత్తుల్ పచరింపఁజాలవన మత్స్వల్పోక్తికిన్ శక్యమే
దివిషద్వర్గసమర్చితాంఘ్రియుగళా దేవా కటాక్షింపుమా. ౩

౩౨౮

# వసంతుఁడు

శ్రీ చింతామణి నరసింహాచారి గారు



సీ. మత్తిలివర్తిలు మంజులకోకిల
శుకముఖద్విజకుల సూక్తిపాళి
నైష్ఠికానుష్ఠేయ నవ్యసుస్వరశోభ
నిగమపారాయణ నియతిఁదెలుప
మకరంద రసపాన మహిమ మేలుచుఁజొచ్చి
కావించునళివధూ రావములను
శృంగారరసపూర్ణ మంగళసంగీత
భంగి సమాఖ్యాతిఁ బయలుపరుప

గీ. చారువీరుద్గణావ్యావే శ్యాగణంబు
ప్రేరితంబయి యలమాత రిశ్వభరిత
సత్కలావేదిచేఁజేయ సాగె రమ్య
నృత్యకేళీవినోదంబు నేర్పుమెయిని.

సీ. పవమానవలనంబు వలన మర్మరములౌ
తాళముల్ దూర్య వాదనము సేయఁ
జంచరీకాక్రాంతిఁ జరియించుమల్లికా
వధువులు సుమలాజ వర్షముంప
వికచ నానాపుష్ప వితతినుండి స్రవించు
మాధ్వీచూర్ణము ధూళి మట్టువెట్ట
నమృతాయితాంబువు లలరునారికేడంబు
లనఘ ప్రపాపాళి ననుకరింప

గీ. నిత్యసూరివిలోచన నిస్తులోరు
పర్వమగుచుండ వాహ్యాళి పరిఢవిల్ల
హస్తిశైలాధిపునినవ్వ డాదరించెఁ
గంతుకూరిమి చెలి యవ్వసంతుఁడెలమి.

౩౨౭

# మిత్రస్మృతి

శ్రీ మాడపాటి హనుమంతరావు గారు



చ. ఫలములచేతఁ గొన్నిటిని; బల్లవసంతతిచేతఁ గొన్నిటిన్
సలలిత సౌఖ్యదాయియగు చాయనుగొన్నిటి; వేవిధాల నీ
యిలను ననేకజీవుల కహీనసుఖంబిడు వృక్షరాజమున్
బలువడి బీకివైచితె? తుపాన! వినాశము చేసివైచితే? ౧

చ. నయగుణభూషణుండు; పరనారుల కెల్లను సోదరుండు; ని
త్యయశుఁడనన్యలభ్యసముదారచరిత్రుఁడు; సాహసాత్ముఁడున్
దయకును సౌహృదంబునకు దాత్తనిదానుఁడౌ; సర్వసజ్జన
ప్రియుఁడగువాని నిట్లు విపరీతపుఁగాలమ! మ్రింగివైచితే. ౨

మ. స్వకుటుంబమ్మును రక్షసేయుటకె యీసర్వంబటంచున్దలం
చి, కడున్ స్వార్థపరాయణత్వమున నిశ్చింతాత్మతో నుండు, లు
బ్ధకులోత్తంసులు కానరారయిరె నీపాపంపుఁ గందోయికి
ట్లకటా! మృత్యువ! ఏమనంగఁదగు నీయంధత్వమాహాత్మ్యమున్.

మ. అమలస్వాంతత నెవ్వఁడాంధ్రసుకలావ్యాప్త్యర్థమై సత్సమా
జములన్స్వజనోపయోగమునకై స్థాపించె; నెవ్వానికిన్
సముఁడౌ నాతఁడు గానఁగాఁబడుట దుస్సాధ్యంబౌ యవ్వానినా
మము నేఁడీగతి మాపికొంటివె? నిజామ్రాష్ట్రాంధ్ర భూభాగమా.

ఉ. పొమ్మిఁక; రంగరాయ! ఘనపుణ్యుల లోకమునందునుండు; నీ
సొమ్మగుఁగాక యెన్నఁడును శోకములేని మహత్సుఖంబు ముం
దమ్ములు నీగుణావళిని నాత్మసుతాళి కెఱుంగఁజేసి నే
మమ్మున వారినెప్పుడు సుమార్గమునన్నడపింత్రు గావుతన్. ౫



## ౩౨౫
## అన్వేషణము

శ్రీ తూము రామదాసు గారు

---

సీ. అధికబింబఫలారుణాంశుమాలికఁ దెచ్చి
రదనావళికి ననురాగమీయ
స్వర్ణకుంభద్వయ సంకాశకుచభార
కంపమానావలగ్నంబు దనర
దరహాసజనిత జ్యోత్స్నమరీచులు సర్వ
దిక్కూల మునుకొని తెలివిసూప
శింజానమంజు మంజీరగర్భోద్భవ
రవములు సెవులపండువులు సేయ
గీ. సజ్జసౌరభ కౌతూహలావతీర్ణ
మత్తరోలంబతతి గరిమమునఁ గుఱులు
ఫాలభాగంబుఁ గప్పిన వామకరన
ఖరములఁ దలరఁ దోలునుఁ గారవమున.

---

## ౩౨౬
## శ్రీరామచంద్ర ప్రభో

శ్రీ వటపురి వేంకటాచార్యులు గారు

---

శా. భూనాథోత్తమ వార్ధిబంధన లసద్భోగీశ పర్యంక య
జ్ఞానాంభోనిధి హవ్యవాహన విభాస్వత్కీర్తి ధారేయ వి
జ్ఞానాపేత దశాస్యభంజన సదా శాంతాత్మ కంజాక్ష బ్ర
హ్మానందాబ్ధి విహార కంబుగళ దేవా రామచంద్రప్రభో. ౧
మ. పతిశాపంబున నాతి రాతిగతి దుర్వారోగ్ర కాంతార మం
దతిశోషిల్లుచు వేలవర్షములు దుఃఖాక్రాంత చిత్తంబుతో
గతిలేకన్ బడియుండఁ జూచి మదిలోఁ గారుణ్యతన్ బూనుటల్
మతినూహింపగఁ జోద్యమున్ గలిగె దేవా రామచంద్రప్రభో. ౨

---

## ౩౩౦

## రమణి

శ్రీ సయ్యదలీ గారు

సీ. కొమ్మయో యది పూలరెమ్మయో బంగారు
బొమ్మయో తోఁచె గందమ్ములకును
ఇంతియో వలరాజ దంతియో నతనిచే
బంతియో వింతనా స్వాంతమునకు
బోటియో రతనాల పేటియో యచ్చర
మేటియో కంటి వనవాటికందు
చానయో యమృతంపు సోనయో ముద్దుల
బానయో చెదరె నా మానసంబు
గీ. దానివయసు వయారంబు తళుకుబెళుకు
సోయగము ప్రౌఢతనమును సొరదినమర
నెట్లుచేసెనో విధిదీని కెనయుసాటి
కాంతగల్గునె కన ముజ్జగంబులందు.

## ౩౩౧

## కృష్ణనుతి

శ్రీ గుడిపల్లి వేంకటరెడ్డి గారు

ఉ. సజ్జనసంతతిన్ గలుషసంఘము వాయ కళత్రపుత్ర భా
స్వజ్జన మోహలంపటత బారగ దూరము శుద్ధతత్వమీ
పజ్జను జేరునంట మరి బ్రహ్మపథంబు లభించునంట నా
యొజ్జవు గూర్చు మట్టిసఖు నూర్జితశక్తి భజింతు మాధవా. ౧
ఉ. బాలరసాలపల్లవము భక్షణఁ జేసెడి పక్షిజాతికిన్
మేలగు గాత్రమే కళ యమేయసుహావపు మచ్చెకంటికిన్
శీలమె సుందరంబు కళ నేరికినిన్ జదువున్న రూపునా
తాలిమి రూపు మానులకు ధర్మమె దాతకు రూపు మాధవా. ౨

## ౩౩౨
# నృసింహస్తోత్రము

శ్రీమరింగంటి లక్ష్మణదేశికులుగారు

శ్లో. శ్రీమద్భాసుర దేహకాంతివిజితప్రద్యోత నేందుప్రభం
కోపాగ్నిస్ఫుర దీక్షణాంచితకన జ్జ్వాలాయుతంసన్ముఖం
ప్రహ్లాదాస్యసరోజచిత్రకిరణం బహిఃకుర్ముఖానందదం
దేవాద్రిప్రభుమీశదాతృవినతం లక్ష్మీనృసింహాంభజే. ౧
లోకానాంభయదం హిరణ్యకశిపుం హత్వాసురాణాంసుఖం
యచ్ఛన్ సర్వదిగీశ్వరస్తుబహుధా సంస్తూయమానంసదా
భక్తానాంకుశలప్రదం రిపుహరం దాసౌఘకల్పద్రుమం
దేవాద్రిప్రభుమీశధాతృవినుతం లక్ష్మీనృసింహాంభజే. ౨
గీర్వాణాధిపతిం మహాబలయుతం భీమాట్టహాసోన్నతం
క్షీరాంభోధిసుతామనోహర విహారప్రౌఢలీలాన్వితం
దివ్యాస్త్రక్షత దేవదానవచయం వేదాంతసూక్తిస్థితం
దేవాద్రిప్రభు మీశధాతృవినుతం లక్ష్మీనృసింహాంభజే. ౩
మందారాతి వదాన్యతావిలసితం మాణిక్యదిగ్ధాంగదం
ముక్తాహారవిరాజితోరస మతిప్రాంచత్కిరీటంశిరం
సంగ్రామోజ్జ్వల శక్తిసంయుతచతుర్బాహుద్విషద్భీకరం
దేవాద్రిప్రభుమీశధాతృవినుతం లక్ష్మీనృసింహాంభజే. ౪

## ౩౩౩
# శివశాంకరి

శ్రీ శ్రీధర కృష్ణశాస్త్రులవారు

శ్లో. అతిభీషణ కటుభాషణ యమకింకరపటలీ
కృతతాడన పరిపీడన మరణాగతసమయే
ఉమయాసహ మమచేతసి యమశాసన నివస
శివశాంకరి శివశాంకరి హర మామక దురితం.

౩౩౪

# స్తోత్రము

సాహిత్యశిరోమణి
శ్రీ తిరుమల బుక్కపట్టణం అణ్ణయాచార్యులు గారు

శ్లో. ఏకైకావిచినోతు కుంజమధునై వైకైకమస్తంగతే
త్వాం హా వైంద్రమణిప్రభో నసులభ స్స్యాద్వల్లవీవల్లభః
ఇత్యుక్త్వాధృతయోషిదాకృతిరమూన్ సంప్రేష్యకుంజాన్ విశ
న్నేకైకాం రమయన్ ముదాకలయతాచ్ఛ్రేయాంసి భూయాంసివః
నిగమాంచలసంచారీ నికేతంసాత్రాజితీ మనోహారీ
పాయాద్దీనోద్ధారీ శౌరిర్వో నరకదనుజసంహారీ. ౨
ధరణీతనయేఽపనయే కరుణాం హి తేఽహి తేజగద్విత తేః
నరకేసుర కేసరిణాం శరభే పరిభేదయతి జగతి ప్రితయామ్. ౩
భువనే విపత్త్యధీనే రాజకుమారీజనే చిరం దూనే
ఊనే దివిషన్మానే మానేనయనేఽ శుభరసముచ్ఛ్రానే. ౪
సత్యాసుదత్యా సమమేత్య సత్యా
క్షిత్యాత్మజాతం సమరేనిపాత్య
రాజన్యకన్యా వృతధన్యమూర్తిః
పాయాదపాయాదవిగేయ కీర్తిః. ౫

౩౩౫

# నృసింహస్తుతి

శ్రీ దయారి శీతారామానుజ చార్యులు గారు

శ్లో. వైకుంఠేపివిహాయ భూతికలనాం శేషాద్రిసాన్నాశ్రితః
శ్రీశస్సద్ఘృణయాద్య భక్తనివహం సంరక్షితుం దీక్షితః
శ్రీమద్యాదగిరీంద్రసద్మనిమహాలక్ష్మీనృసింహోభవ
చ్ఛేవఃకందరమందిరాకృతి రభూద్బ్రహ్మాద్యమర్త్యార్చితః. ౧
కామారాతిశిరఃకిరీటమణిసత్కాంతిచ్ఛటాసంగతో
ద్దామశ్రీచరణాంబుజం నతజన వ్రాతైకసంజీవనం
కామక్రోధమహావికారదమనం కంజాతపత్రేక్షణం
శ్రీమద్యాదగిరీంద్ర మందిరమహాలక్ష్మీనృసింహంభజే. ౨

## ౩౩౭

# అనావృష్టి

శ్రీ చిగుళ్లపల్లి వేదాంతాచార్యులు గారు



శ్లో. పరంవ్యాతన్వానాయవసలవహీనాంవసుమతీ
మశేషాన్కాసారానుదకకణశూన్యాన్విదధతీ
మహీజాతాన్ శుష్కానపివిరచయంతీవిధివశా
దనావృష్టిస్సాభ్రమావజనిభువనోన్మూలనకరీ. ౧

శ్లో. ప్రబలాతపమిళితనిలాఘాతవిఘాతాన్యశేషసస్యాని
స్వాయతననైష్ఫల్యధియాశుష్కాణ్యాసన్కృషీవలాస్యాని. ౨
గ్రసాధరణీచోరైర్మనోజనానాందురంతదుఃఖైశ్చ
ప్రాదురభూవన్ప్రబలావ్యాధివిషాన్నృణాంపశూనాంచ.

సాధుప్రవరాశ్చింతాదంతురచిత్తాబభూవురనవరతం
విజిహీర్షాంకృషికర్మణిదధతఃకృషికావిదూనహృదఆసన్. ౪

కేచనసమీక్షమాణాఃపయోదతతిమేవవృష్టిలుబ్ధహృదః
ప్రలపంతిజలదనిచయావర్షేయుశ్చాద్య వాపరేహనివా. ౫

కలిబలధుతసత్కర్మణి నహివర్షేదేవజలధరోజగతి
యదిచకదాచిద్వర్షేదనవసరేతదపినహిఫలాయభవేత్. ౬

ప్రతిగేహమశనవసనాభావకథా అతితరాంసమైధంత
గ్రహమహిమోత్థాభావా ప్రగాఢసంబాధా. ౭

నిఖిలజగదుదయరక్షావిలయకృదేవైత దపనయాయేష్టే
తస్మాత్తమేవశరణంయాతజనాఃకిమితరైరుపాయశతైః. ౮

## ౩౩౨
## చాటువులు
### శ్రీ హారతి దీక్షాచార్యులు గారు

శ్లో. సంపత్తిం విదదాతి కాఽఖిలజనై రర్థ్యైశ్చకః ప్రేయసీ
కాశ్శాః కేఃక్వవసంతి భూమిపతయః శ్రీశః కురుధ్వేచకిమ్
సంబుద్ధా చకిమవ్యయం బహువచోధారా సుధాకీదృశీ
శ్రీమన్మక్కరవంశ వారిధివిధోః శ్రీరామభూమీపతేః. ౧
కింవక్తే చసదాఽత్రకూరునగరాలంకారచూడామణి
ర్విద్వద్బృందచకోర పార్వణసుధాధామాసుధీభ్యశ్చిరమ్
ఏనేనాత్మహి తేనకస్సమవితః షిద్గోజనః కీదృశః
శ్రీ రామామణి జాతధామని మహామోహేననాశంశ్రితః. ౨

---

## ౩౩౩
## పృష్పికావిచికిత్స
### శ్రీ మంగవెల్లి బుచ్చి వేంకటాచార్యులు గారు

కింపుష్పంవద హేసఖే కుముదమంభోజం నహిక్షోణిజం
కింకుందం నలతాశ్రయం విబుధహస్తాగ్రే సదాశోభతే
కింసంతానసుమం నహిత్రిదివజం హృత్పుండరీకోద్భవం
కీదృగ్రూపమహోస్య బుద్ధిగతతద్రూపం విచిత్రంమహత్. ౧
కేనానీతమిదం ప్రతాపసహజస్థైర్యేణ కీర్త్యర్థినా
కుత్రస్థం కవిసార్వభౌమహృదయే కింకారణం వేత్సితత్
నైజాంరాష్ట్రసుధీకవిత్వ సరణౌ మాధుర్యమీదృగ్భవే
దిత్యేతద్వచనం సమస్తభువనే సంస్థాపనార్థంముదా. ౨
వర్ధన్తాంభువనత్రయస్థితజనజ్ఞానప్రదాశేష తా
మిస్రఘ్నస్ఫురదర్యమోత్థితికరత్యేడ్భాస్వదంభోధిజా
దృక్పాత్రిక్ప్రేక్షణ భక్తరక్షణరమావక్షస్థలాపాంగసం
వృద్ధిభూత పటుత్వధార కవితాశక్త్యాస్యసంతస్సదా. ౩

---

## ౩౩౯
## వియోగి విలాపము
### శ్రీ శివరామశాస్త్రి గారు

సీ. అమృతమొల్కెడిమోవి నతివకేల్దమ్మిచే
　　　　　　　నధరపానము వేళనడ్డుపరచెఁ
　　బరచినపూపాన్పు పడతి సేరునటన్న
　　　　　　　క్రేగంటిచూపున గేరిమారు
　　మారుమాటాడని మగువకెమ్మోవిని
　　　　　　　కదలించిమాటాడఁ గలిగెనపుడు
　　గలిగెఁగానాపైన కలికి చొక్కపుప్రేమ
　　　　　　　యనుకొన్నయంత నాట్యమ్ముజూపు
గీ. జూపువలపునఁజూచినే సొమ్మసిల్లి
　　దక్కెనాసొమ్ము కౌంగిటఁ జిక్కెననుచుఁ
　　దలఁచియుంటినిగాని యీ దైవఘటన
　　పథముగనన్నైతి వంతలఁ బడయనైతి.

---

## ౩౪౦
## రమా మనోహరా
### శ్రీ బొమ్మకంటి సత్యనారాయణరావు గారు

ఉ. శ్రీపతివీవు నాహృదయ సీమవసించి యహర్నిశంబులన్
　　బాపముసేయఁ బంచితొ కృపామతి బుణ్యముసేయఁబంచితో
　　యీపగిదిన్ జరించితిని నెట్టికృతంబులకేన బాధ్యుఁడన్
　　బాపతమఃపతంగ భవభంగశుభాంగ రమామనోవరా?

ఉ. కన్నకుమారుఁడెన్ని కొరగాములొనర్చినఁగాని తండ్రితా
　　మన్ననవీడఁగన్ గరుణమానక రక్షణసల్పుభంగి నీ
　　వున్ననుగన్నతండ్రివి విభూకరుణానిధివై క్షమింపు మా
　　పన్నశరణ్య మద్రచితపాపము బాపురమామనోహరా.

---

## ౩౪౧

# సూర్యుఁడు

సంగీతాష్టావధాని హరిదాసు
శ్రీ పేరకరంగాచార్యులు గారు

సీ. యిందిందిరము లెల్ల నెవనిగాంచినయంత
పరిపూర్ణవికసన ప్రభలనొప్పుఁ
చక్షులెవ్వనిరాక వీక్షించినంతనే
కలరవంబులతోడఁ గలయు బారు
లోకంబులెవని నాలోకించిన సమస్త
కర్మలఁ జేయఁగాఁ గడఁగుచుండు
రాత్రించరుఁడెవని రాకచేతఁ గలంగి
దనపూర్వకాంతినిఁ దప్పుచుండుఁ
గీ. బుట్టనెవ్వఁడు కర్మలు బుట్టుచుండు
వృద్ధినెవఁడొందఁ గర్మలు వృద్ధిఁజెందు
నస్తమెవఁడొందఁ గర్మలు నస్తమించు
నట్టిసూర్యుఁడు నుదయించెనంబరమున.

---

## ౩౪౨

# చాటువులు

శ్రీ చింతామణి సింగరాచార్యులు గారు

శా. శ్రీశాప్యావని భృత్సమానవిలసచ్ఛృంగార దేహోష్టది
గ్రారాజద్గజకుంభనిర్దళనదంష్ట్రాభిలకాంతిచ్ఛటా
దూరీభూతకుపాట సైన్యభవదుద్దోర్దండ సంకాశశం
ఖారీంద్ర ప్రతిమానకే వలఘ్నుణఁ గాపాడు విశ్వేసరీ. ౧
మ. కరిభూభృన్నికటావనీస్థలి దళత్కంజాత కల్హారపు
ష్పరసోజ్జ్వలహారీ వితానజనితస్ఫారత్తరంగచ్ఛటో
పరిఖేలద్భ్రమరీస్వన శ్రుతిరతిప్రాప్తామరీ లోకమై
సురలోకాపగఁ బోలె వేగవతి నాశోభిల్లు వాణీశ్వరీ. ౨

## ౩౪౩
## పూజ్యము

శ్రీ గోవర్ధనం రామానుజాచార్యులు గారు

పూజ్యాశ్రీరఘునాయకస్య విమలాఽయోధ్యాపురీసంతతం
పూజ్యాభూతపురీతథైవసుమహత్కాంచీప్రకాశోజ్వలా
పూజ్యాగోకులనాథ నిత్యవసతిః కాశీగయావంతికా
సర్వంస్థావరరూపమండలమిదంపూజ్యంహిసందృశ్యతే. ౧
పూజ్యశ్శ్రీకమలాపతి స్సురగణాధీశః ప్రపూజ్యస్తథా
పూజ్యాస్తే గురుదేవతాంతచరణాఃపూజ్యస్సతామగ్రణీః
పూజ్యంజంగమరూప విశ్వమఖిలం సర్వత్రదృష్టంశ్శ్రుతం
పూజ్యత్వే ప్రబలప్రమాణ మపివేదార్థేషు సంస్పృశ్యతే. ౨
హేకృష్ణమాధవ మనోరథమేకమస్తి
దీనస్యమేయదిదదాసినదాయయాచే
మాయావిమోహితధియాపహతస్యపుంసః
కస్యాపినోద్భవతువైషమికీప్రవృత్తిః. ౩

---

## ౩౪౪
## శంకరా

శ్రీ పాపకంటి పుల్లమరాజ కవిగారు

చ. నరునితపంబుమెచ్చి మది నమ్మిక పాశుపతాస్త్రమిచ్చి సం
గరమున వాయునందనుని గానఁగవచ్చి మహీంద్రులాదిగాఁ
గురుపతులెల్ల చావఁగను గృచ్చి జయప్రదమిచ్చితౌర! భూ
వరనుత కండనూాలు పురవాస గిరీశ మహేశశంకరా. ౧
చ. మరువను నీదుసేవఁ బలుమారునుతింతు మహానుభావ వే
సరకను బ్రోవలేవ మది సంసయముంచకు వామదేవ నీ
చరణసరోజముల్మదిని సన్నుతిఁజేసెద దేవదేవ భూ
వరనుత కండనూాలు పురవాస గిరీశ మహేశశంకరా. ౨

---

## ౩౪౫

# స్త్రీసంగ నిరాకరణము

శ్రీ కొక్కిరేణి నరసింహరాయకవి గారు

---

క. ఎక్కడి యనుభావమతని
కెక్కడి యీశిత్వ తేజమే క్రియగల్గున్
జిక్కక జనువనితనుగొనఁ
గ్రక్కునఁ జను తన్నుఁబడిన గార్దభముగతిన్. ౧

ఉ. సిద్ధులు విద్యలేమిపనిజేయు తపస్సుననేమి సార్థకం
బిద్ధరత్యాగ విశ్రుతములేమిటి కోసరమా వివిక్తసం
శుద్ధతమాన భావమున శోభిలుటేది సతీసమాజిచే
బద్ధమునైయు కామమునఁ బొల్పుకు నెవ్వనిమానసంబిలన్. ౨

గీ. స్వార్థము నెరుంగనట్టి యీవ్యర్థమూర్ఖ
పండితాత్మాభిమతు నాదు ప్రజ్ఞయేల
నీశ్వరత్వము బొందియు నిందుముఖుల
చేత గోఖరములు పోల్కె చిక్కుబడితి. ౩

గీ. వర్షపూగంబులందు సూర్యాశి వెలంది
యధరమధురాసవము గ్రోలి యైనదృప్తి
నందదాత్మజ మా కామమహావహ్ని
యాహుతులచేత వృద్ధియైనట్లునుండు. ౪

గీ. పుంశ్చలులచేత హృతమైన పురుషచిత్త
మెవఁడు విడిపించుటకుఁ బ్రభువితరుఁడగును
నాత్మరమణేశ్వరుఁడు భగవంతుఁడధిపుఁ
డగునధోక్షజునికిఁ దప్ప యవనియందు. ౫

క. ఆయువతిచేత బోధితుఁ
డైయు వివేకంబులేని యపగత బుద్ధిన్
బాయదు మానసగతమగు
హేయమహామోహమాయధీ నాత్మకున్. ౬

---

## ౩౪౬
# శ్రీ రాణీ భాగ్యలక్ష్మమ్మగారు

శ్రీ జోస్యం వేంకటాచార్యులు గారు

శ్లో. ముక్తాహారసుఖాతతో హరిపదాసక్తావిరక్తాసతీ
ముక్తారవిభూషణాదిభిరలం త్యక్త్వాకృశాంగప్రభా
స్వర్గం ప్రాప్తవతి ప్రియే నరపతౌ శ్రీరామభూపాలకే
రాజ్ఞిత్వ సమభూన్మహాగుణనిధి శ్రీభాగ్యలక్ష్మ్యంబికా. ౧
దిగంతవిఖ్యాతలసత్స్వకీర్తేః శ్రీరామభూపస్య విభాతి పత్నీ
కారుణ్యపూర్ణాకమలాలయేన శ్రియం కిరంతీ విబుధేషు నిత్యం. ౨
శ్రీరామభూపాలకధర్మపత్నీ శ్రీరామపాదాబ్జయుగం స్మరంతీ
రారాజనూనామల దివ్యకీర్తి రారాజతే భాగ్యరమాధరణ్యాం. ౩
ఆత్మకూరు పురీరాజ్ఞీ ధాత్రీ సుమనసాంముదం
విభాతి శశిరేఖేవ సదాసన్మార్గవర్తినీ. ౪

---

## ౩౪౭
# శ్రీ రాణీభాగ్యలక్ష్మాంబగారు

శ్రీతిరుమలబుక్కపట్టణం "జాతకవిద్వన్మణి" వేంకటాచార్యులు గారు

శ్లో. శ్రీరామభూపబుధమాళిగుణావృత శ్రీ
సాధ్వీమణిర్వివిధసజ్జన కల్పవల్లీ
భాభాతి సాహసయశస్సుగుణాభిరామా
ఖ్యాతాత్మకూరుపుర భాగ్యలతేవ సద్యః. ౧
సీతారామనృపాలమౌళిసరణిం ప్రాప్నోతి నిత్యం ముదా
బుద్ధ్వా రాజ్యవిచిత్రతంత్రసరణా వాజ్ఞాదిరీతివ్యపి
చాతుర్యేపి చ ధైర్యకార్యవినయప్రఖ్యాతకీర్త్యాం ముహు
శ్శ్రీమద్భాగ్యపద ప్రయుక్తకమలాసర్వం కరోతి స్ఫుటం. ౨
ఆదాయవ్యయమార్గనీతి నిపుణా కాలానువృత్తిస్థిరా
దానాధానవిధానవృత్తిచతురా రాష్ట్రాభివృద్ధిప్రదా
ఏతాం స్ఫీతగుణాం సదావతు మహాలక్ష్మీర్విశిష్టః ప్రభూ
రాజ్ఞీం భాగ్యద భాగ్యలక్ష్మ్యభిధసు శ్రీరామపత్నీం ముదా. ౩

## ౩౮౭

## కవులకాశీస్సు

శ్రీ మాడభూషి రాఘవాచార్యుల గారు

శ్లో. శ్రీమత్త్రైయ్యంతపాథోనిధిమథనమహా మందరాద్రిప్రదీప్త
ప్రజ్ఞానీతార్థసారామృతవితరణకృచ్ఛ్రీ కలిధ్వంసినామా
జీయాన్మాని స్వపాదాంబుజయుగళలస త్తీర్థవిశ్రాణనేన
ప్రధ్వస్తాంహోభరశ్శ్రీ గగనగిరిరమా ధీశవిన్యస్తభారః.

శా. శ్రీమత్కూర్మతిశైల శీతలగుహా ప్రేంఖద్వి నీలాంబుద
శ్యామాకారుఁడు కంజసంభవ భవాద్యాదిత్య కోటీర స
ద్ధామూల్యారుణ రత్న భాస్ఫురిత పాదాంభోరుహద్వంద్వుఁ డు
ద్దామారోగ్య ధనాయువుల్ మిగుల నొందన్ జేయు మీకెప్పుడున్.

ఉ. శ్రీరమణీయమై గగన రింఖదభంగ సరిత్స్ఫురంబునన్
స్ఫారదరీపతద్విమల వార్ధునికంబయి పేర్కొనంబడున్
ధారుణిభవ్య కూర్మతియనన్ దగు శైలమునన్ వసించు ల
క్ష్మీరమణుండు మిమ్ము పరికించి శుభంబులొసంగి ప్రోవుతన్.

---

## ౩౮౮

## చెలీ!

శ్రీ వానమామలై లక్ష్మణాచార్యులు గారు

ఉ. కొమ్మను వంచెదేలనె నికుంజము నందలి ముద్దు గ్రుచ్చగాఁ
గొమ్మరో పూవుఁ దేనియలఁ గ్రోలెడు తుమ్మెదఝుమ్ము ఝుమ్మనన్
గమ్మని వాసనల్గొనఁగఁ గాంక్షయొకించుక గల్గుగాక దా
నిమ్మఫలంబు జీల్చు శుకనిష్ఠను గాంచ రుచించునే చెలీ!

శా. గాలిందూలుచు లేగొమ్మల గదలి మూకల్ మూకలై జారుచున్
వ్రాలన్ బూవులగుత్తులల్లవె యటన్ వ్రాలెన్ దలల్ క్రిందుగాన్
జాలింబొందదె నీ యెడందకనుచున్ సంతోషముం జెందెనో
పూలంగోయఁగ నుద్యమించితివె నబ్బో! యెంతయున్ ధీరవే!

# బంధములు

## ౩౫౦
## హారబంధః

శ్రీ తిరుమల బుక్కపట్టణాం రంగాచార్యులు గారు

శ్లో. శూరోధీరోవిరోషోసమశమరమణీయోమహామంజుమత్తే
భోస్సాశ్రీసౌఖ్య సాధోధికసుకనకవార్ శ్రీకరఃకల్పకల్పః
మారాకారాభిరామో ఘనజనవనవర్తీ శితాశిల్పశిక్షః
శ్రీమార్గధీమార్గ సమానోహ్యానఘనవనయః శ్రీకరఃకల్పకల్పః

---

## ౩౫౧
## వ్యాళీ బంధః

శ్రీ కిడాంబి శాపురం రంగాచార్యులు గారు

శ్లో. మత్యానిత్యానుతామేశ్రితహితనుతతా శౌరిణారికల్తిప్సా
సీతాజాతాహితాయప్రథమమథనృణాంయావిదేహేషుభూమేః
సేయంశ్రియస్త్రియష్షుహ్యాదయాదరదళత్పద్మమధ్యాసమానా
సాత్రేతేయేరంగనాథే కవికులతిలకే నిత్యగత్యాసమిద్ధే.

---

## ౩౫౨
## గోమూత్రికాబంధము

శ్రీ ఆమన్గల్లు హనుమంతరావుగారు

క. దరధర నారదవినుతా
సురనుత శ్రీహరిసురారి సుతపరిపాలా
పురహర తారకవినుతా
వరసుతవాహయసురారి వ్రతపరిపాలా.

---

## ౩౫౩
## క్షూరబంధః

శ్రీ రే. వే. కృష్ణరావు గారు

శా. పక్షశ్రీయుత వేంకటేశ్వర ధరావర్యాగ్రణీ శారదా
నక్షత్రేశ్వర కల్పభాసురయశా నాకస్థ సంరక్షణా
రక్షోఘప్రకటాద్రి రాడ్ధర శతారావిద్రుమాంచత్సదా
దాక్షిణ్యావన వానరేశ్వర నిషాదావారణాసుప్రదా.



## ౩౫౪
## చిత్రకవిత్వము

శ్రీ గుండా రాజలింగకవి గారు

క. గిరిధర శరకరుణాకర
నరహరిహర నందివాహ నాగసుహారా
శరణాగత రక్షకనను
కరుణించఁగలోఁదలంచు కాయజహరణా. ౧

పురహరశంకరా భుజగభూషరమాధవ పూజితార్యశాం
కరివరదాశివా సుగుణకారణ యీశ్వర శుభ్రదేహసుం
దరగిరిమందిరా సురనుతా పరదానవ శోషభర్గ బం
ధుర సుగుణాకరాశరధితూణ శుభాకర శత్రుశోషణా. ౨



# కవి పరిచయము

సంకేతములు

జ. స్థా. జన్మస్థానము
జ. జననము
వ. వయస్సు
తా. తాలూకా
జి. జిల్లా

సంకేతములు

బి. బిరుదు
మ. మరణము
కు. కులము
ము. ర. ముద్రిత రచనములు
అ. ర. అముద్రిత రచనములు.



౧

## శ్రీ॥ శ్రీ॥ శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాల యతీంద్ర మహాదేశికులవారు

వీరి గృహస్థాశ్రమమునందు వనపర్తి సంస్థానములో ధర్మాధికారులుగా నుండి శ్రీమాన్ హొసదుర్గం॥ కృష్ణమాచార్యులవారని నామధేయము గలవారై యుండి-పరిష్కృత-గ్రంథములను రచియించినవారు-౧౫ ఏండ్ల క్రిందట పరమపదించిరి. బి. విద్వత్కవి సార్వభౌమకవి గండభేరుండాదులు.

ముద్రితాముద్రిత రచనలు

శ్రీపరకాలగురు విజయము-ఉత్తరపరకాలగురు విజయము-రామేశ్వర విజయము-రఘునాథ విజయము-శ్రీనివాస విలాసము-రంగరాజ విలాసము-నృసింహ విలాసము-కార్తికోత్సవదీపికా-కేశవోత్సవమాలికా-శ్రీలక్ష్మీసహస్రం-రసాస్వాదిని-ఆచార్య వేదపాదస్తవ వ్యాఖ్యానము-నవరత్నహారస్తవ వ్యాఖ్యానము-కావ్యోత్కృష్ట రక్షా-సరస్వతీ మాల ధనము-శ్రీకృష్ణ జయంతీ పౌర్వాపర్య నిర్ణయము-శిష్టసిద్ధాంత పద్ధతి-శూద్రాశీర్నిర్ణయము-కర్మక్రమ నిర్ణయము-స్వయం వ్యక్త ప్రతిష్ఠా నిర్ణయము-అధికమాసోత్సవనిర్ణయము-సోదర కన్యాద్వయ వివాహ నిర్ణయము-అతిక్రాంత శ్రాద్ధకాల నిర్ణయము-వివాహకాల నిర్ణయము-ప్రపన్నాభరణము-అలంకార మణిహారము-వృత్తిముక్తాహారస్తుతివ్యాఖ్యానము-విజయదశమీ నిర్ణయము-నూతనోపాకర్మ నిర్ణయము-సుభద్రా పరిణయము-విక్రాంత రాఘవము-ఉన్మత్త పాండవము.

స్తోత్రములు

ప్రపన్నానందస్తవము-ప్రపన్నామృతస్తవము-శ్రీరామ వేదపాదస్తవము-శ్రీనివాస వేదపాదస్తవము-దేశికేంద్ర వేదపాద స్తవము-ఆచార్య వేదపాదస్తవము-నవరత్నహారస్తవము-చపేటాహతిస్తుతి-శ్రీరామ సుప్రభాతము-శ్రీహయగ్రీవ సుప్రభాతము-శ్రీగోపాల సుప్రభాతము-శ్రీ రంగనాథ సుప్రభాతము-సూర్యదండకము-ఆచార్య గద్యము-వేదాంతదేశిక సుప్రభాతము-శ్రీ హయగ్రీవ పంచరత్నస్తవము-శ్రీలక్ష్మీ పంచరత్నస్తవము-శ్రీనారాయణాష్టకము-శ్రీ సంపత్కుమారాష్టకము-శ్రీ రామాష్టకము-పంచాయుధ స్తోత్రము-శ్రీనివాస నవరత్నమాల-లక్ష్మీ నవరత్నమాల-అలంకరణ మాలికా-కావేరీ లహరీస్తుతి-ప్రపన్నసౌభాగ్యము-వృత్తముక్తాహారస్తుతి-నేత్రోల్లాసము-ధర్మానుశాసనము-ఆళవందార్ స్తోత్రము-జితంతే స్తోత్రము--చామరాజేంద్ర దాశీర్నవరత్నమాలిక.

వివిధ గ్రంథములు

ఆహ్నికరత్నము-శ్రీ మద్భాగవత సప్తాహాహ్వానపత్రిక-నవ్యోపాకర్మ నిర్ణయము-మేఘమాల-సమయామృతము-సూర్యోపరాగ దర్పణము-రాజవంశరత్నావళి-కల్యాణగీతమంజరి-ఉత్తరరంగమాహాత్మ్యము-మదనగోపాల మాహాత్మ్యము-శ్రీరామాయణ వైభవము-ఆరాధనక్రమము-స్వస్తి వాచనము"శ్రీపరకాల శ్రీమఠ శిలాశాసనశ్లోకావళి-ఉత్తర రంగనాథా"ధ్యయ నోత్సవమంటపశిలాశాసన"ఉత్తర రంగనాథ మహాద్వార గోపుర శిలాశాసన శ్లోకావళి-శంక

రాం బాసముద్ర శిలాశాసన శ్లోకావళి - శంభురహస్యం - శ్రీనివాససుప్రభాతం - పేరోద్దిష్టాక్ష్యన్నభోక్తృ ప్రాయశ్చిత్తాది నిర్ణయము - శ్రీశరదంబుజమాలా - శ్రీసర్వజ్ఞ కుసుమమాలా - శ్రీ రామచంద్ర మంగళమాలికా - శ్రీ దశావతార స్తుతిః - శ్రీమజ్జార్జి చక్రవర్త్యాశీర్మాలికా - తిరుపతి వెంకటేశ్వర గోవింద నామములు -

౨. కీ. శే. హూసదుర్గం

వేదాంతాచార్యులు గారు

వీరు శ్రీపరకాలస్వాముల (నంబరు ౧) సహోదరులు. గద్వాల సంస్థాన ధర్మాధికారులుగనుండి ౨ మాసములక్రింద గతించిరి.

జననము. శా॥ శ॥ ౧౭౬౮ రసం॥ శుభకృత్సంవత్సర మాఘ శు. ౫లు. వయస్సు ౯౦ ఏండ్లు. భావసం॥ శ్రా॥ ౩ పరమపదించిరి.

ము. ర. శ్రీకృష్ణ బ్రహ్మతన్త్ర్యార్య వేద పాదస్తవము ముద్రితము.

అ. ర. ఆచార్యవైభవాదులు జ. స్థా. వనపర్తి జి. మహబూబునగరము.

౩. సుదర్శన తిరుమలాచార్యులు

వీరు సుమారు ౮౦ ఏండ్ల క్రిందట మృతించిరి. జ. స్థా. కలువకోలను గ్రామము తా. నాగరకర్నూలు జి. మహబూబునగరము అ. ర. మైథిలీపరిణయముకవి వంశ్యులగు సుదర్శనం పురుషోత్తమాచార్యులు కొండాపుపల్లె గ్రా॥ మం. తా. నాగరుకర్నూలుగారివద్ద యున్నది.

౪. కీ. శే. హూసదుర్గం

కృష్ణమాచార్యులు గారు

వీరు. (నంబరు ౨) కుమారులు. జ.-శా. శ. ౧౯౦౧ ప్రమాది. సం॥ ఆషాఢబ౩లు. తన ౧౯వ ఏట పరమపదించిరి.

బి. ,,కవికులతిలక'' జ. స్థా. వనపర్తి జి. మహబూబునగరం

ము. ర. (౧) శ్రీనివాససుప్రభాతము
(౨) శ్రీహయగ్రీవవదన ప్రాబోధిక స్తుతి.
(౩) ప్రసన్నానందలహరి
(౪) శ్రీకృష్ణ పంచరత్నమాల
(౫) నవరత్నమాల

అ. ర. ఆచార్యగద్యములు.

౫. ఆచి రాఘవాచార్య శాస్త్రులు

జ. బహుధాన్యసం॥ చైత్ర బ॥౭ వ: ౫౬

జ. స్థా. అప్పునూరు. తా॥ సిరిసిల్లా జిల్లా కరీంనగరు

బి: ఆంధ్రగీర్వాణ వాణీప్రవీణ

అ. ర. (౧) శ్రీనివాసప్రసాదము
(౨) ప్రపత్తి పారిజాతము
(౩) అధ్యాత్మహారావళి

౬. వారణాసి రామయ్యగారు

హరిదాసు

జ. స్థా. సికిందరాబాదు

వ. ౬౨ సంవత్సరములు.

ము. ర. [౧] శ్రీరామాచల పూర్ణబోధ
[౨] దత్తాత్రేయ పంచవింశతి
[౩] శ్రీరామ మానసిక పూజ
[౪] బమ్మెరపోతరాజ విజయము
[౫] అచల హరిశ్చంద్రోపాఖ్యానము

అ. ర. [౬] అభినవ ప్రహ్లాదోపాఖ్యానము
[౭] ధ్రువోపాఖ్యానము
[౮] సర్వమతసార సంగ్రహ చరిత్ర
కొండా వేంకట రంగారెడ్డిగారి యాస్థానకవి.

౭. శ్రీ వెల్లాల శివరామ శర్మ

వ. ౩౦ సంవత్సరములు.

జ. స్థా. అయ్యవారిపల్లె గ్రామం. జటప్రోలు సంస్థానము. మహబూబునగరు:

వీరు సుప్రసిద్ధులైన కొల్లాపురాస్థాన పండితులైన కీ. శే. వెల్లాల సదాశివ శాస్త్రులవారికుమారులు.

౮. శ్రీ పత్రి సత్యనారాయణ శాస్త్రిగారు

జ. స్థా. కొల్లాపురం. జటప్రోలుసంస్థానము. జి. మహబూబునగరు

వీరితండ్రిగారును కవులు.

౯. సిరివెల్లి విశ్వనాథశాస్త్రి గారు

వ ౨౮.

జ. స్థా, కొల్లాపురము (సంస్థానం) జి. మహబూబునగరు.

ము. ర శ్రీశైలరాజమౌళీశ్వర తారావళి
అ. ర మదనగోపాల స్తవము.

## ౧౦. వలిపె వేంకటరావుగారు వకీలు

జ. స్థా. కొల్లాపురము జి మహబూబు నగరు.

వ. ౪౦.

అ. ర. [౧] భగవత్ప్రార్థన
[౨] లక్ష్మీస్తోత్ర నక్షత్రమాల

## ౧౧. కీ. శే. బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులు గారు

౭ తరములుగా నివంశమువారు కవులు. సుప్రసిద్ధులైన కిరీటి వెంకటాచార్యులు వీరిపూర్వులలోనొకరు. వీరు ౭వసంవత్సరమునుండియే కవితచెప్ప నేర్చిరి. ౧౫వయేట బాలకవియను బిరుదమందినారు. తర్వాత మైసూరు సంస్థానమందు బాలసరస్వతీ బిరుదమందినారు నవద్వీపములో తర్కతీర్థబిరుదమందినారు ఉత్తర హిందూస్థానములో దర్భాంగ, జోధపూరుబుందీకత్తియా. గ్వాలియర్, జ్యోతిపురము, కోటాంజు, ఇందూరు, ధారానగరు జమ్మూ మున్నగు ననేకసంస్థానములలో దిగ్విజయము గాంచినారు. ప్రాకృతములు, సంస్కృతము ఆంధ్రము ఈ అష్టభాషలలో ఆశుధారగా శతఘంటము చేయువారు బళ్ళారి మద్రాసు, కడప ప్రొద్దుటూరు. బనగానపల్లె, పెనుగొండ తాటిపర్తి. సురపురము. అనెగొంది మున్నగుస్థలములలో చాల యవధానములుచేసినారు. బహుగ్రంథకర్తలు విశేషముగా సంస్కృతమందు వ్రాసినారు.

[౧ శతఘంటావధానములు
[౨] శ్రీనివాసవిలాసము
[౩] వీరశైవ శిరస్థానము
[౪] దుర్విగ్రహనిగ్రహము
[౫] నంజరాజపరిణయ చంపు
[౬] తత్వమార్తాండ ప్రభాపటలము
[౭] కిరీటివేంకటాచార్య విజయ వైజయంతీ నాటకము
[౮] రాజవంశ రత్నావళి
[౯] లక్ష్మీసరస్వతీ దండకములు

వీరివి ముద్రితగ్రంథములు చాలకలవు. వీరికుమారులగు జాతకవిద్వన్మణి తిరుమల వేంకటాచార్యులు [ఆత్మకూరు సంస్థానము వారివద్దనున్నవి.

జననము ౧౭౯౫ శా. శ. మన్మథ చైత్రబ౯లు మరణము ౧౮౪౧ శా. శ. సిద్ధార్థి ఫాల్గుణ శు౧౪ లు.

వీరినివాసము-ఆనుకచింత-వయస్సు ౫౮ సం॥ ఆత్మకూరుసంస్థానము మహబూబునగరం జిల్లా

ఆంధ్రదేశమంతటను వీరినెరుగని పండితులుగాని పత్రికలుగానిలేరు. ఆంధ్ర నాటక పితామహులగు ధర్మవరము కృష్ణమాచార్యులు ఉత్తర హిందూస్థాన హిందూ సంస్థానక విద్వాంసులను నానావిధముల శ్లోకరూపమునను, పద్యరూపమును వీరిని స్తుతించియుండిరి. హిందూ మద్రాసు మెయిల్, స్టాండర్డువంటి ఆంగ్లపత్రికలును వీరి ఆశుకవితను గాంచి యమృతపడి అనేకవిధముల శ్లాఘించియుండిరి

## ౧౨. కంబము వీరరామయ్యగారు

జ. స్థా. బాలనగరము. మహబూబు నగరు జిల్లా

కు. వీరశైవమాహేశ్వరుడు

ఆంధ్రశైవ పురాణముల రచయిత.

నవాబ్ ఖాజాఅంవల్లాఖాన్ బహద్దరు గారిజాగీరగు రావికల్ దగ్గరనున్న రామేశ్వర క్షేత్రాధీశ్వరుండగు శ్రీరామ లింగేశ్వరుని యనుగ్రహమువలన తన పక్షపాత వ్యాధినుడుగుటచే రామలింగశతకమును రచియించి ౧౯౨౪ క్రీ. శ. లో ప్రకటించెను. శతకమంతయు నంత్య ప్రాసతో సలక్షణముగనున్నది. ౩ ఏండ్ల క్రిందట వీరు కైలాసవాసులైరి.

## ౧౩. ఒద్దిరాజులక్ష్మీనరసింహారావుగారు

జ. విళంబి. ఆషాఢశు౫, వయస్సు ౩౭ సంవత్సరములు.

జ. స్థా. ఆలంఖానుపేట తా॥ మహబూబాబాదు జి. వరంగల్.

అ. ర. [౧] భక్తసత్యకీర్తి } నాటకములు
[౨] దయావీరుడు }

కు. గోలకొండ నియోగులు.

౧౪. పుల్లగుమ్మి శ్రీనివాసాచారిగారు

జ. స్థా. గద్వాల. రాయచూరు జిల్లా.
వ. ౪౧ సంవత్సరములు.
ము. ర. వేదపాదస్తవము
సంస్కృత భాషా బోధిని
౨ భాగములు
అ. ర. సంస్కృతవాచకములు ౪ భాగములు భారతసంగ్రహము } ఇందు ౨ భాగములు ముద్రితములు. అముద్రితము.
సం. [౨౦౯] వాటికనూరులు.

౧౫. నంబాకం రాఘవాచార్యులు గారు

జ. స్థా. వనపర్తి జి. మహబూబునగరు
వ. ౩౦ ఏండ్లు;
అ. ర. సంకీర్తనశ్లోకములు

౧౬. చక్రహరి నరసరాజుగారు

జ. స్థా. పెంట్లవెల్లి గ్రామం జటప్రోలు సంస్థానము. మహబూబునగరు జిల్లా.
వృత్తి. హైకోర్టువకీలు.
కు. ఛ్రటాజు.

౧౭. ఆవుల పురుషోత్తమదాసు గారు

జ. స్థా. నెలకొండపల్లి గ్రామము తాలూకా ఖమ్మముమెట్టు వరంగల్ జిల్లా
వ. ౨౨ సంవత్సరములు
అ. ర. భగవన్నుతి,

౧౮. మాచేటి వరవరరావుగారు

జ. స్థా. నార్లజాగీరు జి.
ము. ర. గోపాల చూడామణి శతకము.

౧౯. శ్రీ ధర్మవరము మణిమణి హరిగోపాల సూరిగారు

జ. స్థా. ధర్మవరము గ్రామం. గద్వాల సంస్థానము.
వ. ౨౫
కు. చాత్తాని వైష్ణవుడు
అ. ర. వెంకటేశ్వరశతకము [అచ్చు తెనుగు]
ఈకవి తాతపేరు గోపాలయ్య అతండును కవియే

౨౦. కీ. శే. కొండా యల్లయ్యగారు

జ. వ్యయ సం॥ శ్రావణ శు. ౫ ౧౮౭౬
జ. స్థా. హైద్రాబాదు నగరము-మాను
మ. ౧౯౦౩ క్రీ. శ.
ము. ర. సుందరకాండము
[౨] గీర్వాణపారాయణ గ్రంథము
అ. ర. [౧] శ్రీ దశరథరామశతకము
[౨] శ్రీరామకీర్తనలు.
కు. పద్మశాలి.

౨౧ జొన్న ఎల్లారెడ్డిగారు

జ. స్థా. భువనగిరి (నల్లగొండజిల్లా) లోని కొల్లపల్లియను గ్రామము. ౬౦ సం॥ వయస్సు. ప్రస్తుతము గౌరాయపల్లె (భువనగిరి తా॥ లో నున్నారు.
ము. ర. [౧] కాశీశతకము [౨] శ్రీగురు మానసపూజావిధానము [౩] శివపూజావిధానము [౪] సద్బ్రాహ్మణ శతకము.

౨౨. అర్చకం పెరుమాళ్లాచార్యులుగారు

జ. స్థా. పెద్దమందడి గ్రామం మహబూబునగరం జిల్లా [వనపర్తి పోస్టు]
ము. ర. వివేకవిజయము
వీరి పెదతండ్రిగారు వనపర్తి సంస్థాన స్థానకవులైన అయ్యమాచార్యులు పెద్దమందడి చెన్నకేశవ విలాసమును, రామేశ్వరవిజయమును ఆంధ్రకౌలామృతమును, గద్వాల చెన్నకేశవశతకమును రచించిరి.

౨౩. కొండపర్తి వీరమల్లుగారు

జ. స్థా. రామన్నపేట జి. వరంగల్
కు. పద్మశాలి
వ. ౩౪

౨౪. చాగంటి భాస్కరలింగము గారు

జ. స్థా. వరంగల్
వ. ౨౨
కు. బ్రాహ్మణుడు

౨౫. ముదల్‌ఘుర నరహరిరావు గారు

జ. స్థా. ఎల్లమ్మబజారు-వరంగల్
వ. ౨౫ సం॥
కు. బాహుసార క్షత్రియుడు

**౨౬. అత్తలూరు విశ్వనాథ శాస్త్రి గారు**

జ. స్థా: వేములవాడ తా॥ సిరిసిల్ల, జి. కరీంనగరు

వ. ౨౬

వీరివంశ మూలపురుషుడు. శరభాంకుడు అత్తలూరిపాపకవి మొ॥ కవులు శరభాంకలింగము చెన్నబసవపురాణ కర్త

**౨౭. వట్టెము పాపకవిగారు**

జ. స్థా. వట్టెము గ్రామం తా॥ నాగరకర్నూలు జి. మహబూబనగరం

కు. నంబి

జ. ౧౨౮౨ ఫ. మ: ౧౮ సంవత్సరముల క్రిందట

ఆ. ర. ఆనంద రామాయణము

కానియా గ్రంథము తద్వంశీయుల అశ్రద్ధచే ...లులో పోగొట్టుకొని పోయినదట ఇదిగాక [౧] తులాభార నాటకము [౨] తిమ్మాజీపేట హరిశ్చంద్ర నాటకము [౩] సీతారామాంజనేయశతకము [౪] శ్రీనివాసశతకము ఇవి కవిగారి కుమారులవద్ద నున్నవి.

**౨౮. మరితాటి వేణుగోపాలాచార్యులు గారు**

జ: స్థా. అమరచింత-ఆత్మకూరు సంస్థానము

వ. ౧౭

ఇతడు నం (౧౩) మనుమడు

**౨౯. కవితార్కికసింహాచార్యులు గారు**

జ: స్థా: అమరచింత ఆత్మకూరు సంస్థానము

వ. ౨౧

జాతకవిద్వన్మణి తిరుమల వేంకటాచార్యుల కుమారులు.

**౩౦. శిలిగం జగన్నాథంగారు**

జ: స్థా. రుద్రంకోట స్కూలుమాష్టరు కుక్కనూరుపోష్టు పాల్వంచ సంస్థానము

**౩౧. మేల్నాటి లక్ష్మయ్యగారు**

వ. ౫౮

జ. స్థా: దౌలతాబాదు తా॥ కోడంగల్ జి: గుల్బర్గా

వీరు నం (౧౨౭) గారి కుమారులు

**౩౨. కీ. శే. రజాఅల్లి లక్ష్మణరాయడు గారు**

జ. స్థా: సీతారామపురము తా॥ జనూబీ జి: ఆత్రాపుబల్దా

ము. ర. (౧) నృసింహశతకం (౨) ప్రహ్లాద నాటకము.

కు. గోలకొండ వ్యాపారి.

మ. ౧౫ సంవత్సరముల క్రిందట

**౩౩. రంగానందస్వామి గారు**

జ. స్థా. బొందుగుల గ్రామం తా॥ భువనగిరి జి. నల్లగొండ

వ. ౩౬

కు. చాత్తాని వైష్ణవులు

**౩౪. గుండ్లా రాజమౌళి గారు**

జ స్థా; హనుమకొండ-ఒరంగల్ జిల్లా

వ. ౪౧

ఆ. ర. సిద్ధేశ్వరకీర్తనలు. సోమేశ్వరభజనలు.

వీరివంశమందు ఫణికుండల రాజమౌళి మున్నగు కవులుండిరి.

**౩౫. కీ. శే. కేశవపట్నం నరసయ్య గారు**

జ: స్థా. రామన్నపేట తా॥ భువనగిరి జి. నల్లగొండ

ము. ర. జీడికంటి రామశతకము

ఆ. ర. నాంపల్లి? వానకొండ నృసింహ శతకము నిరోష్ఠ్య నారాయణసంఖ్య

మ. ౫ ఏండ్ల క్రిందట

**౩౬. యస్. బి. రాములుగారు**

జ స్థా. నల్లగొండ

వ. ౨౭

౩౭. భట్టరాజు రామకృష్ణయ్య గారు

జ. స్థా. ఇప్పటూరు జి మహబూబు నగరం

ము. ర. శ్రీకృష్ణోత్తర శతనామావళి-శత కము

౩౮. ధర్మపురి

సత్యనారాయణాచార్యులు గారు

జ. స్థా. ఓజవెంగి-ఎల్లంముల టప్పా జి కరీంనగరము

బి. అష్టావధాని-విద్వాన్

౩౯. శ్రీ రామార్చాల

రామాచార్యులు గారు

జ స్థా. మార్చాల తా|| కల్వకుర్తి జి. మహబూబునగరం

వ. ౩౦

ఇతను మంచి చిత్రలేఖకుడు

వీరిచిత్రలేఖనములు సుజాతమున్నగు మాసపత్రికలందు ప్రకటింపబడెను. ఇంకను అము ద్రితములైనవి చాలకలవు. ఈసంచికాముఖపట ము వీరువ్రాసినదే.

౪౦. కీ. శే. అక్షింతల సింగరశాస్త్రి

గారు

జ స్థా. అయ్యవారపల్లె-జటప్రోలు సంస్థానము జి. మహబూబునగరు

వీరుసుప్రసిద్ధులైన అక్షింతల సుబ్బాశాస్త్రిల రెండవకుమారులు వీరు గద్వాల వనపర్తి ఆత్మకూరు వేంకటగిరి సంస్థానములలో గొప్ప పండితగౌరవము నొందిరి.

అ. ర. [౧] భాష్యరత్నఖండనము [౨] ద్వాదశమంజరీ స్తోత్రములు

అన్నపూర్ణాష్టకము మొదలగు స్తోత్రములు చాలరచించిరి కడపలోని వేదాంతసభలో పరీక్షాధికారులుగా కొన్నియేండ్లుండిరి

మ. విశ్వావసు సంవత్సరములో

౪౧ కే. యామునాచార్యులుగారు

జ. స్థా. గద్వాల రాయచూరుజిల్లా

వ: ౪౩ సం||

ము: ర: [౧] జానకీపరిణయము

[౨] కల్యాణి

౪౨ మార్చాల రంగాచార్యులుగారు

జ: స్థా: మార్చాల తా: కల్వకుర్తి జి: మహబూబునగర్

నం ౩౯ గారి అన్నగారు వీరిపద్యములు క-వ-ట-త-వ" వర్ణాక్షరముల కలియికలేకుండ కూర్చబడినవి.

జ. విజయ-ఆషాఢ శు-౫

అ: ర. (౧) నిరోష్ఠ్యకృష్ణశతకము [౨] ఆపంచకర్ణియతారాహారము [౩] దివ్యసూరిచరిత్రము (౪) అభినవశిరోమణి నాటకము మున్నగునవి:

అనూరకారంచేసు హరితాన్వయ తిలక వేదవేదాంత విద్యాప్రవీణ శ్రీ విద్వాన్ అనంతాచార్యులవారు వీరియన్నకుమారుసులు—

౪౩. కీ శే|| కాళ్లూరి రాజేశ్వరరావుగారు

జ. స్థా అన్నపురెడ్డిపాలెము గ్రామము తా|| మధిర జి. వరంగల్లు

కు. నియోగి బ్రాహ్మణులు భద్రాచలం తలూకాలో పెనుబల్లిగ్రామం వీరికిజాగీరు.

తండ్రిగారుకోగ రాయదీక్షితులు గొప్ప సంస్కృతపండితులు ఒకధర్మశాస్త్రము వ్రాసియుండిరి: అదియసంపూర్తియగుటచే వీరు పూర్తించియుండిరి.

అ. ర. "వేంకటేశ్వరశతకము"

వీరు కొలదికాలముక్రిందటనే గతించిరి:

౪౪. కీ. శే. వేంకటగిరి

రామాచార్యులు గారు

జ: స్థా. గద్వాల జి: రాయచూరు

మ. సుమారు ౩౫ సం|| క్రితము

వీరికి గద్వాలలో "అభినవాంధ్ర కవితా పితామహుడు" అని బిరుదు లభించియుండెను

౪౫. శ్రీ ముడుంబ

రామానుజాచార్యులు గారు

జ స్థా: అంబాల (టప్పా అంబాల) తా|| హుజూరాబాదు జి|| కరీంనగరు

వ: ౭౦

అ. ర: వేంకటేశ్వరశతకము- కదంబిని (నవల)-ప్రేమచాంచల్యము (నవల)-రమానంద స్మృతి-పద్యములు

## ౪౬. తిరువాయిపేట రంగయ్య సూరిగారు

జ: స్థా. కందుకూరు తా॥ మధిర జి: వరంగల్

## ౪౭. విఠాల చంద్రమౌళి శాస్త్రి గారు శతావధాని

జ. స్థా. గజవెల్లిగ్రామం (ఉప్పా) సిద్దిపేట తా॥ మెదకు జిల్లా

వ: ౩౦

ము. ర: భక్త విజ్ఞప్తి ౨ భాగములు

అ. ర. భక్త విజ్ఞప్తి ౩వభాగము కుశలవాదినాటకములు.

బి: శతావధాని

## ౪౮ శ్రీ జ్ఞానమాంబగారు

జ. స్థా. ఖమ్మంమెట్టు జి: వరంగల్

„నాభర్త పేరు సూర్యనారాయణుండగుటచేతను నాయుపాస్యదేవత సూర్యనారాయణుండగుటచేతను వీరియందు నాకుగల ప్రేమచేతను „ద్వ్యర్థి"గా సూర్యనారాయణయను మకుటము చేవ్రాసితిని" అని కవయిత్రిగారు వ్రాసినారు

## ౪౯. ఉత్పల వేంకటరావుగారు

హజారి వేంకటరావుగారని యందురు.

జ. స్థా. భువనగిరి జి. నల్లగొండ

వ ౩౮ సం॥ శోభకృతు కార్తికము.

బి. „సదాసనయోగి" అని తనగురువుగారిచే సేయబడినది —

ము. ర: ౧: శ్రీరామ పూజావిధానము_ ౨. శ్రీరామభజనావళి, ౩: శ్రీరామనామ మహిమ౪. పరమాత్మభజనావళి ౫.ఓంకారమహిమ ౬:హనుమద్దండకము

అ: ర: ౧: ప్రేమగీతాంజలి ౨, ఆత్మవిద్య ౩. యోగాభ్యాసము

కు: క్షత్రియవంశము

## ౫౦. ముదిగొండ విరూపాక్షకవిగారు

వ: ౨౬

జ: స్థా: నవాబుపేట

నివాసము జనగామ_వరంగల్ జిల్లా

ము: ర, సోమశేఖరశతకము

బి: శాంకరి—

## ౫౧. కీ. శే. శ్రీధర కృష్ణశాస్త్రిగారు

వీరు జటప్రోలు సంస్థాన పండితులుగా నుండిరి.

జ: స్థా: అయ్యవారిపల్లె జటప్రోలు సంస్థానము

మ: సుమారు ౧౫ ఏండ్ల క్రితము

## ౫౨. కీ. శే. కోట్రికె పుల్లయ్యగారు

జ. స్థా. కొడంగల్ జి. గుల్బర్గా

వ. ౪౦

మ. ౧౮౫౨ శా. శ.

అ. ర. (౧) గయోపాఖ్యాననాటకము (౨) రసికజన మనోరంజనము

## ౫౩. లక్ష్మణసింగుగారు

జ. స్థా. నేలకొండపల్లి తా॥ ఖమ్మం జి. వరంగల్

కు. రజపూత్

వ. ౫౨

అ. ర. కేశవశతకము వీరిది ఉత్తర హిందూస్థాన రాజపుత్ర తిలకుచందుకవితకము.

## ౫౪. అయిత్నేని గోపాలరావు గారు

జ. స్థా. మూడేపల్లిగ్రామము తా॥ సిరిసిల్లా జి. కరీంనగరు

వ. ౬౪

మ. దుర్మతిసం॥ వైశాఖ బ॥౮

కు. వెలమ

ము. ర. శ్రీరామ శతకము_రఘువీర శతకము—

## ౫౫. బి. లక్ష్మీనరసమ్మ గారు

జ. స్థా. రామాయంపేట తా॥ అంబరుపేట

కు. చాత్తానివైష్ణవము

వ. ౩౦ వితంతువు

అ. ర. (౧) స్త్రీల పాటలు (౨) భక్తవత్సలశతకము

౫౬. బచ్చు రామన్న గుప్తగారు

జ. స్థా. సదాశివపేట
జి. మెదకు
వ. ౫౮
కు. కోమటి
సంస్కృతాంధ్ర కర్ణాటక మహారాష్ట్ర పార్శీ భాషలందు పాండిత్యము కలవారు
ము. ర. నవనాథ చరిత్రము
అ. ర. కీచకవధ నాటకము-శ్రీరామప ఉష్ట శతకము

౫౭. భాగవతము సీతారామశర్మగారు

జ. స్థా. మెదకు
ము. ర [౧] వినాయక చతుర్థి పద్యములు [౨] సంగీతరత్నావళి — ,, [౩] అపనాయ [ప్రబంధము] [౪] దేవకీనందనతారావళి
అ. ర. పశ్చాత్తాపము నవల
పుష్పావతి ,,
ఈశ్వరసంకల్పము ,,
బాలబోధిని పద్యములు
ఆరోగ్యదీపిక ,,

౫౮. ముదిగొండ వీరేశలింగ శాస్త్రి గారు

బి. సాహిత్యవిద్యాప్రవీణ-విద్వాన్
జ. స్థా. ఓరుగల్లు
వ. ౩౧ [క్రోధి ఆశ్వ॥ శు॥ ౯
ము: ర. ౧. కాశీసారము ౨: సంభవకాండము ౩: శంకరాచార్యచరిత్రము ౪: శైవసిద్ధాంతదర్పణి
అ:ర: ౧. రాజరాజేశ్వరశతకము ౨: కాశీశ్వరమాహాత్మ్యము ౩: ఆచార్యవిజయము ౪. అగస్త్యేశ్వరశతకం ౫: హరిహరతారతమ్యము ౬: సుందరి [నాటకం] ౭: శివపురాణము

"మాపూర్వులు నిజాము రాష్ట్ర వాసులు: వారు నల్లగొండజిల్లా దేవరకొండ తాలూకాలో చేరిన ముదిగొండగ్రామము నివాసముగా జేసికొని యుండిరి. అందువల్లనే మాయింటిపేరు ముదిగొండవారు" అనివచ్చినది అని కవిగారు వ్రాసినారు.

౫౯. సముద్రాల రామానుజాచార్యులు గారు

సీ॥ జన్మమాదాతృత్వసజ్జనానీకమైన రాట్సన్నుత నిజాంరాష్ట్రమందు! ... మహావిబుధసంక్రాంతమై యుత్తర శిరరిగమన ... శ్రీకోరుట్ల! గోత్రమా విమలచారిత్ర శ్రీవైష్ణవసన్నుత వాధూలసాన్వయుంబు! పాయనా శ్రీ చిత్రభానువరాదిగా భవదరమునకు నేడయ్యె! అతులితౌదార్య శ్రీనివాసార్య ... తాతుండు శ్రీపరాంకుశవరాత్మ! జాటుమనక ... దేశిక మూర్తిసదయు! నైనరామానుజా ... దుయభిధ"
అని కవిగారు వ్రాసియున్నారు.

౬౦. ఘంటబట్ల వేంకట భుజంగ కవిగారు

జ: స్థా. మసలాపుర ... కడి పెద్దాపురం హోసు తా॥ ...
వ. ౩౯
ము. ర: అభినవ ... నాటకము
అ: ర: అధ్యాత్మ ... ౨. దమయంతీపరిణయము ౩ సీమంతినీప్రభావము

౬౧. రంగనాథాచార్యులు గారు

జ: స్థా. మారొచ్చలిగ్రామము తా॥ నాగర్కర్నూలు జి: మహబూబునగరు

౬౨. విక్రాల వేంకటాచార్యులుగారు

జ: స్థా. రాజనగరము వనపర్తి సంస్థానము జి. మహబూబునగరు
వ. ౪౫
వీరు కాశీలో కొన్ని యేండ్లు చదివినారు గొప్ప వైయాకరణులు

౬౩. పలివెల వేంకటఅప్పారావుగారు

జ. స్థా: కలకోట గ్రామం తా॥ మధిర జి. వరంగల్
జ: ౧౬-౧౦-౧౩౧౧ ఫ.
శా: నియోగి
అ. ర. ౧. దీనబంధు (పద్యములు)
౨. జానకి ,,
౩: పూర్ణానందము-నాటకము

౬౪. కీ. శే. గడ్డం రామదాసకవిగారు

వి. ఆశుకవిరత్న

జ. స్థా. సిద్దిపేట. జ-బహుధాన్య సం॥

మ. ప్రమోదూత

కు. పద్మశాలి

ము. గ్ర. కుచేలోపాఖ్యానము-కాళింగ మర్దన-ప్రభావతి-విప్రనారాయణ

అ. గ్ర. ౧. సత్యవర్మ చరిత్రము ౨. దుర్యోధన గర్వాపహరణము ౩. ఇంద్రసభ ౪. ద్రౌపదీవస్త్రాపహరణము ౫. కౌసల్యావివాహము ౬ మదాలస ౭. లక్ష్మణపరిణయము ౮. మాంధాతచరిత్రము ౯. సముద్రమథనము ౧౦. బ్రహ్మగర్వాపహరణము ౧౧. కృష్ణలీలా విలాసము ౧౨. రాధామాధవ విలాసము ౧౩. ఋతుధ్వజవిలాసము ౧౪. జలక్రీడలు ౧౫. జయదేవ చరిత్రము ౧౬. సత్యనారాయణ వ్రతము ౧౭ బిల్హణీయము ౧౮. వృత్రాసుర వధ. ౧౯. నళినీ విభాకరప్రబంధము.

౫-౬ సం॥ క్రితము చనిపోయినారు. వీరి చరిత్ర చాలచిత్రమైనది. ఆధునికులు విశ్వసింపరేమో! వీరినిగురించి స్థానికులిట్లు చెప్పుదురు. వీరి చిన్నతనములలో వీరి తలిదండ్రులు భద్రాచల యాత్రకుపోయిరి. తానును భద్రాచలము పోవుదునని హఠము చేయగా బంధువులితనిని నొకగదిలో బంధించిరి. కాని మరునాడెట్లో తప్పించుకొని గ్రామమందలి శ్రీరామ దేవాలయములో దాగెను. ఆనాడు రాత్రి యాగ్రామకరణము స్వప్నములోవచ్చి భాగవతము చదువుమని చేతికీయ తన కుచదువేరాదని చెప్పగా నాలుకపై యేవో బీజాక్షరములు వ్రాసిపోయెను. మరునాటినుండియే ఆశువుగా కవిత చెప్పుచు గ్రామములు సంచరించెను అచ్చ తెనుగునే కాక సంస్కృతమందును వీరుకవనమల్లినారు. వీరకవి. భగవద్వరప్రసాదలబ్ధమే కాని అభ్యసించి నేర్చిన విద్యకాదు. ఆశువుగా నుభయభాషలందు కవనమల్లువాడు. వీరిఅచ్చ తెనుగు సామాన్యముగా పండితులకే యర్థము కాదనుటకిందు ముద్రించిన పద్యములే సాక్ష్యమిచ్చుచున్నవి.

౬౫. నెమిలికొండ శ్రీ రంగాచార్య శాస్త్రి గారు

వి. అష్టావధాని.

స్వవిషయమై యిట్లు పద్యరూపముగా వ్రాసికొనినారు.

సీ॥ వాసవారాధ్య గవాణ దాసు జాగీరు. నారాయణపురంబు నయముతంబు। పాండిత్యమా బుధవర్య సన్మాన్యమౌ నాటకాలంకారపాటవంబు। కవనమా పద్యములవలీలగా గూర్చు నష్టావధానవిశిష్టితంబు। వాక్చయమా సభాభవనములందు పన్యాసోక్తి వైశద్య భాసురంబు। గోత్రమా భరద్వాజ పవిత్రితంబు। ప్రాయమా యిరువదియొకవత్సరంబు। ఆఖ్యయా శ్రీరంగాచార్యులంద్రుభువిని। బరిగిరికృపానాయకులా ప్రాజ్ఞులార.

౬౬. కీ. శే. మఠం రామయ్య గారు

జ. స్థా. బెక్కెము గ్రామం జటప్రోలు సంస్థానము జి. మహబూబునగరు

మ. ౫-౬ ఏండ్లక్రితము

ము. గ్ర. శివానందలహరికి తెలుగు నేత.

౬౭. జములాపురము వేంకట రామారావుగారు

జ. స్థా. ఎఱుపాలెముగ్రామం తా. మధిర జి. వరంగల్

వీరిపద్యములసంపుటి వెల్లంకి లక్ష్మీకాంతారావుగారు ఖమ్మంమెట్టు తాలూకా మధిరనివాసులవద్ద నున్నది.

౬౮. కీ. శే. పదిరెలక్ష్మణశాస్త్రిగారు

మ. దుర్మతి.

జ. స్థా. పదిరెమఖ్తా తా. శిరిసిల్లా జి. కరీంనగరు

వీరిరచితగ్రంథములు వీరికుమారులగు టి. కృష్ణశాస్త్రివారివద్ద నున్నవి.

౬౯. శ్రీ శాస్త్రిల వారి అనంతరామ శర్మగారు

జ. స్థా. లింగంపేట తా. ఎల్లారెడ్డి జి. నిజామాబాదు

వ. ౧౬

౨౦. ఏ. నరసింహారావు గారు

జ. స్థా గద్వాల జి. రాయచూరు

౨౧. టి. పాండురంగయ్య కవి గారు

వ. ౩౨

జ. స్థా. లింగాలగణపురము తా. జన్గామ జి. నల్లగొండ

ఆ. ర. వేంకటరమణ శతకము

కు. చాత్తాద వైష్ణవులు.

౨౨. కీ. శే. చెన్నమాధవుని పెరుమాళ్ల రాజుగారు

జ. స్థా. బచ్చన్నపేట తా. జన్గాం జి. నల్లగొండ

ఆ. ర. కృష్ణశతకము

సుమారు ౩౫ ఏండ్లక్రిందట చనిపోయినారు.

౨౩. కీ. శే. గంగు కృష్ణదాసు గారు

కు. వైదిక బ్రాహ్మణుడు

జ. స్థా, హనుమకొండ

మ. ౨౦ సం॥ క్రిందట

౨౪. శ్రీ కొండపల్లి రామచంద్రరావు గారు

జ. స్థా. కల్లూరుగ్రామం తా॥ మధిర జి. వరంగల్

వ. ౨౫

ఆ. ర, (౧) ముకుందమాల

(౨) లక్ష్మీనృసింహస్తోత్రము

౨౫. ఉమాపతి నాగయ్యగారు

జ. స్థా. సిద్దిపేట జి. మెదకు

వ. ౬౦

౨౬. కీ. శే. చక్రహరిఅచ్యుత రాజుగారు

వ. ౬౦

మ. మంచుభి

జ, స్థా. శిరిసిల్లా

జి. కరీంనగరు

ము. ర. శిరిశాలశతకము

౨౭. శివదేవుని వీరభద్ర శాస్త్రిగారు

జ. స్థా. రాజన్నపేట జి. వరంగల్

వ. ౨౪

౨౮. ఖండేరావు రామారావు గారు

జ. స్థా. కరీంనగరము

వ. ౯౦

వీరితండ్రికవులు. చాలగ్రంధములు రచించినారు. అన్నియు అముద్రితములు.

౨౯. బండి వేంకటరామా రెడ్డి గారు

బి. అష్టావధాని

జ. స్థా. కందుకూరు తా. మధిర జి. వరంగల్

వ. ౨౬

ము. ర. సుందరీతిలక. మరికొన్ని అష్టావధానములు

ఆ. ర. అచ్చ తెనుగు భారతము

శ్రీరామనాటకము

చెరసాల నాటకము

మాటపదార్ల శతకము

౩౦. గజవల్లి హనుమత్కవిగారు

జ. స్థా. అల్లాదుర్గము జి. మెదకు తా. మెదకు

ము. ర. మనోహర పద్మావతి-నాటకము

వ. ౩౧

౩౧. నేతి రామకృష్ణ శాస్త్రి గారు

జ. స్థా. పెంట్లవెల్లిగ్రామము జటప్రోలు సంస్థానము జి. మహబూబునగరు

వ. ౩౦

౩౨. పుల్లగుమ్మి అహోబలాచార్యులుగారు

జ. స్థా. గద్వాల

వ. ౩౨

ఆ. ర. సూర్యసిద్ధాంతసారము

అభినవతిథివల్లి

దృక్సిద్ధ గ్రహగణితము

వీరు సం (౩౦౯) గారి కుమారులు

౩౩. కీ. శే. వేంకటేశ్వరరావు గారు

కు. వెలమ

మ. భావ సం॥

యింటిపేరు-పాట్లపల్లి

జ. స్థా. పెండ్యాల జి. వరంగల్

ము. ర. హరిస్తుతి

## ౯౫. కీ. శే. శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీవాగీశ బ్రహ్మతంత్ర పరకాలయతీంద్రులవారు

పూర్వాశ్రమములో పురాణం నరసింహాచార్యులవారు: జ. స్థా. గద్వాల. గద్వాల రాజా సీతారామభూపాలరావుగారికి విద్యాగురువులు శిష్యునిగూడ సంస్కృతాంధ్ర కవినిగా చేసినవారు సంస్థాన ధర్మాధికారులు. అసమాన శతావధానులు. వీరికి తిరుపతి వేంకటకవులకును హోరాహోరిగా శాస్త్రవాదము జరిగెను. పరకాలపీఠ స్వాములైనతర్వాత శ్రీవాగీశ బ్రహ్మతంత్రనాములైరి.

రచనలు.

[౧] బ్రహ్మలక్షణ భూషణం [౨] సంసర్గదోష నిష్కృతి పరిష్కృతి [౩] తృతీయార్థవాదము [౪] శాస్త్రైక్య పరిశుద్ధిః [౫] సాధుసిద్ధాంతపద్ధతి [౬] తృతీయాదర్పణ విరోధవిధూననం [౭] విజయోద్యోతము [౮] నిర్ణయమహోదధి [౯] తృతీయాదర్పణం [౧౦] వాదరత్నాకరం (అముద్రితం) [౧౧] శ్రవణద్వాదశీ నిర్ణయము (అముద్రితం) [౧౨] మహానవమీ నిర్ణయం (ముద్రితమైనది. కానిప్రతులుదొరకవు) [౧౩] ఉపాకర్మనిర్ణయము (అముద్రితం) [౧౪] శచస్సుధాతత్త్వం (అముద్రితం) [౧౫] ద్రవిడవేదాపౌరుషేయత్వవిచారము (అముద్రితం) [౧౬] ఊనమాసనికాది నిర్ణయము (అముద్రితము) [౧౭] జానకీపరిణయము, ఆంధ్రము, అముద్రితం [౧౮] సుభద్రాపరిణయము ఆంధ్రము, అముద్రితం [౧౯] శ్రీరామభూప చరిత్రం ఆంధ్రము, అముద్రితం [౨౦] మర్యత్పేక్షణ శిక్షణం (ముద్రితము కానిప్రతులు ఖర్చైపోయినవి) గ్రంథములు గద్వాలలోనుండు శ్రీ హాసదుర్గం దేశికాచార్యులవారివద్ద నున్నవి:

జ: శా. శ. ౧౭౮౯ ప్రభవ ఆషాఢ శు॥
౧౦ స్వాతినక్షత్రం ధనుర్లగ్నం.
సన్యాసము ఆనంద కార్తికము
పరమపదము కలి. ౫౦౨౭ క్రోధన ఆశ్వయుజ బ॥ ౩ లు:

## ౯౬. ఆచి వేంకటనృసింహాచార్యులుగారు

బి. కవికేసరికిశోర_అవధానకుశల అష్టావధాని

జ. కీలక_ఆశ్వీజ_శు౯

జ. స్థా. అపురూపయ్య గ్రామము తా. సిరిసిల్లా జి. కరీంనగరు

కవిత్వవిషయ మిట్లు వ్రాసుకున్నారు.

సీ. అమర భారతి నాటకాలంక్రియాపాణి
నియాదిసాహితీ నిశ్చితంబు
ఆంధ్రమాయస్భూత వ్యావహారిక కథా
కల్పన సామర్థ్య ఘటనసుమ్ము
కవనమా సత్సభాభవనములన్నా శు
ధారా ప్రసంగావధాన సీమ
వాగ్ఝరియా మహోపన్యాస రచనావి
శేషదక్షత్వ సంజీవనమ్ము
యవనభాషావిశేష మభ్యస్తమేను
ఆంగ్లమవసరపూర్తి మాదపునూరు
ఆఖ్యయా, వేంకట నృసింహార్యుడంద్రు
ఆచిమాగ్గృహనామమో యార్యులార.

## ౯౭. కీ. శే. హాసదుర్గం శ్రీనివాస రాఘవాచార్యులు గారు

జ. స్థా. వనపర్తి జి మహబూబునగరు

జ. ప్రజోత్పత్తి కార్తిక బ ౧౫ ౬౦ సంవత్సరముల వయస్సున కీర్తిశేషులైరి.

ము. ర. వీరరాఘవీయ భూమిక

౧. ఆచార్యవైభవము

౨. స్వభావపద్ధతి

వీరు వ్యాకరణ న్యాయ వేదాంత జ్యోతిష వైద్యశాస్త్రము లందు ప్రవీణులు. వీరి తండ్రిగారే నంబరు ౧. వవారగు శ్రీకృష్ణబ్రహ్మతంత్ర పరకాలస్వాములవారు వీరియముద్రితగ్రంథములు శ్రీ హాసదుర్గం దేశికాచార్యులు (గద్వాల)వద్ద నున్నది.

౯౮. క్రో. క. అణ్ణ
సంపత్కుమారాచార్యులుగారు

జ. స్థా. కొల్లాపురము-జటప్రోలుసంస్థానము జి, మహబూబునగరు
ము. ర. రాఘవశతకము
ఆ. ర. ౧. పద్మాలయశతకము
౨. సత్యనారాయణ స్తవరాజము
౩. ఆంధ్రరామాయణత్రయ సమదర్శిని.
జాగిర్దారు వేముకల్ అగ్రహారము జటప్రోలుసంస్థానము మంత్రియు స్నేహలతా కవితాసంఘ సభ్యుడు.
వీరును నం [౧౯౦]ను కలిసి కృష్ణమాత్ర మిత్రులను పేర ఖండపద్యములు తెలుగున వ్రాయువారు.

౯౯. రంగధామ నాయుడుగారు

జ: స్థా. హైదరాబాదునగరు
వ. ౬౦
ము. ర. ౧. ఆళ్వారాదులచరిత్రము ౨. భక్తపోషణశతకము ౩. రామాయణ సీసమాలిక ౪. శంకర విజయము ౫ సచ్చిదానందస్వామి జీవితము ౬. సత్యనారాయణ వ్రతకల్పము ౭. నీతిబోధశతకము ౮. నవగ్రహ ఫలాఫలశ్రుతి ౯. వైరాగ్యశతకము ౧౦ శ్రీగురుస్తవము ౧౧ వేంకటేశ్వరశతకము ౧౨ అలుమేలు మంగతాయి శతకము ౧౩. శ్రీకృష్ణలీలలు.
ఆ. ర. ౧. యాదగిరినరసింహశతకము ౨. సంపూర్ణరామాయణము ౩. సంపూర్ణభాగవతము (గానములు) ౪. యామునాచార్య చరిత్రము ౫. కేశవనామసీసమాలిక.

౧౦౦. గోవర్ధనం నారాయణాచార్యులుగారు

వ. ౫౧
జ. స్థా. బండలింగాపురము తా. జగ్త్యాల. జి. కరీంనగరు
ఆ. ర రామానుజాశ్వధాటీకావ్యము

౧౦౧. ఖండవల్లి నరసింహశాస్త్రిగారు

జ. ౧౩౧౮ ఫ,
జ. స్థా. కట్టెము బిజినెపల్లి టప్పా తా నాగరకర్నూలు జి మహబూబునగరు,

౧౦౨. భవానీసింగ్ ఠాకూరుగారు

జ. స్థా. నేలకొండపల్లె తా. ఖమ్మం జి. వరంగల్
వ. ౪౫
ఆ. ర, ౧ పుత్రనీతి
౨. పుత్రకోపదేశము
౩. కృష్ణస్తవము
౪. ఉదర్శ రాఘవము
ము. ర. ౧. శ్రీనరశతకము
౨. గుంటి మల్లేశ్వరశతకము
౩. సంగమేశ్వరశతకము.
వీరి మేనమామగారగు లక్ష్మణసింగుగారు కవులు వీరికే నరశతకము ముద్రితము.

౧౦౩. అంబటిలక్ష్మీనరసింహారాజుగారు

వ. ౪౩ వికృతి వైశాఖ శు॥ ౫లు.
జ. స్థా. కంఠాత్మకూరు, జి. వరంగల్
ము. ర. ౧. పాండవప్రభావము
౨. ప్రచ్ఛన్న పాండవము
౩. భారతనాటకము
౪. సుమతీనాటకము
౫. హనుమద్విజయము
౬. మనువింద విజయము ప్రబంధము
ఆ. ర. ౧. ప్రభావతీ ప్రద్యుమ్నము
౨. ప్రహ్లాద
౩. రుక్మాంగద
౪. యాదగిరి మాహాత్మ్యము.
౫. శాంతాబాయి నవల.

౧౦౪. దేవులపల్లి వేంకటాచలపతి రావుగారు

జ. స్థా. దేశాయిపేట జి. వరంగల్
వ. ౩౬
ఆ. ర. ద్రౌపదీ పరిణయనాటకము.

౧౦౫. సిద్దప్ప రాజయోగి గారు

జ. స్థా. గుండారెడ్డిపల్లి జి. కరీంనగరం
కు. కుమ్మరి
ము. ర. సిద్ధప్పవరకవి విజ్ఞానబోధిని

౧౧౭. [౧] శ్రీ కొండపల్లి గోపాలరావుగారు

[౨] శ్రీహరి రామలింగ శాస్త్రిగారు

[౧] జ. స్థా. అన్నపురెడ్డిపల్లి తా. మధిర జి. వరంగల్

వ. ౨౭

[౨] వీరిట్లు వ్రాసినారు.

"కారుకొండకు వాస్తవ అనిసెట్టిపల్లి ప్రస్తుత నివాసము.

జ. స్థా. కలువపాముల గన్నవరం తా. కృష్ణా జిల్లా

వ. ౨౭

రేమిడిచర్ల తాలూకా మధిరలో యినాము మాషుదార్లమున్నూ ఆయిన కుటుంబములో భాగస్వామిని శతావధాని కవిరత్న బాల కవిభూషణ యిత్యాది బిరుదాంకితుడను" అని వ్రాసినారు.

వీరుభయులు జంటకవులు

వీరి రచనలు

౧. వానుమద్విలాసము

౨. పద్మిని

౩. ప్రణయసౌరభము

౪. రాజేశ్వర మాహాత్మ్యము

౫. మధువల్లి

౬. నక్షత్రపతనము

౧౧౮. కీ. శే. కర్నమడకల అనంతాచార్యులుగారు

జ. స్థా. గద్వాల గద్వాలాస్థాన పండితులుగానుండిరి. న్యాయ వేదవేదాంత వ్యాకరణమీమాంసా సాహిత్యములందు చాలగొప్ప ప్రవీణులు. వీరిపాండిత్య ప్రకర్షకే యీయంశము గమనింపదగినది. కాశీనుండి శివకుమార పండితులనువారు గద్వాలకువచ్చి అనంతాచార్యులవారు తేరనివిని తమ పాండిత్యప్రకాశమునకై సభచేయించుమనటుల ప్రభుంతరాజునుబొంది యాసభలో తనవిజయించు వారే తేరనిశపథము చేసి యందరి నోడించిరి. తర్వాత రాజుగారు అనంతాచార్యులవారిని ప్రార్థించి పిలిపించిరి. వారువాదమున నొక్క పూర్వపక్షమును ఖండించినంతనే శివకుమార పండితులు "వీరు అనంతాచార్యులవారు తప్ప యింకొకరుండరు" అని పలికెను. మ. హేవళంబి సం॥ కార్తిక శు॥ ౧ నాడు కాశీలో మరణించిరి.

ఆ. ర. (౧) మదనవిజయభాణము (౨) ఆచార్యవింశతి (౩) ఆంధ్ర శబ్దచింతామణి. వే రొక్కనదగినవి. ఇందుమూడవది ముద్రితము వారి కుమారుడు నంద్యాల అనంత రాఘవాచార్యుల వద్దనున్నవి.

౧౧౯. జాజాల వాసుదేవశర్మగారు

జ. కీలక నామసంవత్సరము

వ. ౨౪

జ. స్థా. గోపాలపేట సంస్థానము

ఆ. ర. ఆంధ్ర సత్యనారాయణవ్రతకథలు

౧౨౦. ఉదయరాజు శేషగిరరావు గారు బి. ఏ.

జి. వరంగల్

సంస్కృతాంధ్రాంగ్ల పారసీక భాషలందు కవిత్వము చెప్పగలుగువారు

ఆ. ర. ౧. మనోరమ

౨. భీష్ముడు

౩. కపోతము

౪. "కరీమా" తర్జుమా

వ. ౩౦

ప్రస్తుత నివాసము

హెడ్ అసిస్టెంటు. మిడిల్‌స్కూల్ పాలకొల్లు కరీంనగరుజిల్లా

౧౨౧. గంధము వేంకట నరసింహాచార్యులుగారు

వ. ౩౪

జ. స్థా. కొల్లాపురము జి. మహిబూబునగరు

ము. ర. మాధవశతకము ధృవచరిత్రము

ఆ. ర. నీతిగీతలు

౧౨౨. కీ. శే. అన్నగారి వేంకట కృష్ణారాయుడుగారు

జ. స్థా. బీబీనగరం (హైద్రాబాదునగర సమీపము)

మ. ౧౫ ఏండ్లక్రింద

అ. ర. కృష్ణనామాంకిత స్త్రీ విరహ
వేప శతకము.
అద్భుత రామాయణము
శ్రీకంఠి శతకము
శ్రీరామనామ ప్రతిపాదిత ధైర్యశతకము
లక్ష్మీశతకము

## ౧౨౩ చిదిరెమఠము వీరయ్యగారు

జ. స్థా. మునికుంట నల్లగొండకు ౧౩ మైళ్లదూరమున ఆంధ్రభారత కర్తయగు శ్రీ గౌరన సింగయ్య మహాకవిగారి శిష్యులు
అ. ర. శ్రీకృష్ణ శతానందీయము
భల్లాణచరిత్రము
శరభవిజయనాటకము
చాటువులు

„ఇతడు నిత్యబ్రహ్మచారి ౩౫ సం॥ క్రిందట విరాగియై శ్రీశైలవనమునుజేరి తపమాచరించుచుండెను. ౧౦ సం॥ క్రింద నాబంధువులనేకులీతని గాంచితిమనిరి. ప్రస్తుతము జీవితుడో కాడో తెలియదు. ఇతడు నాపినతండ్రి'' అని చి. వీరభద్రశర్మగారు వ్రాయుచున్నారు.

## ౧౨౪. పెండ్యాల హనుమచ్ఛర్మగారు

జ. స్థా. ఆందోలు జి. మెదకు
జ. విశ్వావసు సం॥

## ౧౨౫. నల్లాన్ చక్రవర్తి ప్రతాప రాఘవాచార్యులుగారు

జ. ఓరుగల్లు
ము. ర. వేంకటేశ్వర నక్షత్రమాల
వేశ్యాముఖము
అ. ర. హైం రావణచరిత్ర
శారదా శతకము
యాదగిరిలక్ష్మీనృసింహతారావళి
సీతాపతి స్తవము
బాలనీతి
గోపిక
బాలికానీతి.

## ౧౨౬. ముదిగొండ బ్రహ్మయ్య లింగంశాస్త్రిగారు

జ. స్థా. వరిమాబాదు
జి. వరంగల్
వ. ౨౬

## ౧౨౭. మేల్నాటి రంగయ్యగారు

మ. ౧౩౧౫ ఫ
వ: ౭౦

జ. స్థా. సురపురసంస్థానము జి: గుల్బర్గా
వీరిపూర్వులగు పురుషకార కేశవయ్యఅను వారు గొప్పకవులు వీరనేకగ్రంధములు రచించినారు. గ్రంథాంతగద్యలో నీప్రకారము వ్రాసినారు. „శ్రీమత్సురపురీసంస్థానస్థిత శ్రీవేణుగోపాలచరణార విందమిళిందాయమానమానస శఠకోపర్షి గోత్రతిమత స్థాపనాచార్య మహాభాష్యకార యతిమాత్రద్రావిడామ్నాయ ప్రవర్తకగీర్వాణాంధ్ర కర్ణాటక త్రివిధకవితావిశారద మేల్నాటి గోష్ఠీవర్య రంగయార్యకవి''
వీరి కుమారులు నంబరు ౩౧

## ౧౨౮. వెల్లాల సదాశివశాస్త్రులవారు

జ. స్థా. అయ్యవారిపల్లె జటప్రోలు సంస్థానము జి మహిబూబునగరు
సంస్థానాస్థానకవులు ప్రజగత్ప్రసిద్ధిగాంచిన అక్షంతల సుబ్బాదీక్షితుల మేనల్లుడు.

అ. ర. ౧. స్త్రీధర్మప్రదీపిక ౨ అచ్యుతస్వామిచరిత్రము ౩: మూర్తిత్రయాభేద విచారము ౪. అఖ్యాతచింతామణి ౫. శబ్దతత్త్వప్రకాశికా ౬. దత్తాశౌచవిచారము ౭ ప్రత్యబ్ధికనిర్ణయము

ము: ర. ౧. కన్యకాంబాచంపు ౨. వెలుగోటివంశచరిత్రము ౩: సురభివంశ చరిత్రము ౪ ఆంధ్రులచరిత్రవిమర్శనము ౫. కావ్యాలంకార సంగ్రహము ౬. ఆంధ్ర దశరూపవిమర్శనము ౭. పారిజాతచంద్రిక ౮. నామిరెడ్డిచరిత్రము ౯. యతినిందానిరాకరణము ౧౦. ఖండనాభాస నిరాసము ౧౧. రామానుజ గోపాలవిజయము ౧౨. కంఠీరవచరిత్రము ౧౩. ఉద్వాహాభాసనిరాసము ౧౪· చంద్రికాపరిణయ వ్యాఖ్య ౧౫: రామచంద్రచరిత్రము

జ. శా.శ. ౧౭౮౩ దుర్మతి కార్తీక శు౧౦
వీరిగురువులు_అక్షంతల సీతారామశాస్త్రిలు
అలంపూరి మల్హారి శాస్త్రిలు కాశీలోని
మానవల్లి గంగాధరశాస్త్రిలు
బొబ్బిలి మహారాజాగారిచే ౨౩ పర్యా

యములు ౧౧౧౬రు: బహుమతులనొందిరి.
మ. ౬౫వపేట తా: శ. ౧౮౪౩: క్రోధన పుష్య బ ౨

౧౨౯. చిదిరె రాజేశ్వరరావుగారు
జ: శుభకృత్ మాఘ శు ౫
జ. స్థా: ఆందోలు మెదకుజిల్లా
మ: ౧౦ సం॥ క్రితము

౧౩౦. అమరవాది వేంకటనృసింహా చార్యులుగారు
జ. ఆనంద ఆశ్వీజ బ౧౦
జ. స్థా. ముస్తాబాదు
తా. సిరిసిల్ల జి. కరీంనగరు

౧౩౧. ఏటూరి సత్యనారాయణ గారు
జ. స్థా. చిత్తలూరు తా॥ సూర్యాపేట
జి. నల్లగొండ
వ. ౨౦

౧౩౨. మాటేటి గోపాలరావు గారు
వీరు ప్రతివాది భయంకర వేదాంత దేశికుల శిష్యులు
ఆ. ర. సింధుమతీవిలాస ప్రబంధము గార్ల వెంకటేశ్వరనీస శతకము
వీరు నంబరు [౧౮] గారి పెద్దతండ్రిగారు సంస్కృతాంధ్ర కవులు.
జ. స్థా, గార్ల జి: వరంగల్

౧౩౩ ముసిపట్లపట్టాభి రామ రావుగారు
జ. స్థా. తిరుమలగిరి తా. పరకాల
జి. కరీంనగరు
వ. ౪౦
ము. ర. విజయోర్వశీయము
అ. ర. రాధామాధవోద్వాహము దీన సంరక్షకశతకము.

౧౩౪. వీరవల్లినృసింహాచార్యులు గారు
బి. శతావధాని
వ. ౩౮
జ: స్థా: మడికొండ జి: వరంగలు

౧౩౫. కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారు
బి. సాహిత్య శిరోమణి
జ. స్థా. వనపర్తి జి. మహబూబునగరం

౧౩౬. కందూరు వేంకటశర్మగారు
జ. స్థా. వ్యాపర్ల వనపర్తి సంస్థానం
జి. మహబూబునగరు
జ. రాక్షస చైత్ర శు॥ ౧౨

౧౩౭. వనం సీతారామ శాస్త్రిగారు
కొల్లాపురము ఆస్థానపండితులు
వ ౪౫
జ. స్థా. కొల్లాపుర సంస్థానము.

౧౩౮. గొబ్బూరు సంజన్నగారు
జ: స్థా. గద్వాల జి. రాయచూరు
వ. ౫౨
ము. ర. ఆదిశిలాక్షేత్ర జీర్ణోద్ధార వ్యాసములు
అ. ర. శ్రీగిరిశాచల వేంకటేశ్వరశతకము

౧౩౯. భావి కృష్ణశాస్త్రిగారు
పీ. రాడ్భగవాన్ దాస రక్షిత నారాయణపురంబు మన్నివాస పురవరము
సరసపద్యమ్మత సద్భావివంశ సాగరము మజ్జన్మకోకరమువరము
ఆంధ్రగీర్వాణ ప్రబంధకారక పరిచయము మద్వ్యక్త్రధాచయమునయము
నవరసాలంకృతి నాటక కావ్యాది పరిశీలనోక్తి మత్ప్రతిభశక్తి
సప్తవింశతివత్సర సమమువయము సలలితంబైన మద్విప్ర కులమమలము
మాధవాంఘ్య్రర్చితంబుమన్మనము ఘనము సరసమౌ కృష్ణనామమౌ సరసులార.”
అని కవిగారు వ్రాసుకున్నారు.

౧౪౦. ఆర్తి కిష్టయ్యగారు
జి. కరీంనగరు

౧౪౧. గంగరాజు వేంకట కిషన్ రావుగారు
జ. స్థా. లద్దనూరు తా. జనగాం,
జి. నల్లగొండ.

౧౪౨. తూము వరదరాజులుగారు
జ. స్థా. వరంగల్
వకీలువృత్తి
వ. ౪౫.
వీరి వంశీయులు నంబరు (౩౨౮) గొప్ప
కవులు.

౧౪౩. పులిజాల గోపాలరావుగారు
జ. స్థా. దోనిపాముల తా. పర్కి
జి. అత్రాపుబల్దా
వ. ౨౫
తె. ర. విజయ భాస్కరము నాటకము:

౧౪౪. అయితరాజు కొండల్ రావుగారు
జ. స్థా: వరంగల్
ప్రస్తుతము పవపత్రిలో నున్నారు.
జ: బహుధాన్య-భాద్రపద బ౧౦
ము. ర. ఉర్దూ తెనుగు నిఘంటు

౧౪౫. అమరచింతపద్మనాభయ్యగారు
జ: స్థా. అమరచింత జి. మహబూబా
నగరం
ము.ర. చంద్రగిరిరామలింగేశ్వరశతకము

౧౪౬. బొమ్మకంటి
యోగానందరావుగారు
జ. స్థా. కలకోట తా. ఖమ్మం
జి. వరంగల్
అ. ర. హనుమచ్ఛతకము
నృకేసరిశతకము
రాఘవశతకము
కోదండరామ శతకము

౧౪౭. చిదిరె లక్ష్మణశాస్త్రి గారు
జ. వికారి ఫాల్గుణబ౭
జ. స్థా. ఆందోలు జి. మెదకు
అ. ర. శ్రీనివాసచరితము
విశాలాస్వయంవర నాటకము
మెదకు సంస్థానాధీశ్వర చరిత

౧౪౮. నరహరిగోపాలాచార్యులుగారు
వ. ౨౫
జ. స్థా. తిమ్మర తా. హుజూరునగరు
జి. నల్లగొండ
ము. ర. జానకీనాయక శతకము
శ్రీకృష్ణశతకము
అ. ర. శ్రీరామభద్రస్తుతి

౧౪౯. తిరుమలబుక్కపట్నం రం..
చార్యులగారు
సుప్రసిద్ధ కిరీటివారి వంశీయులు
జ. స్థా. ఆత్మకూరు (సంస్థానము)
జి. మహబూబునగరు

౧౫౦. మోటుపల్లి కృష్ణమా
చార్యులుగారు
జ. స్థా. కల్లెడ జి. వరంగల్
వ. ౩౩.
వీరి అన్నగారగు కే. శే. శ్రీనివాసా
చార్యలు కవులు.

౧౫౧. ఆత్మకూరు అంజలిదానుగారు
ఇతడు సహజకవి. గురుముఖమున విద్యా
వ్యాసంగ మొనగడు. కు. గౌండ్ల[ఈడిగ]
వ. ౪౦ జ. స్థా. ఆత్మకూరు గ్రామము
జి. నల్లగొండ
ము. ర. శ్రీరామకృష్ణ భజనావళి
పరమాత్మ భజనావళి

౧౫౨. వైద్యం రాజారాంగారు
జ. స్థా. అమ్మాపురము జాగీరు తా
జన్‌గాం. జి. నల్లగొండ.

౧౫౩. కందాళలక్ష్మణాచార్యులుగారు
జ. స్థా. అండెబండ తా. దేవరకొండ
జి. నల్లగొండ
వ. ౬౦
౬ హరికథలు రచనలు అన్నియు నము
ద్రితములు.

౧౫౪. బి. కృష్ణదేశికాచార్యులుగారు
జ. స్థా. అమరచింతసంస్థానము ఆత్మ
కూరు.
వీరు కిరీటివేంకటాచార్యులవంశమువారు

౧౫౫. శ్రీరాణీ వేంకటలక్ష్మమ్మ సర్ దేశాయిగారు

వ. ౪౯
భర్త. కీ. శే. రాజా వేంకటనర్సారెడ్డిగారు.
వీరు పాపన్నపేటసంస్థాన పరిపాలకులు
కు. రెడ్డి.

౧౫౬. గొట్టుపర్తి సుబ్బారావు గారు

జ. హేవిళంబి ఆషాఢ శు ౧౧
హైకోర్టువకీలు
అ. ర. వెంకటేశ్వరశతకము
వీరిపూర్వులందరును కుంచపర్తి గ్రామం మధిరతాలూకాలో నుండెడివారు కాని యిపుడు మాటపల్లి గ్రామం యిల్లెందు తాలూకాలో నున్నారు.

౧౫౭. కే. రామచక్రంగారు

జ. స్థా. ఖమ్మం

౧౫౮. పూజారి సోమలింగంగారు

జ. స్థా. రఘునాథపురము
తా. భువనగిరి జి. నల్లగొండ వ. ౫౫

౧౫౯. రెడ్డిసెట్టి హనుమద్దాసు గారు

జ. స్థా. బీబీపేట జి. నిజామాబాదు
ము. ర. జ్ఞానబోధాధ్యాత్మలు
ము. ౬ ఏండ్ల క్రితము

౧౬౦. కీ. శే. రూఖానుపేట రత్నమ్మ గారు

జ. స్థా. ఇప్పటూరు
విలాసము. రూఖానిపేట తా. షద్గ
ము. ర. వేంకటరమణ శతకము
శివపుష్పంజలి
శ్రీనివాసశతకము
బాలబోధ
అ. ర. కృష్ణునిదశావతారవర్ణన వ. ౭౨
ము. ౫ ఏండ్లక్రిందట కు. రెడ్డి

౧౬౧. గుండాము త్రిలింగముగారు

జ. సాధారణ పుష్యము
జ. స్థా. వరంగల్ (గిర్మాజీపేట)
ము. ర. రాజరాజేశ్వరీశతకము
అ. ర. సింధుసేనోపాఖ్యానము
రాజేశశతకము
నళచరిత్ర
ప్రాణలింగశతకము
భాస్కరనాటకము
రాజరాజేశలింగ శతకము
ప్రతాపరుద్రచరిత్ర
రాజవంశశతకము
నీతిశాస్త్రము
ధూర్జటిశతకము
కేదారేశ్వరశతకము

౧౬౨. వ్యాపర్ల మహబూబలీ గారు

మతము. ముసల్మాను
జ. స్థా. వ్యాపర్ల జి. మహబూబునగరు
గురువులు అనుముల వేంకటసుబ్రహ్మణ్య శర్మగారు. ఎవరో "యితడుతురక యితనికేమికవిత్వము వచ్చును" అని ఆక్షేపింప వారిట్లుచెప్పిరి.

క. తురకకులసుండాంధ్రం
బెరిగి సశాస్త్రంబుగాగ నింపుగకవితల్
ధరణిరచింపగ లేడని
పరిహాసను చేయమీకు బాడియెయార్యా

క. ధరణీసుర కవిశిశువును
నరవరకవితావలోకనంబున నేనీ
కరణికవిత్వంబల్లగ
బరకవితా చోరుడంచు బలికితివార్యా.

౧౬౩. పేరక రామానుజాచార్యులుగారు

జ. స్థా: హైద్రాబాదునగరము వ. ౨౯

౧౬౪. నలంతిఘుల్ చక్రవర్తులతంయాల సింగరాచార్యులు గారు

జ. సాధారణ వైశాఖబ౨
వీరు నం (౧౬౬) గారికుమారులు.
బి. ఉభయభాషా ప్రవీణ
అ. ర. భయంకర మానవవ్యాఘ్రము
పరమపదవిలాసము
చంద్రకళాగర్వనిరసనము సంస్కృతము
జ. స్థా: (ఎల్లమ్మబజారు) వరంగల్.

౧౬౫. బిద్దిరాజు రాఘవరంగారావుగారు

జ: విజయ ఫాల్గుణ బ౧౪

జ. స్థా. ఇనుగుర్తి తా. మహబూబాబాదు జి. వరంగల్

ము. ర. ౧ ఉపదేశరత్నమాల

౨ తిరుప్పల్లాండు

౩ నవలలు

౪ భక్తిసారచరిత్ర

కు. గోలకొండనియోగి. వీరు నంబరు ౧౬౧ గారిసోదరులు ౧-౨ గ్రంధములు ఈ యుభయులు రచించినారు.

౧౬౬. నలంతిఘల్ చక్రవర్తుల తంయాల లక్ష్మీనృసింహాచార్యులుగారు

జ. తారణ జ్యేష్ఠశుద్ధ

జ. స్థా. [యల్లమ్మ బజారు] వరంగల్

బి. కవినాథ

ము. ర. ముకుందశతకము

రమేశశతకము

అచ్చతెనుగు కుబ్జాకృష్ణ విలాసము

అ. ర. శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వ్యాకేకయ రాజనందన చరిత్ర శ్రీ రామాష్టకథాస్తోత్రము. [సంస్కృతము] నిర్వచనశుభాంగీ కల్యాణము. నిరోష్ఠ్యకౌంతేయచరిత్ర యోగభూషణోపాఖ్యానము ప్రచండ పరశురామము సూర్యరాజపురాణము ఆంధ్రతత్త్వత్రయము శుద్ధాంధ్రరామాయణసంగ్రహము వేల్పుకొండ క్షేత్రమాహాత్మ్యము పాదుకాపట్టాభిషేకము హేమాంగీవిలాసము శకుంతల, ధంసా జీవితము, భగవద్దవబోధ, శ్రీ శ్రియఃపతిసంవాదము. గంధవతి యుత్సవము: ఉంజల్ ఉత్సవము, అలంకారార్చనము,

౧౬౭. విద్యాగోవర్ధన అళహసింగరాచార్యులుగారు

జ. స్థా. ఇభురాంపేట తా. మిర్యాలగూడ జి. నల్లగొంత

౧౬౮. వేలూరు మాణిక్యరావు గారు

జ. స్థా. గడిచర్ల తా. వరంగల్

౧౬౯. కే. వీ. నరసింహాచార్యులుగారు

జ. స్థా. కొడ్లపాక జి. వరంగల్

౧౭౦. కవి రంగదాసుగారు

కు. నంబి వైష్ణవ

జ. స్థా. సూరవరము జి. మహబూబనగరు

వీరివంశములో శేషయ్యఅనువారు కవులై యుండిరి,

వీరు సాముద్రికము, జ్యోతిషము, జలార్గళాది శాస్త్రముల నెరుగుదురు.

౧౭౧. శిరిసినహాల్ కృష్ణమాచార్యులుగారు

బి. అష్టావధాని, దైవజ్ఞశిఖామణి

జ. స్థా. మోరతాడు తా. ఆరుమూరు జి. నిజామాబాదు వ. ౩౦.

ము. ర. కళాశాలాభ్యుదయము, కోరుట్లజగ్త్యాల అవధానములు, పద్మావతీపరిణయము, రుక్మిణీకల్యాణము, మనోజవిజయబాణము, గీతతత్త్వమీమాంసా గ్రంథము

౧౭౨. సముద్రాల లక్ష్మీనృసింహాచార్యులుగారు

వ: ౪౦

జ. స్థా. ఆత్మకూరు జి: వరంగల్

ము. ర. గోదాస్తవము

అ. ర. లక్ష్మీనృసింహశతకము

రామాంజనేయము

౧౭౩. టీ. కృష్ణశాస్త్రిగారు

జ. శుభకృత్ ఆషాఢ శు. ౫.

జ. స్థా. పదిర తా. శిరిసిల్ల జి: కరీంనగరు

బి: అష్టావధాని. వీరితండ్రిగారగు లక్ష్మణశర్మగారు సుప్రసిద్ధకవులు వారు శ్రీరామచంద్రశతకమును రచించినారు. అ ముద్రితము.

౧౭౪. నేరళ్ల వేంకటాచార్యులుగారు

వ. ౨౩. జ. స్థా. బండలింగాపురము తా. జగ్త్యాల, జి. కరీంనగరు

అ. ర. అతిసుందర విలాసము

౧౪౫. పరవస్తు నంబెరుమాళ్లుగారు

జ. స్థా. గూడెము తా. శిరిసిల్ల జి: కరీంనగరు. ఆ. ర. యోగభూషణచరిత్ర, నరహరిదాసుచరిత్ర, తిరుప్పావు. వ. ౪౦.

౧౪౬. పల్లా చంద్రశేఖరశాస్త్రిగారు

జ. స్థా. కేతెపల్లి గోపాలపేట సంస్థానము జి. మహబూబునగరు, వ. ౨౯

౧౪౭. అవునూరు వేణుగోపాలరావుగారు

జ. కీలక పుష్య బ. ౧౧ జ. స్థా. అవునూరు తా. సిరిసిల్లా జి. కరీంనగరు

ఆ. ర. జోహరాబాయి నవల

౧౪౮. శ్రీ హెచ్. గుండేరావుగారు వాచస్పతి

బి. వాచస్పతి

ఉద్యోగము నాజిము తాలూక్దారు గద్వాల సంస్థానము

ఆ: ర. [౧] ప్రవాసీ [౨] చైత్యవిలాసము [౩] తత్త్వముక్తావలీ.

అన్నియు సంస్కృతమందే.

౧౪౯. శేషభట్టర్. వేంకటరామానుజాచార్యులుగారు

హైకోర్టువకీలుగారు జ ౧౨ ఖుర్దాదు ౧౩౦౯ ఫ. జ. స్థా. నల్లగొండజిల్లా ప్రకృతము హైద్రాబాదులో నివాసము

ము. ర. [౧] ప్రాకృతదాంపత్యము [౨] నల్లగొండ చరిత్రము.

అ. ర. భావ ప్రపంచము

౧౫౦. యం. రామకృష్ణారావుగారు

జ. సాధారణ శ్రావణ బ. ౧

జ. స్థా. కొల్లాపురము జి. మహబూబునగరు బి. చిత్రపిశారద

ర. చూడుడు నం: ౯౫

స్నేహాలతా కవితా సంఘసభ్యుడు

"నిర్వేదము" యొక్క చిత్రము ఈ కవిగారే చిత్రించినారు. కావునవీరు కవితాశిల్పకులంకారగులు.

౧౫౧ కీ.. శే. వడగం రాజేశ్వరరావుగారు

వీరును కేసిడిచర్ల వేంకటకృష్ణారావుగారును జంటకవులు. రాజకృష్ణకవులను పేరుతో వ్రాయుచుండిరి.

౧౫౨. కీ. శే. బెల్లముకొండ వేంకటాచార్యులు గారు

జ ౧౩౧౨, ఫ. మ. ౧౩౫౮. ఫ.

జ. స్థా. వడ్డేపల్లి తా॥ మేడిచల్ జి. అత్రాఫు బల్దా.

ము. ర. సుకుమారి నాటకము.

అ. ర. నళినివిభాకరీయము. [పద్యకావ్యము]

౧౫౩. ఓరుగంటి లక్ష్మీనారాయణశాస్త్రిలుగారు

జ. స్థా. సింగవటము. కొల్లాపురముసంస్థానము మహబూబునగరము జిల్లా.

వ. ౩౮.

అ. ర. శ్రీలక్ష్మీనృసింహ స్థలమాహాత్మ్యము.

౧౫౪. గోవర్ధన సింగరాచార్యులుగారు

వ: ౬౦:

జ. స్థా. బెముగల్. సంస్థాన బండలింగాపురము. తా॥ జగ్త్యాల జి; కరీంనగరు.

౧౫౫. యం. ఉమామహేశ్వరరావుగారు

వ ౩౬

జ. స్థా. కొల్లాపురము, మహబూబునగరము జిల్లా.

వీరు తమతండ్రిగారికాలము నుండి [౬౦ సం॥ నుండి] యీసంస్థానములో నివాసమేర్పరచుకొని నిలిచిపోయినవారు.

అ. ర. రాఘవము,

౧౫౬. నల్లాన్ చక్రవర్తుల ప్రతాపం రాఘవాచార్యులు గారు.

జ. స్థా. వరంగల్.

వ. ౨౫.

## ౧౫౭. పన్నుల కోవూరు భరతయ్య గారు

వ. ౪౦

జ. స్థా. పన్నుల. తా॥ నాగరకర్నూలు. జి. మహబూబునగరు.

ప్రకృతముండునది జింకలపల్లి గ్రామం గద్వాల సంస్థానము.

ఆ. ర. తిరువాయిమొడి (వాస్తువర్గ గణితము.) వీరితండ్రిగారగు వల్లభరాయడు ఉత్సవ మాహాత్మ్య సంగ్రహము: అను గ్రంథకర్తలు.

## ౧౫౮. [౧]ఏలూరు సత్యనారాయణ రావుగారు

వ. ౧౯;

జ.స్థా. చిత్తలూరు గ్రామం

## [౨] బోయినేపల్లి రంగా రావుగారు

రాక్షస. శ్రావణ బ. ౭

జ. స్థా. చిత్తలూరు తా. సూర్యాపేట జి. నల్లగొండ వీరుభయులు జంటకవులైనను నం. ౧౭౧ పద్యములను ఏటూరు వారును. యీనంబరులోని పద్యములను రెండవవారును వేరుగా వ్రాసిపంపినారు:

## ౧౫౯. బూర్గుల రామకృష్ణారావుగారు బి. ఏ. ఎల్ ఎల్. బి.

వ. ౪౦. జ.స్థా. బూర్గుల జి. మహబూబునగరు.

రచనలు ఖండకావ్యములు. వీరి మాతాతగారగు పుల్లమరాజు నరసింగరావుగారు కవులు వారు రచించిన గ్రంథములు వీరివద్ద నున్నవి. వీరు ద్వితీయాంధ్రమహాసభాధ్యక్షులు: సుప్రసిద్ధులు.

## ౧౬౦. కే. యస్. జాషువాగారు

జ. స్థా. సూర్యాపేట జి. నల్లగొండ

మతము క్రైస్తవులు

## ౧౬౧. అజ్మతుల్లాగారు

మతము. ముసల్మాను వ. ౩౨

జ. స్థా. దేవరకొండ జి. నల్లగొండ

ఆ. ర. సత్యసింధుచరిత్ర, తత్వపుష్పము, మార్కండేయ జననము

నం (౩౩౦) సోదరులు.

## ౧౬౨. కూడవెల్లి శ్రీనివాసరావుగారు

జ. స్థా. కూడవెల్లి జి. మహబూబునగరు

ఆ. ర. మనుచరిత్ర, రామాయణము

## ౧౬౩. రంగరాజు వేంకట ధర్మారావుగారు

జ. స్థా. నర్మెట తా. జనగాం జి. నల్లగొండ వ. ౨౫

ఆ. ర. శ్రీరామరామ శతకము

## ౧౬౪ బాలసరస్వతి కందాళ వేంకట నరసింహాచార్యులుగారు

జ. స్థా. రామన్నపేట జి. వరంగల్

వ. ౨౨ బి. బాలసరస్వతి

ఆ. ర. సావిత్రీపరిణయ నాటకము

## ౧౬౫. సోమరాజు ఇందుమతీ బాయిగారు

జ. స్థా. అమ్మపాలెము తా. మధిర జి. వరంగల్. వ. ౨౩

ఆ. ర. శకుంతలా పరిణయము, పతిభక్తి శ్రీరంగదేవస్తోత్రము వేణుగోపాలస్వామి శతకము

## ౧౬౬. కీ. శే. కోదాటి రామకృష్ణారావుగారు బి.ఏ.

చిన్నతనమునందే ౭_౮ సం॥క్రితము చనిపోయిరి జ. స్థా. సూర్యాపేట జి. నల్లగొండ

## ౧౬౭ బోయినపల్లి విశ్వనాథ రావుగారు

జ. స్థా. రావిపహాడు తా:సూర్యాపేట జి. నల్లగొండ

## ౧౬౮. పల్లా రామచంద్రశర్మగారు

జ. స్థా. కల్వరాల్ గ్రామం జి మహబూబునగరు. వ. ౨౫

౧౯౯. తాటిపర్తి గోపాలాచార్యులుగారు

వ. ౭౦. జ. స్థా రాజనగరము జి. మహబూబునగరు.

౨౦౦. చెన్నమరాజు కొండల రావుగారు

జ. స్థా. కొందుర్గు జి. మహబూబునగరు విలాసము మున్సిఫ్. ధర్మాబాదు

ము. ర. వేంకటేశ్వర శతకము

అ. ర. తెనుగు తిరువాయిముడి వీరి మాతామహులు కవులు

౨౦౧. బీ. కే. వేంకటాచార్యులుగారు

వ. ౩౬

ము. ర. (౧) సత్యనారాయణవ్రతము.

(౨) రామపూజావిధానము.

యితరులతోగూడ రెండుపద్యకావ్యములు వ్రాసి ముద్రించినారు.

అ. ర. శ్రీమదాంధ్ర రామాశ్వమేధము. సంశము. ఆంధ్రపూర్ణాచార్యులు వీరికూటస్థులు. సంస్కృతమున ప్రపన్నామృతమును వీరిపూర్వులు వ్రాసినారు.

జ. స్థా. బిజినేపల్లిగ్రామము, తా. నాగరకర్నూలు. జి. మహబూబునగరు.

౨౦౨. వేంకటరామకృష్ణ కవులు

జ. స్థా. పింగారము సూర్యాపేట.

తా. నల్లగొండజిల్లా.

వ. ౨౨.

ము. ర. రాలినపూవు.

(౧) గాదె వేంకటరావుగారు. (౨) రామకిషన్ రావుగారు. ఉభయులుకలిసి వేంకటరామ కృష్ణకవులను పేరునతెలుగు వ్రాయుచుందురు.

౨౦౩. చెన్నమరాజు వేంకటేశ్వర రావుగారు

జ. స్థా. కొణుదుర్గుగ్రామము. తా. పరిగి. జి. మహబూబునగరము.

అ. ర. ఒకనాటకము.

౨౦౪. రాఘవనగరం రామసింహముగారు

కు. బొందిలి.

జ. స్థా. రాఘవనగరము. జి. నల్లగొండ

ము. ర. విశ్వకర్మ శతకము.

౨౦౫. అభినవపాణిన్యాచార్య నరసింగశాస్త్రిగారు

జ. స్థా. అచ్చంపేట. జి. మహబూబునగరు,

వ. ౫౦.

౨౦౬. కీ. శే. వేంకటపౌండరీక యాజులవారు

జ. స్థా. కుక్కునూరుపల్లి. తా. సిద్ధిపేట. జి. మెదకు

వీరు ౨౫ సం॥ వరకే ఘనాంతము ఋగ్వేదము అభ్యసించిరి. ౩ పౌండరీకాంత శ్రౌతప్రయోగతయము నేర్చిరి. అసామాన్యసాహితీవిద్య నభ్యసించిరి. సంగీత జ్యోతిషములందు ప్రౌఢిమకలదు. దొంతిసంస్థానమువారు వీరిని రప్పించి తస్థానవిద్వాంసులజేసి యినాములిచ్చిరి.

రచన. శ్రౌత సూత్రవివరణము. తన ౬౩ వ సం॥న రౌద్రి అధికశ్రావణ బ॥ ౨ నాడు చనిపోయిరి. వీరిశిష్యులలో నొకరు. నం. (౨౫౮)

౨౦౭. కీ. శే. శ్రీకృష్ణానంద భారతీ దేశికులవారు

జ. స్థా. కుక్కునూరు. జి. మెదకు. వీరి పూర్వాశ్రమనామము యామవరము కృష్ణశాస్త్రిగారు. జ్యోతిష పండితులు. సాహిత్యచక్రవర్తి యని విద్వాంసులచే పొగడ్త గాంచినారు వీరు నంబరు (౨౫౮) గారికి తాతగారు. ప్రాథమిక గురువులును తమ వ: ౬౦ వ సం॥ విరోధికృతులో చనిపోయిరి.

అ. ర. సీమంతినీ పరిణయ చంపు. వీరుయత్యాశ్రమము స్వీకరించిన కొంత కాలమునకు పరమపదించిరి.

౨౦౮. ఎం. వి. మాధవరావుగారు

జ. స్థా. చెన్నూరు గ్రామము. జి. ఆసిఫాబాదు.

వ. ౨౨

౨౦౯. కీ. శే. శ్రీరామకవచం కృష్ణయ్యగారు

జ. స్థా. నారాయణపురము సంస్థానము

జి. నల్లగొండ.

జ. ౧౮౬౩ క్రీ.శ. మ. ౧౯౨౬ క్రీ.శ.

ఆ. ర. భానుమతీ పరిణయము. యక్షగానము. హరిప్రియ నాటకము. శాకుంతలము. సంస్థానచరిత్ర.

౨౧౦. చకిలం శ్రీనివాసశర్మగారు

జ. స్థా. ఉండ్రుగొండ. తా. సూర్యాపేట. జి. నల్లగొండ

౨౧౧ కీ. శే. షబ్నవీసు వేంకట రామనరసింహారావుగారు

౮. ౫. సంవత్సరముల క్రింద కీర్తిశేషులైరి. „నీలగిరి" యను వారపత్రికను ఐదు సంవత్సరములు నడిపిరి.

జ. స్థా. నల్లగొండ.

౨౧౨. మరింగంటి సీతారామానుజాచార్యులుగారు

జ. స్థా. మల్లంపల్లి. తా. జన్గాం. జి. నల్లగొండ

౨౧౩. పాటుకూరు అనంతరామయ్యశర్మగారు

జ. స్థా. నారాయణపురము. జి. వరంగల్,

వ. ౪౬.

౨౧౪. నలంతిఘల్ చక్రవర్తుల తంయాల వేంకట నృసింహాచార్యులుగారు

జ. పరీధావి. ఫాల్గుణ బ. ౧౦

జ. స్థా. గోవిందనగరం. జి. వరంగల్.

వ. ౨౧.

ఆ. ర. భయంకరపిశాచభవనము (నవల) కమలాకుమారి. నాటకము.

౨౧౫. శేషంజగన్నాథాచార్యులుగారు

జ. స్థా. మంకాల తా॥ షహాబాదు

జి. అత్రాఫుబల్దా. జ. రక్తాక్షి మార్గశిర శు ౩. వ. ౫౦

ఆ. ర. (నాటకములు) సుమతీ స్వయంవరము, మయూరధ్వజ, బభ్రువాహన, విప్రనారాయణ రాజసూయాశ్వమేధము ౬ హరికథలున్ను రచించినారు.

౨౧౬. కీ. శే. దొంతిరెడ్డి పట్టాభిరామారెడ్డిగారు

జ. స్థా. యామజాల జి. అత్రాఫుబల్దా

ని. శృంగారకవి మ. సుమారు ౩౦ ఏండ్ల క్రింద

ము. ర. ఆంధ్రపూర్ణాచార్య ప్రభావము (ప్రబంధము)

౨౧౭. కవిసార్వభౌమ శతావధాని వరకూరు వేంకటశాస్త్రిగారు

జ. స్థా. సురపురముసంస్థానము

జి. గుల్బర్గా బి. కవిసార్వభౌమ

మ. సుమారు ౩౦ ఏండ్లక్రితము

ము. ర. పాండవాశ్వమేధచంపు సంస్కృతము

౨౧౮. కీ. శే. రంగాపురము వాడాల నరసింహముగారు

మ. ౩౫ సం॥ క్రిందట

జ. స్థా. రంగాపురము తా. కల్వకుర్తి

జి. మహబూబునగరు. కు. నియోగి

౨౧౯ శ్రీరామకవచం అనంత శాస్త్రిగారు

జ. స్థా. నారాయణపురము సంస్థానము

జి. నల్లగొండ జ. ౧౩౦౭ ఫ.

నం (౨౦౯) గారి కుమారులు వీరు సంస్కృతాంధ్ర కవులు

**౨౨౦. చొల్లేటి నరసింహ శాస్త్రిగారు**

క. ౧౮౭ జ.స్థా. ఖిలేషాపురము తా. ఆంబరుపేట జి అత్రాపుబల్దా

ఆ. ర. అణిముత్యము, స్వధర్మము, నీతి గీతలు.

**౨౨౧ కే. వి. పురుషోత్తమరావుగారు**

హైకోర్టువకీలు జ.స్థా. చెన్నూరు గ్రామం తా. మధిర జి. వరంగల్

ఆ. ర. ఆనందము

**౨౨౨ జి. రాధాకిషన్‌గారు**

జ స్థా. బుట్టారెడ్డి జి. కరీంనగరు

ఆ. ర. ఋతుసంహారము తెనుగుసేత

**౨౨౩ కీ. శే. అవధానము శేష శాస్త్రిగారు**

జ. స్థా. అయ్యవారిపల్లె. జటప్రోలు సంస్థానము జి. మహబూబునగరు ఆస్థాన విద్వాంసులుగానుండెరి.

ము.ర. వీరును సం(౧౮౭)కలిసి చంద్రికాపరిణయ వ్యాఖ్యను సురభివంశచరిత్రను కావ్యాలంకారసంగ్రహమును వ్రాసిరి

మ. ౫౫ ఏండ్లకిత్రము

**౨౨౪. గార్లపాటి రాఘవరెడ్డిగారు**

జ.స్థా జి వరంగల్

వీరు లక్ష్మీకాంతరావు గారనువారును లక్ష్మీకాంతరాఘవ కవులను పేర అనేక పద్యములు ప్రకటించినారు.

**౨౨౫. మాడభూషణం దేశికాచార్యులుగారు**

జ. స్థా: పెద్దఅలూరు వ. ౩౬

ఆ. ర. అభినవ భాణము.

**౨౨౬. యామవరం వేంకటరాజ శర్మగారు**

జ. స్థా. కుక్కనూరు జి. మెదకు

**౨౨౭. చిరుమర్తి నారసింహకవిగారు**

జ. స్థా. కంపాలపల్లె తా. మిర్యాలగూడ జి. నల్లగొండ

మ. సుమారు ౭౦ ఏండ్ల క్రిందట: ౮౦ ఏండ్లవృద్ధులై చనిపోయిరి.

ఆ. ర, ఇంద్రనారద సంవాదము:

"ఇవిగాక వీరు చాల గ్రంథములు రచించిరి. కాని వీరి మనుమలగు సింగయ్యగారి అజాగ్రత్తవలన పోగొట్టుకొని పోయినవి." అని జో. హనుమంతు రెడ్డిగారు వ్రాసినారు. ఈకవి చనిపోవునప్పుడొకమిత్రుని కోరికపై సూర్యస్తోత్రము చేసెనట. ఆసూర్య భగవన్నవరత్నము లాశువుగా చెప్పి ప్రాణములు విడిచిరి. ఆపద్యములుగూడ దొరకలేదు. మూడుమాత్రమే దొరకినవని రెడ్డిగారు వ్రాసినారు. ఆపద్యములివి.

శా. శ్రీమత్సారస మిత్రమిత్ర కరుణాసింధూ జగన్నేత్రను । త్రాసుస్తుత్యబుధేంద్ర పూజ్య భవవిధ్వం సార్కనిత్యాంబుజ । నాయందె న్నగ మోక్షమున్ సిరులువిద్యాసౌఖ్యభోగ ప్రపం । చామోదంబులు డాయునయ్య గ్రహరాజా సూర్యనారాయణా:

మ దినముల్ ప్రస్తుతులెన్న క్షేమనయునన్ దీంద్రింపకే కల్మలాఘనమర్పింపక కూహక ప్రతతిచేతమ్మారినిన్ వేడినన్ ఘనభక్తిం ప్రకటించినన్ భవము చీకాకైజయుల్ నిక్కమా। జనితప్రాభవుడాగదయ్య గ్రహరాజా సూర్య నారాయణా.

శా. సంమందున్ జముడున్ నిజాత్మజాలు ప్రేమన్ గూర్పుచున్ సంతతా । నందంబందెడి ఛాయయున్ బొరయ విజ్ఞానాత్మయా పద్మిని । సౌందర్యాంగన భార్యయై చెలగ నీచందంబు చిత్రంబగున్ । సందేహంబిక లేదు మాకు గ్రహరాజా సూర్యనారాయణా.

**౨౨౮. కేశవపంతుల వేంకట నరసింహశాస్త్రిగారు**

జ. స్థా. పల్లెపాడు జి. రాయచూరు

జ. ప్రమాదీచ శ్రావణము.

**౨౨౯. కీ. శే. యాముజాల వేంకట శాస్త్రిగారు**

జ. స్థా. కుందంకోట గ్రామము పాల్వంచ సం॥ వీరి పితృపితామహులు హైద్రాబాదు నగరమునకు పరిసరమునగల "యాముజాలపాడు"ను గ్రామమున నివసించుచుండెడివారు: కవి

గారు క్రమ వయఃకాలములో కారణాంతములచే హైదరాబాదు నగరమునకేగి అచట శ్రీరాజా కందస్వామిగారి అనుగ్రహమునకు పాత్రులై వారికడ నుద్యోగమును నిర్వహించుచు. వారితోపాటు సకల తీర్థయాత్రలను సేవించియుండిరి. తీర్థయాత్రానంతరం తత్ఫలితముగ నీ క్రిందబాంకుపరచిన మాహాత్మ్య గ్రంథములనురచించియుండిరి:

ము: ర. గౌతమీ మాహాత్మ్యము, భద్రాచలక్షేత్ర మాహాత్మ్యము. కాశీక్షేత్ర మాహాత్మ్యము, సేతు రామేశ్వర మాహాత్మ్యము, శ్రీశైలమాహాత్మ్యము, చిదంబరక్షేత్ర మాహాత్మ్యము కాంచీ వరదరాజ మహాత్మ్యము, జగన్నాథ మాహాత్మ్యము, శ్రీరంగ మాహాత్మ్యము, హాలాస్యక్షేత్ర మాహాత్మ్యము, కాశేశ్వర మాహాత్మ్యము, కాళహస్తీశ్వర మాహాత్మ్యము, యాళువందారు స్తోత్రము, ముకుందమాల పద్యములు, ఆంధ్ర బాలరామాయణము, భజన గోవింద పద్యములు, సకలార్థ ప్రదీపిక, మహాసప్తాహ మహోత్సవ పుణ్యకథ, ఆంధ్ర కాలామృతము, నరసింహ శతకము

యీకవిగారిమనుమలగు బ్ర శ్రీ.యాముజాల వేంకటశాస్త్రి గారివద్ద సదరు గ్రంథముల ముద్రణ ప్రతులన్నియు గలవు:

౨౩౦. కీ. శే. గంగా లక్ష్మన్నగారు

మ. ౧౪ పేండ్లక్రిందట

జ. సా. మంథెన జి. కరీంనగరు

ఆ. ర. కృష్ణదేవరాయ నాటకము, చంద్రకాంతా నాటకము,సుభద్రా పరిణయము, తిథి చింతామణి, దండకారణ్య చరిత్ర, కుచేలోపాఖ్యానము.

మున్నగు అముద్రిత గ్రంథములు అని కొగితముఖమ్ముగా వ్రాసుకొనవలసి వచ్చినదే కాని వారి వంశీయులెవరికో పాపము ఆ గ్రంథములలో నొక్కటియూపె నుంచుకొనలేదట! కావున యీపద్యములే వ్రాయుటచిన్నములు.

౨౩౧.కీ. శే. మేడిసెట్టివీరాస్వామిగారు

నంబరు [౭౯] గారితండ్రి. వ ౫౪.

ఆ: ర. కృష్ణ రాయబారము నాటకము అంబరీషోపాఖ్యానము

మ. ౧౩౩౨. ఫ.

౨౩౨.తుమ్మగోటిసోమశేఖరకవిగారు

జ. ౧౨ ఆబాన్ ౧౨౯౯ ఫ.

జ. సా. కొండ్రపోలు తా. మిర్యాలగూడెం జి. నల్లగొండ

ఆ ర. తృణావర్తుని వధ

౨౩౩. బి. వి రామరాజుగారు

జ. సా. భట్టుపల్లి అగ్రహారము తా: తాటికొండ జి మహబూబునగరం

వీరు నంబరు (౨౫౧) గారి సోదరులు ఇరువురును జంటకవులు; వివరములు నం. [౨౫౧] వారివద్ద చూడనగును.

ఆ. ర. రామాంజనేయము, గజగౌరీవ్రతము, శశిరేఖ. దక్షిణ గోగ్రహణము.

౨౩౪ అలువాల శేషయ్యగారు

జ. సా. దోనిపాముల తా. షర్కి జి. అత్రాపుబల్దా.

వ. ౨౧

ఆ ర. శివధనుర్భంగ నాటకము.

౨౩౫. పోతంశెట్టి బాలయోగిగారు

జ. సా భువనగిరి జి. నల్లగొండ

వ. ౬౦.

యోగాభ్యాసముచేయువారు. కీర్తనలు, భక్తిస్తోత్రములు రచించినారు,

౨౩౬. కొత్వాలు రామరాట్ గారు

కు. రెడ్డి.

జ. సా. గద్వాల.

ఆ. ర. వ్యాసములు. ఖండపద్యములు

౨౩౭. కీ- శే. చిన్నమాధవ వేంకట రామరాజుగారు

జ. సా. బచ్చన్నపేట తా. జనగామ జి. నల్లగొండ.

మ. పరాభవలో ౨౦ పేండ్లక్రితము.

కు. నియోగి.

ఆ. ర. (౧) రామకృష్ణ యుధిష్ఠిరచంపు త్ర్యర్థి [సంస్కృత]చంపు (౨) సూర్యనారాయణీయము ఆంధ్ర ప్రబంధము. (౩) కేశవశతకము.

వీరు నానాసంస్థానములందు జేగాం
టీనకవులు. ౫ దినములవరకు ఆశువుగా
శ్లోకములు కాని పద్యములు గాని చెప్పి
నవి చెప్పక చెప్పుటకై దీక్షవహించినవా
రు. త్ర్యర్థిదంపుసకు దామే వ్యాఖ్యవ్రాసి
నారు. ఈగ్రంథములు వీరుకుమారులు
నారాయణరాజుగారికడ నున్నవి:

౨౩౮. తిరువరంగం పాపయ్య
శాస్త్రిగారు
జ. స్థా. మంథెన జి, కరీంనగరు,
వ. ౫౧.
బి. అష్టావధాని.

౨౩౯. బాలకవి అమునావది వేంకట
నరసింహాచార్యులు
జ. స్థా. వరంగల్.
వ. ౨౩.
ము. ర. యమునీరగద్యం,
లక్ష్మీనరసింహ పంచాంగము
యాదాద్రి లక్ష్మీనరసింహస్తోత్రము
అ. ర. ధనంజయవిజయనాటకం
కవిజన మనోరంజనము
ప్రాకృతమంజరి
ప్రచండ భార్గవవ్యాయోగము
భారతకథాను క్రమణిక
గోదాగాథా వ్యాఖ్యా
శ్రీ భాష్యాదికరణ సారస్వాదిని
ఆంధ్రీకృత శ్రీరంగరాజ స్తవము

౨౪౦- తిరుమలపంచాంగం వేంకటా
చార్యులుగారు
జ. స్థా: సీతారాంబాగు హైదరాబాదు
వ. ౪౫.
అ. ర. జానకీపరిణయము-చంద్రమతీ పరి
ణయము.

౨౪౧-కీ. శే-కాళ్లూరు సీతారామరావు
జమీందారుగారు
వ: ౨౦౫౦॥ క్రితము
జ. స్థా: అన్నపురెడ్డిపల్లె మధిర

అ.ర. రుక్మాంగద నాటకము, శ్రీకృష్ణవి
లాసప్రబంధము ధారశద్విపద

౨౪౨-జాతకమార్తాండ ఆరుట్ల వేంకట
నృసింహాచార్యులుగారు
వ. ౨౩ జ. స్థా. భీమవరము జి వరంగల్

౨౪౩. పి-వి-వరదాచార్యులు గారు
జ. స్థా. సీతారాంబాగు హైద్రాబాదు
వైద్యులు

౨౪౪- వెలికట్ల నరసింహా
చార్యులుగారు
జ. స్థా, వెలికట్ల జి. మహబూబునగరు
వ. ౨౭ ము. ర. ౧) అభినవ శశిరేఖా
నాటకము ౨) దత్తశతకము
అ. ర. సదాశివరామాయణము

౨౪౫- చింతామణి నరసింహా
చార్యులుగారు
అష్టావధాని. జ: స్థా. గంగవరము జి
మహబూబునగరు వ ౨౮
అ. ర. ౧. రాఘవాశ్వమేధము ౨. చం
ద్రహాసము, ౩. వరూధిని. ౪. సుచంద్ర ౫, కృ
తికీర్తి. ౬. శాకుంతల ౭. సహాహమహిమ
౮. శ్యమంతకమణి. ౯. తామ్రకౌతుచరిత్ర
౧౦. కన్యకామహిమ ౧౧. మిత్రవింద ౧౨.
జానకీపరిణయము

౨౪౬- చక్రహరి నారాయణభట్టు
మూర్తిగారు
కు. భట్టురాజు.
వ. ౨౦.
జ. స్థా. లింగంపేట తా: జగిత్యాల
జి. కరీంనగరు.

౨౪౭. వానమామల జగన్నాథా
చార్యులుగారు
జ. స్థా. మడికొండ: జి. వరంగల్.
అ. ర. కార్పాస లక్ష్మీనాటకము

౨౪౮. వానమామలవరదాచార్యులు
జ. స్థా. మడికొండ. వరంగల్ జిల్లా.
నం. (౨౪౭) సోదరులు.

ఆ. ర. వైశాలిని పరిణయము

౨౪౯. శివరామ సిద్ధాంతిగారు

జ. స్థా. సింగంపల్లి తా. తాటికొండ

జి. మహబూబునగరు.

వ. ౨౩.

౨౫౦. డాక్టరు పింగిలి లింబాద్రిరెడ్డి

జ. స్థా. నెమిలికొండ జి. కరీంనగరు

విజ్ఞానప్రచారిణీ గ్రంథమాల సంపాదకులుగానుండి ఆరు గ్రంథములు ప్రకటింపజేసిరి.

౨౫౧. బి. వీ. శ్యామరాజుగారు

నంబరు [౨౫౩] సోదరులు. వీరిరువురు జంటకవులు. నం (౧౨౭)కి శిష్యులు.

జ. స్థా. ఘట్టుపల్లి తా. తాటికొండ జి. మహబూబునగరు. వ. ౩౪

ఆ. ర. ద్రౌపదీ మానసంరక్షణము
తామ్రధ్వజ కీచకవధ సానందోపాఖ్యానము ప్రహ్లాద సావిత్రి శ్రీకృష్ణజననము కుచేల ఉత్తర గోగ్రహణము.

ఇ. ఘట్టురాజు

వీరితండ్రి చంద్రమరాజుగారు ప్రబంధకవులు.

౨౫౨. కందాడ నరసింహాచారిగారు

జ. వికృతి ఫాల్గుణబ ౨

జ. స్థా. రెడ్లరేపాక

తా. భువనగిరి జి. నల్లగొండ.

ఆ. ర. అభినవహరికథా మహాభారతము
రామాయణము కుచేల ప్రహ్లాద రామానుజ చరిత్ర గోదాకల్యాణము సత్యాకల్యాణము

౨౫౩. ఒద్దిరాజు గోపాలరావుగారు

జ. స్థా. ఇనుగుర్తి. జి. కరీంనగరు

ము. ర. మనోరమ

౨౫౪. యామవరము రామ
శాస్త్రిగారు

వ. ౩౭ జ. స్థా. కుక్కనూరు జి మెదకు

బి. శ్లేషయమక చక్రవర్తి అష్టావధాని

ము ర. మాతృప్రార్థనము

ఆ. ర. గురుస్తుతి, కుమారశతకము, చిత్రచిత్రవివాదము, దత్తాత్రేయపూజ, మాణిక దండకము, వృత్తిపరామర్శ, యమకస్తవరాజము, కుమారబోధ, శుద్ధాంధ్రకృష్ణానిరుద్ధము, భాగవత ఏకాదశస్కంధము

౨౫౫. కాళ్ళబండి రాఘవయ్యగారు

జ. స్థా. క్షీరసాగరము హాములపర్తి టప్పా జి. మెదకు వ ౨౪

౨౫౬. కీ. శే. కడకుంట్ల
పాపశాస్త్రిగారు

బి. కవికరి

జ. స్థా. కడకుంట్ల వనపర్తి సంస్థానము తన ౩౦వ ఏట మృతినొందెను.

ఆ ర. భారత సంగ్రహము పన్నెండు గుచ్ఛములది, సంస్కృతము భ్రమరాంబికా సంవాదము. ఆంధ్రప్రబంధము, తెనుగుగ్రంథము కవివంశీయులయొద్దనుండి మాయమైనది. సంస్కృతము శిథిలమైనది.

మ. ౨౦ సం॥ క్రితము

౨౫౭. సురవరము ప్రతాపరెడ్డి గారు
బి. ఏ. బి. ఎల్

జ స్థా. ఇటిక్యాలపాడు తా. అలంపూరు జి. రాయచూరు వ. ౩౯

ము. ర. ౧, హిందువుల పండుగలు ౨, సంఘోద్ధరణము, ౩, ఉచ్ఛలవిపాద నాటకము, ౪, కర్నూలురాజుల వంశావళి, ౫, గ్రంథాలయములు, ౬, మద్యపానము, (మూడు వివిధగ్రంథములీపేరున ప్రకటితములు) ౭. పూనా వ్యవసాయప్రదర్శనము, ౮. గ్రామజన దర్పణము, ౯, సోమనాద్రి ౧౦, రామేశ్వరచరిత్ర

ఆ. ర. ౧, తుకారాంనాటకము ౨, శుద్ధాంత కాంతనవల, ౩, చంపకీభ్రమరము ప్రబంధము

౨౫౮. కీ. శే. గుడిమంచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

జ. స్థా. శ్రీరంగాపురము వనపర్తి సంస్థానము జి. మహబూబునగరము
ఆ. గ్ర. భారతసంగ్రహము
మ. ప్రమోదూత బి. భావకవిప్రకశిరోమణి ఈ బిరుదమును గద్వాల స్థానములో ఆనెగొంది నారాయణశాస్త్రిగారు సభామధ్యమున నిచ్చినారు. చనిపోవునపుడు వయస్సు ౩౮

౨౫౯. వనం వేంకటనరసింహారావు గారు

జ. స్థా. పెదమండువ తా. ఖమ్మం
జి. వరంగల్ వ. ౪౦
ము. ర. శ్రీవెంకటేశ్వరశతకము
పద్మినీబాయి నవల
ఆ. ర. రుక్మిణీనాటకము
గాంధీశతకము
వీరి తాత నారసింహారాయడు అనువారు తెనుగుకవి ధర్మాంగదచరిత్ర నీలకంఠస్వామి దండకము, శారదాదండకము రచించినారు.
ముత్తాతయు కవియని ధర్మాంగదలో నుదహరింపబడినాడు

౨౬౦. శ్రీకిడాంబివాడి కేసరి శృంగారం కృష్ణాచార్యులుగారు

జ. ౧౩౧౩ ఫ.
జ. స్థా. సీతారాంబాగు హైదరాబాదు నగరము
సంస్కృతాంధ్ర కవి జ్యోతిశ్శాస్త్ర పండితులు

౨౬౧. గొబ్బూరు నృసింహాచార్యులుగారు

బి. బాలకవి, అష్టావధాని
జ. విశ్వావసు భాద్రపద శు౩
జ. స్థా. వేలూరు తా. సిద్దిపేట జి. మెదకు
ము. ర. శ్రీరామాయణసారము, కుశలవ, బాలభక్తభజనమాల,
ఆ. ర. చక్రిసునియా నాటకము, పుండరీకచరిత్ర, సూరదాసుచరిత్ర. గోరాకుంభా. కన్యకాపరమేశ్వరి, శ్రీనివాసకథా కల్లోలిని, మహాభారతము, ఉత్తరరామాయణము, నృకేసరిశతకము

౨౬౨. కీ. శే. రంగరాజు కేశవ రావుగారు

ఆరబీ; ఫార్సీ, ఉర్దూ, సంస్కృతము తెనుగు వీనిలో అసమానపండితులు. ఫార్సీకవిత్వము చేసవ్వాబు యక్బాలుద్దౌలాను మెప్పించి కవిశిరోమణియను బిరుదమందినారు మ. ౧౩౧౪ ఫ.
జ. స్థా. ఖిలేషాపురము జి. ఆత్రాపుబల్దా
జ. కాళయుక్తి జ్యేష్ఠ బ౧౪
ఆ.ర. ౧, విక్రమాదిత్యీయము. ౨, ఇంద్రద్యుమ్నీయం, ౩, రామాభ్యుదయము, ౪; లీలాపరిణయము, ౫, కల్కిపురాణము. ము ర. దాశరథీ శతకము

౨౬౩. కీ. శే. గాదె రామచంద్ర రావుగారు

జ. స్థా: సింగవరము జాగీరు
మ. ౫౦|| క్రితము
ము.ర. కాంత_పద్యకావ్యము

౨౬౪. కీ. శే. దీక్షితుల నరసింహ శాస్త్రిగారు

జ. స్థా. ఆత్మకూరు [సంస్థానము] జి. మహబూబునగరు
బి. సంస్థాన ప్రభువులచే మహాకవి_అను బిరుదములభించెను మ. ౫_౬ సం|| క్రితము
ఆ.ర. ౧, లక్ష్మణపరిణయము ౨, తెనుగు సత్యనారాయణవ్రతకల్పము, ౩, విమురాశ్వత్థమాహాత్మ్యము, ౪. శ్రీరంగమహాత్స్యవవర్ణమాలిక, ౬. పానువేట పద్యములు

౨౬౫. ఇ. రాజయ్యగారు

జ. స్థా. చెన్నూరు జి. ఆదిలాబాదు
జ. ప్లవ కార్తిక బ|| ౬
ము.ర, ౧, సాంఘికనీతి, ౨ఉత్తమధర్మము

ఆ.గ్ర. ౧, ఉమామహేశ్వరశతకము ౨. శిల్పమాతృవిలాపము, ౩. ప్రాకృతికశిక్ష

### ౨౬౬. బెల్లంకొండ నరసింహాచార్యులుగారు

బి. అష్టావధాని

జ.స్థా. మఖ్తా నడ్డెపల్లి-తూపురాణ్ టప్పా జి. అత్రాపుబల్దా వ. ౩౪

వీరు దేశబంధుమాసపత్రికా సంపాదకులుగా ౭ సంవత్సరములు నడిపిరి. సంస్కృతాంధ్రకవులు కవిపండిత వంశము ఆ.గ్ర. ఆంధ్రరామాశ్వమేధము. ఆంధ్రవిశ్వకర్మాదర్శము, ప్రభావతీప్రద్యుమ్నము, చారుమతీపరిణయము, మండోదరీపరిణయము: భాగవతసంగ్రహము, రామాయణసంగ్రహము, మీనాక్షి, సత్యభామాగర్వాపహారణము, ఉత్తరకల్యాణము, కుశలవవివాహము, అభిమన్యువివాహము, కీచకవధ. తులసీవివాహము, కన, కసేనవిజయము, సత్యభామావిజయము, రాజహంసోపాఖ్యానము, రత్నమాల సంపూర్ణరామాయణము, కుమారవిజయము, ఉగ్రపాండ్యచరిత్రము, చీనాసుందరి.[నవల] మల్లికార్జున కీర్తనములు ము.గ్ర. శ్రీశివమహాభక్తవిజయము ౪ భాగములు

### ౨౬౭. బో. ఆండాళమ్మగారు

కు. శ్రీవైష్ణవ. వ.౧౮

శ్రీ బి. వెంకటాచార్యులుగారి భార్య భర్త చనిపోయినవారు జ. స్థా. గద్వాల ఈయన వం [౪౧] గారి సోదరి

### ౨౬౮. గివ్వా అమృతరెడ్డిగారు

జ.స్థా. పిల్లలమఱ్ఱి తా. సూర్యాపేట జి. నల్లగొండ ఆ.గ్ర.అమృతగీతములు

### ౨౬౯. నీలకంఠ చంద్రమౌళీశ్వర కవులు

నీలకంఠ శాస్త్రిగారు, చంద్రమౌళీశ్వర శాస్త్రిగారును సోదరులు కవులు

జ.స్థా. మారాముడుగాల. తా, ఆలంపూరు జి. రాయచూరు

౨౫-౨౦వయస్సు గలవారలు గ్రంథాలయమునొకటి తమగ్రామమందు స్థాపించి నడుపుచున్నారు.

ఆ.గ్ర. దేవమాతామణి సదాశివశతకములు, మార్కండేయ చరిత్ర

### ౨౭౦. గంగుల సాయిరెడ్డిగారు

జ.స్థా. జీడికల్లు తా. జన్గాం జి.నల్గొండ వ. ౪౦ ఆ.గ్ర. కాంగ్రెసు

### ౨౭౧. వెంకటరాజన్న అవధానిగారు

బి. వైద్యవర కు, బ్రాహ్మణులు వ.౨౮

జ.స్థా. మంథెన జి. కరీంనగరు

### ౨౭౨. వి-లక్ష్మీదేవమ్మగారు

జ.నక్ష చైత్రశుద్ధ

జ.స్థా అమరచింత జి. మహబూబునగరు

### ౨౭౩. నిర్మల శంకరశర్మగారు

జ. పింగళి శ్రావణ బ౧౧

జ.స్థా. నిర్మల

### ౨౭౪. క- హ-సత్యనారాయణ రావు గారు

జ.స్థా. మటుమరి జి. రాయచూరు

ఆంధ్రకన్నడకవులు: —

రచనలు కన్నడములో హనుమేశ శతకము, ౨.త్రివేణి, ౩.ధైర్యం సర్వసాధనం. ౪. యాదవరాజనూయ నాటకము

వీరు హెచ్చుగా కన్నడమందే ప్రసిద్ధిగాంచినకవులగుటచేతను, కన్నడగ్రంథ రచయితయగుటచేతను ఆంధ్రమందు ఛందోదోషములు కనబడుచున్నవి

### ౨౭౫. రేమిడిచర్ల వేంకటకృష్ణా రావు గారు

వ. ౨౩

జ.స్థా. రేమిడిచర్ల తా-మధిర.జి. వరంగల్. నం-౨౨రెడ్డు వీరున్నూ శలిసి రాజకృష్ణులుఅనుపేరు రచించిన గ్రంథములు

౧-పుష్పమాల ౨-గర్వభంగము-౩-దీక్ష
౪-లలిత

౨౪౬. గవ్వా జానకిరామరెడ్డి గారు
వ. ౩౦ సం [౨౬౮] సోదరులు
జ.స్థా. పిల్లలమఱ్ఱి తా. సూర్యాపేట జి. నల్లగొండ
ము.ర. దేశబంధు. దానకల్పద్రుమము
అ.ర. సత్పథము. సుధాకరుడు. దైవచింతన

౨౪౭. జొన్నలగడ్డ హనుమంతురెడ్డి గారు
జ. శుభకృతు శ్రావణ బ౯
జ.స్థా. యాదగిరిపల్లె తా. మిరియాలగూడ జి. నల్లగొండ

౨౪౮. ఊటుకూరు సూర్యనారాయణరావు గారు
వ. ౨౯ జ.స్థా. వల్లాపురము తా. ఖమ్మం జి. వరంగల్

౨౪౯. పులిగోటి ఆనందమాంబగారు
కన్యక-వ. ౧౨ అష్టావధానముచేయును కు వెలమ
తండ్రి పులిగోటి మంగారావు గారు
జ.స్థా. కొడిమేల తా. జగిత్యాల జి. కరీంనగరు

౨౫౦. తిరువాయిపేట రంగకవి గారు
వ. ౪౯ జ.స్థా. చేర్యాల తా. జనగామ జి. నల్గొండ ము.ర. బిల్హణచరితము
అ.ర. ప్రమీళార్జునీయము. రంగవాస్తువు, వేంకటేశ్వరమహత్త్వము

౨౫౧. పులిజాల వేంకట రంగారావు గారు
జ.స్థా. నల్లగొండ దేశపాండ్యాలు హైకోర్టువకీలు తృతీయాంధ్ర సభాధ్యక్షులు ఏ. యల్. డి. బి. యస్ సి

౨౫౨. అరిగె రామస్వామిగారు
కు. హరిజనులు వ, ౪౫
ఆంగ్లములో మెట్రికువరకుచదివినారు రైల్వేలో చాలకాలముద్యోగము చేసినారు.
ప్రకృతము హైద్రాబాదు నగర మునిసిపాలిటీలో సభ్యులుగానున్నారు

౨౫౩. కే. సీతాపిరాట్టమ్మగారు
జ.స్థా. నల్లగొండ ఉపాధ్యాయిని

౨౫౪. వడగం రాజేశ్వరరావు గారు
వ. ౨౬ జ.స్థా. రేమిడిచర్ల జి వరంగల్ చూడుడు సం (౨౬౫)

౨౫౫ మొలుగు నరసింహాచార్యులు గారు
జ.స్థా. మొలుగు తా.సిద్దిపేట జి. మెదకు వ.౩౫

౨౫౬. ఆచి వేంకటాచార్యులు గారు
జ. ఆనంద ఆషాఢ శు౧౦
జ.స్థా అవునూరు తా.సిరిసిల్ల జి. కరీంనగరు

౨౫౭. వట్టెము నరహరికవి
వ. ౬౨ జ.స్థా. వట్టెము తా. నాగరకర్నూలు జి. మహబూబునగరు
సం ౨౩) కృతులు

౨౫౮. బి. విశ్వనాథ శాస్త్రి గారు
జ.స్థా. సిద్దిపేట జి. మెదకు
అ.ర. ప్రబోధ చంద్రోదయము, ఆంధ్రీకృతము

౨౫౯. తోపు వేంకటాచార్యులుగారు
జ.స్థా గద్వాల వ. ౬౦ సంస్కృతాంధ్రకవి

౨౬౦. టి. ధర్మయ్యాచార్యులు గారు
కు. విశ్వబ్రాహ్మణులు
జ.స్థా, భువనగిరి జి. నల్లగొండ

౨౬౧. చిదిరెమఠము వీరభద్ర శర్మ గారు
కు. వీరశైవులు
జ.స్థా. చర్లపల్లి జి. నల్లగొండ వ. ౨౯ ప్రకృతము కాశిలోనున్నారు.
బి. వేదతీర్థ. కావ్యతీర్థ, స్మృతితీర్థ, ధర్మాచార్య, సాహిత్యవిశారద.
ము.ర. వీరశైవవివాహవిధి [తెనుగు] ౬౦

(ధవీరశైవులు (కన్నడము) కాశీపీఠప్రాచీనత (మరాటి)

ఆ.ర. ఆంధ్రమాలవికాగ్ని మిత్రము, ఋగ్వేదము, (ప్రథమాష్టకము) తర్కసంగ్రహము,(తెనుగు) మీమాంసాపరిభాష శిఖాసిద్ధాంత శిఖామణి, సంస్కృతవాఙ్మయపరిచయ (కన్నడం)

సంబరు(౧౨౩) వీరిపినతండ్రి. వీరితాత తండ్రిచిత్తారుగంగయ్య ప్రసిద్ధకవి. ఈయనతాతపేరుననిడియే ఈతెమురలించి నన్ను శృంగారభల్లాణ చరిత్రము మరియుశృంగారగంధమాలవారు ప్రకటించినారు, వీరిజనకులు కవులే

చిదిరెమఠము అనుపేరు బీదరుజిల్లాలోని చిద్రిఆనుమఠమునుండివచ్చినది అమఠమునకు ౧౬౦౦౦ శిష్యులు కలరు.

ఈకవిగారు మరాటీ కన్నడము సంస్కృతాంధ్రములు బాగుగా నెరిగి కవిత్వము చేయువారు

౨౯౨. పురాణం మల్లయ్యగారు

వ. ౪౦

జ.స్థా. గద్వాల. జి. రాయిచూరు

౨౯౩. ముత్యంపేట సాంబయ్య గారు

జ.స్థా. సిదిపేట జి. మెదకు

౨౯౪. కీ. శే. దేవంభట్ల సత్యనారాయణ శాస్త్రిగారు

నిజాంరాష్ట్రమండలి యినాముదారులు యూనామ్యాదారులు

మ. దుందుభి ఆషాఢము వీరి మేనల్లుడు సం (౧౨౪) జన్మస్థానమేదియో తెలుపలేదు.

౨౯౫. సి. ఇ. ఆంధ్రదాసు గారు

జ.స్థా. హనుమకొండ జి. వరంగల్

వ. ౨౫

ఆ.ర. కుసుమాలయము, పుష్పాంజలి

౨౯౬. మామునూరు నాగభూషణ రావుగారు

జ. శోభకృతు

జ.స్థా. మామునూరు. తా మధిర జి.వరంగల్

ఆ.ర. తొలిపూత ప్రేమారాధనము ప్రణయానర్ఘ్యము, నాటకము

కు. నియోగి

౨౯౭. కన్నెకంటి సత్యనారాయణ మూర్తిగారు

జ.స్థా. మానుకోట వ.౨౦

౨౯౮. మందడి వేంకటకృష్ణకవిగారు

బి కవిశరభ జ.స్థా. పెద్దమందడి జి. మహిబూబునగరము

ము.ర. ౧,రెడ్డికులనిర్ణయచంద్రిక (శేషాద్రిరమణకవులతోకలిసి) ౨. కేశవవిలాసము

ఆ.ర. నిర్వచనభక్త విజయము, గద్వాల సంస్థానచరిత్ర. మానుకవిలాసము

౨౯౯. శ్రీ గిరిధరరావుగారు

జ.స్థా. హుజూరాబాదు జి. కరీంనగరు

౩౦౦. ఆసూరి మరింగంటి శ్రీరంగాచార్యులుగారు

జ.స్థా. దేవరకొండ జి,నల్లగొండ

కవితను వివరములేమియు తెలుపలేదు.

౩౦౧. ఒద్దిరాజు సీతారామచంద్ర రావుగారు

జ. సర్వజిత్తు కార్తిక బ౬

జ.స్థా. ఇనుగుర్తి తా. మహబూబాబాదు జి. వరంగల్

ము.ర. ఉపదేశ రత్నమాల, తిరుప్పల్లాండు, భక్తిసారచరితము, ప్రేమప్రవాహము, శశివిషాణము

..వీరు "తెనుగు" వారపత్రికను ౫సంవత్సరములునడిపి చాలప్రబోధము కావించిరి.

౩౦౨. బుక్కపట్టణము రామచంద్ర కవిగారు

బి. శతావధాని, జ. విజయ

ము.ర. బభ్రువాహన, సురుచి,సత్యభామ

వ్రతకల్పము. లక్ష్మీపరిణయము, నాగ్నిజిత్పరిణయము
అ.ర. ఆనందరామాయణము
జ.స్థా. గోపాలపేట సంస్థానము

౩౦౩. పత్రి విశ్వేశ్వరశాస్త్రిగారు
వ. ౭౮ తండ్రి కవులు
ము.ర. రామాయణసంగ్రహము
జ.స్థా. కొల్లాపురము, స్నేహలతాకవితా సంఘసభ్యులు

౩౦౪. తెలికేపల్లి రామచంద్ర శాస్త్రి గారు
జ.స్థా. రాజాపురము గోపాలుపేట జి. మహబూబునగరు వ. ౩౪
బి. అభినవకాళిదాస, సాహిత్యకల్పద్రుమ అలంకారనటరాజ, కవికులతిలక
ము.ర. భారతీతారామాల, లలితసహస్రీ, హనుమద్గీవశతకము, కవితాకన్యాస్వయంవరము
అ.ర. కావ్యలక్ష్మి, కలికశతకము

౩౦౫. శ్రీ పెరుంబూదూరు వేంకట కృష్ణమాచార్యులుగారు
వ. ౭౦ సంస్కృతాంధ్రకవులు
జ.స్థా. గద్వాల. జి. రాయిచూరు
వాణాలశేషాచార్యులు వీరి వంశీయులు మైథిలీపరిణయకర్తలైన పూర్వకవి

౩౦౬. నల్లానిచక్రవర్తుల రంగాచార్యులుగారు
జ.స్థా. శుభవీడు జి. వరంగల్

౩౦౭. గోవిందుల కృష్ణమాచార్యులు గారు
జ.స్థా. బండలింగాపురము తా. జగ్త్యాల జి. కరీంనగరు వ ౧౫

౩౦౮. సేనాపతి నరసింహాచార్యులు గారు
జ.స్థా. కోరుట్ల జ. చిత్రభాను

౩౦౯. పుల్లగుమ్మి వేంకటాచార్యులు గారు
జ.స్థా. గద్వాల జి. రాయిచూరు
ము.ర. లక్ష్మీస్తవము। అలంకారావళి, ఆదిలక్ష్మీకర్ణపూరము నామావళి. శేఖరసారము, ఆంధ్రవ్యాకరణసూత్రావళి, దీర్ఘప్రసవదిక్కారము
వ. ౯౬ తాతతండ్రి ఆంధ్రకవులు
శ్రీరామతామహులు పురాణం దీక్షాచార్యులు కవులు, మేనమామ పురాణం నృసింహాచార్యులు గారు తిరుపతివేంకటకవుల తోడికొన్నారు.

౩౧౦. తొగిడి రామబ్రహ్మాచార్య కవి గారు
జ.స్థా. వరంగల్ వ. ౪౦ ను. విశ్వబ్రాహ్మణ అ.ర. సాంఖ్యకబోధము

౩౧౧. భట్టర్ అనంతాచార్యులుగారు
జ.స్థా. మోతుకూరు తా. భువనగిరి జి. నల్గొండ వ. ౭౧ బి. వరసకవి
అ.ర. పద్మినీప్రభాకరీయ నాటకము
తాత బుచ్చమాచార్యులు కవులును ప్రసిద్ధగాయకులునైయుండిరి.

౩౧౨. ముదిగొండ మల్లనారాధ్య కవిగారు
వ. ౭౫ జ.స్థా. [గిర్మాజిపేట] వరంగల్
ము.ర. అహల్యా సంక్రందనము

౩౧౩. పంతం ఆంజనేయకవిగారు
జ.స్థా. సికిందరాబాదు
ము.ర. విచిత్రరాఘవీయం, మోక్షసాధని, శ్రీకృష్ణలీలాతరంగిణి

౩౧౪. విక్రాల నరసింహాచార్యులుగారు
జ. శా.శ. ౧౮౭౫
జ.స్థా. రాజానగరము వనపర్తి జి. మహబూబునగరు
ము.ర. భారతీస్తుతి, కల్యాణి
అ.ర. మాలతీమాధవము [ఆంధ్రీకృతము]

కురుసంధానము: మాతాంగదము, జగన్మోహనభాణము
వీరిపూర్వులైన విక్రాల శేషాచార్యులు మైసూరులో కంఠీచంద్రహారము. గజ బహుమతియు కవికంఠీరవ బిరుదమును బొందిరి

౩౧౫. బొమ్మినేని రాజరెడ్డిగారు

జ.స్థా. పెద్దపెండ్యాల తా. రాయిగిరి నవ్వాబుసాలార్జంగుగారి ఎస్టేటులో ప్రకృతము వెంకటాపురము తా. ములుగు
వ.౫౫ ము.ర. లక్ష్మీస్తవము
అ.ర. యాదగిరినృసింహస్తవము, అంజనేయస్తవము, ధర్మసంగ్రహము

౩౧౬. కీ. శే. నేరెళ్ల నరసింహరామ కవిగారు

జ. క్రోధన ఆషాఢశు౭ ము: సిద్ధార్థి.
జ.స్థా. మట్టెవాడ జి. వరంగల్
అ.ర. చంద్రహాసనాటకము; శుద్ధాంధ్ర నిఘంటు, లక్ష్మీశతకము, గోవిందనామ కీర్తనము

౩౧౭- డింగిరి నరసింహాచార్యులుగారు

జ.స్థా. ఇస్లాంపురమ్- మాసాయిపేట స్టేషన్ వ.౨౨ అ. ర. రాఘవశతకము

౩౧౮. కీ. శే. మాడుగుల వేంకయ్యగారు

కు. ఈడిగ జ.స్థా. కుంట్లూరు తా. షర్కి జి ఆత్రాఫుబల్దా మ. ౧౫ ఏండ్లక్రితము
అ.ర. ద్రౌపదీవస్త్రాపహరణము

౩౧౯. చెరుకుపల్లి నరసింహ సిద్ధాంతి గారు

జ.స్థా. కొల్లాపురము జి. మహబూబు నగరు
ము.ర. సంగమేశ్వరశతకము, సంగ్రహ భారతము, సంగ్రహరామాయణము
అ.ర. సింగపట్న నృసింహశతకము
" నృసింహవిలాసము
" లక్ష్మీనృసింహ క్షేత్రమాహాత్మ్యము

౩౨౦. ముదిగొండ సాంబశివ కవిగారు

జ.స్థా. పులిమామిడి తా. ధారూరు జి. ఆత్రాఫుబల్దా కు: పద్మశాలి. వ. ౩౨

౩౨౧. నంద్యాల అనంతరాఘవాచార్యులుగారు

జ.స్థా. జమ్మిచేడు-గద్వాల జి. రాయచూరు. జాగీర్దారుగారు
నంబరు ౧౧౦ గారిపుత్రులు

౩౨౨. కీ. శే. కొండపాక నారాయణాచార్యులుగారు

కు. వైశ్వబ్రాహ్మణ జ.స్థా. దేశాయిపేట జి కరీంనగరు మ. ౧౩౩౬ ఫ.
అ ర. బ్రహ్మానందలీలాకరము

౩౨౩. గోవర్ధనం వేంకటనృసింహాచార్యులుగారు

జ.స్థా. విభురామపేట తా. మిర్యాలగూడ జి.నల్లగొండ వ ౭౦
బహుగ్రంథకర్త అన్నియునముద్రితములు

౩౨౪. ఇ. పి. వేంకటరామ కవిగారు

జ.స్థా. ఆలేరు ము.ర. కౌసల్యాపరిణయము కృష్ణార్జునీయము, రుక్మాంగద, యమకరామతారావళి, పరకాలవిజయము సత్యనారాయణస్వామి

౩౨౫. ముదిగొండ శంకరశాస్త్రిగారు

బి. సాహిత్యవిద్యాప్రవీణ
జ.స్థా. పాపయ్యపేట జి. వరంగల్

౩౨౬. చింతామణినరసింహాచారిగారు

జ.స్థా, శంకరమ్మపేట. వనపర్తి జి.మహబూబునగరు మ ౩ ఏండ్లక్రితము
ము ర. వరదాభ్యుదయముపద్యకావ్యము

౩౨౭. మాడపాటి హనుమంత రావుగారు

సుప్రసిద్ధులు. జ.స్థా: ఎఱ్ఱుపాలెము తా. మధిర జి.వరంగల్ వ.౫౦
ము.ర. మల్లికాగుచ్ఛము, ఖాత్రికాలపు హిందూ ఆర్యులు
అ. ర. మహాభారతసంవీక్షణము

3౨౮. తూము రామదాసుగారు
వ.౪౯ జ.౧౮-౮-౧౮౫౬
మ. ౨౯-౧౦-౧౯౦౪
ము.ర. చిత్రబిందోద్వాహము, కాళిదాసు నాటకము, ఆంధ్రపద నిధానము
అ.ర. రుక్మిణీకల్యాణము గేయము గోపికావిలాసము జ.స్థా. వరంగల్

3౨౯. వటపురి వేంకటాచార్యులుగారు
జ.స్థా. కందికట్కూరు తా. సిరిసిల్ల జి. కరీంనగరు

330 సయ్యదలీగారు
మతము. ముసల్మాను,
ఎం (౧౯౧) సోదరులు
జ.స్థా. దేవరకొండ జి. నల్లగొండ
అ.ర. జలంధరాసురకథ ప్రమీల, దిగంబరమోహిని, శాంతశీల హరిప్రియ నవీన సత్యహరిశ్చంద్ర, నలచక్రవర్తి, భీమవర మహాత్మ్యము, తార్క్ష్యోపాఖ్యానము, బభ్రువాహన, ధృవ, సగర, అనందగురుగీత. ముక్తిప్రదాయిని, సత్యాద్రౌపదీసంవాదము. కాళింది, సిరిసినగండ్ల నలనాటకము, సీతారామశతకము, సురాభాండేశ్వరము, మానవిక రాజయోగము

33౧. గుడిపల్లి వేంకటరెడ్డిగారు
జ.స్థా. చిత్తలూరు జి నల్లగొండ

33౨. మరింగంటిలక్ష్మణదేశికులుగారు
జ.స్థా. మల్లంపల్లి తా. జనగాం జి. వరంగల్ వ.౬౫
ము.ర. కారికావలి, సూక్తి రత్నమాల
అ.ర. రామానుజాష్టోత్తరశతము

333. శ్రీధర కృష్ణశాస్త్రిగారు
జ.స్థా. పంచాలకట్ట కొల్లాపురసంస్థానము జి. మహిబూబునగరము
అ.ర. శ్రీరామమందహాసము చంపూ ఇది కర్నూలులో ఇంద్రగంటి కృష్ణంభట్టు అనువారినొద్ద దొరికినది. వారు గ్రంథమును చూపింపనేచూపింపరు. తమకు తెలియును

33౪. తి.బు. అణ్ణయాచార్యులుగారు
బి. సాహిత్యశిరోమణి
జ.స్థా. ఆత్మకూరు జి.మహిబూబునగరు
సుప్రసిద్ధకిరీటివంశస్థులు
జ. విజయ నిజాషాఢ బ౯

33౫. కీ. శే. దమూరిశ్రీ తారామానుజాచార్యులుగారు
జ.స్థా. తుంగతుర్తి తా. సూర్యాపేట జి.నల్లగొండ వ.౭౨ మ ౬౦ఏండ్లు
ము.ర. యాదగిరిగీత
అ.ర. రామానుజాష్టకము, తిరునామములు

33౬- చిగుళ్లరేవు వేదాంతాచార్యులుగారు
జ.స్థా. జిల్లెళ్లటప్పా కొణుమర్తి జి. మహిబూబునగరు వ.౬౦

33౭. హారతి దీక్షాచార్యులుగారు
జ.స్థా. అమరచింత జి.మహిబూబునగరు
అ.ర. మహాంతర్లాపరత్నమాల, శ్రీనివాసపంస్తుతి, శ్రీరామమంగళహారతి, శ్రీరామకేశవస్తుతి. అలంకరణమణిమాల, ఆచార్యగద్యం. ఆచార్యవింశతి

33౮. మంగవెల్లి బుచ్చి వెంకటాచార్యులుగారు
జ.స్థా. కొలనుపాక జి నల్లగొండ వ.౬౨

33౯. శివరామ శాస్త్రి
జ.స్థా. అలూరు తా. తాటికొండ జి. మహిబూబునగరము వ. ౨౮
ము. ర. సౌందర్య సౌశ్యలికాసాంతకము, సమస్యామంజరి

3౪౦. బొమ్మకంటి సత్యనారాయణ రావుగారు
జ.స్థా. కలకోట తా.ఖమ్మం జి.వరంగల్
జ. శోభకృతు పుష్యబ౨
మ. శుక్ల చైత్రబ౫
అ.ర. రమామనోహరశతకము

3౪౧. పేరక రంగాచార్యులు గారు
బి. సంగీతాష్టావధాని హరిదాసు

జ.స్థా. గౌలిగూడ హైదరాబాదు వ.౩౦
ము.ర. శతకంఠ రామాయణము, గీతార హస్యము
అ.ర. విప్రనారాయణ నాటకము. మాయా తురంగము

**౩౮౨. చింతామణి సింగరాచార్యులు గారు**

జ.స్థా. రాచలూరు మంకాలటప్పా జి. మహిబూబునగరు
అ.ర. చక్రాచల మాహాత్మ్యము, జయప్ర దాపరిణయము

**౩౮౩. గోవర్ధనం. రామానుజాచార్యులు గారు**

జ.స్థా. సీతారాంబాగు హైదరాబాదు నగరము

**౩౮౪. పావకంటి పుల్లమరాజు గారు**

కు. భట్టురాజు జ. స్థా. జంగమాయిపల్లె వనపర్తిసం|| జి. మహిబూబునగరము

**౩౮౫. కీ, శే. కొక్కిరేణి నరసింహ రాయ కవిగారు**

జి, వరంగల్ తా. మానుకోట బీరవోలు
ము.ర. విష్ణుభాగవతము ఏకాదశస్కంధము ఆంధ్రపద్యాత్మకము

**౩౮౬. జోస్యం వేంకటాచార్యులుగారు**

జ.స్థా. అమరచింత జి. మహిబూబునగరు

**౩౮౭. తి. బు. జాతకవిద్వన్మణి వేంకటాచార్యులుగారు**

జ.స్థా. ఆత్మకూరు జి. మహిబూబునగరు
కిరీటి వేంకటాచార్యుల వంశము
వం (౧౧) మొక్క కుమారులు
జ: శా.శ: ౧౮౦౭. పార్థివ చైత్రబ౬
బి. జాతకవిద్వన్మణి

**౩౮౮. మాడభూషి రాఘవాచార్యులు గారు**

జ.స్థా. అమరచింత జి. మహిబూబునగరము

**౩౮౯. వానమామలై లక్ష్మణాచార్యులుగారు**

జ.స్థా. మడికొండ జి. వరంగల్
వం [౨౮౭][౨౮౯] వీరున్న సోదరులు.
ము ర. ప్రణయాభిజ్ఞానము

**౩౯౦కీ. శే. తి.బు. రంగాచార్యులుగారు**

జ.స్థా. ఆత్మకూరు జి. మహిబూబునగరు
సం౧౧. తమ్ములు జ. శుక్ల.మ. త్రయ
అ.ర. స్తోత్రజాలములు, రంభోర్వశీయము బంధకవి అనేక బంధములు రచించినారు

**౩౯౧. కీ. శే. కిడాంబి శాపురం రంగాచార్యులు గారు**

జ.స్థా. పాపురము తాడికొండ జి మహిబూబునగరు వ.౬౬ము ౧౨సం|| క్రితము
బి. అనంతశయనములో "ప్రాచీనసరస్వతి" అనియు రామనాథపురములో సాహిత్యచూడామణి అనియు లభించినవి.
ము.ర. ప్రసన్నవక్త్రాభరణము, మనుకాస్తుభము, వ్యూహవైభవము, నవగ్రహయంత్రము
అ.ర. సుమారు ౧౦౦కి పైగా

**౩౯౨ ఆమనగల్లు హనుమంతరావుగారు**

జ.స్థా. మంకాల తా. పాబాద జి. అత్రాపుబల్దా

**౩౯౩. కీ. శే. కుమ్మరిగుంట్ల వేంకటాచార్యులు గారు**

జ.స్థా. రేమిడిచర్ల తా. మధిర. జి. వరంగల్
మ. రక్తాక్షి.

**౩౯౪. గుండా రాజలింగ కవిగారు**

జ.స్థా. గోవిందనగరం. జి. వరంగల్
కు. కోమటి. వ. ౩౫
అ.ర. షణ్ముఖజననము



శా. శ. ౧౬౭౨



సర్వతంత్ర స్వతంత్ర, రాజాధిరాజ గురుసార్వభౌమ, శ్లేషయమకచక్రవర్తి,
తర్కాలంకార వాచస్పతి, సకలభాషా విశేషకవితాధురంధర
ప్రతినవ ప్రబంధ పరమేశ్వరేత్యాద్యనేక బిరుదాంకితులైన
శ్రీ తి. బు. కిరీటి వేంకటాచార్య స్వాములవారు

శా. శ. ౧౬౨౯



శ్రీ నిగమాంతదేశికాపరావతార
శ్రీనివాస దేశికులవారు



శా. శ. ౧౬౨౫



శ్రీ తి. బు. అన్నయదీక్షితా
చార్యస్వాములవారు

# పూర్వ కవి పరిచయము

— పీఠిక —

ఆంధ్ర దేశమునం దొక భాగము మహాఘనత వహించిన శ్రీ నిజాము దొరతనము వారి యధీనమునందున్నది. ప్రభుత్వభేదమున నాంధ్రరాష్ట్రము చీలికలగుటచే ప్రత్యేక వ్యక్తిత్వము కవితలో నిజాము రాష్ట్రమునం గల యాంధ్రదేశమున నెంతవరకుం గలదో తెలిసికొనవలసిన యవసరము తటస్థించినది. ఈ రాష్ట్రమున నెన్నియో ఆంధ్రసంస్థానములు గలవు. ఎందరో కవులు గలరు. ప్రసిద్ధినొందిన శిల్పమెంతయో గలదు. గాయకులలో శిల్పులలో రాజనీతివిదులలో నెందఱు ప్రసిద్ధులు గలరో వారలొనరించిన సేవ యెట్టిదో పూర్తిగ గ్రంథస్థము కాలేదనుట వాస్తవము. దాదాపుగ నిచటి వాఙ్మయము అజ్ఞాతావస్థలో నున్నది. ఆధునికులలో నిచటివారు పలువురు సాహిత్యసంపన్నులై కవితాఝరుల నాంధ్రదేశమునం బ్రవహింపం జేయుచున్నారుగాని పర్వతపరివృతమగు నీ పీఠభూమి యా ప్రవాహము నావలికేగ వీలుగలిగింపకున్నది. కాననే ఈ రాష్ట్రమున కవులు మృగ్యస్థితిలో నుండిరని యొకానొక లేఖకుండు వ్యాసమునం బేర్కొనెను. వ్యక్తిగతమగు అభిప్రాయభేదముతో నిచటివారని స్థిరపడిన పూర్వకవుల జీవితచరిత్రములపై ఒక వ్యక్తి భిన్నాభిప్రాయములు వెల్లడించుచున్నాడు. అవి ప్రస్తుతాంశములు కావు. ఇపుడు నిజాము రాష్ట్రమునందలి ఆంధ్ర దేశమున వాఙ్మయసేవకులు పలువురు కార్యదక్షులగుచున్నారు. ప్రతిభాశాలురును యువకులునగు కవివతంసులు కవితాపుష్పములతో నాంధ్రభారతి నారాధించుచున్నారు. చిరకాలమునుండి పరంపరగం జెప్పికొను "ఈ రాష్ట్రమునం గవులేలేరు" అను వాక్యమెంతవఱ కీరాష్ట్రీయులు విని సహింపంగలరు? ఇదిగో చూడుండు. మా రాష్ట్రములోని యాంధ్రదేశమున వాఙ్మయపోషకులగు పూర్వకవులు పెక్కండ్రు గలరు. ఆంధ్రసంస్థానములు నాఁటినుండి నేటివరకు నొనర్చు మహాత్యాగముచే నేటికిని ఇతర ప్రాంతములకుం దీసిపోని కవితాకళాలాలసత్వము ఈ రాష్ట్రమునం గలదని సమాధానము చెప్పుటకే ఈ గోలకొండ కవుల సంచిక బయలువెడలినది. తనవ్యక్తిత్వము నిలువంబెట్టుకొనుచు నీసంచిక కవికుటుంబమునకు సన్నిహితసంబంధము సమకూర్చుట యొక విశేషము.

ఈ రాష్ట్రమునందలి యాంధ్రభాగమునందేగాక ఆంధ్రేతర ప్రాంతములందును ఆంధ్రకవులు కవితాకుసుమ సౌరభమును బ్రసరింపం జేసిరి. పలువురు

కవులచరిత్రము కాలగర్భమున మఱుగుపడినది. నాఁటి గ్రంథసముదాయము చాలవఱకు నశించినది. విస్మృతిసాగరమునందు అడుగుబట్టిన ప్రబంధరత్నముల వెలికిదీసి ప్రాచీనత్వము గుర్తింపనెంచుట సామాన్యకార్యముకాదు. ఆంధ్రవాఙ్మయమునఁ గవితాకళ పేరెన్నిక నొందినది మొదలు ముద్రణయుగము వచ్చువఱకుఁగల ప్రాచీన కవుల పట్టిక సిద్ధపఱచి దానిని వర్తమానకవుల పట్టిక కనుబంధముగఁ జేర్చుటచే నీకవులసంచిక నొకవిధముగ నీరాష్ట్రపు ఆంధ్రవాఙ్మయ నివేదిక యనవచ్చును. ఈప్రయత్నము తీవ్రదీక్షతో నిర్వహించిన కార్యశూరులగు శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారు ప్రశంసాపాత్రులు. వారికృషియే ఈగ్రంథమునకుఁ బ్రధానసాధనమైనది. ఈ సంచిక సమగ్రమనవీలులేదు. సమగ్రమగు కార్యము జరుగుటకు అనంతమగు కాలము పట్టును. కాన లభించిన పరికరములతో స్వల్పవ్యవధిలో నీ కవితాకుసుమమాలిక కూర్పఁబడినది. ఈమాలిక యసమగ్రమయ్యుఁ బ్రతిప్రసవము సుగంధభరితము. మకరందబంధురము. పరాగభాసురము.

ఈ రాష్ట్రమునందలి యాంధ్రదేశమున కొకయావరణ రేఖగీసి యందలి యాంధ్రవాఙ్మయవిశేషము లరయుదము. పశ్చిమచాళుక్యులు ఆంధ్రకవితావిలాసములకు దోహదము నొసంగిరి. విక్రమాదిత్యుని కొఱవి శాసనమువలన నన్నయభట్టారకునకుఁ బూర్వముననే పశ్చిమచాళుక్యులు రసవత్తరమగు తెలుఁగురచనముల వచనములలో శిలాశాసనములపయి లిఖించిరని తెలియును. రాజరాజనరేంద్రుఁడు ఆంధ్రభారతీనిలయము నెలకొల్పి నన్నయభట్టారకునిచే నారాధన విధినిర్వహింపఁ జేయుకాలమున నీరాష్ట్రమున రాజకీయపరిస్థితులుచాల క్లిష్టముగనుండెను. అనంతరమచిరకాలముననే కాకతీయనరపాలురు ఆంధ్రపతాకమును నిలువఁబెట్టిరి. ఆపతాకచ్ఛాయ క్రిందఁ బలువురుకవులుచేరి కవితాగీతములఁ బాడిరి. కాకతీయ మహాయుగమున బయలువెడలిన గూడూరు నగునూరు కొడిశాల (ఉప్పరపల్లి) శాసనములు ఆంధ్రకవితారచనమునకు నాఁటికాలమునఁగల రాజావలంబనము వెల్లడిచేయుచున్నవి. మల్లికార్జునారాధ్యులు సోమనాథుఁడు భాస్కర రామాయణ కవులు, గోనబుద్ధారెడ్డి, కాచవిభుఁడు విఠలరాజు మారన మున్నగు ప్రముఖులు కాకతీయ యుగమునాఁటి ఆంధ్రకవులు. విద్యానాథుఁడు కపర్ది అభినవమయూరసూరి మల్లికార్జునుఁడు జాయసేనాని అగస్త్యేశ్వరుఁడు, త్రిపురాంతకుడు ఆనాఁటి సంస్కృతకవిసత్తములు. కాకతీయ

సామ్రాజ్యాంతముతో నాంధ్రసంస్కృత వాఙ్మయాభివృద్ధి కెంతయో ఆటం
కము సంభవించెను. ఆవల రాచకొండ, దేవరకొండ, ఓరుగల్లు, భువనగిరి
దుర్గముల నాధారముచేసికొని చెదరిన యాంధ్రవీరుల సమకూర్చి అనపోత
నాయకుడు రాజ్యము స్థిరముగావించినపిదప సర్వజ్ఞ సింగమభూవల్లభుడు,
సంస్కృతాంధ్ర భాషాభివృద్ధికి మంచిదోహదము నొసంగెను. తాను స్వయ
ముగ గొన్నిగ్రంథములు రచించెను. ఆనాటికవులలో బమ్మెర పోతరాజు
బొమ్మకంటి హరిహరుడు, విశ్వేశ్వరుడు, గౌరనమహాకవి, మనకుస్మర
ణీయులు. శ్రీనాథ మహాకవి సర్వజ్ఞ సందర్శనార్థ మరుగుదెంచి వాఙ్మయాభి
రుచి జనసామాన్యమునకు గలిగించి వెనుకకుమరలెను. కాలవిప్లవముచే ది
టవుచేసిన ఈ రాజ్యము క్రమముగ దేవరకొండ కొల్లాపురముచేరి పూర్వ
భోగభాగ్యములు గోల్పోయినను వాఙ్మయసేవ మఱవలేదు. ఈ రాష్ట్రము
నందలి యాంధ్రసంస్థానములలో వాఙ్మయచరిత్రమున సువర్ణాక్షరములతో
వ్రాయదగినవి గద్వాల, వనపర్తి, ప్రాగుటూరు, సురపురము, ఆత్మకూరు
దోమకొండ, జటప్రోలు సంస్థానచరిత్రములు. ఈసంస్థానాధీశ్వరులలో జేరె
న్నికగన్న కవులుగలరు. వారిపోషణమున విరాజిల్లినవాఙ్మయ మెంతయేని
కలదు. దొంతి, నారాయణపురము, పాపన్నపేట, గోపాలపేటసంస్థానములు
కవులనాదరించి కవితాకళను పెంపొందించెగాని యాసంస్థానములలోని
రాజకవుల పేరులు నాటికవులగ్రంథములు ఆంధ్రులదురదృష్టవశమున నేటి
దనుక మిగులకపోవుట సంతాపకరము.

పదునేనవ శతాబ్దారంభముననుండిన జగద్విఖ్యాత వ్యాఖ్యాతయగు
కోలాచలమల్లినాథసూరి మెదకుమండలములోని కొలిచెలమనివాసి. నేటి
కచటనీయనవంశజులొద్దవారిగ్రంథసముదాయము విరివిగగలదు. మల్లినాథు
నకు బూర్వులగు కపర్దియు ప్రథమమల్లినాథుడును లోకఖ్యాతిగాంచిన
మహామహులు.అంతియగాదు. విఖ్యాతగ్రంథకర్తలును.మల్లినాథుని కావలి
వాడగు నారాయణపండితుడు చంపూరామాయణ వ్యాఖ్యానములో
దమపూర్వులవృత్తాంతముజెప్పుటచే మల్లినాథుని నీరాష్ట్రీయుడని నిశ్చ
యింప వీలుజిక్కినది. భవిష్యత్పరిశోధనమున నిటులెందఱినేని గుర్తింప
వచ్చును. అప్పకవి నివాసస్థలవిషయమున ఉత్తమవ్యాసముల్వ్రాసి యందు
కవినివాసస్థలము మహబూబునగరుజిల్లాయని బూ. రామకృష్ణారావుగారు
యుక్తియుక్తములగు సాధనములతో సమర్థించిరి. ఇట్లింక బలువురుకవుల

చరిత్రమును సమన్వయింపవలసిన యవసరము విశేషించికలదు. మంథెన, ధర్మపురి, కాళేశ్వరము, లేములవాడ, చెన్నూరు మున్నగు గోదావరీప్రాంతగ్రామములు ఒకకాలమున విద్యాక్షేత్రములు. ఇచటి వాఙ్మయ విశేషములు స్థానికుల నిరుత్సాహవశమున మరుగుపడియున్నవి. లోకవిఖ్యాత విద్వాంసులలో ఏలేశ్వరోపాధ్యాయులొకరు. ఈయననివాసము నల్లగొండమండలములో కృష్ణాతీరమునందున్న ఏలేశ్వరము. ఈ గ్రామమిపుడు శిథిలమైనను నాఁటి ప్రాచీనచిహ్నములు మాత్రము మిగిలియున్నవి. విస్మృతవాఙ్మయమున నీ యేలేశ్వరోపాధ్యాయుల గ్రంథసముదాయ మెంతగలదోగదా! "సకల నీతిసమ్మతము" ఒక సంగ్రహగ్రంథము. అందుఁ బదునేనవశతాబ్దమువఱకు ప్రసిద్ధములగు గ్రంథములు పెక్కులుదాహరింపఁబడినవి. అవి చాలవఱకీరాష్ట్రములోని గ్రంథరాజములే. దురదృష్టవశమునసందుఁబేర్కొనఁబడిన గ్రంథములు పరిశోధకుల కలభ్యములుగ నున్నవి. ఈ సకలనీతిసమ్మతమునకు సంబంధించిన రామగిరి దుర్గము సబ్బినాటిసీమకు రాజధానియై తెలుఁగురాజులకు నెలవై ప్రసిద్ధకవులకుఁ గ్రీడానిలయమై పదునేఁవశతాబ్దమున నొకవెలుగువెలిగి యాఱిపోయినది. ఐనను నాఁడు మడికి సింగన వెలిగించిన కావ్యరత్నదీపము నేఁటికిని జ్యోతిర్మండలమువలె వెలుగొందుచున్నది. దేశము సందిగ్ధావస్థలోనున్నతఱి అసమాన సామర్థ్యముతో రాజ్యము నెలకొల్పిన గోలకొండ దుర్గపాలకులగు మహమ్మదీయ నరపాలురును వారియనుచరులుగూడ తపతీసంవరణము, యయాతిచరిత్రము మున్నగు తెనుఁగుకబ్బముల నంకితమొంది వాఙ్మయసేవ రాజధర్మమనినాటిమనకు జిరస్మరణీయులైరి. రాజపోషణములేని మధ్యకాలమునఁగూడ సింగరాచార్యులు పండరినాథకవి నారాయణకవి మున్నగువారలు నిరుత్సాహపడక కావ్యరత్నముల భగవానున కర్పించి కవితాంశకుఁ బెంపుఁగూర్చిరి. సంస్కృతాంధ్ర వాఙ్మయములకు శ్రీ తిరుమల బుక్కపట్టణ వంశజులు ఎన్నెయోతరములనుండి గావించినసేవ అసాధారణము, అనన్యసాధ్యము.

ప్రాచీనకవులనామములు ఇందు అకారాదిగ సమకూర్పఁబడినవి. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ రజతోత్సవ సంచికయందు ౧౧౪ మంది కవులవివరములు పేర్కొనఁబడినవి. పిదపలభించిన యాధారములవలనను కవివంశజులుపంపిన చరిత్రపత్రములవలనను కవులసంఖ్య ఈసంచికలో ౧౭౩వఱకు పెరిగెను. భవిష్యత్పరిశోధనమున నింకు కొందఱు ఈరాష్ట్రమువారు కాక

పోవచ్చును. ఇంక నెక్కుండ్రులభింపవచ్చును. కానసీపట్టిక నింకను ససమగ్ర మని యేమాత్రలంపు కవులసంఖ్య పెరుగుటకును క్రొత్త విశేషములు గ్రహించుటకును, శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి కృషియే ప్రధానసాధనము. ఇందులకు వారికిఁ గృతజ్ఞతఁ దెలుపుట మాధర్మము. మామిత్రులొకరు శ్రీ. కృ. నిలయ రజతోత్సవసంచికలో నిక్కు ౧౮ మందిపూర్వకవులయొక్కయు వారిగ్రంథములయొక్కయుఁ బట్టికఁ జూచి యానందబాష్పములతో నోలలాడినాఁడు. అంత కెక్కువగఁ జేర్చిన యీకవులపట్టిక నింక నెంతయేని సంతోషకరము కాఁగలదని మావిశ్వాసము. సకాలముననే వ్యవధియుండఁగనే ఈప్రాచీన కవులపట్టిక సిద్ధము చేయు పనిని మాసుహృద్వతంసులగు ప్రతాపరెడ్డిగారు మాకు నియోగించిరి. కాని వాఙ్మయసంబంధములగు నితరనిర్బంధముల వలన తొందరలో బట్టిక నీ విధముగ ముగింపఁగలిగితిమి.

ఆ- వె. గోలకొండకవుల కుసుమముల్ సమకూర్చి
దండఁ గ్రుచ్చె మా ప్రతాపరెడ్డి
అందు తావులును నలరు సమర్పింపఁ
బడయు మైతి మకట భాగ్యరేఖ.

సీ. కాకతీయ నృపాల ఖడ్గధారాంచల
తరళీకృతంబులౌ తమ్మిపూలు
రెడ్డిభూపతిశౌర్య రేఖాతపోత్తప్త
లలితపత్రంబులౌ కలువపూలు
పద్మనాయక వీర బాహార్గళోన్ముక్త
గంధబంధురములు కలువపూలు
యవనసామ్రాజ్యకళా ప్రవిలంబి విచికిల
పల్లవావృతములు మల్లెపూలు

గీ. కలవు గోల్కొండ రాజ్య సత్కవివతంస
పద్యసంచికలో వీనిఁ బ్రస్తుతించి
భారతీకంఠమునఁ గూర్చు భాగ్యరేఖ
అలవడె ప్రతాపరెడ్డి కత్యనఘమతికి.

ఇట్లు భాషాసేవకులు

హానుమకొండ
భావసం॥ మార్గశిర శు॥ ౫

శేషాద్రి రమణ కవులు
పరిశోధక మండలి

# పూర్వ కవి పరిచయము

| సంకేతములు | | సంకేతములు |
|---|---|---|
| ని. నివాసము |  | వి. వివరము |
| కా. కాలము | | ము. ముద్రితములు |
| ర. రచనలు | | అ. అముద్రితములు |

## ౧. అగస్త్యుడు

ని. ఒరంగల్లు. కా. ౧౩౦౦ క్రీ.శ. ప్రాంతము

ర. నలకీర్తికౌముది. (సం) బాలభారతము (సం)

వి. మొదటి గ్రంథము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ముద్రితము. ఈకవియే విద్యానాథుడని కొందరు విమర్శకులనిరి. అగస్త్యుడు రెండవప్రతాపరుద్రుని కాలము నను ండెను. ఇతనియాంధ్ర గ్రంథములు కానరావు. ౭౪ కావ్యములువ్రాసెనని గంగాంబయొక్క మధురావిజయములో నుదహరింపబడినది.

## ౨. అణ్ణయాచార్యులు తిరుమల బుక్కపట్టణము

ని. సురపురము కా. ౨౫౦సం॥ క్రిందట

ర. దేశికయశోభూషణము అ. ఆచార్య వింశతి ము. సిద్ధాంతరత్నావళి అ. సిద్ధాంతవైజయంతి ము.

వి. ఈ అణ్ణయాచార్యుల వారు తత్త్వమార్తాండకర్తలగు శ్రీనివాసాచార్యులవారి పితామహులు. గ్రంథరచనముభాగస్వాములుగ వీరిసోదరులగు వేంకటదీక్షితులవారుండిరి. (వీరిసంపూర్ణచరిత్ర ముందు ప్రకటింపబడును)

## ౩. అణ్ణయ్యదీక్షితులవారుతిరుమల బుక్కపట్టణము

ని. సురపురసంస్థానము

కా. జననము శా.శ. ౧౫౨౬

ర. గీతార్థసంగ్రహము వ్యాఖ్య విరోధి వరూధినిప్రమాథిని రసోదారభాణము ఇవి అముద్రితములు.

వి. వీరనేకయజ్ఞము లొనరించిరి. తత్త్వమార్తాండాది గ్రంథకర్తలగు శ్రీనివాసాచార్యులవారు వీరితమ్ములు ఆచలాత్మజాపరిణయగ్రంథకర్త వీరికుమారులు. కాలము క్రీ.శ. ౧౬౦౦ కానోపును.

## ౪. అనంతామాత్యుడు

ని. రాయచూరుజిల్లా

కా. క్రీ.శ. ౧౪౦౦ ప్రాంతము

ర. భోజరాజీయము, రసాభరణము అనంతునిఛందస్సు

వి. ఆంధ్రవిజ్ఞానసర్వస్వమున నిట్లుకలదు. కృష్ణానదియమలప్రభానదిగలియుచోటు ఈకవియునికి. ఈకలయిక నైజాముదేశపు పశ్చిమసరిహద్దువద్ద. ఇదియిపుడుకన్నడదేశము. కృష్ణ-భీమనిజాము రాయచూరునకు ౧౬ మైళ్లలో గలియును. ఇది తెలుగు దేశము కవియచటివాడు

## ౫. అనంత రామ కవి పరశురామ పంతుల

ని. ఒరంగల్లు, క్రీ.శ. ౧౯౩౦ ప్రాంతము

ర. హనుమద్విజయము అసంపూర్ణము అ.

వి. పరశురామపంతుల రామమూర్తి కవి

కీ. తువకుమారుడు. ఈయన ఇంకకొన్ని గ్రంథములు రచించెగాని అలభ్యములు

౬. అప్పలాచార్యులు, కామ సముద్రము

ని. గద్వాల సంస్థానము
కా. ౧౫౦ సంII ల క్రిందట
ర. ఆంధ్రాష్టపదిలేక కృష్ణలీలాతరంగిణి
ము. యథాశ్లోక తాత్పర్యరామాయణము కిష్కింధాకాండము ఆశ్వాసములు3
వి. కవిఅష్ణభాషాకవి కృష్ణార్యుకుమారుడు. ఈ కవివిద్వత్కవికుంజర బిరుదుగడించెను. ఆంధ్రాష్టపదిఏకతరంగ ప్రబంధము ముద్రిత ప్రతిగద్వాల సంస్థానమున లభించును.

౭. అప్పలాచార్యులు, నలంతిఘులు

ని. శుభవీడు హుజూరునగరు తా.
కా. ౧౦౦సం. క్రిందట
ర. ధరాపాగరేశచరిత్రము అ.
వి. ఈగ్రంథము ఏనూళ్లగోత్రుండగు పరాంకుశనృపతికి అంకితము జేయబడినది. కవి వెంకటాచార్యులకుమారుడు

౮. అప్పలాచార్యులు, బొమ్మకంటి

ని: రాచకొండకా. క్రీ.శ. ౧౪౦౦ప్రాంతము
ర. నామలింగానుశాసనము నకు వ్యాఖ్యానము
వి. సర్వజ్ఞసింగభూపాలునకీయన ఆస్థానకవి ఇతరవివరములు తెలియవు

౯. అయ్యలార్యుడు

వి. ఓరుగల్లుప్రాంతము
కా. క్రీ.శ. ౧౩౦౦ ప్రాంతము
ర. భాస్కరరామాయణము యుద్ధకాండశేషము
వి. ఈయనవివరములు తెలియవు

౧౦. అప్పకవి, కాకునూరి

ని. లేమావిళ్ల (నవచూతపురి) తా: నాగరకర్నూలు. మహబూబునగరుజిల్లా
కా. క్రీ.శ. ౧౫౫౦—౧౫౭౦
ర. అప్పకవీయము, సాధ్వీధర్మముద్విపద శ్రీశైలేశ్వరశతకముకాలబాలార్ణవము (జ్యోతిశ్శాస్త్రము)
వి. ఈకవి నిజాము రాష్ట్రములోని లేమావిళ్ల వాసియని బూర్గుల రామకృష్ణరావుగారు సుపరిశోధితమగు వ్యాసము గోలకొండ పత్రికకువ్రాసిరి. అదిచూడందగినది. అప్పకవీయముదక్క ఇతరగ్రంథములు అనుపలభ్యములు. (ఇతనివివరములు ముస్ముందు ప్రకటింతుము.)

౧౧. అయ్యమాచార్యులు

ని. వనపర్తి ప్రాంతము
కా. ౧౦౦ సంII క్రిందట
ర. చెన్నకేశవ వివాసము అ. రామేశ్వర విజయము.
వి. మొదటిపుస్తకము పెద్దమందడి వెంకట కృష్ణకవిగారియొద్ద కలదు రెండవది వనపర్తి ప్రభు గ్రంథాలయమున నుండవచ్చును.

౧౨. ఉదయాదిత్యుడు

ని. వర్ధమానపురము
కా. క్రీ. శ: ౧౧౫౦ ప్రాంతము
ర. ఉదయాదిత్యాలంకారము
వి. ఈగ్రంథమింకను లభింపలేదు. లక్షణగ్రంథములలో నీగ్రంథనామము వినబడుచున్నది. ఒక రాంధ్రగ్రంథమనియు నింకొకరు కర్ణాటక గ్రంథమనియుంజెప్పిరి. ఎవరెట్లుచెప్పినను కవిమాత్ర మాంధ్రుండు. వర్ధమానపుర రాజ్య ప్రభువగు ఈయనకుమారులె భీమరాజు. గోకర్ణుండు. ఈయంశము మామిళ్లపల్లి శాసనమునగలదు: ఉదయాదిత్యుడు. భీమరాజు గోకర్ణులు సోదరులనుట అప్రయాణము.

౧౩. ఎల్లారెడ్డి, కామినేని

ని. బిక్కవవోలు, మెదకు జి.
కా. క్రీ, శ. ౧౫౫౦—౧౫౭౦

ర. వాసిష్ఠము, లైంగ్యము.

వి. ఈకవి మల్లారెడ్డికవికి సోదరుఁడు. దోమకొండ సంస్థానాధిపతి. కవిపేరు గ్రంథనామము తెలియుచున్నదిగాని గ్రంథము లుపలభింపలేదు.

౧౪. ఎల్లన, చింతలపల్లి

ని. గంగాపురము, మహబూబునగరు. జి

కా. ౨౦౦ సం|| క్రిందట

ర. శిరోభూషణము

వి. ఇక్కవి చింతపల్లి వీరరాఘవకవికిఁ బూర్వుఁడు. కవిగ్రంథము దొఱకలేదు. మధురవాణీవిలాసమునుండి పై యంశములు ఉద్ధృతములు.

౧౫. ఏకామ్రనాథుఁడు

ని. ఒరంగల్లు ప్రాంతము

కా. క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతము

ర. ప్రతాపచరిత్రము. (వచనము)
ద్వాత్రింశత్సాలభంజికల కథలు

వి. ఓరుగంటి రాజులచరిత్రము ఆంధ్ర సాహిత్యపరిషత్తు పత్రికలలో ముద్రింపఁబడెను. ఒరంగల్లు శైవప్రచారిణీ ముద్రణాలయమువగూడ ముద్రింపఁబడెను.

౧౬. కపర్ది

ని. కొలిచలమ, మెదకుజి.

కా. క్రీ. శ. ౧౩౦౦లు.

ర. ఆపస్తంబ గృహ్యపరిశిష్టభాష్యము, ఆపస్తంబ గృహ్యసూత్రభాష్యము, ఆపస్తంబ శ్రౌతసూత్రభాష్యము, భారద్వాజ గృహ్యసూత్ర భాష్యము. మొదలగుగ్రంథములు. ౬.

వి. మల్లినాథసూరియను మహా వ్యాఖ్యాతకీతనపూర్వుఁడని నారాయణపండితుఁడు చెప్పెను. చూ. రామాయణ చంపూ వ్యాఖ్య.

౧౭. కవిభల్లటుఁడు

ని. రాయచూరు

కా. క్రీ. శ. ౧౨౫౦.

ర. గణమంజరి, విక్రమార్క చరిత్రము.

వి. ఈకవి గోనబుద్ధభూపాలభుని చే సత్కారములొందినటులఁ జెప్పుకొనుటచే బుద్ధభూపతితోఁబాటు రాయచూరు మండల వాసి.

౧౮. కాచవిభుఁడు; విఠ్ఠలరాజు,

ని. రాయచూరు ప్రాంతము

కా. క్రీ. శ. ౧౨౫౦ ప్రాంతము

ర. (ఉత్తర) రామాయణము ద్విపద. ము.

వి. పిఠాపురము చెంత చిత్రాడ [illegible] శ్రీరామవిలాస ప్రెస్సులో ము[illegible]. అచటనే ప్రతిలభించును. కవులి[illegible] సోదరులు మహబూబునగరు జి. బూదపూరులో ఈయిరువురిని దెల్పు [illegible] ము గలదు. ఇందు ఉత్తరరామాయణ కథ గలదు.

౧౯. కుమార రుద్రదేవుఁడు

ని. ఒరంగల్లు ప్రాంతము

కా. క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతము

ర. భాస్కర రామాయణము అయోధ్యా కాండము.

వి. ఈయన ప్రత్యేకగ్రంథము కానరావు.

౨౦. కుమారస్వామి, సోమయాజి

ని. కొలిచలమ

కా. క్రీ. శ: ౧౪౫౦ ప్రాంతము

ర. రత్నాపణము అను ప్రతాపరుద్రవ్యాఖ్యానము.

వి. ఈకవి మహోపాధ్యాయ మల్లినాథుని కుమారుఁడు. పెద్దిభట్టునకుఁ దమ్ముఁడు.

౨౧. కృష్ణారావు, తడకమళ్ల

ని. హుజూరునగరు తాలూకా

కా. క్రీ. శ. ౧౮౫౦

ర. కంబుకంధర చరిత్రము, రామావతార కాలనిర్ణయము, చిత్రకథా వివరణము, కామరూపకథ, లీలావతీ గణితము:

ర. మొదటనితఁడు హుజూరునగరు ప్రాంతమునుండి తిరువళిక్కేణి చేరి అందువసతి

లంగడించెను. బహు భాషావిదుఁడు గోల కొండవ్యాపారి.

౨౨. కృష్ణమాచార్యులు, కర్పూరము

ని. చెర్లపల్లి

కా. క్రీ. శ. ౧౬౫౦ ప్రాంతము

ర. భగవద్గీత ద్విపద

వి. చర్లపల్లి కేశవాంకితము. ఈ గ్రామము నల్లగొండ మండలములోనిది. గ్రంథము నిజాము కాలేజిలో నుండఁగఁ జూచి నోటు వ్రాసికొనబడెను.

౨౩. కృష్ణమాచార్యులు, యుణాయవల్లి వైయ్యాకరణగజ కంఠీరవ

ని. మంచాలకట్ట జటప్రోలుచెంత

కా. జననము శా. శ. ౧౮౨౦ మరణము శా. శ. ౧౮౭౦.

ర. అష్టప్రాసరామ శతకము సంస్కృతము

శ్రీకృష్ణచంపు ,,

నిరోష్ఠ్యకృష్ణ శతకము ,,

రసజ్ఞానందదము ,,

జాతకచంద్రిక వ్యాఖ్య ,,

వి. గద్వాల వనపర్తి సంస్థానములలోఁ బారితోషికములొంది జటప్రోలు సంస్థానమున విద్వాంసులుగనుండిరి. ఘంటాశతిగ సంస్కృతరచన మొనర్చుచు ఈయన కీర్తిఁగడించెను.

౨౪. కేశవయ్య, సురపురము

ని. ఆత్మకూరుప్రాంతము

కా. ౧౫౦ సం॥

ర: నిరోష్ఠ్య రామాయణము. అ.

వి. ఆత్మకూరు రాజా సోమభూపాలునకంకితము. గ్రంథములోని కొన్ని పద్యములు లభించినవి. ఇతనికవిత ప్రౌఢము.

౨౫. కృష్ణమాచార్యులు

ని. కొల్లాపురము

కా. ౬౦ సం॥ క్రిందటనుండిరి

ర. నృసింహవిలాసము [అ. ప. కా.]

వి. ఈ కవి ఇప్పటికి దాదాపు ౫౦ సం॥ క్రిందగతించిన కొల్లాపురప్రభుత్వపు రాజా జగన్నాధరావు బహదురుగారి ఆస్థానకవి. ఈ గ్రంథము వారికే అంకితముగావింపబడినటుల. శ్రీ. వీరేశలింగము పంతులువారు మల్లభూపాలీయపీఠికలో వ్రాసిరి.

౨౬. కృష్ణమ్మ, మక్తల

ని. మక్తల. జి. మహబూబునగరము

ర. ఉదాహరణము

వివరములు చిక్కలేదు.

౨౭. కృష్ణమాచార్యులు, ఎల్లెవెల్లి కవికంఠీరవ

ని. మంచాలకట్ట జటప్రోలుసంస్థానము

కా. ౧౦౦ సం॥ క్రిందట

ర. నిరోష్ఠ్యరామాయణము [సంస్కృతము]

౨౮. కృష్ణమాచార్యులు, తిరుమల

ని. గద్వాలసంస్థానము

కా. ౧౫౦ సం॥ క్రిందట

ర. యథాశ్లోక తాత్పర్య రామాయణము సుందరకాండము ఆశ్వాసములు ౩. గద్వాలసంస్థానమున నుండెను.

౨౯. కేసన మల్లనకవులు

ని. బమ్మెర

కా. క్రీ. శ. ౧౬౫౦

ర. దాక్షాయణీ పరిణయము. అ.

విష్ణు భజనానందము. అ.

వి. మొదటిగ్రంథము కరకాల తాలూకా గురిజాల పాలకుఁడగు పులిజాల సోమమంత్రికంకితము. రెండవగ్రంథము పరిశోధింపఁబడవలసియున్నది. పైకవులిరువురు సోదరులు.

౩౦. గంగాధరయ్య, చిత్తూరు

ని. చర్లపల్లి. జి నల్లగొండ

కా. క్రీ. శ. ౧౯౨౩ ప్రాంతము

ర. కాలిపాశ మాహాత్మ్యము [ద్విపద]

శృంగార బల్లాణచరిత్రము, శృంగార సిరియాళచరిత్రము, శుకసప్తతి [వచనము]

వి. కవివంశజులింకి కవికాలమునుండి సరసకవి బిరుదుకలరు. పూర్వమీ కుటుంబమువారు పెనవేళ్ల నివాసులు. రెండవగ్రంథము విజయనగరము శృంగార గ్రంథమాల లో. ము.

౩౧. గంగాధరకవి, అద్దంకి

ని. గోలకొండ

కా. క్రీ. శ. ౧౫౧౨ — ౧౫౪౩

ర. తపతీ సంవరణోపాఖ్యానము

వి: గోలకొండనవాబగు మల్కిభరాము అనఁబడు మలిక్ ఇబ్రహీమున కంకితము గావింపఁబడినది. మహమ్మదీయు లంకితము గొన్న ఆంధ్రగ్రంథములలో నిది మొదటిది.

౩౨. గణనాథకవి

ని. గోలకొండ

కా. క్రీ. శ. ౧౫౫౦ ప్రాంతము

వి. ఈయన నృసింహపండితుని కుమారుఁడు కుతుబుషాయొద్ద ఆస్థానకవిగా నుండెను. మల్లారెడ్డికవికి సమకాలికుఁడు. సహాయుఁడు.

౩౩. గట్టయ్య, కనకబండి

ని. నేలకొండపల్లి

కా. ౧౫౦ క్రిందట

ర. హరిశ్చంద్రకథ ద్విపద, పోలురాజుకథ, కాటమరాజు కథ.

వి. కవి యాదవుఁడు.

౩౪. గోపాలమంత్రి, చింతలపల్లి

ని. గంగాపురము

కా. ౩౫౦ సం॥ క్రిందట

ర. ఆర్యాశతకము

వి. మధురవాణీవిలాసము రచించినవీరరాఘవ కవికీతఁడు పినతండ్రి. గద్వాల. జటప్రోలుసంస్థానములోఁ జేరొందెను.

౩౫. గోపమంత్రి

ని. గార్ల

కా. క్రీ.శ ౧౮౦౦ ప్రాంతము.

ర. సింధుమతీవిలాసము స. కా. అ.

వి. కవి భారద్వాజగోత్రుఁడు సింధుమతియను వేశ్యకుజయుఁడను యువకునకుగల సంబంధము దెలుపు శృంగారకావ్యము. ఇందు సంస్కృతాంధ్రకవితగలదు.

౩౬. గోపాలకృష్ణకవి, కుందావఝ్ఝుల

ని. ములకనూరు [కరీంనగర్]

కా. ౧౨౦ సం. క్రిందట

ర. బ్రహ్మవైవర్తమునందలి శ్రీకృష్ణజన్మఖండము (అముద్రితము)

వి. హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధకమండలియందును హనుమకొండ పరిశోధకమండలియందును మడికొండలో మోదుకూరి రామారావు గారికడను ప్రతులు గలవు.

౩౭. గౌరనమంత్రి

ని. రాచకొండ

కా. క్రీ. శ ౧౪౦౦ ప్రాంతము.

ర. లక్షణదీపిక [సంస్కృతము] హరిశ్చంద్రచరిత్రము ద్విపద నవనాథచరిత్రము ద్విపద

వి. ఈ కవి పితృవ్యుఁడగు వేంకటప్పయ్యమంత్రి దేవరకొండదుర్గపాలకుఁడగు మాధవరాయ ప్రభు నియమాత్యుడు ఈ వెంకటప్పయ్యమంత్రి ప్రశంస శాసనము లందుగలదు.

౩౮. గోపాలరావు, రాజాబహద్దరీ

ని. వనపర్తి ప్రభువు.

కా. క్రీ. శ ౧౬౫౦ ప్రాంతము

ర. రామచంద్రోదయము సంస్కృత శ్లేష కావ్యము. శృంగారమంజరిభాణము

వి. అనర్ఘరాఘవము పద్యకావ్యము వ్రాసిన బిజ్జాల తిమ్మనృపుఁడీతని మేనల్లుఁడు. ఈకవి వనపర్తిలోని సూగూరునందు రాజ్యముచేసెను. షట్ దర్శనీవల్లభుడు. అష్టభాషాకవి. గ్రంథములు వనపర్తి సంస్థానమున ముద్రితములు.

**౩౯. గోకర్ణుఁడు**

ని. వర్ధమానపురము
కా. క్రీ.శ ౧౧౪౦ ప్రాంతము.
ర. గోకర్ణచ్ఛందస్సు
వి. ఈ గ్రంథకర్త జైనుఁడనికొందఱనిరి. భీమన రచితమనబడు కవిజనాశ్రయమే ఈయన గ్రంథమని కొందఱు విమర్శకులనిరి. గోకర్ణచ్ఛందస్సు నామము అప్పకవి పేర్కొనెను. ఇది కవిజనాశ్రయము కాదని మాతలంపు.

**౪౦. చంద్రమరాజు**

ని. భట్టుపల్లి
కా. ౪౦_౫౦ సం॥ క్రిందట
ర. మనిషావలోకనదర్పణము
వి. కవికుమారులగు రామరాజు గారియొద్ద (భట్టుపల్లి తాడికొండ తాలూకా మహబూబునగరు జిల్లాలో) గలదు.

**౪౧. చంద్రశేఖర కవి, వెన్నెకంటి**

ని. ఒరంగల్లు
కా. క్రీ.శ ౧౭౦౦ ప్రాంతము
ర. హరిశ్చంద్ర చరిత్రము ద్విపద
వి. గ్రంథము రెండు భాగములుగ నున్నది. హనుమకొండలో నొక వర్తకునియొద్ద తాటాకుపుస్తకము గలదు. ఈకవి మామయగు రామకవి ఒరంగంటివాఁడగాన కవియు నచటివాఁడే కానోపు:

**౪౨. చినమాధవరావు, సురభి**

ని. జటప్రోలు
కా. ౧౫౦ సం॥ క్రిందట
ర. శూద్రస్మృతి. సంస్కృతము
వి. కం. వీరేశలింగము పంతులువారు మల్లభూపాలీయము పీఠికలో వ్రాసిన అంశముండి గ్రహింపఁబడినది. సురభివారి వంశచరిత్రమున ఈ గ్రంథము పైరాజార్చింపచేసినట్లు కలదు.

**౪౩. చెన్నకృష్ణమాచార్యులు, మరింగంటి**

ని. కనగల్లు
కా. ౭౦సం॥ క్రిందట
ర. యాదగిరినృసింహ శతకము.
వి. ఇంకఁగొన్ని శతకము లీయన రచించెను. ఈయన గ్రంథములు వివరములు మరింగంటి రంగాచార్యులు కనగల్లు, నల్లగొండజిల్లాయనువారికడఁ గలవు.

**౪౪. చెన్నకృష్ణకవి**

ని. వనపర్తి సంస్థానము
కా. ౨౦౦సం॥ క్రిందట
ర. యాదవభారతీయము (ద్వ్యర్థి) ముద్రితము
వి. వనపర్తి సంస్థానమున ముద్రితము జనుంపల్లివల్లభరాయనికంకితము. కవినందవరీకి.

**౪౫. ఛాయాపతి, చింతలపల్లి**

ని. గంగాపురము మహబూబునగరు
కా. ౧౦౦సం॥ క్రిందట
ర. రాఘవాభ్యుదయము ౫ ఆశ్వాసములు
వి. ఈకవితాతయగు వీరరాఘవకవి మధురవాణీవిలాసమును రచియించెను. ఈకుటుంబములోఁ బలువురు విద్వత్కవులు గలరు.

**౪౬. జగన్నాథరావు, పానుగోటి**

ని. పానుగోడు దేవరకొండ తా॥
కా. ౨౫౦సం. క్రిందట
ర. కుముదవల్లీవిలాసము (ప. కా)
వి. ఇనుగుర్తిలో ముద్రితము. వ్రాత ప్రతివడ్డెపల్లిలో బెల్లంకొండ నరసింహాచార్యులవారికడగలదు. కవికి ౧౧వ పురుషుడు ముద్రించెను.

**౪౭. జాయ సేనాపతి**

ని. ఒరంగల్లు
కా. క్రీ.శ ౧౨౫౦ ప్రాంతము
ర. నృత్తరత్నావళి

వి. ఆంధ్రనృత్యవిశేషము తీయన సంస్కృతమున గ్రంథరూపమువరచించెను. ఈయన కాకతిగణపతి దేవునికి రాజప్రతినిధి. ఈతనిశాసనములు గలవు.

**౪౮. తిమ్మయ్య, సారంగు**

ని. గోలకొండ

కా. క్రీ. శ ౧౫౫౦ ప్రాంతము

ర. వైపనారాయణచరిత్రము ముద్రితము

వి. గోలకొండలో కుతుపుషాహి కాలమున పలకరణీకము చేయుచుండెను. గోలకొండ వ్యాపారి. వైష్ణవమతస్థుడు.

**౪౯. తిమ్మభూపాలుడు, బిజ్జల**

ని. ప్రాగుటూరు సంస్థానము

కా. ౨౦౦ సం. క్రిందట

ర. అనర్ఘ రాఘవము ముద్రిత ప్రబంధము

వి. వనపర్తి సంస్థానాధిపతులగు అష్టభాషా గోపాలరావుగారి కీశవి మేనయల్లుడు. కర్నూలు మునిసిపల్ స్కూలు పండితులు అనుముల వేంకటసుబ్రహ్మణ్యశర్మగారికడలభించునుకవివంశజులుపల్లెపాటిజాగీరుదారులుగ నిపుడున్నారు.

**౫౦ తిరువేంగళము, పరాంకుశము**

ని. డబీరుపురము. హైద్రాబాదు

కా. ౫౦ సం|| క్రిందట

ర. రాశికగణితచూడామణి (పద్యకావ్యము ముద్రితము)

**౫౧. తిరుమలభట్టారకుడు**

ని. లేమావిళ్ళ [నవచూతపురము]

కా. క్రీ. ౧౪౫౦_౧౫౦౦

ర. కాలామృతము.

వి. అప్పకవీయము ౪ అ ౧౧౬ ప. నందు శ్రీమద్వేంకటనాయకం అనుశ్లోకము వాహరించి ఇక్కవి మదీయాన్వయభవుండని అప్పకవిచెప్పెను.

**౫౨. తిరుమలరాయకవి, బైరంపల్లి**

ని: గద్వాల

కా. ౪౦ సం. క్రిందట

వి. ఈయన సంస్కృతాంధ్రములలో ఆశుకవియై సమయోచితచాటువులు పెక్కు రచించెను. ఒకప్పుడీయనసిరస్తావారు పదవినొందిన మిత్రులుకొనియాడిరట. అపుడాయన .వాడుడుశిరస్థవాడుడు,అని యొకమాలికలో శిరస్తాదారులకన్వయించునటు పద్యముచెప్పెనట,

**౫౩. తెలగనార్యుడు, పొన్నికంటి**

ని. గోలకొండ

కా. క్రీ. శ ౧౫౬౫—౧౫౭౦

ర. యయాతిచరిత్రము. ముద్రితము

వి. మదరాసు వావిళ్ళవారు గ్రంథప్రకాశకులు. తెనుగుభాషలో తొలుత బయలుదేరిన శుద్ధాంధ్రకావ్యమిది. మహమ్మదీయ ప్రభువగు అమీనుఖానుఅను కుతుపుషాకడ రాజకీయోద్యోగి కృతినొందెను, ఇదే అచ్చతెలుగున మొదటికృతి.

**౫౪. త్రిపురాంతకకవి, రావిపాటి**

ని. వరంగల్లు

కా. క్రీ. శ ౧౩౦౦ ప్రాంతము

ర. త్రిపురాంతకోదాహరణము
[వనపత్రిలో ముద్రితము]
ప్రేమాభిరామము
చంద్రతారావళి
అంబికాశతకము
మదనవిజయము

వి. వరంగల్లుస్థితిగతుల ప్రేమాభిరామమున వర్ణించుటచేతను ఓరుగంటివాడనియని మాతలపు.

**౫౫. దీక్షాచార్యులు, పురాణము**

ని. పుల్లగుమ్మి. గద్వాల

కా. ౪౦ సం. క్రిందట

ర. రామచంపు
ఛందోముకురము } సంస్కృతము.
రామనృపకరణపూరము
కేశవసుప్రభాతము
కావ్యోత్కర్ష } అముద్రితము

వి. గద్వాలసంస్థాన విద్వాంసులగు పుల్లగుమ్మి వేంకటాచార్యులవారికీకవి మేనమామ. గద్వాలప్రభువు రామభూపాలుని విద్యాగురువు. సాహిత్యవిద్వన్మణి బిరుదాంకుడు. జననము శా.శ ౧౭౪౪ మరణము శా.శ ౧౭౯౧

౫౬. ధర్మకవి, చరికొండ

కా. క్రి శ ౧౫౫౦—౧౬౦౦

ని. ధర్మపురి నివాసి

ర: చిత్రభారతము [ముద్రితము]

వి. వరంగల్లు పరిపాలించిన సితాపుఖాను ప్రభువునకు మంత్రియగు ఎనుములపల్లి పెద్దనమంత్రికి చిత్రభారతము అంకితము.

౫౭. నరసింగరావు, పుల్లంరాజు

ని. బూరుగుల మహబూబునగరు జిల్లా

కా. ౭౦సం. క్రిందట

ర. నృకేసరిశతకము అ. రామానుజ సుప్రభాతము అ.

వి. హైద్రాబాదు బూర్గుల రామకృష్ణరావు గారికితాత. వారివద్ద లభించును.

౫౮. నరసింగరావు,సురభి

ని. కొల్లాపురముచెంత మంచాలకట్ట

కా. ౧౭౦సం॥ క్రిందట

ర. నక్షత్రఖేలనము (సం)

వి. ఈగ్రంధమాకవిరచించినటుల కం. వీరేశలింగము పంతులువారు మల్లభూపాలీయము పీఠికలో వ్రాసిరి.

౫౯. నరసింహాచార్యులు,అంబాళం

ని. ఆనగొంది

కా. ౪౦సం॥ క్రిందట

ర. విశ్వగుణాదర్శ వ్యాఖ్యాత

వి. అనెగొంది సంస్థానములోగల వంశజులయొద్ద నీగ్రంథముగలదు.

౬౦. నరసింహాకవి, చరిగొండ

ని. చరిగొండ జి. మహిబూబునగరు

కా. క్రీ.శ ౧౬౦౦

ర. శశిబిందుచరిత్రము అ.

వి. ఇది యప్పకవీయమునం దుదాహృతము. గ్రంథము తాటికాకులఅచ్చ గ్రామముకు నొకవర్తకుని చెంత గలదు.

౬౧. నరహరి (లేక) సరస్వతీతీర్థముని

ని. భువనగిరి

కా. క్రీ.శ ౧౧౪౨

ర. కావ్యప్రకాశికపై బాల చిత్తానురంజని వ్యాఖ్య, స్మృతిదర్పణము, తర్కరత్నము

వి. తననివాసము త్రిభువని (త్రిభువనగిరి యని) చెప్పుకొనెను. భువనగిరికి ప్రాచీననామము త్రిభువనగిరి యని శాసనములలో గలదు.

౬౨. నరసింహనాయకకవి, వనము

ని. గువ్వలగూడెము (కొంభముమెట్టు తా॥)

కా. ౫౦సం॥ క్రిందట

ర. ధర్మాంగదచరిత్రము (ప్రబంధము నీలకంఠదండకము (అలభ్యము)

వి. గ్రంధము కవిమనుమలగు వనంనరసింహారావు గారి యొద్ద గువ్వలగూడెములో గలదు.

౬౩. నారాయణాచార్యులు, చెట్లూరి

ని. గద్వాల

కా. ౩౦ సరవత్సరముల క్రిందట

ర. ప్రతాదరుద్రీయ సారము. అ.

వి. గద్వాల సంస్థానమునందీయన పరీక్షాధికారిగనుండెను.

౬౪. నారాయణకవి, నెల్లుట్ల

ని. బమ్మెర

కా. క్రీ.శ ౧౬౦౦ ప్రాంతము

ర. వ్రజాభ్యుదయము

వి. గ్రంధకర్త బమ్మెర పోతనవంశములోనివాడు. బమ్మెరలో నెల్లుట్లవారికడ జీర్ణప్రతికలదు. మొదటిరెండాశ్వాసముల వరకు ఆంధ్రసాహిత్యపరిషత్తు కాకినాడలో గలదు.

**౬౫. నాగనాథ కవి**

ని. ఓరంగల్లు ప్రాంతము
కా. క్రీ.శ ౧౩౫౦ ప్రాంతము
ర. మదనవిలాసభాణము [సం] విష్ణుపురాణము. తెలుగు
వి. లక్షణగ్రంథములయందీ రెండు గ్రంథములుదాహరింపఁబడినవిగాని యింతవఱకు లభింపలేదు. ఈకవియే ఆయినవోలులోని అనపోతనాయకుని శాసనకవి. ఈయన పశుపతిపండిత పుత్రుడు.

**౬౬. నాగేంద్రకవి**

ని. భువనగిరి ప్రాంతము
కా. క్రీ.శ ౧౪౦౦ ప్రాంతము
ర. రమాధీశ్వరశతకము
వి. శతకము మిగుల ప్రాచీనము ప్రౌఢము. కవి ఆయినవోలు శాసనము వ్రాసినవాడు. నాగనాథుడు కాడు. యీ కవివైష్ణవమతాభిమాని. ముద్రితము వావిళ్లవారికడ లభించును.

**౬౭. నారాయణపండితుడు, కొలిచలమ**

ని: కొలిచెలమ మెదకుజిల్లా
కా. క్రీ.శ ౧౬౫౦ ప్రాంతము
ర. చంపూరామాయణ వ్యాఖ్య
ఈయన కోలాచల మల్లినాథ సూరివంశమునబుట్టినవాడు. మల్లినాథుని కుటుంబమును గూర్చి వివరములు చాల ఇతఁడొసంగెను. ప్రతి మదరాసు ఓరియంటలు లైబ్రరిలో గలదు.

**౬౮. నారయ, వెలిగందల**

ని. వెలిగందల కరీంనగర్ జిల్లా
కా. ౧౪౫౦-౧౫౦౦ క్రీ.శ.
ర. భాగవతములో మూఁడవస్కంధములో గొంతయు ౧౧.౧౨ స్కంధముల పూర్తిగ నితఁడు రచియించెను.
వి. బమ్మెరపోతరాజునకీతని ప్రియశిష్యుడు.

**౬౯. నింబగిరిశాస్త్రి, గోవిండ్ల**

ని. కోరుట్ల కరీంనగరు జిల్లా
కా. క్రీ.శ ౧౪౫౦
ర: ప్రమాసన గ్రంథము
వి. వే. రామానుజాచార్యులుగారియొద్ద కోరుట్లయందీప్రతి గలదు.

**౭౦. పండరినాథకవి, మోదుకూరి**

ని. మడికొండ
కా. ౧౦౦సం॥ క్రింద నుండెను.
ర. ఆధ్యాత్మ రామాయణము (ప. కా) అముద్రితము, రామకథా కల్పలత ౨౪౦౦ శ్లోకములు,
వి. మొదటి గ్రంథము ప్రత్యంతరము వ్రాయుచుండుటచే హనుమకొండ పరిశోధకమండలిలోనున్నది. రెండవది మిగుల జీర్ణదశలోనున్నది. కవి గ్రంథరచనము అనుమకొండలో గావించెను.

**౭౧. పరశురామరెడ్డి, తూము**

ని. మామిడిపడ మహబూబునగరు జిల్లా
కా. ౧౫౦ సం॥ క్రిందట
ర. అలమేలు మంగాపరిణయము అ.

**౭౨. పాపాశాస్త్రి, దీక్షితుల**

ని. అమరచింత ఆత్మకూరు సంస్థానము
కా. జననము ఫ॥ ౧౨౬౧ మరణము ౧౩౦౧
ర. చెంచునాటకము, హనుమచ్ఛతకము అ.

**౭౩. పాపయశాస్త్రి, పాత**

ని. కోరుట్ల
కా. క్రీ.శ ౧౯౨౦
ర. విక్రమార్కీయము
గ్రంథము దొరకలేదనియు ప్రయత్నింతుమనియు కోరుట్లనుండి వే. రామానుజాచార్యులుగారు తెలిపిరి.

**౭౪. పామనాయకుఁడు, బహిరీ**

ని. వాగివగిరి
కా. ౨౦౦ సం. క్రిందట
ర. భార్గవపురాణము అ.
వి. గద్వాలసంస్థానమునందు ప్రతి కలదు. భార్గవపురాణము మహబూబునగరుజిల్లాలోని మరపురను వేణుగోపాలస్వామికి అంకితము.

౭౫. పిన్నయ్య ప్రభాకరుఁడు, ఎలకూచి
ని. జటప్రోలు ప్రాంతము
కా. క్రీ.శ ౧౬౫౦ ప్రాంతము
ర. ఆదిత్యపురాణము
వి. ఇది ఆంధ్రసాహిత్య పరిషత్తులో గలదు గాని అత్యంతశిథిలము. ఎలకూచి బాల సరస్వతికవికీయన తమ్ముఁడు.

౭౬. పెద్దనసోమయాజి, కాణాదము
ని. గద్వాల
కా. ౧౫౦ సం॥ క్రిందట
ర. అధ్యాత్మరామాయణము (ము) ముకుందవిలాసము [ము] మత్స్యపురాణము, శేషశైలేశలీల యథాశ్లోక తాత్పర్య రామాయణము [బాలకాండము] రామాయణ చంపూ వ్యాఖ్య
వి. ఈయననందవరీక బ్రాహ్మణుఁడు ప్రౌఢ కవి.

౭౭. పోతరాజు, బమ్మెర
ని. బమ్మెర ఒరంగల్లువద్ద
కా. క్రీ.శ ౧౪౦౦-౧౪౫౦
ర. భాగవతము, భోగినీ దండకము, నారాయణశతకము, వీరభద్రవిజయము
వి. ఈకవి కడపజిల్లా ఒంటిమిట్ట నివాసియనువాదము ప్రమాదము, కవిని భాగవతము అంకితము గోరినది సర్వజ్ఞసింగభూపతి. ఈయన నల్లగొండ జిల్లా రాచకొండ పాలకుఁడు

౭౮. ఫణికుండల కవి
ని. మాహేశ్వరము
కా. ౮౦ సం॥ క్రిందట
ర. సీమంతినీ కల్యాణము ప్రబంధము. ము.
వి. సంస్కృతాంధ్రములలో నితఁడు ప్రౌఢ కవి. వరంగల్లు రామలింగేశ్వర ప్రెస్సులో ముద్రితము

౭౯. బసవప్ప, పిడుపర్తి
ని. ఒరంగల్లు:
కా. క్రీ.శ ౧౫౫౦ ప్రాంతము
ర. ప్రభులింగలీల పద్యకావ్యము అముద్రితము
వి. ఈకవి పిడుపర్తి సోమనాథకవితమ్ముఁడు పాలయార్యుని కుమారుఁడు. పిడుపర్తి బసవకవి ఇతని పితామహుఁడు

౮౦- బసవకవి, పిడుపర్తి
ని. ఒరంగల్లు ప్రాంతము
కా. క్రీ. శ ౧౪౮౦
వీరశైవ దీక్షాబోధ, పిల్లవయగా యకథ, బ్రహ్మోత్తరఖండము
ఇవి ద్విపదగ్రంథములు ౨-౩ గ్రంథములు అముద్రితములు

౮౧. బాలసరస్వతి, ఎలకూచి
ని: మహబూబునగరు జి.
కా. క్రీ.శ ౧౬౦౦ ప్రాంతము
ర. మల్లభూపాలీయము, [ముద్రితము] చంద్రికాపరిణయము, ఆంధ్ర చింతామణి వ్యాఖ్య, రంగకౌముది, రాఘవయాదవపాండవీయము
వి. ఈకవి మహబూబునగరు మండలములోనివాఁడు. మొదటి గ్రంథము జటప్రోలు ప్రభువుల పూర్వుఁడగు మల్లభూపతికంకితము, రెండవది మధిర తాలూకా పరిటాలపాలకుఁడగు జూపల్లి వెంకటాద్రికంకితము

౮౨. బుచ్చి వెంకటాచార్యులు, తిరుమల బుక్కపట్టణము
ని. గద్వాల సంస్థానము
కా. క్రీ.శ ౧౭౦౦
ర. వేదాంతకారికావళి [ముద్రితము] అభినవశృంగారరసమంజరి భాణము, కల్యాణపురంజనము, శృంగారసర్వస్వము
వి. అచలాత్మజాపరిణయ గ్రంథకర్త కీకవి తమ్ముఁడు ఈయనచతుశ్శాస్త్రపారీణుఁడు ౭౫సం॥న మరణించెను. గద్వాలసోమభూపాలునికాలమునందుండెను.

౮౩. బుద్ధారెడ్డి, గోన
ని. రాయచూరు
కా. క్రీ.శ ౧౩౦౦ ప్రాంతము
ర. రంగనాథరామాయణము [ద్విపద] ము.
వి. ఇతడు రాయచూరురాజు. కాకతీయుల సామంతుడు

౮౪. బ్రహ్మయ్యలింగము, ముదిగొండ
ని. మెదకుమండలము
కా. ౧౨౦౦ క్రీ. శ. ప్రాంతము
ర. శివరహస్యఖండమను వచనము అముద్రితము
వి. మెదకుజిల్లా చేకుమాలలో హైకోర్టువకీలు చేకుమాల అనంత కిషన్ రావుగారి యొద్ద తాటాకుపుస్తకము గలదు. ప్రౌఢశైలిగల వచనకావ్యము

౮౫. భాస్కరకవి
ని. ఒరంగల్లు
కా. క్రీ.శ ౧౩౦౦
ర. భాస్కర రామాయణము
అరణ్య యుద్ధకాండము
వి. భాస్కర రామాయణములోని భాస్కరుడిరువురని కొందఱందురు. ఒకడేయని యు నతడు తిక్కనసోమయాజి తాతయనియుఁ గొందఱందురు.

౮౬. భీమకవి, లేములవాడ
ని. లేములవాడ
కా. లేములవాడ కరీంనగర్ జిల్లా
ర. కవిజనాశ్రయము, నృసింహ పురాణము, బసవపురాణము కన్నడము
వి. భీమకవి లేములవాడ నివాసియనుపక్షమే బలవత్తరము. ఈవాదములో జ. రామయ్య, మా. రామకృష్ణకవి, వే. ప్రభాకరశాస్త్రి, శేషాద్రిరమణకవులు సిద్ధాంతములు గావించిరి గాన విశ్వసనీయము.

౮౭. మడివాలయ్య, మఠం
ని. బోర్లెంగ్రామం జి. నిజామాబాదు
కా. ౧౦౦ఏండ్ల క్రితము
ర. శారదరామాయణము అ.

వి. కవి. కర్ణాటాంధ్రకవి
వివరము ముందు ప్రకటింపబడును గోలకొండపత్రిక శ్రీముఖ పుష్యశుద్ధ పత్రికలో వివరము మఠం సిద్ధవీరయ్య గారు వ్రాసినారు

౮౮. మంథాన భైరవుడు
ని. అలంపురము
కా. క్రీ.శ ౧౦౦౦ ప్రాంతము
ర. భైరవతంత్రము (సంస్కృతము)
వి. దీనికే మంథానతంత్రమని నామాంతరము అపూర్వమైన యుత్తమ గ్రంథప్రతి హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధకమండలిలో గలదు

౮౯. మల్లికార్జున సిద్ధయోగి
ని. కొలనుపాక ప్రాంతము
కా. క్రీ.శ ౧౨౦౦ ప్రాంతము
ర. గాడపురాణము ద్విపద [అముద్రితము]
వి. ఇది మూడాశ్వాసముల గ్రంథము. ఇందు కొలనుపాకలో గాడమత స్థాపనచేసిన యంశము కలదు. ప్రతిగవండ్లవారికడ లభించును.

౯౦. మల్లారెడ్డి
ని. బిక్కనవోలు మెదకు జిల్లా
కా. క్రీ.శ ౧౫౫౦–౧౫౭౦
ర. షట్చక్రవర్తి చరిత్రము, పద్మపురాణము, శివధర్మోత్తరఖండము
వి. ఇవి దోమకొండసంస్థాన ప్రభువుగారిచే ముద్రితములు. దోమకొండ ప్రభువులకీ కవిపూర్వుడు. కవుల చరిత్రమున ఈబిక్కనవోలు గోదావరిమండలములోనిదనుట ప్రమాదము. బిక్కనవోలు నిజామాబాదు రైల్వేలైనులోని స్టేషను. దోమకొండకుచాల సమీపములోనున్నది.

౯౧. మల్లికార్జునభట్టు, శాకవల్లి
ని. ఒరంగల్లు
కా. క్రీ.శ ౧౩౦౦
ర. భాస్కరరామాయణము, బాలసుందర

కాండము, అభిషిక్త రాఘవము సంస్కృతము సరస్వతీచంద్రిక సం

వి. ఈయన ప్రతాపరుద్రుని కాలమున సంస్థానములో అత్యంతాదర సత్కారము లొందినట్లు కవులచరిత్రములో గలదు.

౯౨. మల్లికార్జున పండితారాధ్యులు

ని. జన్మస్థలము శ్రీశైలప్రాంతము

కా. క్రీ.శ ౧౧౬౦-౧౧౮౦

ర. శివతత్త్వసారము ముద్రితము కన్నడమునఁగొన్నియు సంస్కృతమునఁ గొన్నియు గ్రంథములు రచించెను.

వి. కవిజన్మము శ్రీశైలప్రాంతము. బాల్యము ద్రాక్షారామమునగడిపి పిదప చందోలులో నెలనాటుచోడునిసభలో శిక్షితుఁడై బసవేశ్వరునిదర్శింప కల్యాణమునకు బయలుదేరెను. అమరావతికి వచ్చుసరికి బసవనివిభూతికతన కవితయుఁ బోయిన కన్నులువచ్చెను. అవల గ్రంథరచనము గావించుచు పానుగల్లులోను గాఁగల తావులదిరిగి కవితారచనముతో మతప్రచారముచేయుచు ముందునకేగుతరి బసవేశ్వరుఁడు లింగైక్యమైరనివిని ఈకవి శ్రీశైలప్రాంతమునఁగల వెల్లటూరునఁనిల్చి మరణించెను. రామప్పగుడి వెయ్యిస్తంభములగుడిలోనగు తావుల నీయన చిహ్నములుగలవు. ఓరుగల్లు మహబూబునగర మండలములలో నీకవి వాఙ్మయ జీవితలుగడచుటచేతను జన్మము శ్రీశైలప్రాంతమునను గాన ఈకవి నిజామురాష్ట్రీయునిగ గ్రహింపనగును.

౯౩. మల్లినాథసూరి, కొలిచలము

ని. కొలిచలము మెదకు జిల్లా

కా. క్రీ.శ ౧౪౦౦ ప్రాంతము

ర. పంచకావ్యములకు వ్యాఖ్యాత ఇంకనెన్నో గ్రంథములువ్రాసెను.

వి. కామకాయనసగోత్రులగు ఈయనవంశజులు నేటికిని కొలిచలములో నున్నారు. ఈయనఉత్తమవ్యాఖ్యాత. మహామహోపాధ్యాయ బిరుదాంకితుఁడు

౯౪. మల్లేశము, దొంతర

ని. అన్నవరము సూర్యాపేట తా॥

కా. ౬౦సం॥ కింద నుండెను.

ర. అలవాలక్షేత్రమాహాత్మ్యము ముద్రితము

వి. పెరికకులమువాఁడు, సహజపాండిత్యముతోఁ గవిత రచించినవాఁడు. బజారులలో నితనిగ్రంథము వెలకుఁ జిక్కును. అంత ప్రౌఢకవిత కాదు

౯౫. మాధవరావు

ని. రాచకొండప్రభువు

కా. క్రీ.శ ౧౪౨౪

ర. రాఘవీయము అను రామాయణవ్యాఖ్యానము

వి. ఈరామాయణ వ్యాఖ్యానప్రశస్తి ఒకానొకశాసనమునఁ బేర్కొనబడెను. అది రాచకొండ చెంతగల నాగవరమునఁగలదు. ఈగ్రంథముఁ లభింపలేదు

౯౬. మారనకవి

ని. ఓరుగల్లు

కా. క్రీ.శ ౧౩౦౦

ర. మార్కండేయ పురాణము

వి. ఓరుగంటి [illegible] గన్న సేనానికిఇది [illegible] తిక్కనసోమయాజిశిష్యుఁడు. ఇతనితండ్రియు తిక్కనయేగాని కవిత్రయములోనితిక్కనకు భిన్నుఁడు

౯౭. ముద్దయకవి

ని. మంథెన

కా. ౧౦౦సం॥ క్రిందట

ర. మంథెనరామాయణము యక్షగానము. అముద్రితము

వి. ఈగ్రంథము మంథెనలో బ్రాహ్మణుల యొద్ద బలుతావులలోఁ గలదు. విశేషించి పలువురు కంఠస్థముచేసి పాడుచుందురు.

౯౮. మ నినాథకవి, వరవస్తు
ని. కేశవపట్టణము
కా. ౪౦సం. క్రిందట
ర. లలితాశతకము
లక్ష్మీశతకము
వి. కవిత్వము ప్రౌఢము ముద్రితములగు నీశతకములు మదరాసువావిళ్ళవారికడలభించును. శేషమత పీఠాధీశులగు జియ్యరుశిష్యుడగు నిక్కవివృత్తాంతము స్పష్టముగ దెలియదు.

౯౯. రంగాచార్యులు, తిరుమలబుక్కపట్టణము
ని. అమరచింత
కా. ౬౦ సం॥ క్రిందట నుండిరి:
ర. గుణరత్నాకరము, పద్మినిపరిణయముచంపువు. అముద్రితములు
వి. ఇరువదవయేట గతించిరి. బాలసరస్వతి శ్రీనివాసాచార్యులగారి పినతండ్రి. పైపుస్తకములుఅమరచింతలో బు. తి. వేంకటాచార్యులవారికడ గలవు

౧౦౦. రంగప్ప, బంగారు
ని. పిల్లలమఱ్ఱి
కా. ౧౪౪౦ క్రీ.శ ప్రాంతము
ర. భేతాళచరిత్రము ద్విపద అముద్రితము
వి. అన్నసముద్రము చినవీరయ్య సంస్కృతమునఁ జెప్పినదానికిది తెనుఁగు అంమరేచర్లగోత్రులగు రెడ్డివీరులలోజేరిన భేతాళరెడ్డి పరాక్రమము ఆలయ నిర్మాణము అభివర్ణితము. ప్రతులు హనుమకొండ పరిశోధక మండలియందును హైదరాబాదు ఆ॥ ప॥ మండలియందును గలవు

౧౦౧. రంగనాథుఁడు, చక్రపాణి
ని. వరంగల్లు ప్రాంతము
కా. క్రీ.శ ౧౨౦౦ ప్రాంతము
ర. నయనగతిరగడ
సంస్కృతాంధ్రకృతులు పెక్కులు
వి. తొలుతనితఁడు వైష్ణవుఁడుగనుండి అనంతరము శైవుఁడై పాలకురికి సోమనాథునిశిష్యత్వముగడించి రంగకవియనిపేరొందెను. ప్రాచ్యలిఖిత గ్రంథాలయము మదరాసులో మాతృకగలదు

౧౦౨. రాఘవరెడ్డి, చేడ
ర. రామాయణము [ద్విపద]
ని. దమ్మాగ్రావుపేట
కా. ౧౫౦. సం. క్రిందట
ర. రామాయణము [ద్విపద]
వి. పరిశోధక మండలి[అనుమకొండ]లోఁగలదు. ఇటగలప్రతి చాల శిథిలావస్థలో నున్నది.

౧౦౩. రామాచార్యులు, ఆరుట్ల
ని. చెన్నూరు. ఆసిఫాబాదు తా॥
కా. ౫౦-౬౦సం. క్రిందట
ర. జగన్నాథచంపువు [?]
వి. ముద్రితము. గ్రంథము లభింపకపోవుటచే విశేషాంశములు తెలియలేదు. లభించినశ్లోకములు ప్రౌఢతరములు. రసవంతములు

౧౦౪. రామకవి, ధర్మవరము
ని. గద్వాల
కా. ౧౫౦సం. క్రిందట
ర. గ్రంథములపేరులు తెలియవు
వి. గద్వాలసోమన్నపాలుని అనుజ్ఞచే ముకుందవిలాసమునురచించి యందొకపద్యము నందుఁదానుకవినని చెప్పుకొనినాఁడు: ఆపద్యము ప్రౌఢముగ నుంటచే గ్రంథములభించువఱకు నామమేని జపియుంచుకొనఁదగును.

౧౦౫. రామచంద్ర శాస్త్రి, గడిశాస్త్రిల
ని. రాయపర్తి. వరంగల్లు తా.
కా. ౩౦ సం. క్రిందట
ర. సగరపురాణము (పద్యకా) ముద్రితము.
వి. హనుమకొండ నివాసులలోఁ గొందఱు ఉప్పరులు తమవంశచరిత్రము నీగ్రంథ

మునఁ జేర్పించి క్రీ. శ. ౧౯౦౧ లో మద
రాసులో ముద్రింపఁజేసిరి. కవివివరము
గ్రంథమున గొంచమేనిలేదు.

## ౧౦౬. రామలింగకవి, తెనాలి

ని. గోలకొండ ప్రాంతము.
కా. ౨౫౦ సం. క్రిందట?
ర. ధీరజనమనోవిరాజితము,
వి. కవి విశ్వబ్రాహ్మణుఁడు. ఇందు అమర
సింహుఁడు విశ్వబ్రాహ్మణుల నిందించు
టదానిచేఁ గలిగినకష్టములు మున్నగు
కథలుగలవు. ఇతఁడు అక్కన్నమాదన్న
లకాలమున నుండెను.

## ౧౦౭. రామాచార్యులు, క్రొత్తపల్లి

ని: గద్వాల సంస్థానము.
కా. (తెలియదు) ౧౫౦ సం. క్రిందట
ర. యథాశ్లోక తాత్పర్య రామాయణము.
అయోధ్యాకాండము, ౫ ఆశ్వాసములు
ముద్రితము.
వి. గద్వాల సంస్థానమునందు ముద్రితము.

## ౧౦౮. రాజమౌళి

ని: మాహేశ్వరము. పాకాలతాలూకా
కా. ౪౦ సం. క్రిందట
ర. పెక్కుగ్రంథములు రచించెను. అందువి
శేషభాగములు ముద్రితములు
వి. ఈకవి ఫణిమండలకవికిఁ గుమారుఁడు.
తండ్రివలెనితఁడును ప్రౌఢకవి.

## ౧౦౯. రామభూపాలుఁడు, ముష్టిపల్లి

ని. గద్వాల సంస్థానము
కా. ౭౦ సం. క్రిందట
ర. ఛందోముకురము (సంస్కృతము)
వి. శా. శ: ౧౭౦౦ లో గద్వాలయందు
ముద్రితము. పురాణము దీక్షాచార్యులు
గారీకవికి విద్యాగురువు. రామభూపా
లుఁడు గద్వాలసంస్థానప్రభువు

## ౧౧౦. రామానుజాచార్యులు, అచ్చి

ని. వరదన్నపేట
కా. ౧౩౦౦ క్రీ. శ. ప్రాంతము
ర. తత్త్వార్థదర్పణము (ద్విపద) అముద్రితము
మోక్షసారము (అముద్రితము) ముముక్షు
జనకల్పము. (ముద్రితము)
వి. కవి వరంగల్లు ప్రాంతమునఁగల అచ్చి
వారికిఁబూర్వుఁడు. గ్రంథములమొదటిది
హనుమకొండ పరిశోధక మండలియందు
గలదు.

## ౧౧౧. రామానుజాచార్యులు
## కాండ్రవేటి

ని. కాండ్రవేడు
కా. క్రీ. శ. ౧౬౦౦
ర. తిరువాయి మొడిద్విపద
వి. శృంగారకవిరాయ బిరుదాంకితుఁడు.
మా. రామకృష్ణకవిగారి ప్రకటనమైనది
వేలు. ఇదివేలు గ్రంథము.

## ౧౧౨. రామానుజాచార్యులు, సముద్రాల

ని. కోరుట్ల. కరీంనగరు జిల్లా
కా. ౧౫౦ సం.
ర. సుశీలోపాఖ్యానము (అముద్రితము)
. కోరుట్లప్రాంతమునగల సముద్రాలవారను
వైష్ణవ కుటుంబమునకు జెందినవాఁడు.
ఈకవికృతగ్రంథములుకోరుట్లలో లక్ష్మీ
నారాయ గ్రంథాలయమునందుఁ గలదు

## ౧౧౩. రామన్న, చెన్నూరు

ని. యాదవాకిళ్ల. హుజూరునగరుతాలూకా
కా. ౧౦౦ సం. క్రిందట
ర. రామాయణము [ఆంధ్రీకరణము]
వి. హుజూరునగరు తాలూకాలోని చిలు
కూరునందలి శ్రీరామస్వామికిది అంకిత
ము. కవితరసవత్తరము. అచటి కరణము
గారి కడఁగలదు.

## ౧౧౪. రాఘవాచార్యులు, అంబాళం

ని. ఆనెగొంది సంస్థానము
కా. ౪౦ సం. క్రిందట
భారతచంపూ వ్యాఖ్య
వి. ఈగ్రంథము ముద్రితమైయున్నదని ఒకా
నొకరు తెలుపుచున్నారు. లభింపలేదు.

౧౧౫. రామానుజరావు, పండరి

ని. రామాయమ్మపేట. సిద్దిపేటతాలూకా

కా. జననము క్రీ. ౧౮౩౦ మరణము క్రీ. శ. ౧౯౦౮

ర. గాంగేయచరిత్రము యక్షగానము. అహల్యాసంక్రందన విలాసము. హనుమదవతారమండలి. అముద్రితములు.

౧౧౬. రామమూర్తి, పరశురామపంతుల

ని. ఒరంగల్లు మట్టెవాడ

కా. ౧౨౦ సం: క్రిందట

ర. శుకచరిత్రము, వివేకసారము, ఆధ్యాత్మ రామాయణము, సీతారామాంజనేయము యక్షగానము, వేదాంతకీర్తనలు, ఊమలవాయ రామశతకము, పరశురామశతకము, మనోహరశతకము.

వి. కవివంశజులు వరంగల్లు చెంతమట్టెవాడలో గలరు. గుర్తించినవి ముద్రితములు. అముద్రితగ్రంథములు కాకినాడలో ఆం. సా. పరిషత్తులో గలవు.

౧౧౭. రుద్రదేవచక్రవర్తి

ని. హనుమకొండ

కా. క్రీ. శ. ౧౨౬౨ ప్రాంతము

ర. నీతిసారము

వి. ఈగ్రంథమింతవఱకు దొరకలేదు. మా. రామకృష్ణకవిగారు కొన్నిపద్యము లుదాహరించి ఈనృపుడుకవియని గుర్తించిరి.

౧౧౮. రుద్రుడు, కోలను

ని. ఓరుగల్లు

కా. క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతము

ర. రాజరుద్రీయము ఇది కాశికయను పాణినీయ సూత్రవృత్తికి వ్యాఖ్య

వి. ఈగ్రంథము మద్రాసు ఓరియంటల్ లైబ్రరిలో కలదు. ఇంకగొన్ని గ్రంథముల కయనకర్తృత్వముకలదు. రాజరుద్రీయకర్త ప్రతాపరుద్రచక్రవర్తియనియేపలువురఅభిప్రాయము. ఈకర్తృత్వ విషయమింకను వివాదాంశమై యున్నది.

౧౧౯. హేమంతకవి, వేంకటరాజు

ని. తూముగుంట. గోపాలపేట సంస్థానము

కా. ౧౦౦ సం. క్రిందట

ర. గ్రంథములు దొరకలేదు.

వి. గోపాలపేట సంస్థానమున నితనిగ్రంథములుకలవట. తత్సంస్థానాధిపతులపేర గొన్ని గ్రంథములు ఇయనరచించెనట.

౧౨౦- లక్ష్మీపతి, రాపాక

ని. పరకాల

కా. క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతము

ర. భద్రాయురభ్యుదయము, శ్రీకృష్ణవిలాసము, శంకరవిజయము. శ్రీమదుపాఖ్యానము, నీలావివాహము.

వి. మొదటిరెండు పాత్రములు దోమకొండ రాజావారు ముద్రించిచేసిరి. మూడవపుస్తకము మదరాసు ఓరియంటలు లైబ్రరీలో అసంపూర్ణముగ గలదు.

౧౨౧- లక్ష్మణాచార్యులు, అచ్చి

ని. వరంగల్లు మండలము

కా. ౧౫౦ సం. క్రిందట

ర. ముముక్షుజనకల్పము ముద్రితము

వి. ఇది విశిష్టాద్వైత మతప్రశస్తి దెలుపు అనుచులక్షణ దేశికసంప్రదాయముచ్చే అనుమకుటముగలకవి సంబోధనతో గూడిన సీసపద్యగ్రంథము. కవివంశజులు వరంగల్లుమండలములో బలుతావులగలరు.

౧౨౨- లక్ష్మీనరసింహము లేక నరసింగమయ్య

ని. గద్వాల

కా. క్రీ. శ. ౧౬౫౦

ర. నృసింహవిలాసము [అముద్రితము]

వి. కౌణాదము వారికీకవి కుటుంబము బావమఱదివరుసలోనిది. రామకృష్ణకవిచే దూషింపబడిన ప్రగడరాణ్ణరసకవి ఇతడేమొ. ఈగ్రంథము ప్రకృతము దుర్లభము.

౧౨౩- లక్ష్మణసింగు

ని. నేలకొండపల్లి

కా, ౫౦ సం. క్రిందట

ర. కేశవశతకము [అముద్రితము]

వి. నేలకొండపల్లిలో భవానిసింగువద్దకలదు.

౧౨౪- లింగమూర్తి, పరశురామ పంతులు

ని. ఒరంగల్లు. మట్టెవాడ

కా. ౧౫౦ సం. క్రిందట

ర. సీతారామాంజనేయము, రతిమన్మథవిలాసము. సీతపాట, సాంఖ్యయోగము మానసశతకము:

వి. ఇక్కవిసమాధి వరంగల్లులోగలదు. కవి వంశజులు మట్టెవాడలో నున్నారు. వివరములు వావిళ్లవారి సీతారామాంజనేయ పీఠికలోఁ గాంచనగును:

౧౨౫. వల్లభ రాయకవి, కోవూరు

ని. పసుపుల మహిబూబునగరుజిల్లా

కా. ౪౦-౫౦ సం. క్రిందట

ర. ఉత్సవ మాహాత్మ్యము [ప.కా]

అముద్రితము

వి. కవికుమారులగు కోవూరు భరతయ్యగారి వద్ద ప్రతిగలదు. వీరిచిరునామ జింకలపల్లి. గద్వాల పోష్టు

౧౨౬. విఠలరాయకవి, పండరి

ని. కామాయమ్మపేట సిద్దిపేట తాలూకా

కా. జననము ౧౮౭౪ క్రీ.శ మరణము క్రీ.శ ౧౯౧౬

ర. గజగౌరీవ్రతము యక్షగానము

కౌసల్యాపరిణయము ,,

శ్రీరామవిజయము ,,

ఇవి ముద్రితములు

వామనచరిత్రము, మదనసాయకపరిణయము, హేమాంగీవిలాసము, రాజసూయయాగము. సత్యనారాయణ వ్రతము, సుమాలినీస్వయంవరము, బభ్రువాహన చరిత్రము

వి. ఈయన పండరిరామానుజరావుకుమారుఁడు ఈయన గ్రంథములలోఁ బైజెప్పిన వానియందు ఎక్కువభాగములు గేయములు. జనసామాన్యమునందు ఈకవిగేయములకు ఎక్కువ ప్రచారము కలదు.

౧౨౭. విద్యానాథ కవి

ని. వరంగల్లు

కా. క్రీ.శ ౧౩౦౦ ప్రాంతము

ర. ప్రతాప రుద్రయ శోభూషణము [సంస్కృతము] అలంకారశాస్త్రము

వి. విద్యానాథుఁడాంధ్రుఁడే కాని నిజముగు పేరు మల్లినాథుఁడని కొందరు అగస్త్యేశ్వరుఁడని కొందరుతలంచుచున్నారు. ప్రతాపరుద్రునిచే నొక మల్లినాథుఁడు కనకాభిషేకము బడసెగాన నితఁడాతఁడే మో.

౧౨౮. విశ్వేశ్వరకవి

ని. రాచకొండదుర్గము

కా. క్రీ.శ ౧౪౫౦ ప్రాంతము

ర. చమత్కారచంద్రిక [సంస్కృతము] వీరభద్రవిజృంభణము; కరుణాకందళము కందర్పసంభవము

వి. చమత్కారచంద్రిక రెండవసర్వజ్ఞ సింగభూపాలుఁడు రచించినటుల విశ్వేశ్వర కవి చెప్పకొనెను

౧౨౯. విశ్వేశ్వర శివదేశికులు

ని: ఒరంగల్లు

కా. క్రీ.శ ౧౨౦౦ ప్రాంతము

ర. శివతత్త్వరసాయనము

వి. మల్కాపురశాసనములో ఈయనచరిత్రము గలదు. కాకతీయగణపతిదేవునకు ప్రతాపరుద్రునికి ఈయనదీక్షాగురువు. శివతత్త్వరసాయనము యీయన రచితమనుటకుఁ జరిత్రకారుల ఉదాహరణములే ప్రమాణములు. గ్రంథము లభింపలేదు.

౧౩౦. వీరరాఘవాచార్యులు, కొటికలపూడి

ని. గద్వాలసంస్థానము

కా. ౧౫౦ సం. క్రిందట
ర. యథాశ్లోక తాత్పర్య భారతము ఉద్యోగపర్వము ఆశ్వాసములు ౨ ముద్రితము
వి. పూడూరు కేశవస్వామికంకితము. కవి వివరములు తెలియవు. గ్రంథము గద్వాలసంస్థానమునందు లభించును.

౧౩౧. వెంకన్న, తక్కసీల
ని. తక్కసీల ఆలంపురము తా॥ రాయచూరు జిల్లా
కా. క్రీ.శ ౧౭౬౦ ప్రాంతము
ర. పార్వతీదండకము, సీతారామ శతకము అముద్రితములు సు. ప్రతాపరెడ్డిగారి వద్దనున్నవి

౧౩౨. వెంకట నరసింహాచార్యులు, మరింగంటి
ని. కనగల్లు నల్లగొండజిల్లా
కా. ౧౦౦ సం॥ క్రిందట
ర. చిలువపడిగరేని పేరణము శుద్ధాంధ్రకావ్యము, పద్మినికన్యకాభ్యుదయము [ప్రబం]
రతిమన్మథాభ్యుదయము ,,
రామాభ్యుదయము ,,
శ్రీకృష్ణశతానందీయము ,,
శ్రీకృష్ణతులాభారము [ద్విపద]
వి. సిరిపినగండ్ల, దేవరకొండసీమలోనున్నది. మరింగంటి సింగాచార్యులనుకవి కీయన అరవపురుషుఁడు

౧౩౩. వేంకట నృసింహాచార్యులు, మరింగంటి
ని. కనగల్లు
కా. ౫౦సం॥ క్రిందట
ర. అనిరుద్ధవిలాసము యక్షగానము
వి. సింగరాచార్యులు, ౧. వెంకటనరసింహాచార్యులు వెంకటరాఘవాచార్యులు ఒక వంశములోనివారు.

౧౩౪. వేంకట రాఘవాచార్యులు, మరింగంటి
ని. కనగల్లు నల్లగొండజిల్లా
కా. ౬౦సం. క్రిందట
ర. కేశవస్వామిశతకము, కృష్ణవింశతి
వి. కేశవశతకము హనుమకొండ ఆంధ్రాభ్యుదయము అనుపత్రికలో ముద్రింపఁబడినది. ఇది అంత్యనియమము గల భక్తిరస శతకము

౧౩౫. వేంకటకవి, తిరువాయిపాటి కొలనుపాక
ని. కొలనుపాక
కా. ౫౦సం. క్రిందట
ర. యాదగిరీంద్రశతకము
యాదగిరినృసింహ శతకము
వి. ఈరెండు శతకములు ముద్రితములు వరదరాసువారిళ్లవారికడలభించును. కవి చాత్తాదవైష్ణవుడు.

౧౩౬. వేంకట నరసింహాచార్యులు, అసూరి మరింగంటి
ని. దేవరకొండ సీమ
కా. ౧౦౦సం. క్రిందట
ర. రతిమన్మథాభ్యుదయము అముద్రితము
వి. యావసుల అనంతరాజాగారియొద్ద పెద్దిశెటతాలూకా వరదాపురములో బ్రతికెను.

౧౩౭. వేంకటేశకవి, మాటూరి
ని. మంటూరు మధిర తాలూకా
కా. ౧౦౦సం క్రిందట
ర. బుధమనోల్లాసశతకము
భక్తిభరితము కవిత్వము ప్రౌఢము గాదు.

౧౩౮. వేంకటప్పయ్య, మాటూరి
ని. మాటూరు మధిర తాలూకా
కా. ౨౦సం. క్రిందట
ర. భూరిగుణజాలశతకము. ము.
వి. కవిత్వమంత ప్రౌఢముగాదు ఇతర పద్యానుకరణములు పాదపూరణములు పదములు

గలవు. ఏలూరు మంజులవాణీప్రెస్సులో ముద్రితము

౧౩౯. వేంకటాచార్యులు, తిరునగరి

ని. హనుమకొండ

కా. ౨౫౦సం. క్రిందట

ర. యతిరాజశతకము ముద్రితము

వి. యతిపతీహనుమద్గిరి రాజమందిరాయనునీ శతకము విశిష్టాద్వైతప్రతిపాదకము: రసవత్తరము. గ్రంథకర్తవంశజులిపుడు రాయపర్తిలోనున్నారు

౧౪౦. వేంకట నరసింహాచార్యులు, మరింగంటి

ని. కనగల్లు నల్లగొండ జి.

కా. శా.శ ౧౭౬౪ క్రీ.శ ౧౮౪౨

ర. తాలాంకనందినీ పరిణయము, ఇందిరాల భాగవతము [యక్షగానము] అముద్రితములు

వి. ఈరెండుగ్రంథములు హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధకమండలిలో గలవు.

౧౪౧. వేంకటరామకవి, శ్రీనాథుని

ని. అశ్వారావుపేట ప్రాంతము

కా. క్రీ. శ. ౧౭౦౦ ప్రాంతము

ర. శ్రీరామ పట్టాభిషేకము (లేక) అశ్వారాయచరిత్రము (అ.)

వి. కవిసగోత్రులు కంభముమెట్టు ప్రాంతమునఁ బలుతావులలోఁ గలరు. వెలమవీరులకుధంసాతో జరిగిన సంగ్రామమింద్రుఁ జరిత్రానుకూలముగా నభివర్ణితము ప్రతి నిరపురములో గలదని వినికి.

౧౪౨. వేంకటరమణయ్య, కృష్ణగిరి

ని. ధర్మపురినివాసి

కా. ౧౯౭౦ క్రీ: శ.

ర. వాసిష్ఠరామాయణము [ముద్రితము] అధ్యాత్మరామాయణము గయోపాఖ్యానము [కన్నడము] వాసిష్ఠ రామాయణ వ్యాఖ్య.

వి. మొదటిది మదరాసు పూర్వముద్రిత ప్రతులలో లభించినది. రెండవది అలభ్యము మూఁడవది ఓరియంటలు లైబ్రరి క్యాటలాగునుండి ఉద్ధృతము.

౧౪౩. వేదాంతాచార్యులు, కవితార్కికసింహ

ని. మంచాలకట్ట

కా. జననము శా: శ ౧౬౧౬

ర. రంగనాథపంచాశత్। విష్టపశుసమర్థనం, ఏకాదశీశ్రాద్ధమీమాంస, వ్రతరత్నప్రదీపిక, వాసోయజ్ఞోపవీత విచారము, రామత్రింశత్ స్తోత్రము, దశనిర్ణయము, ఉపయుక్తాంశసంగ్రహము, సత్కీర్తి యాకల్పమంజరి.

ర. ఇంక నెన్నియోగ్రంథములరచించిన ఈ గ్రంథకర్త చతుస్తంత్రవేత్త

౧౪౪. వేంకటాచార్యులు, తిరుమలబుక్కపట్టణము

ని. సురపురము సంస్థానము

కా. క్రీ. శ. ౧౮౩౦ ప్రాంతము

ర. గదాధరీయఖండనము (ఝంఝామారుతం) శృంగారతరంగిణి, అలంకారకౌస్తుభము, రసికమాన సోల్లాసము భాణము, శుకాధిపతనము, ఉషాపరిణయము నాటకము, యతిరాజదండకము, హయగ్రీవదండకము, దశావతారస్తోత్రము, భావశతకము, అచలాత్మజా పరిణయము, గజసూత్రవాదము, శృంగారలహరి.

వి. చివరవాల్గుపుస్తకములు ముద్రితములు: ముద్రితమగు నాలుగుపుస్తకములలో మొదటిమూఁడు ఆత్మకూరునందును తుది అచలాత్మజాపరిణయము, ఏలూరు మంజువాణీప్రెస్సునందును లభించును. ఈకవి మహావిద్వాంసుఁడు. సురపుర ప్రభువులగు పామనాయకపుత్రులైన వెంకటప్పకాలమున నీకవియుండి కాశీమొదలగు ప్రసిద్ధస్థలములలో శాస్త్రవాదమునవిద్వాం

సులగల్పి ద్వైతా ద్వైతమతములగుపా
దుకలు స్వమతస్థాపనము పరమతఖండన
మను చామరములు విశిష్టాద్వైతమను కిరీ
టముధరించుటచే సకవికి, కిరీటి బిరుదుగ
లిగెను. ౩౭ సం॥ జీవించిరి. అహోబిల
పీఠాధీశులజయించిరి. (ఈకవి సంపూర్ణ
చరిత్రము రెండు ప్రకటింపబడును.)

౧౪౫. వేంకటదాసు, రాకమచర్ల
ని. పెద్దరామ్మారెడ్డి తా, పర్గి జి. మహ
బూబునగరు
కా. ౮౦ సం॥ క్రిందట
ర. రాకమచర్ల కీర్తనలు. వేలువ్రాసెనుకాని
౫౦౦వరకు ముద్రింపబడినవి. ఇతడు వర
కవి. భక్తాగ్రేసరుడు.

౧౪౬. వెంకటదాసకవి, రాపాక
ని. పరకాల
కా. క్రీ. శ. ౧౮౦౦
ర. శివరహస్యఖండము (అముద్రితము)
వి. చంపాపురవిశ్వేశ్వరుడిందు బ్రశంసిం
పబడెను. వేములవాడ రాజేశ్వరునికిది
అంకితము. శివునూరి అచ్చనమంత్రి ఇ
క్కవిని బ్రోత్సహించి గ్రంథమురచిం
పజేసెను. రాపాక లక్ష్మీపతికీకవిసహో
దరుడు.

౧౪౭. వెంకటరాయకవి, ఉద్దమర్రి
ని: భువనగిరిచెంత ఉద్దమర్రి
కా. క్రీ.శ ౧౮౦౦ ప్రాంతము
ర. సర్వోపనిషత్సారసంగ్రహము [అముద్రిత
ము సంస్కృతము]
వి. యీగ్రంథము ఆంధ్ర సాహిత్య పరిషత్తు
కాకినాడలోగలదు. ఉపనిషత్తులలో
బ్రతిపాదింపబడిన ధర్మము లిందుగలవు.
భువనగిరినితడు ఏకశిలానగరమని ప్రశం
సించినాడు

౧౪౮- వేంకటాచార్యులు, ముడుంబ
ని, మహబూబునగరుజిల్లా
కా. క్రీ.శ ౧౮౦౦ ప్రాంతము

ర. దేవహూతివిలాసము [అను]
రసదీపిక. ముద్రితము
వి. వరంగల్లు ప్రాంత నివాసియని బుజావుచే
యదగిన వివరములు దేవహూతివిలాసము
నందుగలవు. ఈగ్రంథము ఆంధ్ర విశ్వవి
ద్యాలయమునందుగలదు.

౧౪౯- వీరరాఘవాచార్యులు
ని. వనపర్తిసంస్థానము
కా. ౧౫౦ సం, క్రిందట
ర. భాగవతమునకు వ్యాఖ్య, వీరరాఘవీయము
[ముద్రితము]
వి. వనపర్తి సంస్థానమున ప్రశస్తులలభించు
ను, ఇది విశిష్టాద్వైతవ్యాఖ్య

౧౫౦. వేంకటాధ్వరి, ఆరిశాణపాలము
ని. ఆత్మకూరు సంస్థానము
కా. తెలియదు
ర. లక్ష్మీసహస్రవ్యాఖ్య

౧౫౧. శరభాంకుడు
ని. ఒరంగలు
కా. క్రీ.శ ౧౩౦౦ ప్రాంతము
ర. శరభాంకలింగశతకము
వి. యీశరభాంకకవి వేమనవలె తనపేరశత
కము వ్రాసికొనెను. ఈయన ప్రతాపరు
ద్రునిమంత్రియని లింగధారణచంద్రికలో
గలదు. వేములవాడ నుండి ఒకానొ
కరుమారు ఈకవివంశమున మూలపు
రుషుడనివ్రాసిరి.

౧౫౨. శివదేవయ్య
ని. వరంగలు
కా. క్రీ.శ ౧౨౫౦-౧౩౨౦
ర. పురుషార్థసారము
శివదేవధీమణిశతకము
వి. గణపతిదేవుడు రుద్రమ దేవులకు మంత్రి
గానుండి యీయన పెక్కుగ్రంథములు
రచించెగాని అవిలంభించుటలేదు. బాల
బోధము అక్షణశిరోమణి సకలనీతిసమ్మ

తము ఆపు గ్రంథములలో శివదేవునికృతు
లు ఉదాహరణముగాఁ గైకొనఁబడెను

౧౫౩. శేషాచలపతి, యామునజాల
ని. నాగవరపాడు మధిరతాలూక
కా. ౧౨౦సం॥ క్రిందట
ర. వసిష్ఠజనక సంవాదము (ముద్రితము)
రామాయణము యక్షగానము (అ.ము.)
వి. మొదటిది వావిళ్లవారికడ మదరాసులో లభించును. రెండవగ్రంథము కవివంశజులకడ కంభము మెట్టులోఁ గలదు.

౧౫౪. శేషప్ప
ని. ధర్మపురి కరీంనగరు జిల్లా
కా. ౧౫౦సం. క్రిందట
ర: నరసింహశతకము, నరహరిశతకము ధర్మపురిరామాయణము యక్షగానము
వి. ఈధర్మపురి గోదావరి తీరమునందున్నది. కవి సాతానివైష్ణవుఁడు. ఈతనిగూర్చి పెక్కుకథలు వాడుకలోనున్నవి.

౧౫౫. శేషాచార్యులు, బోరవెల్లి
ని. గద్వాలసంస్థానము
కా. ౧౫౦సం. క్రిందట
ర. యథాశ్లోక తాత్పర్య రామాయణము. యుద్ధకాండము. పూర్వభాగము ౪ ఆశ్వాసములు (ముద్రితము)
వి. ముద్రితప్రతి గద్వాల సంస్థానమునందు లభించును. కవితండ్రి రాఘవాచార్యులు కృతి గద్వాల కేశవస్వామి కంకితము
ని. కలువకొలను మహబూబునగరుజిల్లా

౧౫౬. శేషాచార్యులు, వాడాల
కా. ౧౦౦-౧౨౦సం॥ క్రిందట
ర. మైథిలీపరిణయము (ప.కా) అముద్రితము
వి. గద్వాలసంస్థానమునకు ఆస్థానకవి ఈగ్రంథము కొండ్రావులపల్లి కోడేరు పోష్టు మహబూబునగరుజిల్లాలో సుదర్శన పురుషోత్తమాచార్యుల గారివద్దను గద్వాల శ్రీపెరుంబుదూరు కృష్ణమాచార్యులవద్దను వీరిప్రతులు కలవు.

౧౫౭. శ్రీనివాసాచార్యులు, కవితార్కికసింహ
ని. మంచాలకట్ట జటప్రోలుసంస్థానము
కా. ౩౦౦సం: క్రిందట
ర. [తెలియదు]
వి. సంస్కృతమున నెన్నియో గ్రంథములు రచించిరి. [యీవివరము ముందు సంపాదించి ప్రకటింపబడును]

౧౫౮. శ్రీనివాసాచార్యులు, తిరుమల బుక్కపట్టణము
ని. సురపురము సంస్థానము
కా. శా.శ ౧౬౮౦ ప్రాంతము
ర. తత్త్వమార్తాండము ౨౪౦౦౦ శ్లోకముల గ్రంథము, నయద్యుమణి గుణమీమాంస, సిద్ధాంతచింతామణి, ఉపసంహారవిజయ వరాజయ. జ్ఞానరత్నపరీక్షిక, చతుస్సూత్రి, త్రియ్యంతఘంటాపథ. దురుపదేశధిక్కార, రహస్యత్రయ సారగాథావ్యాఖ్య మొదలగు వేదాంతగ్రంథములు, దత్తరత్నప్రదీపిక, గ్రహణభుక్తిదీపిక, శ్రీజయంతినిర్ణయము మొదలగునవి. వివరములు ముందు ప్రకటింపబడును

౧౫౯. శ్రీనివాసతాతాచార్యులు, బుక్కపట్టణము తిరుమల
ని. సురపురము
కా. క్రీ.శ ౧౬౦౦ ప్రాంతము
ర. రసోదారభాణము
వి. ఈకవి ౧౫౮ ఆగు శ్రీనివాసాచార్యులకు తండ్రిగారు. అఖండవిద్వాంసులు

౧౬౦. శ్రీనివాసరాఘవాచార్యులు, కవితార్కికసింహము
ని. మంచాలకట్ట జటప్రోలుచెంత
కా. శా.శ ౧౭౨౦ జ. ము. ౧౭౫౫ లో

ర. లక్ష్మీపంచాశత్తు, ధ్వాంత మాత్రార్థవిచారము
వి. ఈయన చతుస్తంత్ర పారంగతులు

**౧౬౧. శ్రీనివాసాచార్యులు, కవితార్కికసింహ**
ని. పంచాలకట్ట జటప్రోలుచెంత
కా. శా.శ ౧౫౯౫-౧౫౯౬
ర: అచపప్రామాణ్యగమనిక, ఏకాదశినిర్ణయము, శుద్ధప్రకాశిక, ఊర్ధ్వపుండ్రపర్వవిద్యాంగనిర్ణయము, వాదావళి, మాధ్వమతశతదూషణి, బ్రహ్మనందీయ ఖండనము, భేదధిక్కార న్యక్కారః
వి. ఇవిగాక ౬౦ పుస్తకములు రచించెను కోయిలకొండలో సురవరం ఆనంతరెడ్డిగారి వలన యీయన శా.శ ౧౬౨౯ లో నొక గ్రామము దానముగనొందెను.

**౧౬౨. శ్రీరంగాచార్యులు, వాత్స్య**
ని. బూరుగుగడ్డ
కా. ౨౦౦సం: క్రిందట
ర. శాల్మలీకందనందన విలాసము. ఆ.
వి. ఇందుబూరుగుగడ్డదేవాలయమహాత్మ్యము నిర్మాణక్రమముచరిత్రమునకనుకూలముగ పద్యరూపముగ రచింపబడెను. హైదరాబాదు లక్ష్మణరాయపరిశోధక మండలిలో ప్రతిగలదు కవిస్తుతిలో అల్లసానిపెద్దన్నను పేర్కొనెను.

**౧౬౩. శ్రీరామకవి, రాపాక**
ని. పరకాల కా. ౧౭౯౦ క్రీ.శ
ర. అధ్యాత్మరామాయణము

**౧౬౪. సంజీవకవి చింతలపల్లి**
ని. గంగాపురము మహబూబునగరు జి.
కా. ౨౦౦ సం॥ క్రిందట
ర. చంద్రాంగదోపాఖ్యానము
వి. ఈకవి చింతలపల్లి వీరరాఘవకవికిఁ బూర్వుఁడు: గద్వాలాది సంస్థానములలోఁ పేరొందినవాఁడు గ్రంథమలభ్యము.

**౧౬౫. సంజీవరాయకవి, రావూరి**
ని. కొలనుపాక
కా. క్రీ.శ. ౧౭౯౦ ప్రాంతము
ర. రుక్మిణీపరిణయము. [ము.] వీరనారాయణశతకము [ము.] త్రివిక్రమవిలాసము, వసుదేవనందన శతకము, భాగవతము, ౧౧. ౧౨. స్కంధములు.
రుక్మిణీపరిణయము కొప్పర్తి నరసకవికృతమనికొందఱితలంపు.

**౧౬౬. సర్వప్ప, కాసె**
ని. ఓరుగల్లుప్రాంతము
కా. క్రీ.శ. ౧౪౦౦ ప్రాంతము
ర. ప్రతాపచరిత్రము
సిద్ధేశ్వరచరిత్రము ద్విపద
ర. వరంగల్లు ప్రాంతవాసియగుట నిచటిప్రవాదములను గ్రంథస్థము గావించెను. కవితావిషయముకంటె చరిత్రాంశమున నితనివి ప్రమాణగ్రంథములు.

**౧౬౭. సర్వజ్ఞ సింగభూపాలుఁడు**
ని. రాచకొండ
కా. క్రీ.శ. ౧౩౭౦౩౧౪౨౦
ర. రసార్ణవసుధాకరము [సంస్కృ]
అమరవ్యాఖ్యానము
వి. ఈపేరుగలవారు రాచకొండపాలకులలో నిరువురుగలరు. ప్రకృతవ్యక్తి మొదటివాఁడు. ఈతఁడుకవియు సర్వజ్ఞ బిరుదాంకితుఁడునైయున్నాఁడు. రసార్ణవసుధాకరము విలువగలలక్షణగ్రంథము (ముద్రి)

**౧౬౮. సింగనార్యుఁడు, మడికి**
ని. రామగిరిదుర్గము
కా. క్రీ.శ: ౧౪౦౦ ప్రాంతము
ర. జ్ఞానవాసిష్ఠరామాయణము, పద్మపురాణము, సకలనీతిసమ్మతము, భాగవత దశమస్కంధము, నీతితారావళి.
వి. రామగిరిలో నివాసమేర్పఱచుకొని అచటిమంత్రులతో బాంధవ్యముజరిపి కృతులంకితమొసంగెను.
జీవితము దుర్గమునందుఁజరిపెను.

౧౬౯. సింగరాచార్యులు, మరింగంటి
ని. దేవరకొండసీమ
కా. ౨౫౦ సం॥ క్రిందట
ర. శ్రీకృష్ణశతానందీయము, కృష్ణలీలాభారతము. రామకృష్ణచరిత్రము, నాటకశాస్త్రము. ప్రేమాభిరామము, ధనాభిరామము, నలయాదవరాఘవపాండవీయము, అలంకారసంగ్రహము ఆంధ్ర భాషాభూషణము, రతిమన్మథాభ్యుదయము, రామాభ్యుదయము, నిరోష్ఠ్యరామాయణము, నిరోష్ఠ్యశుద్ధాంధ్ర సీతాకల్యాణము.
వి. తుదిరెండును ముద్రితములు. ఇంకనెన్నో గ్రంథములు రచించినట్లు కృతులలోం జెప్పంబడెను.
వివరములు, ముందు ప్రకటింతుము.
చూ. గోలకొండపత్రిక శ్రీముఖ భాద్రపద శు॥ ౧౫

౧౭౦. సింగయ్య, సిరుమర్తి
ని. సిరుమర్తి నల్లగొండజిల్లా
కా. ౪౦ సం॥ క్రిందట
ర. ఆంధ్రీకరణ భారతము అముద్రితము.
వి. భువనగిరిలో నొకవైశ్యునకీ గ్రంథమంకితము. ఈవివరములు కాశినుండి చిదిరెమఠము వీరభద్రకవిగారు తెలిపిరి

౧౭౧. సింగనామాత్యుఁడు, ఏర్చూరి ఏర్చూరు
కా. క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతము
ర. భాగవతము షష్ఠస్కంధము. కువలయాశ్వచరిత్రము
వి. ఏర్చూరు నల్లగొండమండలములోనిది. ఈ ప్రౌఢకవి రచించిన కువలయాశ్వ చరిత్రము అముద్రితము. ఉదాహరణపద్యము లందలివి చాల ప్రౌఢము గానున్నవి.

౧౭౨. సింగరాచార్యులు
ని. వెల్పుకొండ
కా. క్రీ.శ ౧౪౦౦ ప్రాంతము
ర. అర్బురాదిప బంధము [ద్విపద] అ.
వి. ప్రతివాదిభయంకరము నరసింహాచార్యులకిది విశిష్యుఁడు. ప్రతి హనుమకొండ పరిశోధకమండలియందుఁగలదు.

౧౭౩. సుబ్బాశాస్త్రులు, అక్షింతల
ని. వేపర్ల, వనపర్తిసంస్థానము
కా. ౬౫ సం॥ క్రిందటనుండిరి
ర. భాష్యార్థరత్నమాల. [అర్యావృత్తము] ప్రహసనము అ. ము. కర్నూలు వెల్లాల శంకరశాస్త్రిగారవద్ద నున్నది.
వి. జగద్విఖ్యాత విద్వాంసులు అనేకసంస్థానములలో నఖండ గౌరవములందిరి. వేదాంతశాస్త్రమునసియన అత్యంతవిజ్ఞాని. (ఈతని చరిత్రము ముందు ప్రకటింపబడును.)

౧౭౪. సుబ్బాశాస్త్రి, గార్గేయపుర
ని. గద్వాల సంస్థానము
ర. యథాశ్లోకతాత్పర్య రామాయణము, అరణ్యకాండము, ఆశ్వాసము ౩. ము:
వి. ప్రతిగద్వాల సంస్థానమున ముద్రితము.

౧౭౫. సోమనాథకవి, పట్టమెట్ట చిక్కవోలు [దోమకొండ]
కా. క్రీ.శ. ౧౫౦౦-౧౫౫౦
ర. సూతసంహిత, బ్రహ్మోత్తరఖండము.
వి. ఈరెండుగ్రంథములు దోమకొండసంస్థానప్రభువులచే ముద్రితములు. దోమకొండ సంస్థానాధిపతుల కాలమునని వి మెదకుజిల్లాయందుండెను.

౧౭౬. సోమనాథకవి
ని. లేములవాడ
కా. క్రీ. శ. ౧౬౫౦ ప్రాంతము
ర. వసుచరిత్రమునకు విద్వన్మనోరంజనివ్యాఖ్య, చతుర్భుజాభిషేకము [అము] యాదవచరిత్రము [అము] గంగాగౌరీ సంవాదము [అము]
వి. కవితనవ్యాఖ్య లేములవాడ రాజేశ్వరున కంకితము గావించెను. మిగిలిన మూఁడు గ్రంథములపేరులు వసుచరిత్ర వ్యాఖ్య నుండి ఉద్ధృతములు.

౧౭౭. సోమభూపాలుఁడు

ని. గద్వాల

కా. రతిరహస్యము, అష్టపదులు అము.

ర. ౩౦౦ సం॥ క్రితము

వి. హరిభట్టారకుఁడు సంస్కృతీకరించిన రతిరహస్యము ఈ తెలుఁగునకె భాషాంతరీకరణము. రతిరహస్యము (తెలుగుపద్యముల, తాళపత్రప్రతి సు. ప్రతాపరెడ్డి గారివద్దకలదు.

౧౭౮. సోమనాథుఁడు, పిడుపర్తి

ని. ఒరంగల్లుప్రాంతము

కా. క్రీ.శ. ౧౫౦౦లు.

ర. బసవపురాణము పద్యము
ప్రభులింగలీల ద్విపద

వి. ఈయన బసవకవికిఁ కుమారుఁడు ప్రౌఢకవి. ఈ రెండుగ్రంథములు (ముద్రి)

౧౭౯. సోమనాథకవి, పాలకుర్తి

ని. పాలకుర్తి

కా. క్రీ. శ. ౧౧౫౦ ప్రాంతము

ర. బసవపురాణము, పండితారాధ్యచరిత్రము అనుభవసారము, చెన్నమల్లుసీసము, వృషాధిపశతకము ఇవిముద్రితములు, బసవోదాహరణము. సోమనాథభాష్యము, రుద్రభాష్యము. బసవోదాహరణము. నమస్కారగద్యము, పంచప్రకారగద్యము పంచప్రకారగద్యము, అక్షరాంకగద్యము, అష్టోత్తర శతనామగద్యము, వృషభాష్టకము, బసవాష్టకము.

వి. ఈయన కన్నడము తెలుఁగు సంస్కృతములలో గ్రంధములురచించెను. మరము పాలకుర్తి [వరంగల్లుచెంత] గలదు. సిద్ధిపొందినది యిటనేయని కొందఱందురు. సిద్ధిపొందిన చిహ్నములు చూపుదురు. మతకర్తలలో నింతప్రౌఢకవి ఆంధ్రవాఙ్మయమునందు లేఁడు ఈయనకంకితముగా రచింపఁబడిన గ్రంథము లాంధ్రమునఁ బెక్కులుగలవు.

౧౮౦. హనుమంతమ్మ

ని. బొర్లెం జి. నిజామాబాదు

కా. ౧౦౦ఏండ్లక్రితము

ర. స్తవములు అ.

వి. ఈయమ మడివ్యాళ్లయ్యగారిభార్య పరమపతివ్రత, వరప్రసాద లబ్ధముగా బసవలింగప్పఅనుకుమారుని గాంచెను:

౧౮౧. హరిభట్టు

ని. కంభము మెట్టు

కా. క్రీ.శ ౧౬౦౦ప్రాంతము

ర. రతిరహస్యము [సంస్కృతము] మత్స్యపురాణము (ముద్రితము, నృసింహపురాణము పిఠాపురములోను
కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు లోను ముద్రితము

౧౮౨. హరిహరుఁడు, బొమ్మకంటి

ని. రాచకొండ

కా. క్రీ.శ ౧౪౦౦ ప్రాంతము

ర. అనర్ఘరాఘవమునకువ్యాఖ్య

వి. బొమ్మకంటి అప్పలాచార్యులకీయన శిష్యుఁడు. మహా విద్వాంసుఁడు. ప్రతిమ ద్రాసు ఓరియంటలు లైబ్రరీలోఁగలదు.

౧౮౩. హనోన్నయ్య, చరిగొండ

ని. చరిగొండ

కా. క్రీ.శ ౧౭౦౦ ప్రాంతము

ర. జ్యోతిషరత్నాకరము [ప.కా]

మహబూబునగరుజిల్లా చరిగొండ నివాసి, చరిగొండధర్మకవి చరిగొండ నరసింహకవి, ఈహనోన్నయ్య ఒకకుటుంబములోనివారె. పూర్వోత్తరములు పరిశీలింపవలసియున్నవి.

# తప్పొప్పుల పట్టిక



| పుట | పద్యపంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౭ | ౩ | చిదాన్వ | చిదన్వ |
| ౧౦ | ౬ | సూర్యసం | సూర్యసం |
| ౧౧ | ౨ | నాత్మక్ | పెంపున్ |
| ౧౧ | ౨౦ | గిఁయు | గిఁయు |
| ౧౪ | ౧౧ | ఝేలఁ | నేలఁ |
| ౧౪ | ౨౦ | కంకపత | కంకపత్ర |
| ౧౫ | ౧౦ | తాప్పస్వ | తాష్టస్వ |
| ౨౫ | ౩ | శ్రీధవభాను | శ్రీధవబాణు |
| ౨౬ | ౧ | శ్రీవనిత | శ్రీవనితా |
| ౨౬ | ౯ | దృగోత్పల | దృగుత్పల |
| ౨౮ | ౮ | శరుణం | శరణం |
| ౨౯ | కవిపేరు | శిలింగం | శిలిగం |
| ౩౬ | ౫ | ధీరా | వరా |
| ౩౭ | ౩ | భూమేల్ | బూమేర్ |
| ,, | ౪ | ధామై | స్తోమై |
| ,, | ౭ | యూహ్లా | యూపా |
| ,, | ౯ | భవ్య | భూరి |
| ,, | ౧౧ | నవ | ధుత |
| ౩౮ | ౧౮ | భక్తిముక్త | భక్తముక్తి |
| ౩౯ | కవిపేరు | శ్రీ కె యూమునా | శ్రీ. కె యామునా |
| ౪౦ | ౧౦ | సరసీరుహాక్షి | సరసిరుహాక్షీ |
| ౪౬ | ౯ | వుపాశ్య | వుపాస్య |
| ౫౧ | ౧౪ | జగత్పతే | జగత్పతీ |
| ౯౦ | ౨౧ | ర్భరశోక | ర్భరమగుశోక |

| పుట | పద్యపంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౯౭ | ౬ | నొడయండ | నొడయుండ |
| ౯౯ | ౩ | కుంభీఢ్డితి | కుంభీడ్దితి |
| ౯౯ | కవి. పేరు | పైడికంటి | పైడిమఱ్ఱి |
| ౧౧౪ | ౧౧ | వేగ | మగువ |
| ,, | ౨౩ | వేగ | మగువ |
| ౧౧౯ | ౯ | రీత్యన్ని | రీత్యాన్ని |
| ౧౨౭ | ౬ | రిష్ఠ | రిష్ట |
| ,, | ౧౨ | సత్ప్రథయా | సత్ప్రథమా |
| ౧౨౯ | ౨ | కబ్ది | కల్మి |
| ,, | ౧౭ | జేసిన | జేయన |
| ౧౩౦ | ౫ | సేయు | సేయ |
| ౧౩౧ | ౧౬ | నేల | నెల్ల |
| ౧౩౫ | కవి, నెం | ౧౪౪ | ౧౪౫ |
| ,, | ౩ | శుభస్క | శుభంక |
| ,, | ౮ | సహ్ని | సన్ని |
| ౧౩౬ | ౧౩ | నవుడు | నవుకు |
| ౧౩౯ | ౧౨ | శీతకాహాన | శీతకరహాస |
| ౧౭౪ | ౩ | భూరితర | బహుళతర |
| ౧౭౭ | ౧౫ | చిత్రోయి | చితివోయి |
| ౧౭౯ | ౪ | గ్గుడున | గుడువ |
| ,, | ,, | దీనవర్ష | దీనకర్ష |
| ,, | ౧౪ | నుడవడ | నుడివడ |
| ,, | ౧౮ | అడకుంవ | అడఁకువ |
| ౧౯౫ | ౫ | వల్లవ | పల్లవ |
| ,, | ౯ | జరపిరరర | జరరపిరర |
| ,, | ౧౩ | రాధ్యయ | రాధ్యమ |
| ౨౧౨ | ౧౨ | చూరిచి | గూరిచి |
| ౨౧౩ | ౫ | తైషపతి | తైషఃపతి |
| ౨౧౭ | ౧౪ | నాంధ్రబాషి | తెనుఁగుబాస |

| పుట | పద్యపంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౨౧ | శీర్షిక. | ఉతరప్రభో | ఉత్తరప్రభో |
| ౨౨౬ | ౧౫ | ధీనమాన | దీనమాన |
| ౨౨౭ | ౧౦ | శాశ్వత | నిశ్చిత |
| ,, | ౧౯ | జలుక | జిలుక |
| ౨౨౯ | ౧౨ | విటూఛ్రా | విటూచ్ఛ్రా |
| ౨౩౦ | ౫ | విదాం | విద్వాం |
| ౨౪౧ | ౧౦ | నీక్షంప | నీక్షింప |
| ౨౪౬ | ౨౦ | చమ్మృమ్మృ | చమ్మృ |
| ౨౪౭ | ౨౩ | మంత్రశే | మంత్రశ్రే |
| ౨౫౦ | ౧౨ | స్వాతం | స్వాంతం |
| ౨౫౯ | ౧౬ | ప్రమద | ప్రమద |
| ౨౬౩ | ౨౨ | ముఖుంబు | ముఖంబు |
| ౨౬౫ | ౪ | కొరగి | కెఱగి |
| ౨౭౭ | ౩ | జెదరి | బెదరి |
| ౨౮౩ | ౧ | దుర్మత | దుర్మతవాద |
| ౨౯౦ | ౬ | భావంబుతోవరలు | భావంబుతోడుతవరలు |
| ౨౯౩ | ౨ | లజ్ఞాను | లజ్ఞాన |
| ౨౯౮ | ౧౨ | దరధవు | దరభవు |
| ,, | ,, | ము౯ | ముల్ |
| ౩౦౭ | ౨ | నాట్యమాడి | నటనసల్పి |
| ౩౦౮ | ౧౩ | నామమా | పేరునా |
| ,, | ౧౫ | మమ్ము | మమ్మ |
| ౩౧౬ | ౯ | ఖ్యావనాత్ | ఖ్యాపనాత్ |
| ,, | ౧౪ | ప్రకృతిరిశ | ప్రకృతిరివ |
| ౩౨౪ | ౭ | శరారి | శరారి |
| ,, | ౧౫ | పన్నుతి | సన్నుతి |
| ,, | ౧౬ | నిలయంబులలో | నిలయంబులో |
| ౩౨౬ | ౨౩ | మునిలీరానిల | మునిలీలానిల |

# గోలకొండ పత్రికా ప్రచురములు

---

౧ హిందువుల పండుగలు—౩౨౦ పుటలు అనేక
పటములు కర్త: సురవరము ప్రతాపరెడ్డిగారు ౧—౮—౦

౨ సంఘోద్ధరణము—సంఘాభివృద్ధి మార్గములు
చక్కగా నిరూపింపబడినవి. పుటలు ౯౦
కర్త. ప్రతాపరెడ్డిగారు ౦—౬—౦

౩ ఉచ్ఛ్రలవిషాదము—కాశ్మీర దేశచరిత్రాత్మక
మైనది వీరరసప్రధానము సుమారు ౧౦౦పుటలు ౦—౧౨—౦

౪ కృష్ణార్జున సంవాదము—ద్విపద ప్రాచీనకవి
నాదెండ్లగోపప్రధాని కృతము కృష్ణరాయల
నాటిది అపూర్వగ్రంథము ౦—౬—౦

౫ కృష్ణాలహరి—సంస్కృత శ్లోకములు తెలుగు
పద్యములతో సహా పారాయణ యోగ్యము. ౦—౨—౦

౬ కర్నూలురాజుల వంశావళి—చారిత్రికము ౦—౨—౦

౭ చార్మినార్—పద్యములు కర్త సముద్రాల రాఘ
వాచార్యులు సచిత్రము ౦—౨—౦

౮ రఘునాథ్ వచనము—ఊటుకూరు సత్యనారా
యణరావు బహాదరువారు వ్రాసినది
చారిత్రిక గాథ ౦—౨—౦

౯ గోలకొండ భావసంవత్సరాది సంచిక— ౦—౮—౦

౧౦ సుధాలహరి—శ్లోకములు పద్యములు
పారాయణ యోగ్యము ౦—౨—౦



# మీకండ్లపై  దయదలచుడు

అమిత ప్రకాశముగలవస్తువును దీర్ఘకాలము చూడకుడు. ప్రకాశము మంచిదై యుండవలెను. అనగా అట్టిప్రకాశముగాని, మసకమసకగాగాని యుండరాదు. అంతేగాక కాంతి వెనుకనుండిగాని లేక యెడమప్రక్కనుండిగాని వచ్చి కంటిలోగాక పుస్తకముపై బడవలెను. నీవును కిటికీవైపు మళ్లించి కూర్చుండినచో యిదిజరుగును.

అస్పష్టముగాను చిన్నఅక్షరములలోను ముద్రింపబడిన పుస్తకములను గాని పేపరుగాని చదువవలదు. అక్షరములు ఎప్పటికిగాని ఎత్తులో ౧౪ మిల్లిమీటర్లకంటె చిన్నవిగాగాని లావులో పావుమిల్లిమీటరుకంటె తక్కువగాగాని నుండరాదు.

నేరుగా ఎండలోగాని, ప్రదోషకాంతిలోగాని చదువవలదు.

తళతళలాడు తెల్లకాగితమును ముఖ్యముగా మిరుమిట్లుగొల్పుచు కనులకు బాధకలిగించు గ్లేజుకాగితమునుగాని ఉపయోగించవలదు.

అప్పుడప్పుడు పుస్తకము నుండి దూరముగాచూచుచు కండ్లకువిశ్రాంతినిమ్ము. పుటను త్రిప్పునపుడెల్ల యిట్లుచేయవలెను.

ఆరోగ్య స్థితినిబట్టి ౬ లేక ౭ వ సంవత్సరములవరకు పిల్లలను బడికి పంపరాదు.

రైలు బండిలోగాని, యితరబండిలోగాని, పడకలో పరుండిగాని చదువవలదు.

చదువునపుడును వ్రాయునపుడును శిరస్సును శరీరమును చక్కగానుంచవలెను. డెస్కులనుగాని కుర్చీలనుగాని హాయిగా కూర్చుండుట కనుకూలముగను, శిశువు పుస్తకములపై వ్రాలకుండునట్లును నిర్మించవలెను. పుస్తకముపైకి వంగరాదనియు, ౧౨ మొదలుకొని ౧౮ అంగుళములదూరము వరకు తనకు అవసరమగునంతదూరము డెస్కుపై యెత్తుచేసుకొనవలసినదనియు శిశువుకు చెప్పవలయును. శిశువు వంగవలసిన అవసరములేకుండ డెస్కుమీద చెక్క ౩౦ డిగ్రీల కోణముగల వంపు గలదై యుండవలెను. బడిపిల్లలలోనుండు గూనియు, తలఅదరుటయు ఉపాధ్యాయుడును ఆరోగియు సరియైనవిధమున కూర్చునువిషయంలో శ్రద్ధవహింపనందుకు ఫలములే.

వివేకముగలవారు క్రిందవర్ణించిన ప్రకృతిహెచ్చరికలను జాగ్రత్తగ గమనించుచు :—

నీళ్లుకారుట, మంటలు, వెలుతురును ఓర్చలేకపోవుట, దురద, ఎరుపు, కంటిరెప్ప అంచునకాయ, కనుబొమ్మల వెంట్రుకలు రాలిపోవుట, ఒకకన్ను కంటె మరియొకకన్ను చిన్నదిగానుండుట, రెప్పలల్లార్చుట, కండ్లచుట్టును నల్లటిడగరాలుముడుతలు, మెల్లకన్ను, నొసటిముడుతలు, నత్తి, సభాపిరికితనము, బిత్తరిచూపు, తలతిరుగుట, తలనొప్పి, పుస్తకములపై అయిష్టము, చదువునప్పుడుకునుకుపాటు, మూర్ఛ, దృష్టిచెదరుట, మునికోపము, మఱపు, నిర్నిద్రత, అలసట, చదువుటకు పుస్తకాలను ౧౮ యించులకంటె దగ్గఱగాని దూరముగగాని ఉంచుకొనుట, రాత్రిళ్లుచిన్న అక్షరములను చదువుటవల్ల కష్టము, కంటియెదుట సాలెగూళ్లమాదిరి తిరుగుచున్నట్లు కనబడుదారములు, లేకనల్లనిమచ్చలు;

ఎండకైగాని, కంటిచూపుకైగాని వైద్యులవల్లగాని, ఆస్పత్రులనుండిగాని సలహాపొందక కండ్లద్దములను కొనవద్దు. గుమాస్తాలకు సగమద్దములుకల్ద్దారురూ ౧౦ నుండి అంతకంటెయెక్కువ వెలగలకుగూడ దొరకును.

హార్డ్ అండు కో

ఆప్టిషియన్సు అండ్ అక్యూలిస్టు, (లండన్)

124 జేమ్సుస్ట్రీటు, సికింద్రాబాదు.

---

## మీరుమిక్కిలితప్పు దారిలోయున్నారు

అన్నిప్రకటన పత్రికలవాండ్లు మిక్కిలి లాభము చేయుచుండా యున్నవి. మీరుఒకసారి ఆతంకనిగ్రహ గోళీలనువాడిన తెలుసుకొనగలరు. యింతవరకు తప్పుత్రోవలో యున్నారు. ఈ మాత్రలు అజీర్ణం, రక్తము చెడుట, ముష్టిమైథునవల్లకలుగు రోగములను, మరియు, స్వప్నస్ఖలనం, నపుంసకత్వము యిటువంటివ్యాధులను నిర్మూలముగాపోగొట్టి- వీర్యవృద్ధి బలముకలుగచేయును మాత్రలబుడ్డివెల రు ౧_౮ అణాలు మాత్రమే. దొరకుస్థలము.

భగవాన్ అండుకంపెని గుల్జార్ హౌజ్ హైద్రాబాద్_దక్కన్